బాల ప్రౌఢ

# వ్యాకరణ సర్వస్వము

ప్రథమ సంపుటి

## బాలప్రౌఢ

# వ్యాకరణ సర్వస్వము

ప్రథమ సంపుటి




'స్వాతిశ్రీ'

టి. భాస్కరరావు, ఎం. ఏ.,

సీనియర్ లెక్చరర్, ఏ. పి. కాలేజి - గుంటూరు.

ప్రశాంతి పబ్లిషర్స్

పట్టాభి వీధి: గాంధీనగరం

కాకినాడ - 4

అయిదవ ముద్రణ 1992
మూల్యము - రు 50/-



ప్రాప్తి స్థానము
ప్రశాంతి పబ్లిషర్స్
పట్టాభి వీధి: గాంధీనగరం
కాకినాడ - 4

ముద్రణ
శ్రీ లక్ష్మి ప్రెస్
అరండల్ పేట - గుంటూరు

## 'శీతాంశో రమృతార్పణమ్'

బాలవ్యాకరణము రచించిన

శ్రీ పరవస్తు చిన్నయ సూరి గారికి

ప్రౌఢవ్యాకరణము రచించిన

శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు గారికి

సభక్తికముగా

సమర్పితము

పరమోదారులు మద్గురూత్తములు యద్భాషా పయోరాశి యా
విరి గావించి యనుగ్రహించి రదియే విద్యార్థి పద్యః పయో
ధరమై ఝల్లని గాలి పోసి యనుమోద స్ఫూర్తి వర్షించె సు
స్థిరమై లక్షణ సత్ఫలోత్కరము వాపింగాంచ నాంధ్రోర్వరన్

# విషయసూచిక



ఇది

బాల వ్యాకరణము నందలి

సంజ్ఞా సంధి తత్సమాచ్ఛికములకు

ప్రౌఢ వ్యాకరణమునందలి

సంజ్ఞా సంధి శబ్ద పరిచ్ఛేదములకు

వ్యాఖ్యానము

# అకారాది సూత్రక్రమణిక

## సంధి పరిచ్ఛేదము

2]

## తత్సమ పరిచ్ఛేదము

ఆచ్ఛిక పరిచ్ఛేదము

## సంకేతాక్షర వివరణము

| సంకేతము | గ్రంథము | గ్రంథకర్త |
|---|---|---|
| అచ్చ. రా. | అచ్చతెనుఁగు రామాయణము | కూచిమంచి తిమ్మకవి |
| అని. | అనిరుద్ధ చరిత్ర | కనుపర్తి అబ్బయ |
| ఆము. | ఆముక్త మాల్యద | శ్రీకృష్ణదేవరాయలు |
| ఉ. రా. | ఉత్తర రామాయణము | కంకంటి పాపరాజు |
| ఉ. హరి. | ఉత్తర హరివంశము | నాచన సోమన |
| కవిక. | కవికర్ణ రసాయనము | సంకుసాల నృసింహకవి |
| కళా. | కళాపూర్ణోదయము | పింగళి సూరన |
| కాశీ. | కాశీఖండము | శ్రీనాథుఁడు |
| క్షేత్రయ. | క్షేత్రయపదములు | క్షేత్రయ |
| చంద్ర. | చంద్రభానుచరిత్ర | తరిగొప్పుల మల్లన |
| చంద్రా. | చంద్రాంగద చరిత్ర | పైడిమఱ్ఱి వేంకటపతి |
| జై. | జైమిని భారతము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి |
| నిర్వ. | నిర్వచనోత్తర రామాయణము | తిక్కన |
| నై. | నైషధము | శ్రీనాథుఁడు |
| పర. | పరమయోగి విలాసము | పెద్దరాజు |
| పాంచా. | పాంచాలీ పరిణయము | కాకమాని మూర్తి |
| పాండు. | పాండురంగ మాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి |
| పారి. | పారిజాతాపహరణము | నంది తిమ్మన |
| ప్రభా. | ప్రభావతీ ప్రద్యుమ్నము | పింగళిసూరన |
| భర్తృ. | భర్తృహరి సుభాషితము | ఏనుఁగు లక్ష్మణకవి |
| భల్లా. | భల్లాణ చరిత్ర | మల్లవరపు వాలేశ్వరుఁడు |
| భాగ. | భాగవతము | పోతన |
| భాను. | భానుమతీ పరిణయము | రెంటూరి రంగరాజు |
| భార. | భారతము | కవిత్రయము |
| భాస్కర. | భాస్కర శతకము | మారద వెంకయ్య |
| భీమ. | భీమఖండము | శ్రీనాథుఁడు |
| భోజ. | భోజరాజీయము | అనంతామాత్యుఁడు |
| మార్క. | మార్కండేయ పురాణము | మారన |

| | | |
|---|---|---|
| య. | యయాతి చరిత్ర | పొన్నిగంటి తెలగన |
| రా. | భాస్కర రామాయణము | భాస్కరాదులు |
| రా. వి. | రాజవాహన విజయము | కాకమాని మూర్తి |
| రాఘ. | రాఘవ పాండవీయము | పింగళి సూరన |
| రామ. | రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుఁడు |
| రుక్మాం. | రుక్మాంగద చరిత్ర | ప్రౌఢకవి మల్లన |
| లక్ష్మీ. | లక్ష్మీనృసింహావతారము | ఎఱ్ఱాప్రెగ్గడ |
| వసు. | వసు చరిత్రము | రామరాజభూషణుఁడు |
| విక్ర. | విక్రమార్క చరిత్ర | జక్కన |
| విజ. | విజయవిలాసము | చేమకూర వేంకటకవి |
| విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము | కేతన |
| వి. పు. | విష్ణుపురాణము | వెన్నెలకంటి సూరన |
| వీర. | వీరభద్ర విజయము | పోతన |
| వేం. పం. | పంచతంత్రము | వేంకటనాథుఁడు |
| శశాం. | శశాంక విజయము | శేషము వేంకటపతి |
| శివ. | శివయోగ సారము | కొలనియాది గణపతిదేవకవి |
| శుక. | శుక సప్తతి | పాలవేకరి కదిరీపతి |
| శేష. | శేషధర్మములు | సిద్ధకవి |
| సత్య. | సత్యభామా సాంత్వనము | లింగనమఖి కామేశ్వరకవి |
| సా. | సారంగధర చరిత్ర | చేమకూర వేంకటకవి |
| సుమతి | సుమతి శతకము | |
| స్వా. | స్వారోచిష మనుసంభవము | అల్లసాని పెద్దన |
| హ. | హరివంశము | ఎఱ్ఱాప్రెగ్గడ |
| హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము | శంకరకవి |



[ పూ - పూర్వభాగమునకు ఉ - ఉత్తరభాగమునకు
స్కం - స్కంధమునకు కాం - కాండమునకు
ఆ - ఆశ్వాసమునకు సంకేతములు. ]

— ౦ —

# భూమిక

౧

వ్యాకరణము శాస్త్రము. శాస్త్రము లెప్పుడును సులభగ్రాహ్యములు కావు. వానికి టీకలు, వ్యాఖ్యలు, భాష్యములు మున్నగునవి యవసరము లగుచునే యుండును. శాస్త్రమువలెనే టీకాదికమునందును క్లిష్టత యున్నయెడల, అదియు జిజ్ఞాసువునకు సహకరింపజాలదు. కావున వ్యాఖ్యాత విషయమునకు లఘుత్వము రాని మెలకువతో, రచనమునందు లాఘవమును సమర్థింపవలయును. ఇది వ్యాఖ్యాన విషయమున నాయభిప్రాయము.

శ్రీ పరవస్తు చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణము పఠన పాఠనములలో మిక్కిలి ప్రతిష్ఠనొంది యున్నది. సూరి వ్యాకరణగౌరవము నెరిగిన మనీషి. కావున బింకము చెడని పొంకముతో సూత్రములను రచించి, సాహిత్యమహోద్యానము నందలి వివిధప్రసూనముల నెన్నికచేసి లక్ష్యములుగా నలంకరించెను. సూత్రములను రచించుటలోనే కాదు - లక్ష్యముల నమరించుటలో సహితము చక్కని సంధానకౌశలము సాక్షాత్కరించును. అంతటి యుత్తమరీతిలో సాగి, విద్యార్థుల జ్ఞానశక్తికి దోహదము చేయు సామర్థ్యము కలిగియు బాలవ్యాకరణసూత్రములు సులభగ్రాహ్యములు కావు. సూత్రము లెప్పుడును సూత్రములే. కావుననే వ్యాఖ్యానము లవసరము లయినవి. 'బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక' యను పేర శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిలవారు వ్యాఖ్యానమును రచించిరి. ఆ తరువాత 'గ్రాంథికాంధ్ర కల్పకము' అను నామాంతరము గల 'బాలవ్యాకరణ సారస్య సర్వస్వ పేటిక' యను టీకను శ్రీ కూచి రామమూర్తి శాస్త్రిగారు రచించిరి. 'ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము' నందు సన్నయాథర్వణీయములకు వ్యాఖ్యానగ్రంథముగా బాలవ్యాకరణమును గ్రహించి శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు వివరణము సమకూర్చిరి. వారే 'బాలవ్యాకరణోద్ద్యోతము' అను పేర మఱొక గ్రంథమును ముద్రింపించిరి. ఇదియు ముఖ్యముగా బాలవ్యాకరణమునకు వివరణగ్రంథమే యైనను, సూత్రముల క్రమమునే కాక పాఠములను సహితము మార్చుట యిందు జరిగెను. శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు బాలవ్యాకరణమునకు లఘుటీకను సంతరించిరి. శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు 'రమణీయము' అను పేర బాలవ్యాకరణ సమీక్షా గ్రంథమును వెలువరించిరి. ఇవి యింతవరకు, నే నెరిగినంతవరకు బాలవ్యాకరణమున కున్న వ్యాఖ్యాగ్రంథములు.

బాలవ్యాకరణము సాధింపని లక్ష్యములను సాధించులక్ష్యముతో శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారు 'త్రిలింగ లక్షణశేషము' అను వ్యాకరణగ్రంథమును సంతరించిరి. ఆకరములను బేర్కొనుచు ననేకలక్ష్యములను బెక్కుగ్రంథములనుండి గ్రహించి ప్రదర్శించిరి. ఇది యెవరు పెట్టినపేరో కాని, దీనికి 'ప్రౌఢవ్యాకరణము'

అను ప్రసిద్ధి కలిగినది. పఠన పాఠనములందు దీనికిని స్థానము లభించినది. 'బాలబోధ సుధ' అను నామాంతరము గల 'కుమారదేవపండితీయము' అను ప్రౌఢవ్యాకరణ వివరణమును శ్రీ తాళ్ళూరు ఆర్ముగంపిళ్ళగారు రచించిరి. 'సుబోధినీ వ్యాఖ్యానము' అను పేరున శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు ప్రౌఢవ్యాకరణమునకు టీకా గ్రంథమును రచించిరి. శ్రీ భాష్యం వేంకట నరసింహ భాష్యకారాచార్యులుగారు 'తత్త్వబోధినీ వ్యాఖ్య'ను సమకూర్చిరి. ఇవి ప్రౌఢవ్యాకరణమునుగూర్చి వెలువడిన వ్యాఖ్యాన గ్రంథములు.

౨

పైని చెప్పిన గ్రంథములుకూడ విద్యార్థులకు వ్యాకరణ ప్రస్థానమున వెలుగులు వెలయించి మిక్కిలి సహకరించుచున్న వనుట వాస్తవము. అయినను విద్యార్థుల కున్న కొన్ని యిబ్బందులను గుర్తించుకొనుట యవసరము.

వ్రాయునది వ్యాకరణ వ్యాఖ్యానము. కావున వ్యాకరణ బద్ధమై సంధిబంధము నిసుమంతయు సడలనీయని రీతిలోనుండ వలయునన్న పట్టుదల కొందర రచనలో సహజమై కనిపించు చున్నది. విషయము సుబోధ మగుట యావశ్యకము. విషయము జటిలమై, భాషయు జటిలమైనయెడల లక్ష్యము కావలసినంతగా సిద్ధింపదు. కొందరు మూలగ్రంథము నాలంబనము గావించుకొని యథేచ్ఛావిహారము చేసినవారు గలరు. దానివలన నాత్మతుష్టి కలుగవచ్చును; కాని జ్ఞానపుష్టి కలుగదు. కొందరు భాషా శాస్త్రపద్ధతుల ననుసరించి, కొన్ని ప్రక్రియలను రూపములను నిరసించుటకు గాని స్వీకరించుటకు గాని మొగ్గు చూపిరి. వ్యాకరణమును భాషాశాస్త్రమును భాషా స్వరూపమును నిరూపించునవే యనుటలో సందేహము లేదు. కాని వాని ప్రయోజనములు భిన్నములు; వాని దృష్టిపథములు భిన్నములు. భాషాశాస్త్ర పరిశీలన పాటవము కలుగ వలయునన్న వ్యాకరణపాండిత్యము చాలవర కవసర మన్న మాట నిజము. వ్యాకరణపాండిత్యమును సంపాదించుటకు భాషాశాస్త్రపాండిత్యముతో నిమిత్తము లేదు. కావున వ్యాకరణమునందలి రూపసాధనప్రక్రియను ప్రక్రియా సౌలభ్యమునుబట్టియే సమర్థింపవలయును గాని చారిత్రక యాథార్థ్యమునుబట్టి కాదు. ఇట్టి కొలదిపాటి యనిష్టములు కొన్ని గ్రంథములందు కలవు.

అన్నింటికంటె ముఖ్యమైన దింకొకటి యున్నది. బాలవ్యాకరణమునకు వ్యాఖ్యలు వేరుగను, ప్రౌఢవ్యాకరణమునకు వ్యాఖ్యలు వేరుగను వెలువడినవి. ఇట్లు వేర్వేరుగ వెలువడుటచేత సమగ్రాలోకన సౌకర్యము పాఠకున కొక్కపట్టున కలుగుటలేదు. కొందరు బాలవ్యాకరణ వ్యాఖ్యాతలు సమయసందర్భములయందు ప్రౌఢ వ్యాకరణసూత్రములను పరామర్శించుట లేకపోలేదు. అది యట్టి పరామర్శించుటయే కాని వివరించుట కాదు. అట్లగుట కక్కడ వీలులేదు. ప్రౌఢవ్యాకరణవ్యాఖ్యాతలు బాలవ్యాకరణ సూత్రములను కొన్నింటిని చేర్కొనక తప్పదు. కాని వారును వానిని

స్పృశించి వీడుటయే కాని యామూలచూడముగా వివరించుటకు వీలులేదు. అంతే కాక, ఉభయ గ్రంథములందును అన్యోన్య సంవాద వివాదములు లేని సన్నివేశములు కొన్ని గలవు. వానికొక గ్రంథమునందు తావున్న మఱొక గ్రంథమునందు లేకుండుట తటస్థించినది. అది తప్పదు.

కావున రెండు గ్రంథములకును గలిపి స్పష్టముగు రీతిలో, విషయమును వీలయినంత సమగ్రముగా వివరించుచు ఒక వ్యాఖ్యానము వెలువడుట యవసర మనిపించినది. మిత్రుల ప్రోద్బలముతో, గురువుల యాశీర్బలముతో నేనే యీపనికి పడుము కట్టితిని. 'బాలప్రౌఢ వ్యాకరణ సర్వస్వము' రూపు దాల్చినది.

౨

ఈ గ్రంథమునందు బాలవ్యాకరణసూత్రములను, ప్రౌఢవ్యాకరణసూత్రము లను సన్నివేశక్రమము ననుసరించి కలబోయుట మొదటి విషయము. సాధారణముగా బాలవ్యాకరణ సూత్రక్రమము ననుసరించియే ప్రౌఢవ్యాకరణసూత్రములు కలవు. ఉదా॥ బాలవ్యాకరణమునందలి మొదటి నాలుగుసూత్రములు వర్ణసమామ్నాయమును చెప్పును. ప్రౌఢవ్యాకరణమున మొదటిసూత్రము వర్ణసమామ్నాయమునకు సంబం ధించినదే. అంతేకాదు. బాలవ్యాకరణసూత్రముల నాలుగింటికి సమాహారరూపముగా అది యున్నది. కావున దానిని సర్వస్వమునందు ఐదవసూత్రముగా చేర్చి వ్యాఖ్యా నించుట జరిగెను. ఇట్లు చేయుటవలన నీయైదు సూత్రములకున్న సంబంధము పాఠకుడు స్వయముగా నూహించుకొనుట కవకాశము కలుగుచున్నది.

కొన్నియెడల బాలవ్యాకరణమునకు సవరణములు వచ్చును. అవి బాలవ్యాకర ణమును వెన్నంటియే యుండుటవలన, వ్యాఖ్యానముకూడ నుండుటవలన ఔచిత్యా నౌచిత్యములను, అవశ్యకానావశ్యకములను వెంటనే గ్రహించుటకు మిక్కుటముగా నవకాశము కలుగుచున్నది. కొన్నియెడల బాలవ్యాకరణము చెప్పని క్రొత్తవిషయము లను ప్రౌఢవ్యాకరణము చెప్పును. కొన్నియెడల ప్రౌఢవ్యాకరణ మేమాత్రమును స్పృశింపని బాలవ్యాకరణ విషయము లుండును. వాని నాయా సందర్భములనుబట్టి యొక వరుసలో నమరించి వ్యాఖ్యానించుట జరిగెను. వీలయినంతవరకు, ఏపరిచ్ఛేద ములోని సూత్రము లాపరిచ్ఛేదములోనే యుండును. ప్రౌఢవ్యాకరణమునందలి సంజ్ఞాపరిచ్ఛేదములోని చివరి రెండు సూత్రములు అనుకరణ కార్యమునకు సంబం ధించినవి. కావున వానిని సంధి పరిచ్ఛేదమునందలి యనుకరణసూత్రములకు కడపట చేర్చుకొనవలసి వచ్చినది. ప్రౌఢవ్యాకరణమునందలి శబ్దపరిచ్ఛేదములోని పది సూత్రములు మాత్రమే తత్సమ పరిచ్ఛేదములో చేరినవి. తక్కినవన్నియు అచ్చిక పరిచ్ఛేదమునకు సంబంధించినవే. ఈ రెండింటికిగాక అయిదు సూత్రములు మిగిలి యున్నవి. అవి కారక పరిచ్ఛేదమునకు సంబంధించినవి.

ప్రతిసూత్రమునకును ప్రతిపదార్థప్రాయముగా అర్థము చెప్పితిని. లక్ష్య లక్షణ సమన్వయము చేసి చూపితిని. ఇతర సూత్రములతో నున్న సంబంధముకూడ

చెప్పితిని. ఇదంతయు వీలయినంత సంగ్రహముగా రచించుటకే యత్నించితిని. స్పష్టత సర్వదా నా ధ్యేయము.

బాలవ్యాకరణమునందలి మొదటి నాలుగు పరిచ్ఛేదములును, ప్రౌఢవ్యాకరణమునందలి మొదటి మూడు పరిచ్ఛేదములును కలిసి యీ 'సర్వస్వము'నందు నాలుగు పరిచ్ఛేదములుగా అవిర్భవించినవి. ఇందున్న మొత్తము సూత్రములు మూడువందల యేబది మూడు. ఇవి మాత్రమే ప్రథమ సంపుటియందు వ్యాఖ్యాతములైనవి.

బాలవ్యాకరణమునందలి కారక సమాస తద్ధిత క్రియా కృదంత ప్రకీర్ణక పరిచ్ఛేదములును, ప్రౌఢవ్యాకరణమునందలి కారక సమాస తద్ధిత క్రియా కృదంత వాక్యపరిచ్ఛేదములును ముక్తలక్షణ వివేచనమును ద్వితీయ సంపుటియందు వ్యాఖ్యాతములగును. ఇంతవరకు చెప్పినదానినిబట్టి యీ గ్రంథము వ్యాఖ్యానము మాత్రమే కావలయును. 'బాలప్రౌఢ వ్యాకరణ సర్వస్వము' అని సర్వస్వపదమును తగిలించుట వట్టి యాడంబరమే యగును. ఈ వ్యాఖ్యానము అను పట్టము పూర్తియైన పిమ్మట రెండు గ్రంథములకు పరిచ్ఛేదక్రమమున నొక తులనాత్మక సమీక్ష జరుగును. మొదటి రెండు సంపుటులును వ్యాఖ్యానభాగము; తృతీయ సంపుటి సమీక్షాభాగము.

బాలప్రౌఢ వ్యాకరణములు స్పృశింపని పెక్కులక్షణములు కావ్యప్రపంచమున మనకు లభ్యము లగుచున్నవి. పూర్వవ్యాకరణములయందలి లక్షణములనుగూడ ఈరెండు గ్రంథములు విడిచిపెట్టుట జరిగెను. కావున, బాలప్రౌఢ వ్యాకరణములలో లేని, ప్రయోగములనుబట్టి తెలియదగిన లక్షణములనుగూడ ఇందు చేర్చుట జరుగును. అదియే ముక్తలక్షణ సంగ్రహము.

సమ్యాదులు, కడాదులు మున్నగువిధముగా ఆది శబ్దముచే గ్రహింపబడిన గణమును, దాని కగుకార్యమును 'గణపాఠావళి' అనుకోట సూచించుట జరుగును. వ్యాకరణమునందు పెక్కు సంజ్ఞలు వచ్చుచుండును. కావున ఆయా సంజ్ఞలను నిర్వచించి, వాని కగు కార్యములను కొలదిగా నుదాహరించుట మరొకపని. ఇదంతయు 'పారిభాషిక పదకోశము' అను శీర్షికతో జరుగును. ఇవేకాక ఇరువురు వ్యాకర్తల జీవితవిశేషము, రచనాపాటవము, ప్రయోగ పరిశీలన సామర్థ్యము, ప్రక్రియా ప్రదర్శన చాతుర్యము, సంస్కృతానుకరణము, వ్యాకరణ స్వరూప స్వభావములు, వ్యాకరణ ప్రయోజనము - మున్నగునవి క్రోడీకరింపబడును. ఇట్లు పెక్కువిషయములతో నిండియుండుటచేతనే దీనికి 'సర్వస్వము' అను పదము సమర్థము కాగలదని నా యభిప్రాయము.

ఏతద్గ్రంథ రచనమునకు నాకు నిరంతర ప్రోత్సాహకులయిన నా మిత్రులకు, శ్రేయఃకాంక్షులై శంకలు తీర్చి ఒద్దికలు పేర్చిన పెద్దలకు నా ధన్యవాదములు.

అభిప్రాయములకు భాష యాకృతి నిచ్చినట్లు, ఏ గ్రంథమునకైన నాకృతి నిచ్చుట ముద్రాపకుల వంతు. నే ననుకొన్నట్లుగా, నా యభిలాష కనుకూలముగా రూప కల్పనము చేసిన శ్రీ లక్ష్మీ ప్రెస్సువారికి నా యభివందనములు.

# సంజ్ఞా పరిచ్ఛేదము

1. సంస్కృతమునకు వర్ణము లేఁబది. (బాల-౧)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః॥ క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ॥ ఇం దకారాదు లచ్చులు కకారాదులు హల్లులు. అజ్ఝల్విభాగ మీలాగునసే మీఁద నెఱుంగునది.

వ్యాఖ్య : భాష వాక్యములవలన నేర్పడును. వాక్యములు శబ్దములవలన, శబ్దములు వర్ణములవలన నేర్పడును. అందువలన అక్షరములను ముందుగా తెలిసికొనుట యవసరము. తెనుగునకు సంస్కృతప్రాకృతశబ్దములతో గరిష్ఠసంబంధము కలదు. అనేకపదములను సంస్కృతమునుండియు ప్రాకృతమునుండియు తెనుగుభాషలోనికి తెచ్చుకొనుట కలదు. కావున, ఆ పదముల నుచ్చరించుటకు తగిన వర్ణములనుకూడ గుర్తించుకొనుట యవసరము. కావున సూరి సంస్కృతమునందు ఏబది యక్షరము లున్నవని తెలిపి వాని నన్నింటిని వరుసగా చూపుచున్నాడు.

అకారాదులు - అకారము మొదలుగా గలవి. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః॥ అను నీ పదునాఱు వర్ణములును అచ్చులు. వీనికి 'స్వరములు'అనియు 'ప్రాణములు' అనియు కూడ పేర్లు గలవు.

కకారాదులు-కకారము మొదలుగా గలవి. క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ॥ అను నీ ముప్పది నాలుగువర్ణములును హల్లులు. వీనికి 'వ్యంజనములు' అనియు ప్రాణులు అనియు పేర్లు గలవు.

అచ్ + హల్ + విభాగము = అజ్ఝల్విభాగము = అచ్చులయొక్కయు, హల్లులయొక్కయు భేదము. ఇకముందు 'అచ్చు' అనియు 'హల్లు' అనియు వాడి నప్పుడు పై విభాగము ననుసరించి వర్ణముల నన్నింటిని గుర్తించుకొనవలయు నని యర్థము.

పై వర్ణములకు అచ్చులు, హల్లులు అనునవి పేర్లైన యెడల 'ఈలాగునసే మీఁద నెఱుంగునది' అని చెప్పవలసిన యావశ్యకములేదు. ఇవి ప్రత్యాహార

ప్రక్రియనుబట్టి యేర్పడిన సంజ్ఞలు. మాహేశ్వర సూత్రములు పదునాలుగు కలవు. అందు మొదటిసూత్రములోని మొదటియక్షరము-'అ'. నాలుగవ సూత్రము కడపటి ఇత్సంజ్ఞ-'చ్'. ఈరెండింటిని కలుపగా 'అచ్' అని యగును. ఇదియే తెలుగు సంప్రదాయమునుబట్టి ఉత్వద్విత్వములను పొంది 'అచ్చు' అనియగును. ఇట్లు ప్రత్యాహారము చేయుటవలన అకారాదులగు వర్ణములు సమీకరింప బడును. (1. అఇఉణ్ 2. ఋఌక్ 3. ఏఓఙ్ 4. ఐఔచ్)

ఇట్లే ఐదవసూత్రమునందలి మొదటి వర్ణమును పదునాల్గవసూత్రమునందలి కడపటి ఇత్సంజ్ఞతో జోడింపగా 'హల్' అని యగును. ఇది ఉత్వద్విత్వములను పొంది 'హల్లు' అని యగును. ఇట్లు ప్రత్యాహారము చేయుటవలన కకారాది లగు వర్ణములన్నియు సంగ్రహింపబడును. (5. హయవరట్ 6. లణ్ 7. ఞమఙణనమ్ 8. ఝభఞ్ 9. ఘఢధష్ 10. జబగడదశ్ 11. ఖఫఛఠథచటతవ్ 12. కపయ్ 13. శషసర్ 14. హల్)

మాహేశ్వర సూత్రములనుబట్టి యైనచో హల్లుల క్రమము 'హయవర....' యని ప్రారంభమగును. తెలుగున నట్లుగాదు. అందువలననే సూరి ప్రత్యాహారప్రక్రియ మాట యెత్తుకొనక, రూఢముగా వాడుకలోనున్న 'హల్లు' శబ్దమును మాత్రము గ్రహించెను. క్రమము మారినను 'హల్లులు' అనుట చేత కకారము మొదలు శకారము వరకు గల వర్ణములే గ్రహింపబడును. కావుననే 'ఈలాగుననే మీఁద నెఱుంగునది' అని పలుకవలసి వచ్చెను.

## 2. ప్రాకృతమునకు వర్ణములు నలువది. (బాల-౨)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః॥ క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ॥ కొందఱి మతంబున హ్రస్వవక్రంబులును బ్రాకృతంబునందుఁ గలవు. కొందఱి మతంబున వక్రతమంబులుం గలవు. ఎ ఏ ఒ ఓ, లు వక్రము లని, ఐ ఔ లు వక్రతమములని ప్రాచీనులు వ్యవహరింతురు.

వ్యాఖ్య - సంస్కృతములో కంటె ప్రాకృతములో పది వర్ణములు తక్కువ. "ఋ ౠ ఌ ౡ ఐ ఔ ఙ ఞ శ ష" యను పది వర్ణములును సంస్కృతవర్ణ మాలలో నుండి ప్రాకృతవర్ణమాలలో తగ్గిపోయినవి. అందువలన, ప్రాకృతము నందు నలువది వర్ణములైనవి. కొందఱ యభిప్రాయమునుబట్టి హ్రస్వవక్రములైన

'ఎ-ఒ' యనునవి కూడ ప్రాకృతమునందు గలవు. మఱికొందఱ యభిప్రాయమును బట్టి వక్రతమములైన 'ఐ-ఔ' అనునవి కూడ ప్రాకృతమునందు గలవు. వీనినికూడ స్వీకరించినచో మొత్తము నలువదినాలుగు వర్ణములగును. ఇవి యితరుల యభిప్రాయములే కాని, సూరికి ఈ వర్ణములను గ్రహించుట సమ్మతము కాదు. కావుననే తాను 'నలువది' అనియే పరిగణనము చేసెను.

వక్రము లనగా వంకరయైనవి యని యర్థము. ఎ ఏ ఒ ఓ అనునవి వక్రములు. అ ఆ యున్నగు వర్ణములవలె గాక వక్రములు భిన్నమైన యుచ్చారణమును గలిగి యున్నవి. కావుననే, వీనికి వక్రములు అను పేరు కలిగినది. ఇందు 'ఎ ఒ' అనునవి రెండును హ్రస్వవక్రములు; 'ఏ ఓ' అనునవి రెండును దీర్ఘవక్రములు. 'ఐ ఔ' అను నీ రెండును వక్రతమములు.

3. తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు. (బాల-౩)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అః॥ క గ చ ౘ జ ౙ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ.

వ్యాఖ్య - తెనుగు అని యనగా అచ్చతెలుగు అని యర్థము. సంస్కృత సమేతర మైనవానిని అచ్చతెలుగు అని యందురు. సంస్కృతభవము, ప్రాకృత సమము, ప్రాకృతభవము, దేశ్యము - అను నాలుగురకములైన భాషకు తెనుగనియు, అచ్చతెలుగనియు వ్యవహారము గలదు. ఇట్టి తెనుగుభాషయందు పైనిచూపిన ముప్పదియాఱు వర్ణములు మాత్రమే కలవు.

సంస్కృతవర్ణమాలలో లేకుండ, తెలుగువర్ణమాలలో మాత్రమే కల వర్ణము లివి - ఎ ఒ ఁ ౘ ౙ॥ ఈ యైదు వర్ణములు ఏ పదమునందు ప్రయోగింపబడునో ఆ పదమును నిశ్చయముగా అచ్చతెలుగని నిర్ణయింపవచ్చును.

4. ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృత సమంబులనుగూడి తెలుఁగున వ్యవహరింపంబడు. (బాల-౪)

ఋతువు - పితౄణాము - కౢప్తము - ఌకారము - దుఃఖము -

ఖడ్గము - ఘటము - ఛత్రము - ఝరము - కంఠము - ఢక్క - రథము - ధరణి - ఫణము - భయము - పఙ్క్తి - ఆజ్ఞ - శరము - షండము.

వ్యాఖ్య - అచ్చతెనుగుపదములలో లేకుండ, తెనుగునందు వాడబడు సంస్కృతపదములతో కలిసి 'ఋ-ౠ' మున్నగు పందొమ్మిది వర్ణములును ఆంధ్రభాషయందు వ్యవహరింపబడు నని యర్థము. కావున ఈ వర్ణములలో నే వర్ణ మున్నను, ఆ వర్ణమున్న పదమును తత్సమముగా నిర్ణయింపవచ్చును. కంఠము- ఇందలి ఠవర్ణము తెనుగు వర్ణమాలలో లేదు: తెనుగున సంస్కృతసమములఁగూడి ప్రవేశించు పందొమ్మిది వర్ణములలోను గలదు. కావున ఈ పదము తత్సమము. ఇట్లే యిందుదాహరింపబడిన పందొమ్మిది శబ్దములును ఆయావర్ణముల మూలముగా తత్సమములుగా నిర్ణయింపదగినవి.

[చిన్నయసూరి ఙ వర్ణమునకు లక్ష్యము 'పఙ్క్తి' యని చూపెను. తత్సమముల ననునాసికోయుక్తములుగా వ్రాయుట సమ్మతము కాదు. 'పంక్తి' యని వ్రాయుట ప్రశస్తము. 'వాఙ్మయము' అన్నది యిచ్చట లక్ష్యము కాఁగలదు.]

**5. ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియైదు.** (ప్రౌఢ-౧)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అఁ అం అః॥

క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ॥ ఱాకార గ్రహణము సంస్కృత ప్రాకృత భాషావ్యాకరణజ్ఞుల సమ్మతము. అయ్యది మంత్రశాస్త్ర ప్రసిద్ధము. యవలలవలె రేఫంబును ప్రయత్నభేదంబుచే ద్వివిధంబు గావున శబ్దశాసనాదులచేత నలఘు రేఫము వర్ణాంతరముగా గ్రహింపఁబడదయ్యె. క్షకారము సంస్కృతవ్యాకరణములయందును, నిఘంటువులయందును పాంతపదమధ్యమునందుఁ బఠింపఁబడుటం జేసి యది వర్ణాంతరము గాదు, సంయుక్తాక్షర మని తెలియవలయు.

వ్యాఖ్య - తెనుఁగున గల ముప్పదియాఱు వర్ణములను, సంస్కృతసమములఁ గూడి యిందు ప్రవేశించు పందొమ్మిదివర్ణములను కలుపుకొనగా మొత్తము

ఏబదియైదు వర్ణములగును. బాలవ్యాకరణమునందలి మూడవ, నాలుగవ సూత్రముల కిది సమాహారము.

వివరణమునందు ప్రౌఢవ్యాకరణకారుడు కొందఱి సందేహములకు సమాధానముల నిచ్చెను.

ౡ కారమునకు దీర్ఘము లేదని సిద్ధాంతకౌముది సిద్ధాంతము. సూరి సంస్కృత వర్ణమాలలో 'ఌౡ' లను రెండింటిని గ్రహించెను. ఇట్లు గ్రహించుట సంస్కృతమున గల యితర వ్యాకర్తలకు సమ్మతమే యనియు, మంత్రశాస్త్రమునందు ౡ వర్ణము ప్రసిద్ధముగా కలదనియు తెల్పి సూరిని సమర్థించుచున్నాడు.

అప్పకవి మున్నగువారు శకటరేఫమును వర్ణాంతరముగా వర్ణసమామ్నాయమున చేర్చికొనిరి. 'యరలవ' యను అంతస్థ వర్ణములు నాలుగును లఘువులుగా, అలఘువులుగా నుచ్చరింపబడును. 'యవల' యనువానిని సంస్కృతప్రాకృతవ్యాకర్తలు సైతము రెండువిధములుగా లఘువులని, అలఘువులని పరిగణింతురు. అయినను అలఘువులను వర్ణాంతరములుగా అంగీకరింపలేదు. అట్లే తెలుగునందలి రకారము రెండు విధములు. 'యవల' లవలెనే యిదియు రెండువిధముల నుండును. వానికి కానట్లే దీనికిని అలఘురూపమున భిన్నవర్ణము అంగీకార్యము కాదు. ఈ సామంజస్యమునుబట్టియే శబ్దశాసనుడు మున్నగు వ్యాకర్తలు శకటరేఫమును భిన్నవర్ణముగా వర్ణసమామ్నాయమందు చేర్చుకొనలేదు.

కొందఱు క్ష కారమునుకూడ వర్ణాంతరముగా పరిగణించిరి. కకార షకార సంయోగము (క + ష) వలన నేర్పడినది 'క్ష'. కావున యిది సంయుక్తాక్షరమే కాని మఱొక వర్ణము కాదు. సంస్కృతవ్యాకరణములయందు దీనిని సంయుక్తాక్షరముగనే పరిగణించిరి. సంస్కృత నిఘంటువులయందును సంయుక్తాక్షరముగనే పరిగణించి, షకారము నంతమందు గలిగిన పదములలో క్షకారమును ప్రదర్శించిరి. సూరియు క్షకారమును ప్రత్యేకముగా గ్రహించలేదు. కావున ఈ విషయమునందు సీతారామాచార్యులు బాలవ్యాకరణప్రసంగమును బలపఱుచుచు వివరించెను.

'అచ్చతెనుగు' అను భావముతో బాలవ్యాకరణకారుడు 'తెనుగు' అను శబ్దమును వాడగా, తత్సమాదులను గలియగలుపుకొన్న భాషను బోధించుటకు ప్రౌఢవ్యాకరణకారుడు 'ఆంధ్రభాష' యని వాడెను. దీనినిబట్టి తెనుగు, ఆంధ్రము - అనునవి భిన్నములని యనిపించును. వ్యాకరణమునందు మాత్రము ఇట్లు వేరుగా పరిగణించుట

యిద్దరు వ్యాకర్తలకును సమ్మతము. ఇక సాహిత్య లౌకిక వ్యవహారమునందు తెనుగు, ఆంధ్రము - అనునవి సమానార్థకములై పర్యాయపదములుగా ప్రయుక్తము లగుచున్నవి.

**6. నిర్దేశవిధానోచ్చారణంబులం దలుచుగ అవర్ణాదులు కార ప్రత్యయాంతములును, రవర్ణ మిఫ ప్రత్యయాంతమునగు. (ప్రౌ-౨)**

అకారమునకు ఉకారము వచ్చును. కకారమునకు గకారము వచ్చును. లకారమునకు రేఫమువచ్చును మొ॥ అకారము, ఇకారము, ఉకారము, రేఫము మొ॥ తలుచుగ ననుటచే కేవల వర్ణోచ్చారణము నందీ విధి నిత్యము కాదని తెలియునది.

వ్యాఖ్య - నిర్దేశమునందును, విధానమునందును, ఉచ్చారణమునందును తలుచుగా వర్ణముల కన్నింటికి 'కార' ప్రత్యయము కలుగుచుండును; రవర్ణమునకు 'ఇఫ' ప్రత్యయము కలుగుచుండును- అని సూత్రార్థము.

వ్యాకరణకార్యములందు దేనికి విధింపబడునో దానికి నిర్దేశమనియు, ఏది విధింపబడునో దానికి విధాన మనియు పేళ్లు. వర్ణములను పలుకుటకు ఉచ్చారణ మని పేరు.

'అకారమునకు ఉకారము వచ్చును.' అను వాక్యము నందు ఉకారము విధింపబడుచున్నది: కావున ఉకారము విధానము - ఉకారము అకారమునకు విధింపబడుచున్నది; కావున అకారము నిర్దేశము.'ఉ' అనియు 'అ' అనియు ననుటకు బదులు 'కార' అను ప్రత్యయమును జేర్చి ఉకారము, అకారము అని పలుకుట సౌలభ్యమును కలిగించును. కేవలము వర్ణోచ్చారణమునందును అకారము, ఇకారము అని పలుకవచ్చును. "తలుచుగ" ననుట కేవలము వర్ణము నుచ్చరించునప్పుడు కారప్రత్యయము నిత్యముగా విధింపవలసిన యవసరములే దనుటకే యని వ్యాకర్త విశదించెను. దీనిబట్టి నిర్దేశవిధానములందు నిత్యముగా కారప్రత్యయము కలుగవలయునను భావము పొడచూపును. సాధారణముగా 'కార' ప్రత్యయము చేర్చి పలుకుట గలదు. కాని యది నిత్యవిధి కాదు. ఈ తరువాతి సూత్ర మీ విషయమునే యర్థాంచును.

'ర వర్ణ మిఫప్రత్యయాంతము నగు' - రవర్ణమును మాత్రము 'ఇఫ' యను ప్రత్యయమునుజేర్చి 'రేఫము' అని పలుకుదురు. 'శకటరేఫమును అకారము' అని యనుటచేత సాధురేఫమును 'రకారము' అనియు ననవచ్చును.

ఇఫప్రత్యయమును, కారప్రత్యయమును సంస్కృత వ్యాకరణములచేతనే విధింపబడినవి. పఠనపాఠనక్రమమున వాని యుపయోగము ప్రసిద్ధము. అందువలననే సూరి బాలవ్యాకరణమున ఆ ప్రత్యయములను జేర్చి వాడిగను, వానివి విధింపలేదు.

మొదటిసూత్రముననే అకారాదులు, కకారాదులు - అని కార ప్రత్యయమును వాడెను. రేఫము, శకటరేఫము అని పదునెనిమిదవ సూత్రమున వాడెను. కావున సూరికి ఇట్లు వాడుట సమ్మతమే.

దంత్యతాలవ్యంబులయిన చజలు - కచటతపలు - గజడదబలు మున్నగు విధముగా, కారప్రత్యయమును చేర్పకుండ, నిర్దేశవిధానోచ్చారణములందు వర్ణము లను సూరి బాలవ్యాకరణమునందు ప్రయోగించెను. కావున ఈ విధి ప్రాయికమే కాని, నిత్యము కాదు.

7. ఒకచో హ్రస్వంబు దీర్ఘం బగు. (ప్రౌ-౮)

నిర్దేశవిధానంబులంగా రేఫప్రత్యయములు రానియెడల హ్రస్వము నకు దీర్ఘము వచ్చునని యర్థము॥ అకు ఊ వచ్చును; కాకు గా వచ్చును; లాకు రా వచ్చును.

వ్యాఖ్య - కార ప్రత్యయముగాని, ఇఫప్రత్యయముగాని రానిచోటులందు హ్రస్వమునకు బదులుగా దీర్ఘము వచ్చునని సూత్రార్థము.

"అకు ఊ వచ్చును" అను వాక్యమునందు 'అ' యనునది నిర్దేశము: 'ఉ' యనునది విధానము. పూర్వసూత్రమునుబట్టి యైనచో 'కార' ప్రత్యయము కలిగి 'అకారమునకు ఉకారము వచ్చును' అనియే యగును. పూర్వసూత్రమునందలిది ప్రాయికవిధి కావున, అది ప్రవర్తింపని యప్పుడు, ప్రస్తుతసూత్రముచేత హ్రస్వ మునకు దీర్ఘము వచ్చును. 'అకు ఊ వచ్చును' అని యగును.

కారేఫ ప్రత్యయములు రాని యెల్ల సందర్భములందును హ్రస్వమునకు దీర్ఘము వచ్చునను నభిప్రాయము 'దీర్ఘంబగు' అని విధించుటవలన కలుగుచున్నది. కాని యీ విధియు నిత్యము కాదు. 'అఆలకు' మున్నగు విధముగా నిర్దేశించునప్పుడు

హ్రస్వముగా నున్న స్థలములు నుండవచ్చును. చిన్నయసూరి 'ఋౠఌౡ' మున్నగు విధముగా హ్రస్వమును హ్రస్వముగను, దీర్ఘమును దీర్ఘముగను నిర్దేశించెను.

**౪. దీర్ఘంబు దీర్ఘంబు.** (ప్రౌ - ౪)

నిర్దేశ విధాన విషయములైన వర్ణములు దీర్ఘము లయ్యేనేని అవి యట్లే యుండునని యర్థము॥ ఐకి ఔ వచ్చును మొ॥

వ్యాఖ్య - నిర్దేశమునందును, విధానమునందును హ్రస్వవర్ణములు దీర్ఘము లగునవి పూర్వసూత్రమున తెలుపఁబడినది. అట్టియెడల దీర్ఘమే యున్నయెడల, ఏమియు మార్పుండదనియు, దీర్ఘముగానే యుండుననియు స్పష్టముచేయుట ఈసూత్ర ప్రయోజనము.

నిర్దేశము ఐవర్ణము: విధానము ఔవర్ణము. ఇవి దీర్ఘవర్ణములు. కావున నివి దీర్ఘములుగానే యుండును. అందువలన 'ఐకి ఔ వచ్చును' అనియే యుండును.

హ్రస్వమును దీర్ఘమై, దీర్ఘమును దీర్ఘముగా నున్నయెడల సందిగ్ధత యేర్పడకే యుండునా? అను ప్రశ్న యుదయింపక తప్పదు. ఇకప్రత్యయమును కారప్రత్యయమును వాడుటకాని, హ్రస్వమును దీర్ఘముగా ఉచ్చరించుటకాని, సౌకర్యముకొఱకు నవలంబించు నుపాయములు. వానియుపయోగమే సందిగ్ధతను కలిగించినయెడల వానిని మానుకొనుటయే శ్రేయము. కాని రచయితలు వేర్వేఱు మార్గములలో ఈసౌలభ్యమును సాధించిరి. సందేహము కలుగని చోటులందే హ్రస్వమునకు దీర్ఘము చేసిరి. కొన్నియెడల పూర్వమందున్న హ్రస్వాక్షరమును ఊది పల్కుటయు కనిపించును. కవిజనాశ్రయకర్త "అఆ లైఁ ఔ లకు మఱి। ఇఈ లు ఋకార సహిత మె ఏ లకు నౌ। ఉఊ ల్తమలో నొఓ లౌదు। ఒఓ లకు వళ్ళగున్న యోన్నత చరితా" యని నిర్దేశ విధానము లందలి హ్రస్వవర్ణములను ఊదిపల్కెను. అట్లు గ్రహింపనియెడల ఛందస్సు తప్పును. కావున ఇట్లు ఊది పల్కుట కూడ నిర్దేశవిధానములం దుపయోగమున కలదని స్పష్టమగు చున్నది.

[ప్రౌఢవ్యాకరణమునకు తత్త్వబోధినీ వ్యాఖ్యను రచించిన శ్రీభాష్యము వారు ఇది "బాలవ్యాకర్తకు సమ్మతము గాదు. అతడు తనవ్యాకరణమున నెచ్చటను హ్రస్వమును దీర్ఘముగా గ్రహింపలేదు. ఇట్టి దీర్ఘాక్షరనిర్దేశములు కొందఱు ఛాందసులు చేసినను సామాన్యముగా వాఙ్మయమునం దిట్టి ప్రయోగము లరుదుగా నుండును. అట్టి ప్రయోగములందును దీర్ఘముతో నిర్దేశించినచో నది

హ్రస్వమా, దీర్ఘమా యని సందేహము కలుగుచుండును. అట్టి సందేహ స్థానములగు ప్రయోగములు బాలవ్యాకర్తకు సమ్మతములు గాకయే యాతడీవిషయమును స్పృశింపలేదు" అని వ్రాసిరి. కాని యిది యథార్థము కాదు. సూరి బాలవ్యాకరణమున హ్రస్వమునకు దీర్ఘమును నిర్దేశించిన ప్రయోగములు-చాల కలవు. డాకు శా దేశంబు - యూకు సకారంబగు - అతంగ్వాదుల డాకు ఉకారంబగు॥ మున్నగు విధముగా బాలవ్యాకరణకారుడు నిర్దేశమునందు హ్రస్వమునకు దీర్ఘము నుపయోగించెను. కావున ఇది సూరికి సమ్మతము కాదనుటపత్యసమ్మతము కాజాలదు.]

**9. కచటతపలు పరుషంబులని గజడదబలు సరళంబు లని చెప్పంబడు. (బా - ౫)**

వ్యాఖ్య - హల్లులను విభాగించుచు పరుషములు, సరళములు అను రెండు భేదములను సూరి చూపుచున్నాడు. ఏదేని ఒకవర్ణమును పలుకవలయునన్న నోటిలోని యొకభాగమును నాలుకయొక్క భాగముతో స్పృశింపవలయును. నోటిలోని భాగమును 'స్థానము' అని నాలుకయొక్క భాగమును 'కరణము' అని పిలుతురు. స్పృశించుటకు 'ప్రయత్నము' అని పేరు. పైని చెప్పిన పది వర్ణములందును పరుష ప్రయత్నము (గట్టిగా స్పృశించుట) వలన నుచ్చరింపబడునవి పరుషములు; సరళ ప్రయత్నము (తేలికగా స్పృశించుట)వలన నుచ్చరింపబడునవి సరళములు.

ఉదాహరణమునకు "కగ"లను దీసికొందము. నాలుకయొక్క మొదటి భాగము (కరణము) కంఠము (స్థానము)ను గట్టిగా స్పృశించుటవలన "క" వర్ణము పుట్టును. ఒకే స్థానమున పుట్టినప్పటికిని, ప్రయత్నభేదమువలన క వర్ణము పరుషమై, గ వర్ణము సరళమైనది. ఇట్లే మిగిలిన వానివి కూడ గుర్తించుకొనవగును.

**10. ఇతరము లగు హల్లులు స్థిరములు. (బా - ౬)**

ఖ ఘ జ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ॥

వ్యాఖ్య - హల్లులయందు పరుష సరళములు పోగా మిగిలినవన్నియు స్థిరములని సూత్రార్థము. ద్రుతముమీదను, ప్రథమావిభక్తిమీదను పరుషములు సరళములుగాను, గసడదవలుగాను మారుట కలదు. సరళములు కూడ కొన్నియెడల ఆదేశ సరళములై (పరుషముల స్థానమున వచ్చినవి), కొన్నియెడల సహజ సరళములై ఉ]

యుండును. పరుషసరళములకు అవిధమైన మారుపాటు కలుగుచునే యుండును. అట్లు ఏవిధమైన మార్పాటును పొందని వగుటచేత ఈ యిరువదినాల్గు హల్లులకును స్థిరము లను పేరుకలిగినది.

[హల్లులయందుండియు పరుషములుగా గాని, సరళములుగా గాని, స్థిరములుగాగాని వర్గీకరింపబడకుండ రెండక్షరములు మిగిలిపోయినవి. అవి చ జ యనునవి. వాని నెందు చేర్పవలయునను ప్రశ్నకు సమాధానముగా తరువాతి నాలుగు సూత్రములును ప్రవర్తించును.]

**11. దంత్య తాలవ్యంబు లైన చజలు సవర్ణంబులు. (బా – ౬)**

తాలవ్య చకారంబు దంత్యచకారంబునకును, తాలవ్య జకారంబు దంత్యజకారంబునకును గ్రాహకములని తాత్పర్యము.

వ్యాఖ్య – దంత్యములైన చ వర్ణమును, జ వర్ణమును తాలవ్యములైన చవర్ణ జవర్ణములతో సమానములని యర్థము. అనగా, తాలవ్యమైన చకారము దంత్య చ కారమును, తాలవ్యమైన జకారము దంత్య జ కారమును గ్రహించునని యర్థము.

పరుషములందు చవర్ణము గలదు. అది తాలవ్యము. దంత్యమైన చ వర్ణమును గూడ అది గ్రహించును. పరుషమైన చకారమునకు ఏయే కార్యములు (ద్రుతకార్యము, గసడదవా దేశము మున్నగునవి) విధింపబడునో, అవి యన్నియు దంత్యమైన చ కారమునకును వర్తించునని యర్థము. అట్లే సరళములందలి జ వర్ణము తాలవ్యము. దంత్యమైన జ వర్ణమును గూడ అది గ్రహించును. తాలవ్య జకారము వర్తించుచోటులందెల్ల దంత్యజకారమును వర్తించును.

[ఇంతకును, తాలవ్యమననేమి? దంత్యమననేమి? అను ప్రశ్నలు గలవు. ప్రస్తుతమాత్రముచేత ఆ ప్రశ్నములు తలయెత్తగా వానికి సమాధానముగా రాబోవు రెండుసూత్రములును వర్తించును.]

**12. ఇ ఈ ఎ ఏ ఐ ంం గూడిన చజలు తాలవ్యంబులు. (బా – ౭)**

చిలుక – చీమ – చెలి – చేమ – ఝల – జీడి – జెట్టి – జేజె.

వ్యాఖ్య – ఇ ఈ ఎ ఏ అను నచ్చులతో కలిసివచ్చిన చవర్ణ జవర్ణములు తాలవ్యము లని సూత్రార్థము. నాలుకయొక్క కొన తాలువును స్పృశించుటవలన నేర్పడునవి తాలవ్యములు. మూర్ధమునకును దంతమూలమునకును మధ్యప్రదేశమును "తాలువు" అని యందురు. తాలువు = అంగిలి.

చిలుక – చీమ మున్నగుశబ్దములలోని చవర్ణము తాలవ్యము. జిల – జీరి మున్నగుశబ్దములలోని జవర్ణము తాలవ్యము.

**13. అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చజలు దంత్యంబులు.** (బా - శా)

చలి – చాప – చుక్క – చూపు – చొక్కు – చోటు – చౌక – జముడు – జాతర – జున్ను – జూలు – జొన్న – జోలి – జౌకు – ఐదంతము లయిన చజలు సమేతరశబ్దములందు లేవు.

వ్యాఖ్య - అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లతో కలిసి వచ్చిన చవర్ణ జవర్ణములు దంత్యములు. జిహ్వాగ్రము దంతములను స్పృశించుట వలన నేర్పడునవి దంత్యములు.

చలి, చావ-మున్నగు శబ్దములలోని చ కారము దంత్యము. ఇచ్చటి చ వర్ణము నుచ్చరించునపుడు నాలుకకొన ముందరి పైపండ్ల వెనుకభాగమును స్పృశించును, అట్లే జముడు - జాతర మున్నగు శబ్దములలోని జకారము నుచ్చరింపవలయును. కావున, ఈ శబ్దములలోనిది దంత్య జ కారము.

[ఇ ఈ ఎ ఏ లు కూడి తాలవ్యములను, తక్కిన యచ్చులుకూడి దంత్యములను ఏర్పరుచుచున్నవి. ఈసందర్భమున తెనుగు వర్ణమాలలో ఉపయోగమునకు రానిది ఐకార మొక్కటియే. కావున, దాని విషయమునుగూడ సూరి యిట్లు నిర్ధారించుచున్నారు.]

ఐదంతములు = ఐకారమునంతమందు గలిగినవి. సమ + ఇతరశబ్దములు = సమేతరశబ్దములు = తత్సమములుకాక మిగిలిన శబ్దములు; అనగా అచ్చతెలుగు శబ్దములని యర్థము.

అచ్చతెలుగు శబ్దములందు ఐకారముతో కూడిన చవర్ణ జవర్ణములు లేవు. అట్టి యక్షరమే లే దన్నప్పుడు అది తాలవ్యమా? దంత్యమా? అను ప్రశ్న ముద యించు నవకాశమును లేదు.

"సమేతర శబ్దములందు" అని యిక్కడ చెప్పుటవలన ఎనిమిదవ, తొమ్మి దవ (బాలవ్యాకరణమునందు) సూత్రముల విషయము అచ్చతెలుగునకు సంబంధించిన దని జ్ఞాపనము చేయబడుచున్నది. అనగా, అచ్చతెలుగునందుమాత్రమే అఆఉఊ ఒఓఔలను గూడివచ్చు చజలు దంత్యము లగునని గ్రహింపవలయును.

[ఇట్లు చెప్పుటవలన సంస్కృతసమము లందు దంత్యతాలవ్య విభాగము కలదా? ఉన్నచో నెట్లుండును? అను ప్రశ్నము లుదయించును. వానికి సమా ధానముగా తరువాతిసూత్రము చెప్పబడుచున్నది.]

**14. సంస్కృతసమంబులం దికారాంతములగు శబ్దముల యుపధా చజలు బహువచనంబు పరంబగునపుడు దంత్యములగు.**

(బా - ౧౦)

ఇవి తప్ప సంస్కృతసమంబులందు దంత్య చజలు లేవని తాత్ప ర్యము. ఉపధ యనఁగాఁ దుదివర్ణమునకు ముందు వర్ణము. అర్చి - అర్చులు; రోచి - రోచులు; వీచి - వీచులు; రాజి - రాజులు; వాజి- వాజులు॥ మఱియు రాజశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి. ఇతరములయిన చ జ ల కుదాహరణములు॥ చంద్రుఁడు - చామరము - చక్రిక - చూర్ణము - చోరుఁడు - చౌర్యము - జయము - జాతి - జుగుప్స - జూటము॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - ఇకారాంతములైన సంస్కృత సమశబ్దములయొక్క ఉపధాస్థాన మున నున్న చ కారమునకును, జకారమునకును బహువచనము పరమగునప్పుడు దంత్యత్వము కలుగునని సూత్రార్థము.

ఉపధ యనగా తుదివర్ణమునకు ముందు వర్ణము. కేవలహల్లుగాని, కేవల స్వరముగాని వర్ణమని యందురు. 'అ' ఒక వర్ణము. 'క'-ఇందు 'క్, అ' అను రెండువర్ణములు గలవు. 'స్త్రీ'-ఇందు 'స్. త్, ర్ ఈ' అను నాలుగువర్ణములు

గలవు. 'రోచి' అనునప్పుడు చివరియక్షరము 'చి'. చివరి వర్ణము (చ్ + ఇ) 'ఇ'. చివరి వర్ణమునకు ముందరి వర్ణము (చ్) చకారము. బహువచనము పరమగు నపు డిత్వమున కుత్వమగును. "రోచి + లు = రోచులు". ఇట్టియెడల ఉత్వ విశిష్టమైన చకారము దంత్యముగా నుచ్చరింపబడును. 'వాజి' అను శబ్దమునందు జకారము ఉపధ; తాలవ్యము. బహువచనము పర మగునపుడు 'వాజి + లు = వాజులు' అని యగును. ఇచ్చటి ఉత్వవిశిష్ట జకారము దంత్యము.

సంస్కృతమునందలి రాజన్‌శబ్దము తెలుగునందు తత్సమముగా 'రాజు' అని యగును. రాజు శబ్దమునందలి జవర్ణముకూడ దంత్యయుక్తముగానే యుచ్చరింపబడును. సూరి రాజన్ శబ్ద మని కాని, రాజశబ్ద మనికాని యనక 'రాజుశబ్ద' మని యనుటచేత ఈ శబ్దము ఉత్వవిశిష్టముగా నున్నప్పుడుమాత్రమే దంత్యజకార మును గలిగియుండు నని గ్రహింపవలయును.

సంస్కృతసమములందు రాజు శబ్దము కడపటను, బహువచనము పరమైన పుడు ఉత్వమునొందిన ఉపధా చజలను తప్ప, దంత్య చజలు లేవు. తక్కినచోట్ల అన్నియు తాలవ్యములే. చంద్రుఁడు - చామరము మున్నగు ఉదాహరణములందు 'అ ఆ' మున్నగు అచ్చులతో కూడిన చజలు గలవు. అచ్చ తెలుగువం దైనచో నిట్టిచోటి చజలు దంత్యము లగును. సంస్కృతసమములందు దంత్యములు లేకుండుటచే, వీనిని తాలవ్యములుగనే పలుకవలయును.

15. ఒకానొకచో జకారం బుభయంబు నగు. (ప్రౌ - ఇ)

శ్లేషయందు జకార మొక్కటియె యొకయర్థమున దంత్య మును, వేఱొక యర్థమునఁ దాలవ్యము నయ్యెడునని యర్థము. అకట! పాండురాజ యశమెన్నవైతి - రాఘ ౧ ఆ. ౩౧. (ఇట జకారము భారతార్థమునందు దంత్యము, రామాయణార్థమునందుఁ దాలవ్యము నని యెఱుఁగవలయు.)

వ్యాఖ్య - ఒకానొకచో అనియనగా శ్లేషయం దని వ్యాకర్తయే వివరించెను. శ్లేషపదమునందు రాజ శబ్దములోని జకారము ఒక యర్థమున దంత్యముగను,

యర్థమున తాలవ్యముగను కూడ పలుకబడ వచ్చునని యర్థము. 'ఉభయమును' అని సముచ్చయార్థకము నుపయోగించుటచేత, దంత్యముగను తాలవ్యముగను పలుకబడు విధానము వికల్పమని తెలియవలయును.

భారతార్థమునందు 'పాండురాజ + యశము' అని విభాగింపవలయును. ఇందలి జకారము దంత్యోచ్చారణము కలిగియుండునని వ్యాకర్త యభిప్రాయము. రామాయణార్థమునందు 'పాండుర + అజయశము' అని విభాగము చేయవలయును. ఇందలి జకారము తాలవ్యోచ్చారణము కలిగియుండును. కావున శ్లేషకవిత్వమునందు ఒకే జకారము ఒకప్పుడు దంత్యముగను, ఒకప్పుడు తాలవ్యముగను నుచ్చరింపబడవచ్చునని ప్రస్తుత రాఘవపాండవీయప్రయోగమునుబట్టి ప్రౌఢవ్యాకరణకారుడు నిర్ణయము చేసెను.

చిన్నయసూరి 'రాజు' అను తత్సమశబ్దమునందలి జకారము దంత్యయుక్తముగా కనబడు చున్నదని పలుకుట ఈ సూత్రోత్పత్తికి హేతువు. బాలవ్యాకరణమునందున్నట్లు 'రాజు' శబ్దములోని జకారమును దంత్యముగా సమర్థింపవలయుననియే బహుజనపల్లి వారి యుద్దేశము. కావుననే 'పాండురాజ' అని యనినప్పుడు దంత్యమనియు, 'అజ' అని యనినప్పుడు తాలవ్యమనియు నిర్ణయముచేసి, ఒకే యక్షరము రెండువిధములుగా పలుకబడుటలోని వైచిత్రిని గమనించి యీ విధముగా సూత్రీకరించుట జరిగినది.

గుప్తార్థ ప్రకాశికాకర్త 'పాండురాజ' అను శబ్దములోనిది రాజన్ శబ్దమునకు తత్సమరూపమగు రాజు శబ్దముకాదనియు, అదియే యైనచో దంత్యమే యైయుండెడిదనియు నిర్ణయించుకొని, 'పాండురోగముచే ప్రకాశించువాడు' అను నర్థమున ఈ శబ్దము వాడబడెనని వ్రాసెను. పాండురోగముచేత ప్రకాశించుట యనునది యర్థములేని యన్వయము; కాక, ఆలంకారికులు పరిగణించిన నేయార్థము అను దోషమునకు పింగళి సూరన పాల్పడె ననవలసి వచ్చును: కావున ఈ యర్థము స్వీకార్యము కాదు.

'శ్లేషయందు ఒకే వర్ణమును రెండువిధములుగా పలుకుట సాధ్యముకాదు' అను వాదమే సమర్థము కాదు. పలిందు నిర్పిందు శబ్దముల కైక్యము కూర్చినప్పుడు, లఘ్వలఘుపులయిన 'య ల వ' వర్ణముల కైక్యము కూర్చినప్పుడు దంత్యతాలవ్య

ములకు మాత్రమేల ఐక్యము కూర్పరాదు ? అభంగ సభంగశ్లేష విధానమున శబ్దము లకు ఏకవిధోచ్చారణ మేమాత్రమును పీఠకాదు. ఐనను, ఒక యర్థమున ఒకవిధము గను, మఱొకయర్థమున మఱొకవిధముగను మాటలను వినుటయు, ఉచ్చరించుటయు అంగీకార్యమేకదా ! కావున ప్రౌఢవ్యాకరణకారుడు చెప్పినట్లు ఒకేయక్షరము నొక యర్థమున దంత్యముగను, మఱొకయర్థమున తాలవ్యముగను గ్రహించుట కాక్షేపము లేదు. ఇట్టిచోట్ల చకారమునుగూడ ఉభయవిధముగా గ్రహించుట సముచితము.

విజయవిలాసమున "తీయఁగఁ బంచదార వెనుదీయఁగఁ బల్కు సమన్ ద్వితీయగన్" అని కలదు. 'పంచదార' అను చోట చకారము చక్కెర యను నర్థ మున దంత్యమై, ఐదుగురికి భార్యయైన ద్రౌపది యను నర్థమున తాలవ్య మగుచున్నది. కావున దీనినిగూడ చేర్చుకొనవలయును గదా !

కేవలము 'జ' కారమును మాత్రమే ఉభయమని పేర్కొనుట యుక్తి సహము కాదు.

ఉదాహరణమునుబట్టి చూచినచో ఇదంతయు భ్రమోత్పన్నమైనట్లు స్పష్టము. చిన్నయసూరి రాజు శబ్దమని చెప్పినప్పుడు ఉదంతమైన రూపమునే ఉద్దేశించియుండె ననుట గమనింపదగిన యంశము. అట్లు కానియెడల రాజన్‌శబ్దమని కాని, రాజశబ్ద మనికాని చెప్పియుండవలసినది. 'రామశబ్ద' మని వాడుదురు కాని 'రాముఁడు శబ్ద' మని వాడరుకదా! కావున నిచ్చట రూపమును యథాస్థితముగా గ్రహింపవలయును. ప్రకరణమునుబట్టికూడ, ఉదంత రూపమే ఉద్దిష్టమని చెప్పవచ్చును. కావున 'రాజు' అను ఉదంతరూపము మాత్రమే దంత్య యుక్తము. 'రాజ' అని అదంతముగా నున్నపుడు తాలవ్యముగనే వ్యవహరింతురు. దీని నిటు గమనింపకపోవుటచేత ప్రౌఢవ్యాకరణ కారుడు 'పాండురాజ' అన్నప్పుడు దంత్యమనియు 'అజ' యన్న పుడు తాలవ్యమనియు ననుకొనెను. ప్రస్తుత వివేచనమునుబట్టి రామాయణార్థము నందును. భారతార్థమునందును కూడ జకారము తాలవ్య మన్న విషయము స్పష్టము.

16. రాజు వైకృతం బని కొంద ఱందురు. (ప్రౌ - ౬)

(అపుడు తత్సమంబునందలి చజలు దంత్యములు కావని యూ హించునది.) రాజు చూడంగఁ జెప్పంగరాని కడిమి, సీటియలఁ గ్రుమ్మ నొంచిరి లేటి మగలు॥ య. ౨ ఆ. ౧౭౭ మో॥

వ్యాఖ్య - 'రాజు' అను శబ్దము తత్సమము కాదని, తద్భవ మని కొందఱి యభిప్రాయము- అది సూత్రార్థము. వైకృత మనగా తద్భవమని యర్థము. 'యయాతి చరిత్రము' అను నచ్చతెలుగుగ్రంథమున పొన్నిగంటి తెలగనార్యుడు రాజు శబ్దమును వాడెను. ఆతని భావమునుబట్టి రాజు శబ్దము అచ్చతెలుగు కావల యును.- అట్లు కానియెడల, అచ్చతెలుగు గ్రంథమున దాని కవకాశము కల్పింపబడదు. ఇట్లే కూచిమంచి తిమ్మకవి మున్నగువారును రాజు శబ్దమును వైకృతముగానే తలపోసిరి.

'కొందఱందురు' అని యనుటచేత రాజుశబ్దము వైకృతమను నభిప్రాయము ప్రౌఢవ్యాకరణకారునికి లేదనియు, ఇతరుల యభిప్రాయమును మాత్రమే ఉద్ధరించి చూపుచున్నాడనియు ననిపించుచున్నది.

రాజు శబ్దమును వైకృతముగా నంగీకరించునెడల, రాజు శబ్దమునందలి జకారము దంత్యమని వేరుగా నిర్దేశింపవలసిన యవసరములేదు. ఎట్లును, ఉత్వవిశిష్ట మైన జకారము తెలుగుశబ్దములందు దంత్యమేకదా !

'ఖగరాజు' మున్నగుచోటులందలి జకార మిప్పటికిని సందిగ్ధముగనే మిగిలి పోవును. సమాసగతమైన రాజు శబ్దమును వైకృత మనుటకు వీలు లేదు. అట్లనుచో సమాసమే దుష్టమగును. కావున, ఇక్కడి రాజు శబ్దము తత్సమము కాక తప్పదు. బాలవ్యాకరణకారుని యభిప్రాయముప్రకారము ఇందలి జకారము దంత్యము. 'ఒకా నొకచో జకారం బుభయంబునగు' అను సూత్రమునుబట్టి ప్రౌఢవ్యాకరణకారుడును రాజుశబ్దములోని జకారమును దంత్యముగా నభిప్రాయపడె ననుట నిశ్చయము. వైకృతవాదమువలన రాజుశబ్దము తత్సమముగను, తద్భవముగనుకూడ మన్నదని యంగీకరింపవలసి వచ్చుచున్నది.

రాఘవపాండవీయప్రయోగవిషయమునగూడ ప్రస్తుతసూత్రము మూకీభావము వహించుచున్నది. 'పాండురాజ' అనునప్పుడు సమాసమగుటచేత 'రాజు'శబ్దమును తత్సమముగా నంగీకరింపక తప్పదు. వైకృతవాదము ఈ విషయమునం దేమాత్ర మును నుపకారి కాదు.

చిన్నయసూరి 'రాజుశబ్దము' అని వాడుటచేత ఉదంతమగు శబ్దమునే స్వీక రింపవలయు నను యథార్థము గ్రహింపక పోవుటచేత ఇన్ని తబ్బిబ్బులు పడవలసి వచ్చినది. సూరిమతము ననుసరించియైనచో భారతరామాయణార్థముల రెండింటను

జకారమును తాలవ్యముగనే పలుకవలయును. ప్రౌఢవ్యాకరణకారుడు చేసిన రెండు సూత్రములను భ్రాంతిజన్యములై వ్యర్థములై పోవుచున్నవి. బాలవ్యాకరణమునకు సవరణముగాని, పూరణము గాని చేయజాలవు.

పైగా, ప్రౌఢవ్యాకరణకారుడు 'అపుడు తత్సమంబునందలి చజలు దంత్యములు కా వని యూహించునది' అని సూచించుట అనుపపన్నము. వాదముకొఱకు రాజుశబ్దము వైకృత మను కొన్నప్పటికిని, ఇంత నెచ్చటను తత్సమములందు దంత్యములు లే వని యంగీకరింపవలసిన యావశ్యకము లేదు. ఇకారాంతములైన సంస్కృతసమశబ్దముల ఉపధాచజలు బహువచనము పరమగునప్పుడు దంత్యములగుటకు అవకాశము మిగిలియేయున్నది. తానేమియు ఈవిషయమున ఆక్షేపము తెలుపలేదు. కావున పీచులు, రోచులు, వాజులు, రాజులు మొన్నగు బహువచనరూపములందు దంత్యములుండుట కభ్యంతరము లేదు.

## 17. నకారంబు ద్రుతంబు. (బా - ౧౧)

వ్యాఖ్య – నకారమును ద్రుతమని పిలుతురని యర్థము. ఇది మూడు రూపములతో కన్పించును॥ ను – ని – న్॥ ఇకారముమీద వచ్చినచో "ను"అనునది "ని"గా మారును. హల్లుగాని, అవసానముగాని పరమైనచో "ను" అనునది "న్" అను రూపము నొందును. ద్రుతమునకు ప్రకృతిభావము కలిగినపుడు "ను"అనియే యుండును. కాబట్టి ను వర్ణమే "ని-న్" అను రెండురూపములను పొందుచున్నదనవలయును. ఈమూడురూపములందును మార్పునొందక, సామ్యమును సాధించుచు, స్థిరముగా నుండునది నకారము. కావుననే సూరి నకారముననే ద్రుతముగా స్వీకరించుచున్నాడు.

## 18. నకారం బసాధారణంబు ద్రుతంబు. (ప్రౌ - ౮)

ప్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్టమయిన నకారంబు ద్రుతసంజ్ఞకం బని యర్థము, ద్రుతమనఁగా నొల్లనిమెడ మఱఁగిపోవునది యనుట.

ఉ॥ ప్రత్యయాత్మకమైన నకారమునకు – తాను, నేను, ధనమును, వనమును, చదువుచున్నాను, చదువఁగలను॥ మొ॥ ఆగమాత్మకమైన నకారమునకు – నన్నును, నాచేతను, చదువుచును, చదువుచును॥ మొ॥ అవ్యయాత్మకమైన నకారమునకు – అన్నయును, తమ్ముండును.

మఱియును, ఏనియును॥ మొ॥ వలయుచో నీ ద్రుతంబు నందలి యకా రంబునకు లోపం బగు. ఉన్నాను - ఇత్యాదులయందు ద్రుతంబు నందలి యుత్వంబునకు లోపంబు గలుగదు. శబ్దశాసనుఁడు "ద్రుతాభ్యోనః" అని కేవల నకారగ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వ సిద్ధికై యని తెలియవలయును.

వ్యాఖ్య - అసాధారణమైన నకారమును ద్రుతమని యందురని సూత్రార్థము. అసాధారణము అని యనగా ప్రత్యయము కాని, ఆగమముకాని, అవ్యయముకాని యైన దని అభిప్రాయము. అనగా శబ్దమునందు సహజముగానున్న నకారముకాక, ప్రత్యయముగా కాని, ఆగమముగా కాని, అవ్యయముగా కానియుండు నకారము ద్రుత మనిపించు కొనునని భావము. ఇది ఉత్వవిశిష్టముకూడ నై యుండవలయు నన్నది మరొక లక్షణము.

తాను, నేను - అను శబ్దములయిందలి చివరి 'ను' వర్ణము ప్రత్యయము. ఇది ప్రథమావిభక్తి యేకవచనమునందుమాత్రమే యుండును. ఇతరరూపములయందు ఈ ను వర్ణము కలుగదు. కావున ప్రత్యయముగా విధింపబడిన ఉత్వవిశిష్టమైన యీ 'ను' వర్ణము ద్రుతము.

ధనమును, వనమును - మున్నగుచోటులందలి 'ను' వర్ణము ద్వితీయావిభక్తి ప్రత్యయము.

చదువుచున్నాను, చదువఁగలను - మున్నగుచోటు లందలి నువర్ణము పురుష ప్రత్యయము (క్రియావిభక్తి.)

పై యుదాహరణములన్నియు ప్రత్యయ నకారము ద్రుతమని నిరూపించుటకు చాలి యున్నవి.

నన్నును, నాచేతను - మున్నగుచోట్ల చివర నున్న ను వర్ణము ఆగమము. కయి, పట్టి, యొక్క అను మూఁడు ప్రత్యయములకు తక్క తృతీయాదివిభక్తులకు 'ను' ఆగమముగా బాలవ్యాకరణ తత్సమ పరిచ్ఛేదమునందు విధింపబడును. దానిని బట్టి 'నాచేతను' అనుదానియందలి 'ను' వర్ణమును ఆగమముగనే పరిగణింపవలయును. "నన్నును" అనుచోటునందలి "ను" వర్ణము నీపద్ధతినిబట్టి యాగమ మనుటకు వీలుకాదు. అది ద్వితీయావిభక్తి స్థానమున ఆదేశముగా వచ్చిన 'న్నును' అను రూపములోనిది. ప్రౌఢవ్యాకరణకారుడు తృతీయాదులకువలెనే ద్వితీయావిభక్తి

కూడ 'ను' వర్ణము ఆగమమయ్యె నను నభిప్రాయము కలిగియుండుటచేత, ఇట్లు చెప్పుచుండెను. ఇది ఆయన యభిప్రాయము.

చదువుచును, చదువుడును – మున్నగు చోటులందలి ను వర్ణముకూడ ఆగమమే. శత్రర్థక ప్రత్యయము చు వర్ణము. దాని మీది "ను" వర్ణము ఆగమము. ఆనంతర్యార్థకమైన డు వర్ణముమీది 'ను' వర్ణముకూడ ఆగమమే.

పైవన్నియు ఆగమనకారమునకు ఉదాహరణములు.

అన్నయును, తమ్ముండును – మున్నగువానియందలిది 'ఉను' అను సముచ్చయార్థకము. సముచ్చయార్థకము అవ్యయమగుటవలన ఇచ్చటి నకారము అవ్యయాత్మకము.

ఈపైవి చూపిన ప్రత్యయము, ఆగమము, అవ్యయమునైన నకారము ద్రుతమనుటలో బాలవ్యాకరణమునకును విప్రతిపత్తి లేదు. [బాలవ్యాకరణము నందలి సంధ్యాంశ (సంధి) పంద్రెండవసూత్రము ఈ విషయమును స్పష్టముగా నిరూపించును.]

కావున నింతవరకు నిది బాలవ్యాకరణమునకు వివరణము మాత్రమే.

"వలయుచో నీ ద్రుతంబునందలి యుకారంబునకు లోపంబగు" అను వివరణముకూడ క్రొత్తది కాదు. బాల వ్యాకరణమునందలి యిరువదవ సూత్రమైన "అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు విభాషనగు" అను దానినిబట్టి ద్రుతమునందలి ఉత్వమునకు లోపమును బాలవ్యాకరణమే తెలిపినది. సూత్రమునందు 'విభాష'యని యుండుటచే, కొన్నియెడల నిషేధము కూడ నుండును. ఉన్నాను - మున్నగుచోటులందలి ద్రుతమునకు గాని ద్రుతస్వరమునకు గాని లోపము రాకుండుట యపేక్షితము. దానిని సూచించుటకే సూరి "విభాష" యని సూత్రమున చేర్చెను. కావున ప్రౌఢవ్యాకరణము దీని నిక్కడ పేర్కొనుట బాలవ్యాకరణ విషయమును జ్ఞాపకము చేయుట కుపకరించును.

ఇంతవరకు ప్రౌఢవ్యాకరణము బాలవ్యాకరణమును సమర్థించుటయు, వివరించుటయు మాత్రమే కాననగును. ఇంక ఉత్వవిశిష్టమైయుండుట యను వంశమును చూడవలయును. "ఉత్వవిశిష్టమైన నకారము" అని యనుటవలన కేవల నకారమును, ఇత్వవిశిష్టమైన నకారమును ద్రుతము అను సంజ్ఞకు పాత్రములు కాకపోవలసి వచ్చును. అనగా అవ్యాప్తి దోషము పట్టును. అట్లే "ప్రత్యయాగమ" అని మొదలయిన వివరణమువలన "చేసు" "కెలను" మున్నగు శబ్దములందలి ను వర్ణము ద్రుతముకాదని స్పష్టముగా తేలుచున్నది. కాని "కన్ను" మున్నగు శబ్దములందలి చివరి "ను" వర్ణమును ద్రుతముగా స్వీకరించుట యిరువురు వ్యాకర్తల యందును

గన్పట్టును. పై వివరణమువలన ఇక్కడి 'ను' ద్రుతము కాక పోవలసి వచ్చును. కావున విదియు అవ్యాప్తి దోషము పాలయినదనక తప్పదు.

ఇంక 'ద్రుతాఖ్యో నః' అను చింతామణి విషయమును పరామృశింతము. "శబ్దశాసనుఁడు 'ద్రుతాఖ్యోనః' అని కేవల నకారగ్రహణముచేయుట ద్రుతమునకు స్థిరత్వసిద్ధికై యని తెలియవలయును" అని ప్రౌఢవ్యాకరణకారుడు వివరించెను. దీని వివరణమున కుమారదేవపండితీయము - "చింతామణి కర్తకుఁగూడ నుత్వ విశిష్టమగు నకారమే ద్రుతమనుట సమ్మతమయ్యును 'ద్రుతాఖ్యో నః' అనునది 'స్థిరా ఇతరే' యను వ్యంజనములకు స్థిరాది సంజ్ఞలను విధించు ప్రకరణమందుండుట చే నుత్వవిశిష్ట నకారమును గ్రహించినచో స్థిరసంజ్ఞ కూడ నుత్వవిశిష్ట నుకారమునకే చెంది పొల్లునకుఁ జెందకపోవుం గాన సామాన్యముగ 'న' యని వ్యంజనమాత్రమును గ్రహించియున్నాఁడు. చిన్నయసూరి కట్టి ప్రకరణ నిర్బంధము లేకున్నను నుత్వ విశిష్టమని విశేషించి చెప్పక చింతామణ్యనుసారముగ నకారమాత్రమే ద్రుతమని యాతఁడు చెప్పుట సమంజసము కాదు." అని మొదలుగా వ్రాసెను.

అదే ప్రకరణమునందు "పరుషసరళములను జెప్పిన పిదప, నందు 'స్థిరా ఇతరే' అని చెప్పుటచే నకారమునకును స్థిరత్వము రావలసి యున్నందునను, 'ను' అనుదానినే ద్రుతముగా గ్రహించినచో నకారమును స్థిరత్వము కలుగకపోవలసి వచ్చును కావునను, సామాన్య నకారమునకు స్థిరత్వమును సిద్ధింపఁజేయుటకై చింతా మణిలో 'ద్రుతాఖ్యో నః' అని సూత్రింపఁబడెనని ప్రౌఢవ్యాకర్త వివరించుచున్నాఁడు" అని సుబోధినీవ్యాఖ్యానము వివరించెను.

పై రెండు అభిప్రాయములను చక్కని భ్రమప్రమాద ప్రహావనమున శాతిర మైనవి. చింతామణియందు 'ద్రుతాఖ్యో నః' అని చెప్పిన పిదప వరుసగా 'కచటతపాః పరుషాః' 'గజడదబాస్తు సరళాః' 'స్థిరా ఇతరే' అను సూత్రము లున్నవి. అట్లుం డుటవలన ద్రుతము, పరుషములు, సరళములు పోగా మిగిలినవి స్థిరము లను నభి ప్రాయ మేర్పడుచున్నది. కావున వ్యాఖ్యాతలు దానిని వారించుటకు పరుషసరళములు కాక మిగిలిన హల్లులు స్థిరములని వివరించిరి. అక్కడ అది యవసరము. చిన్నయ సూరి ఆక్రమమునే మార్చుకొనుటవలన ద్రుతము స్థిరమగునా? కాదా? అను సంశయమే వచ్చుట కవకాశములేదు. పరుషసరళ స్థిరములను ముందుగా నిరూపిం చినపిమ్మటనే ద్రుతము నెత్తుకొనెను. అది విషయాంతరము. ప్రస్తుతము ననుస రింతము. ఉత్వవిశిష్టమైన నకారము ద్రుతమని చెప్పినచో సామాన్య నకారమునకు

స్థిరత్వము కలుగదని చెప్పుటయెట్లు ? చింతామణిసూత్రమును బట్టి ద్రుతము స్థిర వర్ణము కాకపోవుట సంభవించును గాని సామాన్య నకారము స్థిరవర్ణము కాకపోవుట యెట్లు ? అంతేకాక 'నః' అని చెప్పుటచేత స్థిరమగుట మాత్రమెట్లు ? ఉత్వముతో కలిసియుండుట, కలిసియుండకపోవుట యనునవి నకారమును స్థిరములలో చేర్చు టకే మాత్రమును సహకరింపవు. ఈ యసంగతిని గుర్తించియే తత్త్వబోధిని యీక్రింది విధముగా విమర్శించినది.

"కచటతపాః ఇత్యాది సూత్రద్వయముచేఁ బరుషసంజ్ఞయు సరళసంజ్ఞయును జెప్పి తదితరములగు హల్లులన్నియు స్థిరసంజ్ఞలు గల వగునని 'స్థిరా ఇతరే' అను సూత్రముతోఁ జింతామణి చెప్పుచున్నది. హల్లులతో నచ్చులు కూడియున్నను, లేకున్నను నీ సంజ్ఞలు వచ్చుచునే యుండును. 'పూచెం గుముదము' ఇత్యాదుల నుత్వవిశిష్టమగు కకారమునకుఁ బరుషసంజ్ఞ లేకపోయెనా ? అట్లే 'ను' అనుదానిలో నున్న నకారముగూడ స్థిరసంజ్ఞ నెట్లయినను బొందుచుండును. ఇందుకు 'ద్రుతాఖ్యో నః' అను సూత్రముతో నెట్టిసంబంధము లేదు" అని మున్నగు విధముగా వ్రాసి "వాన సీతారామాచార్యులవారి యీ సమర్థనము యుక్తియుక్తముగాఁ గానరాదు" అని ముగించెను.

ఇచ్చట సీతారామాచార్యులవారి సమర్థనమున దోషములేదు. వ్యాఖ్యాతలు పట్టించిన అపమార్గముచేత ఆచార్యులవారి ప్రసంగమే అయుక్తమని యనిపించు చున్నది. అది యట్టిది కాదు. "స్థిరత్వ సిద్ధికై" అనుమాటను, పారిభాషికమగు స్థిరముగా తలపోసి అర్థము చెప్పుకొనుటచే, ఇంత యనౌచిత్యము ప్రవేశించినది. బాలవ్యాకరణవిషయమున వ్యాఖ్యాతమైనట్లే 'ద్రుతమునకు స్థిరత్వమును గల్గించుటకు' అనగా ద్రుతవిషయమున నిశ్చయమైనను కలుగజేయుటకని యర్థము చెప్పికొన వలయును. పారిభాషికమైన స్థిరముతో ఈ స్థిరత్వమున కేమియు సంబంధములేదు. 'ను' అని చెప్పినయెడల 'న్, ని' అను రెండును ద్రుతము కాకపోవలసివచ్చును. అందువలన 'ను, ని, న్' అను మూడురూపములందును సమానముగా నున్న న కార మునే గ్రహించి ద్రుతమనుట జరిగెను. ఇట్లు చెప్పుటవలన పైనే యచ్చు ఉన్న ప్పటికిని ద్రుతత్వమునకు లోపము కలుగదు. ఇదే యభిప్రాయము చిన్నయసూరికి కలదు. ఇదే యభిప్రాయము నన్నయభట్టారకునకును గలదు. దీనిని గ్రహించుట యందు ప్రౌఢవ్యాకరణకారు దేమియు పొరపడలేదు. కాని తాను మాత్రము 'ఉత్వ విశిష్టము' అనియే చెప్పెను. ఆ చెప్పుట వివరణములో చేసెను గాని సూత్రమునందు

ఉత్వప్రసక్తియే లేదు. దీనినిబట్టి మువ్వురకును ఉత్వవిశిష్టమైన నకారమే సమ్మతమనియు, కాని దానిని కంఠోక్తిగా చెప్పినచో "న్, ని" అనువానికి ద్రుతసంజ్ఞ కలుగదని మానిరనియు నిశ్చయింపవచ్చును. ఆ విషయము బాలవ్యాకరణమునందలి యుదాహరణములనుబట్టి స్పష్టముగా గ్రహింపవచ్చును. మరి, యింత తెలిసిన ప్రౌఢ వ్యాకరణకారుడు తానుమాత్రమేల "ఉత్వవిశిష్ట" మనవలయు నను ప్రశ్నయుదయించును. తానును సూత్రమునందు తెలుపలేదు. వివరణమునందు తెలిపెను. "ను, ని, న్' అను మూడురూపములయందును మొదటిదే ప్రధానరూపమనియు, తక్కినరెండును దానికి రూపాంతరములే యనియు ఆయన నిశ్చయము. అందువలననే ఆరెండింటికి కూడ "ద్రుతము" అను సంజ్ఞను ఆయన అంగీకరించియే యున్నాడు.

ఇంతవరకు చేసిన చర్చనుబట్టి ప్రస్తుతసూత్రము బాలవ్యాకరణసూత్రమునకు వివరణము మాత్రమేకాని సవరణ మెంతమాత్రమును కాదని తేలుచున్నది. కావున "ద్రుతము" అను విషయమున పైకి భిన్నాభిప్రాయము లున్నట్లు కవిపించుచున్నను, బాలప్రౌఢవ్యాకరణకారులకు నిజముగా ఒకే నిశ్చితాభిప్రాయమున్నట్లు పై విమర్శనమువలన స్పష్టమగుచున్నది. ఈ తరువాతి సూత్ర మీ విషయమునే నిర్ధారించును.

19. ద్రుతాంతము లయిన పదములు ద్రుతప్రకృతికములు.

(బా - ౧౨)

ప్రథమా కయి పట్టి యొక్కేతరములయిన విభక్తులు, ఉత్తమ పురుషైకవచనంబులు, భూత తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనంబులు, ఆశీరాద్యర్థంబు లయిన మెడు త వర్ణకంబులు, శతృ శానుమానంతర్య చేదాద్యర్థకంబులు, నేను తాను పదంబులును, వలె ప్రభృతులును ద్రుతప్రకృతికంబులు - నన్నున్ - నాచేతన్ - నాతోడన్ - నాకొఱకున్ - నావలనన్ - నాకంటెన్ - నాకున్ - మాలోపలన్ - మాయందున్; వత్తున్ - వచ్చెదన్; వచ్చెన్ - వచ్చున్ - వచ్చెడున్; ప్రసన్నులయ్యెడున్ - కావుతన్; కొట్టుచున్ - కొట్టన్ - కొట్టఁగన్ - కొట్టుడున్ - కొట్టినన్; వలెన్ - ఎంతయున్ - పోలెన్ - అయ్యున్. ఇత్యాదు లూహ్యంబులు.

వ్యాఖ్య - ద్రుతమును అంతమందు కలిగిన పదములు ద్రుతప్రకృతికములని సూత్రార్థము.

ప్రథమా (డు - ము - వు - లు), కయి, పట్టి, యొక్క - అనునవి కాక మిగిలిన విభక్తులన్నియు ద్రుతప్రకృతికములు॥ నన్నున్, నాచేతన్, నాతోడన్, నాకొఱకున్, నావలనన్, నాకంటెన్, నాకున్, మాలోపలన్, మాయందున్.

ఉత్తమపురుష + ఏకవచనములు = ఉత్తమపురుషైకవచనములు (నేను అను సర్వనామముతో అన్వయించు క్రియారూపములని యర్థము) - వత్తున్, వచ్చెదన్.

భూతప్రథమపురుషైక వచనములు (అనగా, వాఁడు - అతఁడు వంటి సర్వ నామముతో అన్వయించు భూతకాలిక క్రియలు) - వచ్చెన్.

తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనములు (ప్రత్యేకముగా ఒకకాలమును నిరూపింపక, సందర్భమునుబట్టి యేకాలమునైనను బోధింపగల క్రియారూపమును తద్ధర్మార్థకమని యందురు. తత్ + ధర్మ + అర్థకము = ధాతువుయొక్క ధర్మమే అర్థముగా కలది.) - వచ్చున్, వచ్చెడున్. ఆశీస్సు, శాపము మున్నగువానియం దగు 'ఎడు - త' అను ప్రత్యయములు - ప్రసన్నులయ్యెడున్, కావుతన్.

శతృ + అర్థకములు = శత్రర్థకములు (వర్తమానకాలమును సూచించు ప్రత్యయముతోడి అసమాపక క్రియారూపములు) - కొట్టుచున్.

తుమ్ + అర్థకములు = తుమర్థకములు 'కొఱకు' అను నర్థమును బోధించు నవి. (సంస్కృతమునందు వెళ్లుటకొఱకు' అని యన్నప్పుడు 'గంతుమ్' అని యుండును. అచ్చట 'తుమ్' బోధించెడి యర్థమును తెలుగున బోధించునది తుమర్థ కము) - 'కొట్టన్', 'కొట్టఁగన్'.

అనంతర్యార్థకములు (తరువాత జరిగిన పనిని బోధించునవి) - కొట్టుడున్.

చేత్ + అర్థకములు = చేదర్థకములు (అయినచో - అను నర్థమును బోధించునవి) - కొట్టినన్.

ఇంతవరకు చెప్పిన వన్నియు ద్రుతప్రకృతికములు. ఇవియేకాక నేను, తాను - అను పదములు, వలెన్, పోలెన్ - అను నవ్యయములు; ఎంతయున్, అయ్యున్ - అను సముచ్చయార్థకములు మున్నగునవి ద్రుతప్రకృతికములు.

[పై యుదాహరణములందు నాచేతన్, నాతోడన్ - మున్నగువిధముగా నకారపుపొల్లు తోడి రూపములు చూపబడినవి. నిజమునకు, ప్రక్రియను బట్టి 'తృతీయాదులకు నుగాగమము' విధింపబడుటచేత నాచేతను, నాతోడను - అను

విధముగానే రూపము లుండవలసియుండును. 'అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగానగు'(బా-సంధి 20) అన్న నియమమును బట్టి ద్రుతస్వరమునకు లోపము రావచ్చును, అట్లు లోపము వచ్చిన రూపములనే యుదాహరణములందు ప్రదర్శించుట జరిగెను.

**20. ద్రుతప్రకృతులుగాని శబ్దంబులు కళ లనంబడు.** (బా - ౧౨)

రాముఁడు – రాములు – హయము – విష్ణువు – గోడ – మేడ – అయ్య – అమ్మ – రామునికయి – జ్ఞానముఁబట్టి – నాయొక్క – వచ్చిరి – వచ్చితివి – వచ్చితిరి – వచ్చితిమి – రాఁడు – రారు – రాదు – రావు – రాము – కొట్టక – తిట్టక – ఎత్తిలి – ఒత్తిలి – ఊరక – మిన్నక – బళి – అక్కట – ఏల॥ ఇత్యాదులూహించునది.

వ్యాఖ్య – ఇంతవరకు చెప్పికొన్న ద్రుతప్రకృతికములు కాక మిగిలిన శబ్దము లన్నియు 'కళలు' అని సూత్రార్థము.

ప్రథమావిభక్తి॥ రాముఁడు, రాములు, హయము – విష్ణువు. అచ్చతెనుగు శబ్దములయిన గోడ, మేడ, అయ్య, అమ్మ మున్నగునవి కూడ కళలే.

[వీనికి చివర ప్రథమావిభక్తి ప్రత్యయము లేకపోయినను, ఉన్నట్లుగా గణించుట శాస్త్రసమ్మతము. పదము ప్రకృతి ప్రత్యయముల కలయికవలన నేర్పడును; పైవి పదములు. అందువలన ప్రకృతిపైని ప్రత్యయమును విధించి, దానిని లోపింప జేసికొనవలయును. ఇది ప్రక్రియయందు సామ్యమును సాధించుటకై చేసికొను సౌకర్యము.]

కయి – అను చతుర్థీవిభక్తిప్రత్యయము, పట్టి – అనుపంచమీవిభక్తిప్రత్యయము, యొక్క – అను షష్ఠీవిభక్తి ప్రత్యయమునుగూడ కళలే॥ రామునికయి, జ్ఞానముఁబట్టి, నాయొక్క

భూతకాల ప్రథమపురుష బహువచనము - వచ్చిరి.

భూతకాల మధ్యమపురుష - వచ్చితివి (ఏ), వచ్చితిరి (బ)

భూతకాలోత్తమపురుష బహువచనము - వచ్చితిమి.

వ్యతిరేకార్థకక్రియలు - రాఁడు, రారు, రాదు, రావు, రాము.

వ్యతిరేకక్త్వార్థక క్రియలు - కొట్టక, తిట్టక.

క్త్వార్థకక్రియలు - ఎత్తిలి, ఒత్తిలి.

తూష్ణీమర్థకములు - ఊరక, మిన్నక.

ప్రశంసార్థకము - బళి.

సంతాపార్థకము - అక్కట.

ప్రశ్నార్థకము - ఏల.

ఇట్టి పన్నియు కళలు, 'వ్యతిరేకక్త్వార్థకక్రియలు' మొదలుకొని 'ప్రశ్నార్థకము' వరకు గలవాని నన్నింటిని మొత్తముమీద 'అవ్యయములు' అని పిలువవచ్చును.

'ఇత్యాదు లూహ్యములు' అని వివరణమునందు సూరి యనుటవలన 'అట్టులు, ఇట్టులు, ఎట్టులు' అను ప్రకారార్థకములును - 'మఱి, మిక్కిలి' మున్నగు అత్యంతార్థకములును - "ఏ, ఆ" మున్నగు అవధారణార్థకములును గూడ కళలయందే గ్రహింపబడుచున్నవి.

21 అకప్రత్యయాంతావ్యయంబు కళయ. (ప్రౌ - ౮)

వ్యతిరేకార్థక భూతకాలికాసమాపకక్రియ ద్రుతప్రకృతికముకాదని యర్థము॥ సాధన కిట్టిపాటి యుపకారముఁ దకుఁ జేకవిప్రసం॥ బోధనఁజేసి చేసె॥ భార. ఆది. ౧ ఆ. ౧౨౮॥ హర్షమదమాన విషాదములం దొరంగనీక తొలఁగఁ ద్రోవు॥ భార. శాంతి. ౨ఆ. ౨౫౩॥ ప్రాణవ్యపాయంబులేక తగన్॥ హరి. ఉ. ౩ ఆ. ౨౦౩ మొ. ప్రయోగము లిట్లుండ - అనఘ యిదియేటితపమే॥ మనుపమ దుఃఖితుల మగుట నాధారములే। కను సంతానోచ్ఛేదంబున వ్రేలెద మధమ లోకముల తెరువు పనన్॥ భార. ఆది. ౨ ఆ. ౧౩౬॥ ఇందు 'లేకను' అని ద్రుతాంతముగా నుండుట వలనం గొంద ఱయ్యది ద్రుతప్రకృతికమని భ్రమియించెదరు. (చూ. శబ్దపరిచ్ఛేదము ౧౧౬ వ సూత్రము.)

వ్యాఖ్య - అకప్రత్యయాంతావ్యయము అని యనగా వ్యతిరేకక్త్వార్థక మని యర్థము. ఇది కళయే కాని ద్రుతప్రకృతికము కాదని ప్రౌఢవ్యాకరణము నిర్దేశించుచున్నది.

వ్యతిరేకక్త్వార్థకమున 'కఞ్' యను ప్రత్యయమును బాలవ్యాకరణము విధించుచున్నది. ఇందు కకారము మాత్రమే ప్రత్యయము. ఞ్ యనునది ఇత్సంజ్ఞ. ఞిత్తు పరమైనపుడు ఉత్వమున కత్వము కావలయును. అను + క = అనక యని యగును. 'క' యను ప్రత్యయము పరమందుండగా ధాత్వంతము నందలి ఉత్వమునకు అత్వము కలుగుచున్నది. అను + అక = అనక అనియు విభజించుట కవకాశము కలదు. కావుననే దీనిని ప్రౌఢవ్యాకరణకారుడు అకప్రత్యయాంతావ్యయ మని పేర్కొను

చున్నాడు. ఇచ్చు + క = ఈక: కలుగు + క = లేక అను రూపములందు క వర్ణమునకు పూర్వమందు అ వర్ణములేదు. కావున ఈక, లేక మున్నగు వ్యతిరేక క్త్వార్థకములను అకప్రత్యయాంతావ్యయములనుట యంత సమంజసముగా కనుపట్టదు. సూరి పేర్కొన్నట్లు వ్యతిరేకక్త్వార్థకములని కాని,కజ్యంతములనికాని పేర్కొని యుండిన నుచితముగా నుండెడిది.

బాలవ్యాకరణము వ్యతిరేకక్త్వార్థకములను కళలుగానే పేర్కొని కొట్టక, తిట్టక యని యుదాహరించెను. ప్రౌఢవ్యాకరణము బాలవ్యాకరణమునే సమర్థించుచు, ఇతరులకు కలిగిన భ్రమను తొలగించుటకుగాను ఈ సూత్రము నారంభించెను. కావున ప్రస్తుతసూత్రము బాలవ్యాకరణ సమర్థకము.

కాదనక + ఇట్టిపాటి = కాదనకిట్టిపాటి. ఈ ప్రయోగమును బట్టి వ్యతిరేకక్త్వార్థకము కళయని నిరూపితమగుచున్నది. ఇది ద్రుతాంతమె యైయున్నచో "ఇఁకాదులకుఁదప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు" అను సూత్రములనుబట్టి సంధి కారాదు. అనగా 'కాదనక నిట్టిపాటి' యను విధముగా నుండవలయును. అట్టి అవిష్టరూపముతో లేదు కనుక 'కాదనక' యనునది కళయేయని సిద్ధాంతము. 'తొరంగ నీక తొలఁగఁద్రోవు' అనునుదాహరణము పూర్వోదాహరణముకంటె బలీయము. ఉదాహృతపద్యమున తకారము ప్రాసము.'తొరంగనీక' యను వ్యతిరేకక్త్వార్థకము ద్రుతాంతమే యైనచో "ద్రుతప్రకృతములమీఁది పరుషములకు సరళములగు" కావున తరువాతి పదమునందలి తొలిపరుషము సరళము గావలయును. అప్పుడు ప్రాసభంగ మగును. కావున దిద్దుటకును, పొరబడుటకును వీలుకాని యీ యుదాహరణము చేత పైతను వ్యతిరేకక్త్వార్థకము కళయే యని స్థాపింపబడుచున్నది. 'లేకతగన్' అను చోట కూడ తకారము ప్రాసస్థానమందున్నది. కావున నిదియు కళాత్వస్థాపకమైన గట్టి యుదాహరణమే.

ఇన్నిచోట్ల కళాత్వనిరూపకములైన లక్ష్యములను చూపినపిదప, తద్భిన్నమైన లక్ష్యమునుగూడ ప్రౌఢవ్యాకరణము చూపుచున్నది. 'లేకను' అని ద్రుతాంతముగా వ్యతిరేకక్త్వార్థకము భారతముననే ప్రయోగింపబడినది. అచ్చటి'ను' సముచ్చయార్థకమైన 'ఉను'లో తొలివర్ణము లోపింపగా మిగిలియున్న యవశిష్టమనియు అర్థవిశేష మున కలిగెననియు ప్రౌఢవ్యాకరణకారుని నిశ్చయము. అర్థవిశేషము నెరుగని కొందరు దీనిని ద్రుతప్రకృతికముగా భావించిరనియు, అది కేవలము భ్రాంతి యనియు ఆయన యుద్దేశము. ఇదే విషయమును శబ్దపరిచ్ఛేదమునందలి మాటపదు నారవ సూత్రమున మరల ప్రసంగానుప్రసంగముగా తెలిపెను. బాలప్రౌఢవ్యాకరణ

ములు రెండును వ్యతిరేకకర్త్రర్థకములను కళలుగానే పరిగణించుటలో ఏకహృదయులైనవి.

**22.** హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగా నగు. (బా - ౧౪)

అడఁకువ - అడంకువ; అరఁటి - అరంటి; ఎలుఁగుట - ఎలుంగుట; బలఁగము - బలంగము; మగఁటిమి - మగంటిమి.

వ్యాఖ్య - బిందు వనగా సున్నయని యర్థము. దీనినే 'అనుస్వార' మనియు నందురు. ఎల్లప్పుడును అచ్చువెంబడినే యుపయోగింపబడుటచేత దీని కీపేరు కలిగినది. అనుస్వారము రెండు విధములు.

1. అర్ధానుస్వారము ( ఁ ). దీనిని అరసున్న యనియు ఖండబిందు వనియు గూడ వాడుదురు. 2. పూర్ణానుస్వారము ( ం ). దీనిని నిండుసున్న యనియు, పూర్ణ బిందు వనియు కూడ వాడుదురు.

హ్రస్వాక్షరముమీదనున్న అర్ధానుస్వారమునకు బదులుగా పూర్ణానుస్వారము వైకల్పికముగా నగునని సూత్రార్థము. అ, ఇ, ఉ, ఎ, ఒ - అనునవి హ్రస్వాచ్చులు. ఇవియు, వీనిని గూడియుండిన హల్లులును హ్రస్వాక్షరములు.

వైకల్పికము అని యన్నపుడు సూత్రమున విధించిన కార్యము ఒకమారు జరుగును; ఒకమారు జరుగకుండును. జరుగుట, జరుగకుండుట యనునవి యుపయోగించువాని యిష్టమునుబట్టి యుండును.

'అడఁకువ' అను శబ్దమునందు అరసున్న 'డ' యను హ్రస్వాక్షరముపైనున్నది. కావున సూత్రవిధినిబట్టి నిండుసున్నరాగా 'అడంకువ' యని యగును. సూత్రవిధి వైకల్పిక మగుటవలన పూర్ణానుస్వారము రాకుండ 'అడఁకువ'యను రూపముకూడ నుండవచ్చును. ఇట్లే తక్కిన రూపములుకూడ రెండేసి విధములుగా నైనవి.

[సూత్రవిధినిబట్టి అరసున్నకు నిండుసున్నను విధించుచున్నట్లు అనిపించును. కాని ఇప్పుడు అరసున్న యున్నచోట ఒకప్పుడు నిండుసున్న యుండెడిది. చారిత్రకముగా పరిశీలింపగా 'అడంకువ' మున్నగు శబ్దములలోని నిండుసున్నలు నిత్యవ్యవహార వశమున క్రమముగా జారిపోయి యుండుననియు, అట్లు జారిపోయినవానికి బదులుగా గుర్తులుగా అరసున్నలను నిల్పుట జరిగినదనియు గుర్తింపనగును. కావున నిండుసున్నలే అరసున్నలయ్యెననుట చారిత్రకసత్యము. కాని, నిండుసున్నలకు అరసున్నలను విధించినయెడల అపరంజి, నారింజ

మున్నగు శబ్దములలోని పూర్ణబిందువులకు కూడ చ్యుతి కలిగి అనిష్టరూపము లేర్పడును. కావున బాలవ్యాకర్త ప్రక్రియాలాఘవము నపేక్షించి, చరిత్రకు విరుద్ధ మేదైనను, అరసున్నకు నిండుసున్నను సముచితముగా విధించెను.]

**23. దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు. (బా - ౧౩)**

వాఁడు - వీఁడు - రాఁడు - లేఁడు - కాఁబోలు - కాఁబట్టి - గోఁగులు - రేఁగులు.

వ్యాఖ్య - సాధ్యపూర్ణము = వ్యాకరణ నియమముచే సాధింపదగిన పూర్ణానుస్వారము. అనుస్వారము సిద్ధము, సాధ్యము నని రెండువిధములుగా నుండును. 1. సిద్ధము అనియనగా శబ్దమునందు సహజముగా నున్న అనుస్వారమని యర్థము. ఉ॥ దెందము - అందము 2. సాధ్యము అని యనగా శబ్దమునందు సహజముగా (పుట్టుకతో) లేకుండ వ్యాకరణ నియమమువలన వచ్చిన యనుస్వారమని యర్థము. ఉ॥ చెందొవ - పొందామర.

ఆ, ఈ, ఊ, ఏ, ఐ, ఓ, ఔ - అనునచ్చులు - దీర్ఘములు. ఇవియు, వీనితో కూడివచ్చు హల్లులును దీర్ఘాక్షరములు. దీర్ఘాక్షరము మీద సాధ్యపూర్ణము కలుగదని సూత్రార్థము. అనగా, ద్రుత స్థానమున బిందువు వచ్చునప్పుడు కూడ పూర్ణబిందు వీ సూత్రముచేత రాదు. అట్లే దీర్ఘము మీదనున్న ఖండబిందువునకును పూర్ణబిందువు రాదు. వాఁడు - వీఁడు మున్నగు శబ్దములయందలి బిందువు వ్యాకరణ నియమమును బట్టి వచ్చినది. కాబట్టి యిది సాధ్యబిందువు. బిందువని యన్నప్పుడు పూర్ణబిందువు కావి, యర్ధబిందువుకాని కావచ్చును. వా, వీ-మున్నగు దీర్ఘాక్షరముల మీద నుండుట వలన ప్రస్తుత సూత్రమునుబట్టి యిచ్చట పూర్ణబిందువురాదు. అప్పుడింక ఖండ బిందువు మాత్రమే కావలసి యుండును.

[తీంత్రి - తాంత్రి మున్నగు శబ్దములయందలి పూర్ణబిందువు సహజ సిద్ధము. కావున దీర్ఘాక్షరముపై నుండుట కాక్షేపములేదు.]

**24. సంస్కృత సమేతరములయిన తెలుఁగుశబ్దముల యందుఁ బరుష సరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది.**

**(బా - ౧౬)**

సంకర - కలఁకువ - మంచు - త్రాఁచు - దంట - దాఁటు - గంట - కోఁట్లు ఇత్యాదు లూహ్యంబులు.

వ్యాఖ్య - సంస్కృతసమ + ఇతరములు= సంస్కృత సమేతరములు = సంస్కృత సమములు కానివి; అనగా అచ్చ తెనుగు శబ్దములు.

అచ్చతెనుగు శబ్దములయందు బిందువు పరుషసరళములకు ముందు మాత్రమే కనబడుచున్నదని యర్థము. దీనినిబట్టి అచ్చతెనుగుశబ్దములయందు స్థిరవర్ణములకు ముందు బిందువుండదని స్థిరపడుచున్నది. ఏదైన నొకపదములో స్థిరవర్ణమునకు ముందు బిందువున్నయెడల, ఆ పదమును సంస్కృతసమ మని గుర్తుంచుకొన వలయును.

ఉ॥ హంస. ఇందు బిందువు 'స' అను స్థిరవర్ణమునకు ముందున్నది. కావున ఈ పదము సంస్కృతసమము.

వంకర - కలఁకువ మున్నగు నుదాహరణములందు పూర్ణబిందువు కాని అర్ధబిందువుకాని పరుషములకు ముందు మాత్రమే కలవు. కావున ఉదాహరణము లందలివి తెలుఁగు శబ్దములని స్పష్టము.

చెంగు - చెలుఁగు - పొంగు - పోఁగు - రెండు - మూఁడు-ముందు-మీఁదు - చింబోతు - ఆఁబోతు॥ ఈ యుదాహరణములందు సరళములకు ముందు పూర్ణాను స్వారమును అర్ధానుస్వారమును గలవు.

[ఈ నియమమునకు విరుద్ధముగా 'కంసాలి'యను శబ్దమునందు మాత్రము స్థిరవర్ణమునకు ముందు బిందువు కనబడుచున్నది. ఇది 'కమసాలి' యనుశబ్దమునకు రూపాంతరమే. ఉచ్చారణత్వర వలన మకారము బిందువై యుండగా, కవిప్రయోగబలమువలన దానికిని ప్రతిష్ఠ చేకూరినది. తక్కిన తెలుగు శబ్దము లన్నింటి యందును పరుషసరళములకు ముందుమాత్రమే బిందువు కానబడును.]

**25. యకారంబును వువూవొవోలును దెలుఁగుమాటలకు మొదటలేవు.** (బా - ౧౬)

ఎవఁడు - ఎక్కడ - ఏమి - ఏల - ఉంత - ఊరు - ఒకఁడు - ఓడ॥ హరి యతఁడు - నిద్రవోయె నిట్టిచోట్ల సంధివశంబున వచ్చిన యకార వకారంబులు గాని పూర్వ సిద్ధంబులు గావు. వోఢృ, వోఢవ్య శబ్దములు దప్ప సంస్కృతసమంబులందు సహితము వువూ, 'వో' వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది॥ ఉదకము - ఊర్మిక - ఓదనము.

వ్యాఖ్య - అచ్చతెనుగు మాటలకు మొదట 'య' గుణింతములోని యే యక్షరమును నిల్వదు: అట్లే వువూవొవో అను నక్షరములు అచ్చతెనుగు మాటలకు మొట్టమొదటి యక్షరములుగా నుండవు - అని సూత్రార్థము.

ఎవఁడు, ఎక్కడ-అని మున్నగు విధముగానుండు శబ్దములను శిష్టులు సైతము యెవఁడు, యెక్కడ - మున్నగు విధముగా ఉచ్చరించుచుందురు. అట్లే 'ఊరు' అనుటకు బదులుగా 'వూరు' అనియు, 'ఒకడు' అనుటకు బదులుగా 'వొకడు' అనియు పలుకుట వినిపించును. ఇట్టిచోట్ల మాటకు మొదట ఉండవలసినవి అచ్చులే॥ ఎవఁడు - ఎక్కడ - ఏమి - ఏల.

అట్లే వుంద, వూరు, వొకఁడు, వోడ మున్నగువిధముగా నుచ్చరింపబడు పదములకు మొదట నిజముగా వువూవొవో అను అక్షరము లుండవనియు, అందు వలన అచ్చట అచ్చులే యుండవలయు ననియు సూరి నిర్ణయము కావున ఉంద - ఊరు - ఒకఁడు - ఓడ అనియే రూపము లుండవలయును.

[మొదట యకారమును కలిగియున్న పదము తత్సమమై యుండవలయు నని దీనినిబట్టి నిర్ణయింపవచ్చును. యముఁడు - యమళము - యాగము - యుద్ధము మున్నగు యకారాదిపదములు తత్సమములు.]

తత్సమపదములయందుకూడ వువూ వోలతో మొదలగు మాటలు లేవు. 'వోఢృ, వోఢవ్య' యను రెండు శబ్దములే తత్సమములందు గలవు. తత్సమములం దవి యనుటచేత తెనుగున లేవని యర్థము. సంస్కృతకావ్యములందును, కోశము లందును వోఢజు, వోఢా మున్నగుశబ్దము లింకను గొన్ని యుండవచ్చును, కాని, వానితో ప్రసక్తి లేదు. తెనుగున సంస్కృతసమశబ్దముల కుదాహరణములు :

ఉదకము - ఊష్మిక - ఓదనము మున్నగునవి.

'హరియతఁడు' అని యనునప్పుడు హరి + అతఁడు అని విభాగింప వలయును. రెండవ శబ్దమునకు మొదట నున్నది అకారమే. సంధిలేకపోవుటచే యడాగమము కలిగి హరి + య + అతఁడు = హరియతఁడు అని యగును. నిద్ర + పోయె అనునప్పుడు ప్రథమమీది పకారమునకు వకారము కాగా 'నిద్ర వోయె' అని యగును. కావున, ఇటువంటిచోట్ల నున్న యకారమును, వోకారమును సంధి కార్యములచేత వచ్చినవే కాని, శబ్దములందు సహజముగా నున్నవికావు. ఇట్లు ఉండుటకు ఆక్షేపము లేదు.

**26. యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబులగు.**

(బా - ౧౮)

హరి యతఁడు - ఇత్యాదులం దాగమయకారము లఘువు. తక్కిన యకార మలఘువు. విఱుగు మెఱుఁగిత్యాదులందు రేఫం బలఘువు. ఇదే శకట రేఫమని చెప్పఁబడును. శకట రేఫము తత్సమ తద్భవములందు లేదు. పెరుఁగు కరు గిత్యాదులందు రేఫంబు లఘువు. ఏళులు పాళులు త్రాళు లని బహుత్వమందు ళలడల కాదేశమయిన ళకార మలఘువు. తల, నెల యిత్యాదులందలి లకారము లఘువు. అతఁడు వలికె నిత్యాదులం దున్న వాదేశ వకారము లఘువు. తక్కినవకార మలఘువు. వర్ణ సమామ్నాయమందలి ళ కారము వర్ణాంతరముగాని యలఘు ళ కారముగా దని యెఱుంగునది.

వ్యాఖ్య – య ర ల వ - అను నాలుగక్షరములును లఘువులని, అలఘువు లని రెండేసి విధములుగా నుండును. 'లఘువు' అనగా తేలికయైనదని యర్థము: అనగా తేల్చి పలుక బడునది. 'అలఘువు' అనగా తేలికకానిదని యర్థము: అనగా ఒత్తి పలుకబడునది.

హరి + అతఁడు - ఇచ్చట సంధిలేనందువలన పరస్వరమునకు యడాగమము కలిగినది. హరి + య + అతఁడు = హరి యతఁడు. కావున నిచ్చటి యకారము శబ్దసిద్ధము కాదు. వ్యాకరణకార్యమువలన అదనముగా వచ్చిచేరు వర్ణమును 'ఆగమము' అని యందురు. ఇచ్చటిది ఆగమయకారము: కావున లఘువు. కాయ, మాయ - మొదలగు మాటలలో శబ్దసిద్ధముగా నున్న యకారము అలఘువు.

విఱుగు మెఱుఁగు - మున్నగు శబ్దములందలి 'ఱ' వర్ణమును అలఘురేఫము అని యందురు. దీనికే శకటరేఫము (బండిరా) అనియు పేరు గలదు. వర్ణమాల యందు బండిరాను వేరుగా చూపకపోయినను, వ్రాతయందు 'ఱ' యని వేరుగా వ్రాయుట గలదు. చిన్నయసూరి మతమునుబట్టి శకటరేఫము తత్సమతద్భవము లందు లేదు. సంస్కృతప్రాకృతములందు శకటరేఫము లేనందువలన తత్సమము లందును శకటరేఫముండుటకు వీలులేదు. కాని తద్భవములందు లేదను విషయము ప్రయోగవిరుద్ధమై యున్నది. పెరుఁగు - కడుగు మున్నగు శబ్దములందలి రేఫము లఘువు.

ఏఱు + లు; త్రాడు + లు; పాలు + లు అనియుండగా శబ్దాంతమున నున్న ర డ ల - అను వర్ణములకు బదులుగా ళకారము వచ్చును. ఏళులు-త్రాళులు-పాళులు॥ ఇట్లు బహువచనము పరమగునప్పుడు 'ర ల డ' లకు ఆదేశముగా వచ్చు ళకారమును అలఘుళకార మని యందురు. ఒక వర్ణమునకుకాని మాటకుకాని బదులుగా ఒక వర్ణముగాని ఒకమాటకాని వచ్చినయెడల, దానిని ఆదేశము అనియందురు. అలఘువైన ళకారమును 'ళ' అని వ్రాయుదురు. కాని కళ, మంగళము మొదలయిన చోట్లనున్న 'ళ' వర్ణాంతరము (వర్ణాంతరము = మరొకవర్ణము). ఇది 'యరలవ' అను నాలుగువర్ణములలోను చేరినది కాదు; వర్ణసమామ్నాయములో చిట్టచివరనున్న యక్షరము. కావున దీనికి ఈ విభాగమే లేదు. తల, నెల - మున్నగుశబ్దములందలి లకారము లఘువు.

ప + ఆదేశవకారము = పాదేశవకారము = 'ప'అను వర్ణమునకు బదులుగా వచ్చిన 'వ' అను వర్ణము. "అతఁడు" అనునది ప్రథమావిభక్తి రూపము. దీని పైని "పలికె" అను శబ్దము వచ్చెను. అప్పుడు పకారమునకు బదులుగా వకారము వచ్చి "అతఁడు వలికె" అనియైనది. ఈ విధముగా వ్యాకరణ నియమమువలన వచ్చిన వకారము లఘువు. వల, వాగు - మున్నగుశబ్దములలోని వకారము అలఘువు.

శాస్త్రసాధ్యములయిన య, వ లు లఘువులని, శబ్దసిద్ధములయిన య, వ లు అలఘువులనియు నిర్ణయము. శకటరేఫము అలఘువు; సాధురేఫము లఘువు. బహువచనము పరమగునప్పుడు డ, ల, ర లకు ఆదేశముగా వచ్చిన ళకారము అలఘువు. శబ్దసిద్ధమైన లకారము లఘువు. ఇది సారాంశము.

27. తద్భవములందును నలఘురేఫము గలదు. (ప్రౌ - ౯)

కఱకంఠుఁడు - కాఱియ - గఱి - గొఱపము - గొఱ్ఱె - గోఱజము - జీలకఱ్ఱ - పిఱికి - పెఱ - మోఱకు - ఱాగ మొ॥ కఱకంఠుఁడు గరకంఠశబ్దభవము; కాఱియ కారికాశబ్దభవము; గఱి గరుచ్ఛబ్దభవము; గొఱపము కురపశబ్దభవము; గొఱ్ఱెకురరీశబ్దభవము: గోఱజము గోరోచనాశబ్దభవము; జీలకఱ్ఱ జీరకశబ్దభవము; పిఱికి భీరుకశబ్దభవము; పెఱ పరశబ్దభవము; మోఱకు మూర్ఖశబ్దభవము; ఱాఁగ లంకాశబ్దభవము మొ॥

**వ్యాఖ్య** - బాలవ్యాకరణము యరలవ లను రెండువిధములుగా నిరూపించుచు **విశేషణములందు** 'శకట రేఫము తత్సమ తద్భవము లందు లేదు' అని యనెను. ఈ యభిప్రాయమును సవరింపబూని, ప్రౌఢవ్యాకరణము తద్భవములందు శకట రేఫము గలదని యుదాహరణపూర్వకముగా నిరూపించుచున్నది.

మొదటి యుదాహరణము కఱకంఠుఁడు. చిన్నయసూరి దీనిని ముందు రాబోవు అనింద్యగ్రామ్యముల సందర్భమున నుదాహరించును. కావున నిందు శకటరేఫ ముండుట సూరికిని సమ్మతమే. సూరి దీనిని గ్రామ్యముగా పేర్కొనుటవలన, ఇందలి శకటరేఫము తన నిశ్చయమునకు అభ్యంతరముకాదు. ప్రౌఢవ్యాకరణకారుని యభిప్రాయమున నిది తద్భవము. గర + కంఠుఁడు = గరకంఠుఁడు. 'విషము' అను నర్థమున గరళశబ్దమే కాక గరశబ్దముకూడ సంస్కృతమున గలదు. కావున 'గర' అను పూర్వశబ్దమును సంస్కృతమై 'కంఠ' అను ఉత్తర శబ్దమును సంస్కృతమై 'గరకంఠః' అని సంస్కృతమునసే సమాసమయ్యెనని బహుజనపల్లివారి నిశ్చయము. అట్లేర్పడిన గరకంఠ శబ్దమునుండి వర్ణాదేశముతో (గకారమునకు కకారమును, రేఫమునకు శకటరేఫమును కలుగగా) 'కఱకంఠుఁడు' అను శబ్ద మేర్పడి యుండును. కావున దీనిని తద్భవముగా గ్రహింపవలయును. కాని దీనికొక ఆక్షేపము గలదు. సమేతర శబ్దములందు ఠకారము నిలువరాదు. 'కఱకంఠుఁడు' అను శబ్దము తద్భవమే యనుటకు ఠకార ప్రయోగము అభ్యంతరముగా నిల్చును. అందువలన ప్రౌఢవ్యాకరణకారుడు దీనిని వైకృతగ్రామ్యముగా పరిగణించెను. తద్భవమే యయ్యును గ్రామ్యమగు నని ఆయన అభిప్రాయము. తద్భవమైనపుడు గ్రామ్యమగుట యసంగతము. గ్రామ్యమైనపుడు తద్భవమా ! తత్సమమా ! యను విచికిత్స యసంగతము. కావున ప్రౌఢవ్యాకరణకారుడు 'కఱకంఠుఁడు' అను శబ్దమును తద్భవములలో శకటరేఫముగలదని నిరూపించుటకు ప్రథమోదాహరణముగా ప్రదర్శించుట ప్రయోజనవంతము కాలేక పోవుచున్నది. దీనిని తద్భవముగా నిశ్చయింపగలిగి నప్పుడు గాని ఉదాహరణకోటియందు దీనికి చోటు లభింపదు.

'యాతన' అను నర్థముగల కారికా శబ్దమునుండి "కాఱియ" యను శబ్దము కలిగెను. రేఫమునకు శకట రేఫమును, కకారమునకు యకారము నాదేశము లైనవి. అర్థసామ్యమును, రూపసాదృశ్యమును తద్భవమే యను విషయమును స్థిరీకరింపదగి యున్నవి. సూరి ఆచ్ఛికపరిచ్ఛేదమున ఇరువదిమూడవసూత్రము సందర్భమున "కాఱియ" శబ్దమును శకటరేఫముతోడనే యుదాహరించెను.

రెక్కయను నర్థముగల "గరుత్" అను శబ్దము "గఱి" అని తద్భవమయ్యెను. "గరపము" అనగా గుబ్బములను దువ్వెడు సాధనము. అదియే ఇంకొక మార్పుతో "గొఱపము" అని యయ్యెను. కొన్ని ప్రాంతములందు వ్యవహారమున "కొఱువము" అనియు రూపము గలదని శబ్దరత్నాకరము పేర్కొనుచున్నది. ఇట్టి తక్కిన శబ్దములను తద్భవములుగా నంగీకరింప వలసినవియే యైయున్నవి. వీని యన్నిటి యందును శకటరేఫ మున్నదనుట సత్యము. కావున సూరి తద్భవములందు శకట రేఫములేదని చెప్పుట ప్రామాదిక మనియు, సీతారామాచార్యులు చెప్పినట్లు **తద్భవము** లందును నలఘురేఫము గలదని చేసిన **సవరణము సముచితమనియు** నిశ్చయింప నగును.

## 28. సంస్కృత ప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు.

(బా - ౧౮)

| సంస్కృతము | సంస్కృతసమము |
|---|---|
| రామః | రాముఁడు |
| విద్యా | విద్య |
| హరిః | హరి |
| ధేనుః | ధేనువు |
| భూః | భువి |
| పితా | పిత |
| గౌః | గోవు |
| నౌః | నావ |
| ద్యౌః | దివి |
| హృద్ | హృది |
| జగత్ | జగత్తు - జగము |

ఇత్యాద్యు లూహ్యంబులు.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
|---|---|---|
| అగ్నిః | అగ్గీ | అగ్గి |
| అటిః | అడీ | అడి |

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
|---|---|---|
| ఆలిః [పఙ్క్తి] | ఓలీ | ఓలి |
| కటుః | కారో | కారము |
| గౌరవమ్ | గారవం | గారవము |
| జటా | జడా | జడ |
| మిరా | మేరా | మేర |
| యమః | జమో | జముఁడు |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| శృఙ్గారః | సింగారో | సింగారము |
| శ్రీః | సిరీ | సిరి |

ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య - సంస్కృతముతోకాని, ప్రాకృతముతోకాని సమానమైన శబ్దము తత్సమ మని సూత్రార్థము. సంస్కృతమునుండి సరాసరి కొన్ని శబ్దములు తెనుగు లోనికి వచ్చినవి. కొన్ని శబ్దములు సంస్కృతమునుండి ప్రాకృతములో ప్రవేశించి, ప్రాకృతమునుండి తెనుగులోనికి వచ్చినవి. ఇట్లు వచ్చిన రెండువిధములగు రూపము లను తత్సమములని యందురు.

'రామః' అనునది సంస్కృతము. దానికి ఉత్వడుజ్లులు వచ్చి 'రాముఁడు' అని యైనది. ఇది తత్సమము. 'అగ్నిః'అనునది సంస్కృతము. అదియే మార్పుపొంది'అగ్గీ' అను రూపముతో ప్రాకృతములో ప్రవేశించినది. దీనికి చివరి దీర్ఘము పోయి 'అగ్గి' అని తెలుగులో చేరినది. ఇది తత్సమము. రామ, అగ్గి - మున్నగుచోట్ల ప్రాతిపదికలో ఏవిధమైనమార్పును జరుగలేదు. ఇట్టి రూపములను తత్సమములని పిలుతురు.

[తెనుగుభాష తత్సమము - తద్భవము - దేశ్యము - గ్రామ్యము అని నాలుగువిధములై యున్నది. తత్సమము అననేమియో సూరి యీ సూత్రమునందు తెలిపెను. తక్కిన వానిని గురించి తరువాతి సూత్రములందు వరుసగా వివరించెను]

**29. సంస్కృత ప్రాకృతభవంబగు భాష తద్భవంబు. (బా-౨౦)**

| సంస్కృతము | సంస్కృతభవము |
|---|---|
| ఆకాశః | ఆకసము |

| సంస్కృతము | సంస్కృతభవము |
|---|---|
| కుడ్యమ్ | గోడ |
| చన్ద్రః | చందురుఁడు |
| తమఙ్గః | తమగము |
| తామరసమ్ | తామర |
| నారాచః | నారసము |
| నిభః | నెపము - నెవము |
| ముఖమ్ | మొకము - మొగము |
| మృగః | మెకము - మెగము |
| వక్రః | వంకర |
| వేసరః | వేసడము |
| సముద్రః | సందడ్రము |
| సూచీ | సూది |
| స్మరః | మరుఁడు |
| హారణమ్ | అరణము |
| హరితాళమ్ | హరిదళము |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
|---|---|---|
| అఙ్గారః | ఇంగాలో | ఇంగలము |
| అప్సరాః | అచ్ఛరా | అచ్చర |
| ఆశ్చర్యమ్ | అచ్ఛేరం | అచ్చెరువు |
| పఞ్చాశత్ | పణ్ణాసా | పనస |
| పృథివీ | పుఢవీ | పుడమి |
| ప్రయాణమ్ | పయాణం | పయనము |
| ప్రవాళః | పవాళో | పవడము-పగడము |
| మత్సరః | మచ్ఛరో | మచ్చరము |

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
|---|---|---|
| యజ్ఞః | జణ్ణో | జన్నము |
| లక్ష్మీః | లచ్ఛీ | లచ్చి |
| విష్ణుః | విణ్హూ | వెన్నుఁడు |
| వైద్యః | వేజ్జో | వెజ్జు |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| స్థూలమ్ | థోరమ్ | తోరము |

ఇత్యాదులు తెలియునది.

వ్యాఖ్య - సంస్కృతమునుండి కాని ప్రాకృతమునుండి కాని పుట్టిన భాషను తద్భవ మని యందురు. సంస్కృతశబ్దములందును ప్రాకృతశబ్దములందును వ్యవహారమువలన వర్ణాగమము, వర్ణాదేశము, వర్ణలోపము, వర్ణవ్యత్యయము మున్నగు మార్పులు వచ్చుచుండును. అట్లు మార్పులు పొందిన పిమ్మట ఏర్పడిన శబ్దములే తద్భవము లనిపించుకొనును.

'ఆకాశః' అనునది సంస్కృతశబ్దము. 'ఆకాశ' యను ప్రాతిపదికపై ఏవిధమైన మార్పును కలుగకుండ 'ము' వర్ణకము చేరి 'ఆకాశము' అని యైనది. ఇందు ఆంగికమైన మార్పులేదు. కావున నిది తత్సమము. అటుకాక కకారమునకు దీర్ఘము లోపించి, శ కారమునకు బదులుగా స కారము ఆదేశమై 'ఆకసము' అను రూపమేర్పడును. ఇందు ఆంగికమగు మార్పు కలిగినది. కావున నిది తద్భవము. (ఆకాశః - ఆకసము)

'తామరసమ్' అను సంస్కృతశబ్దము 'తామరసము' అని యైనప్పుడు తత్సమమగును. అంగికముగా నున్న చివరి వర్ణమునకు లోపము కలిగి 'తామర' అని యైనప్పుడు తద్భవమగును. (తామరసమ్ - తామర)

'పారావతః' అను సంస్కృతశబ్దమునకు తత్సమరూపము 'పారావతము'. ఇందు వర్ణవ్యత్యయము (అక్షరముల తడబాటు) కలుగగా 'పావురము' అను రూపము కలిగెను. ఇందు ఒకచోటి అక్షరము పరొకచోటికి మారుట కారణముగా ఆంగికమైన మార్పు కలిగినది. కావున నిది తద్భవము. (పారావతః-పావురము.)

'చన్ద్రః' అను సంస్కృతశబ్దమునకు తత్సమరూపము 'చంద్రుఁడు'. ఇందు వర్ణాగమము (అదనముగా వర్ణము వచ్చిచేరుట) కలుగగా 'చందురుఁడు' అను రూపమునొందెను. 'ద్ర' అని యనగా దకార రకార (ద్ + ర - ద్ర) సంయోగము. అందలి రెండువర్ణములకు నడుమ అదనముగా ఉకారము చేరినది (ద్ + ఉ + ర - దుర). అదనముగా వర్ణము వచ్చి చేరుటవలన ఆంగికమైన మార్పు కలిగినది. కావున విది తద్భవము (చన్ద్రః - చందురుఁడు).

ఇట్లే కొన్ని సంస్కృతశబ్దములనుండి పుట్టిన ప్రాకృతశబ్దముల నుండియు తద్భవములు కలుగుచున్నవి. "అఙ్గారః" అను సంస్కృతశబ్దమునకు తత్సమము "అంగారము". ప్రాకృతరూపము - "ఇంగాలో". రెండవయక్షరములోని దీర్ఘమునకు హ్రస్వము కలిగి "ఇంగలము" అని యగును. ఇది ప్రాకృతము నుండి పుట్టిన తద్భవము. (ఇంగాలో - ఇంగలము)

"యజ్ఞః" అను సంస్కృతపదమునకు తత్సమము "యజ్ఞము". ప్రాకృత రూపము. 'జణ్ణో'. వర్ణాదేశమువలన 'జన్నము' అను రూపమేర్పడును. ఇది ప్రాకృతమునుండి పుట్టిన తద్భవము. (జణ్ణో - జన్నము).

30 త్రిలింగదేశ వ్యవహారసిద్ధం బగు భాష దేశ్యంబు. (బా-౨౧)
ఊరు - పేరు - ముల్లు - ఇల్లు - కోల - పేట - దూడ - మేడ-
కోఁతి - లేఁత - తావి - మోవి॥ ఇత్యాదు లరయునది.

వ్యాఖ్య - శ్రీశైలము, కాళేశ్వరము, దక్షారామము అను మూడు శివక్షేత్రములను కలిగియున్న ప్రదేశము త్రిలింగదేశము. త్రిలింగదేశవ్యవహారమునందే పుట్టి, ప్రతిష్ఠనొందిన భాషకు దేశ్యమని పేరు. ఈ దేశ్యములకు సంస్కృతమునందు కాని ప్రాకృతమునందు కాని మూలరూపములు లేవని యర్థము.

ఊరు - పేరు మున్నగుశబ్దములు తెలుగుదేశమునందు పుట్టి, వ్యవహారమునందు స్థిరపడి, ప్రామాణికత్వము నొందినవి. కావున వీనిని దేశ్యములని యందురు.

31 కారము క్షారశబ్దభవము (పొ౧-౧౦)

ఇందు సారూప్యము గనఁబడెడి. క్షారశబ్దంబు కటుశబ్దపర్యాయంబు నగు. "త్రిరాత్రమక్షారలవణాశినౌ రథశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణ వర్జనంచ" అని ఆపస్తంబసూత్ర వాక్యము.

వ్యాఖ్య - బాలవ్యాకరణమునుబట్టి కటుశబ్దమునుండి క్కారో యను ప్రాకృతశబ్దముత్పన్నమయ్యెను. ప్రాకృతమునకు సమముగా తెలుగున 'కారము' అను రూప మేర్పడెను. కావున నిది తత్సమము. ప్రౌఢవ్యాకరణకారుడు దీనిని క్షారశబ్దమునుండి యుత్పన్నమైనట్లు సాధించుచున్నాడు. ఈయన యభిప్రాయమునుబట్టి 'కారము' సంస్కృతభవము. దీనికి ప్రాకృతముతో నేమాత్రమును సంబంధము లేదు.

తాను చూపు నుత్పత్తికి సాధకముగా సారూప్యమును గూడ కనబరుచుచున్నాడు. 'కారము' అనునది కటుశబ్దమును గాక క్షారశబ్దమును బోలినమాట వాస్తవము. క్షారము అనగా 'లవణము' అని ప్రసిద్ధమైన యర్థము. కావున అర్థమునందు కారమునకు, క్షారమునకును మిగుల భేదము కనిపించుచున్నది. క్షారము అనుశబ్దము కటుశబ్ద పర్యాయము నగునని యనుటచేత 'కారము' అను అర్థాంతరముగూడ కలదని తెలియజేయుచున్నాడు. దీనికి ఆపస్తంబ సూత్రవాక్యమును ప్రమాణముగా చూపుచున్నాడు. 'క్షారలవణ వర్జనంచ' అనుచోట క్షారము - లవణము అనునవి ఏకార్థకపదములు. కాని ఏకార్థకపదముల నట్లు ప్రయోగించుట నిష్ప్రయోజనము. కావున లవణమనగా 'ఉప్పు' అను నర్థము మాత్రమే యుండుటచేత దానినట్లే గ్రహించి, క్షారశబ్దమునకు 'కారము' అను నర్థమును చెప్పికొనిన పై పంక్తి సంగతమగునని వ్యాకర్త యభిప్రాయము. వ్రతనియమములందును పథ్యపుభోజనము నందును ఉప్పుగారములను విడిచిపెట్టుట ప్రసిద్ధ విషయమే. ఆపస్తంబసూత్రము నందలి క్షారలవణశబ్దములు రెండును లౌకికార్థమునగాక సాంప్రదాయికార్థమున ప్రయుక్తములైనవని కొందరందురు. అట్టి యర్థముండిన నుండవచ్చును. ఆంధ్ర సంస్కృత నిఘంటువులయందు క్షారశబ్దమునకు 'కారము' అను నర్థముకూడ సూచింపబడి యున్నమాట వాస్తవము. కావున అర్థనిర్ణయమునకై లక్ష్యాంతరముల యవసర మెంతమాత్రమును లేదు.

ప్రాకృతమునందు 'కారో' యను శబ్దమున్నదనుటలో సందేహములేదు. అట్టి యెడల తెలుగునందలి 'కారము' ప్రాకృతసమ మనుటకు సందేహము కలుగవలసిన యవసరము లేదు. ప్రాకృతమునందలి 'కారో' శబ్దమునకు సంస్కృతమూలము కటుశబ్దమా? క్షారశబ్దమా? యను ప్రశ్న మిగులును. కటుశబ్దమే యైనయెడల అర్థసామ్యము కలదనవచ్చును; క్షారశబ్దమే యైనయెడల అర్థమున మార్పు కలిగెనని యనవలసి వచ్చును. ఒక భాషలోని శబ్దము మరొకభాషలో ప్రవేశించినప్పుడు కించిదర్థభేదము నొందిన నొందవచ్చును.

ఎట్లైనను 'కారో' యను ప్రాకృతశబ్దముతో రూపసామ్యము, అర్థసామ్యము, రెండు నుండుటచే 'క్షారము' అను శబ్దమును ప్రాకృతసమముగా పరిగ్రహించు టయే యుచితము.

32. కోట పేటలు వైకృతములు (ప్రౌ-౨౭)

కోట్టశబ్దభవము కోట. పింఠాశబ్దభవము పేట. "కోట్టార ఘట్ట హాట్టాశ్చ" అని అమరత్రిలిఙ్గ శేషము. "పింఠా విటజనాశ్రయః" అని అమరపద పారిజాతము. కోట్టశబ్దపర్యాయంబుగా సంస్కృతంబునఁ గోటశబ్దంబు నొక్కఁడు గానంబడియెడి. దానివలనఁ గలిగినదండు లేని యుపు డది కుండ లోనగువాని వంటిదని యెఱుంగవలయును. పేట శబ్దార్థము ప్రకృతియగు పింఠాశబ్దార్థము కంటె నించుక భిన్నముగా నున్నది. అది వికృతియందు సహజంబ (చూ. వైకృతదీపిక)

వ్యాఖ్య - చిన్నయసూరి కోట, పేట-యనుశబ్దములను దేశ్యములుగా పేర్కొ నెను. సీతారామాచార్యులు వానిని దేశ్యములు గావనియు, తద్భవములనియు నిర్ధారించు చున్నారు. సంస్కృతమునందలి కోట్టశబ్దమునుండి తెలుగునందలి కోటశబ్దము కలిగి యుండెనని యాయన యభిప్రాయము. ఇట్లైనచో నిది తద్భవము. ఇటులైన, సంస్కృతమునందు 'కోట' శబ్దముకూడ కలదు. దానికి తత్సమ రూపముగ 'కోట' తెలుగున నేర్పడినదన్నను నేర్పడినదనవచ్చును. ఇక్కడమాత్ర మొక ప్రశ్న కలుగ వచ్చును. అదంతమైన అమహచ్ఛబ్దము గావున దీనికి ముపర్ణకము కలుగవలదా యని. కలుగవలయును. 'కోటము' అనురూపము కావలసియుండును. ఇట్టి అనిష్ట రూపమును నివారించుటకు కోటశబ్దమును కుండశబ్దమువలె పరిగణింపవలయునని వ్యాకర్త సూచించెను. 'చరిత్రాదుల ముపర్ణంబునకు లోపంబు బహుళంబుగా నగు' అను బాలవ్యాకరణ సూత్రవిధిచే సైతము దర్భ, పనస మున్నగు శబ్దములకు ముపర్ణకము నిత్యముగా లోపించును. కావున కోటశబ్దమును దర్భాదిగణములో చేర్చుకొనినయెడల 'కోట' యను రూపమే నిత్యముగా సిద్ధించును. ఇంతయును బహుజనపల్లివారికి కోటశబ్దమును దేశ్యముగా గాకుండ, తత్సమ తద్భవములలో నేవిధముగా గ్రహించినను సమ్మతమే.

చిన్నయసూరి 'పేట' శబ్దమును నిరనునాసికముగా ప్రయోగించెను. దీనికి 'హారమునందలి పరుస' యని యర్థము. ఈ శబ్దమునువిడిచి యర్థాంతరముననున్న

మరొకశబ్దము నిచ్చట ప్రౌఢవ్యాకరణకారుడు గ్రహించెను. దానిని పింతాశబ్దభవముగా సాధింపఁబూనుటచేత "పేఁట" యని సానుస్వారముగా గ్రహించెను. సంస్కృతమునందలి పింతాశబ్దమునకు "విటజనులు నివసించుతావు" అనియర్థము. ఇదియు నగరమునందలి యొకభాగమే. పేట శబ్దముకూడ నగరమునందలి యొకభాగమునే బోధించును. ప్రత్యేకముగా విటజన వాసస్థానమును బోధించుశబ్దము తద్భవమునందు సాధారణ వాసస్థానమును బోధించునదిగా మారెను. ఇట్లు మారుటకు ఆక్షేపములేదు. అనేకపదములు ఒకభాషనుండి మరొకభాషలోనికి మారునప్పుడు ఈ విధముగా కించి దర్థభేదము నొందుట సహజమే.

సంస్కృతమున నంతప్రసిద్ధములుకాక కేవలకోశగతములై యున్న శబ్దముల నుండి తద్భవము లేర్పడెననుట విచార్యము. జనసామాన్యము సంస్కృతపదమును గ్రహించి, తమ యసమర్థతచేతను, అశ్రద్ధచేతను, అభ్యాసముచేతను ఉచ్చారణములో కొన్నిమార్పులు సేయగా ఏర్పడునటువంటివి తద్భవములు. సంస్కృతమున మారుమూలనున్న పదములు, తెలుగువారినోట వాడుకకెక్కినవనుట యుక్తిసంగతముకాదు. కావున వీని విషయమున ఇదమిత్థమని నిర్ణయించుట కష్టము. పునఃపరిశీలన మవసరము.

**33. లక్షణవిరుద్ధం బగు భాష గ్రామ్యంబు. (బా - ౨౨)**

వస్తాఁడు - తెస్తాఁడు - వచ్చేని - తెచ్చేని - వచ్చేవాఁడు - తెచ్చేవాఁడు - వచ్చేటివాఁడు - తెచ్చేటివాఁడు॥ ఈ భాష ప్రయోగంబున కనర్హంబు.

**వ్యాఖ్య** - వ్యాకరణలక్షణములకు సరిపడని భాషను గ్రామ్య మని యందురని సూత్రార్థము. గ్రామ్యమని యనుట చేత అపభ్రంశ మనియే భావము. లోకవ్యవహారమునందును, కావ్యవ్యవహారమునందును గల భాషను గ్రహించి వ్యాకరణము సంస్కరించును. ఇట్లు సంస్కరింపబడని శబ్దములను గ్రామ్యములుగా పరిగణింతురు. "వస్తాఁడు - తెస్తాఁడు" మున్నగునవి గ్రామ్యములు. ఇట్టివానిని కావ్యభాషయందు ప్రయోగింపరాదు. వీనినే "వచ్చును - తెచ్చును" మున్నగు విధముగా సంస్కరించినయెడల, ప్రయోగించుట కాక్షేపము లేదు. కేవల వ్యవహారమునుండి గ్రహించిన గ్రామ్యశబ్దములు ప్రయోగమునకు యోగ్యములు కావు.

**34. గ్రామ్యంబు త త్తజ్జాతివర్ణనంబునం బ్రయోగార్హం బగు.**

(ప్రౌ - ౧౪)

మొక్కేము సామి॥ రావహా. ౨ అ॥ ఇతని సూసినా మేలు బాగెము సేసినాము॥ య. ౧అ. మొ॥

వ్యాఖ్య - గ్రామ్యము ప్రయోగమున కనర్హమని చిన్నయసూరి తెలుపగా, దానికి సవరణగా సీతారామాచార్యులీ సూత్రమును రచించెను. ఆయా జాతులవారు పలుకునప్పుడు గ్రామ్యము ప్రయోగింపదగునని సూత్రార్థము. కవి కాని, ఉత్తమ మధ్యమ పాత్రలుకాని కాక, అధమ పాత్రలు గ్రామ్యమును ప్రయోగించుట కభ్యంతరము లేదు. పాత్రోచితభాష కావ్యసౌందర్యము నినుమడింపజేయుననుట అలంకారశాస్త్ర విషయము. అయినను దాని నెఱుగని కొందఱు గ్రామ్యమును సర్వత్ర నిరసింతు రను నూహతో సీతారామాచార్యులీ విషయమును స్పష్టతకొరకు ప్రస్తావింపవలసి వచ్చినది.

"మ్రొక్కితిమి స్వామి" అను రూపము పామరవ్యవహారమున "మొక్కేము సామి" అని యైనది. ఇచట వక్త పామర వ్యక్తియే కావున ఈ ప్రయోగమును నిరసింప నవసరము లేదు. కాక సంభాషణ సౌందర్యసముజ్జ్వలమగును. అట్లే 'చూడఁగల' యనుటకు 'సూసినా' యని "మేలుభాగ్యము" అనుటకు "మేలు బాగెము" అనియు ననుట పాత్రోచిత గ్రామ్యప్రయోగములు. వీనిని గ్రహింప వలయు నని ప్రౌఢవ్యాకరణ కారుని యాశయము.

**35. ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు.** (బా - ౨౬)

పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యంబయిన గ్రహింపందగు నని తాత్పర్యము॥ కలికంఠుఁడు - ప్రాణగొడ్డము - జీవగఱ్ఱ - కపిల కన్నులు - కపిలగడ్డము - కపిలజడలు.

**వ్యాఖ్య** - పెద్దలు కావ్యములందు ప్రయోగించిన మాటలలో గ్రామ్యము లున్నప్పటికిని స్వీకరింపఁదగునని సూత్రార్థము. వ్యాకరణము ప్రయోగశరణము. అనగా లోకమునందును సాహిత్యమునందును ప్రతిష్ఠనొందిన ప్రయోగముల ననుస రించియే వ్యాకరణము వర్తించునని యర్థము.

ఏదయిన నొక గ్రామ్యశబ్దము కవుల కావ్యమునందు ప్రవేశించినదన్న యెడల, దానికి నిత్యవ్యవహారమున మిక్కిలి ప్రసిద్ధి యున్నదనవలయును. అట్లు శిష్టజనవ్యవహారమున రూఢిని పొందిన శబ్దమే కవి నేమరించి కావ్యమున ప్రవేశింప గలదు. కావున గ్రామ్యము నింద్యమే అయినప్పటికిని లోక వ్యవహారమునందు స్థిరపడి యుండుటచేతను, కవులచేత ఆదరింపబడియుండుటచేతను కొన్ని గ్రామ్యశబ్దములు అనింద్యములుగా పరిగణింపబడును అట్టి శబ్దములను అనింద్యగ్రామ్యము లని యందురు. వానిని పెద్దలు వాడియుండుటచేత, తరువాతి వారును వానిని వాడుట కాక్షేపము లేదు. అట్టివానిని క్రొత్తగా కల్పించి వాడరాదు.

కలికంతుఁడు - ప్రాణగొడ్డము మున్నగునవి గ్రామ్యములు. "కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు" అను నియమమునకు విరుద్ధముగా పైసమాసములేర్పడినవి. 'కలికంతుఁడు' అను సమాసమునందు పూర్వశబ్దము తెలుగు; ఉత్తరపదము సంస్కృతము. తక్కినయన్ని సమాసములందును పూర్వపదము సంస్కృతము; ఉత్తరపదము తెలుగు. కావున నివియన్నియు దుష్టసమాసములు. అందువలన గ్రామ్యములు. అయినను కవులు ప్రయోగించుటచేత, ఇవి అనింద్య గ్రామ్యములై గ్రాహ్యము లగుచున్నవి.

**36. ప్రాణగొడ్డ మగ్రామ్యంబు నాఁ దగు (ప్రౌ - ౧౨)**

ఇయ్యది ప్రాణకుట్టక శబ్దభవము. అంచపదము, అంచయాన లోనగువానివంటిది (చూ. ఆంధ్రశబ్దరత్నాకరము).

వ్యాఖ్య - ప్రాణగొడ్డము అనుసమాసమును అగ్రామ్యమనియే తలప నగునని సూత్రార్థము.

పూర్వసూత్రమున బాలవ్యాకరణము 'ప్రాణగొడ్డము'ను గ్రామ్యముగా పరిగణించెను. ఇందు పూర్వపదము 'ప్రాణ' యనునది సంస్కృతము; ఉత్తరపదము 'గొడ్డము' అనునది తెలుగు. కావున దుష్టసమాసమనియు గ్రామ్యమనియు నిశ్చయము.

ప్రౌఢవ్యాకరణము ప్రస్తుతసూత్రముచేత దీనిని 'ప్రాణకుట్టక' మను సమాసమునకు తద్భవముగ సమర్థించుచున్నది. ఇట్లయిన యెడల దీనిని గ్రామ్యమని యనుట కవకాశము లేదు. 'కుట్టక' పదముమాత్రము వికృతియందు 'గొడ్డము' అని మారెననియు, పూర్వపదమైన 'ప్రాణ' యనునది మారలేదనియు సీతారామాచార్యుల

యభిప్రాయము. ఇట్లు ఒకపదము మార్పునొందియు ఒక పదము మార్పునొందకయు తద్భవము లేర్పడవచ్చునా? దీనికి సమాధానముగా అంచయాన, అంచపదము - అనుసమాసములను వ్యాకర్త ఉదాహరించుచున్నాడు. 'హంసయాన' అను సంస్కృత సమాసమునకు 'అంచయాన' అనునది తద్భవము. ఇందు పూర్వపదమైన 'హంస' మార్పునొంది 'అంచ' యైనది. ఉత్తరపదము ఏమాత్రమును మార్పునొందక యథా తథముగా నున్నది. అట్లే 'అంచపదము' అనునదికూడ 'హంసపదము' అను సంస్కృతసమాసమునకు తద్భవము. ఇందును పూర్వపదమైన 'హంస' శబ్దము మాత్రమే 'అంచ'గా మారి ఉత్తరపదమైన 'పదము' ఉన్నదున్నట్లే యుండిపోయి నది. కావున సమాసము తద్భవముగా రూపొందినప్పుడు ఒక శబ్దము మాత్రమే మార్పునొంది, రెండవశబ్దము మార్పునొందకుండ నుండవచ్చుననుటకు పై రెండు లక్ష్యములను సమర్థములై యున్నవని యంగీకరింపక తప్పదు.

కాని, ఒక్కవిషయ మిక్కడ గమనార్హము. 'యాన' అన్నప్పుడుకాని 'పదము' అన్నప్పుడుకాని అచ్చటి వర్ణములు మారవలసిన యవసరములేదు. తెలుగు నందున్న వర్ణములే కాని భిన్నములైన వర్ణములు కావుగదా! కాన, సంస్కృతము నుండి తెలుగులోనికి వచ్చునప్పుడు మార్పునొందు లక్షణము వానికి లేదు.

[యకారమునకు జకారముగా మారెడి అలవాటు కలదు కాని అది ప్రాకృత సంబంధమువలన నేర్పడినది. యముఁడు - జముఁడు. అట్లుకాని—ఁడు 'య' మార్పునొందదు. ప్రాయము - పాయము.]

"ప్రాణ" అనునప్పుడు ఇందలి వర్ణములును తెలుగునందున్న వర్ణములే. కాని సంస్కృతమునందలి యీ వర్ణములు వికృతియందు మార్పునొందుట యితరి లక్ష్యములనుబట్టి స్పష్టముగా కనిపించుచున్నది. "ప్రయాణ" శబ్దము వికృతియందు "పయనము" అనియైనది. అనగా "ప్ర" అను సంయుక్తాక్షరము రేఫను గోల్పోయి నది. అట్లే మూర్ధన్యమగు "ణ" కారము వికృతియందు దంత్య నకారముగా మార్పునొందినది. ఇది యీయొక్కచోటనే కాదు. ఇట్లుమారుట యీ వర్ణముల లక్షణము. క్రావడి పోవుటకు: ప్రాయము - పాయము॥ ప్రాయశ్చిత్తము - పాచి తము॥ మూర్ధన్య ణ కారము దంత్యమగుటకు: గుణము - గొనము॥ అర్పణము - అప్పనము॥.

పై లక్షణములనుబట్టి చూడగా ప్రాణశబ్దమునందలి రెండక్షరములును వికృతి యందు మార్పునొందు లక్షణము గలవనుట కెంతమాత్రమును సందియములేదు.

కావున "ప్రాణగొడ్డము" అనునది "అంచయాన" "అంచపదము" అనువానివంటిది కాదు. కావున ప్రౌఢవ్యాకరణవాదము నిరస్తమగుచున్నది. బాలవ్యాకరణమన్నట్లు దీనిని అనింద్యగ్రామ్యముగా గ్రహించుటయే సమంజసము.

37. కపిల శబ్దభవము కవిల శబ్దం బొందు గానంబడెడి
(ప్రౌ - ౧౩)

అవసరజ్ఞుండయి వ్యాసుఁడే తెంచె నంత నత్తపసి, కవిలగడ్డంబును గవిల జడలును గవిల కన్నులును, దవిన యన్నువ నల్లనైన దీర్ఘపుఁ దనువును జూచి, యుభిద కన్నుంగవ మొగిచి తెఅవక యుండె భయమున॥ భార. ఆది. ౪౫॥

వ్యాఖ్య - సంస్కృతమునందలి కపిల శబ్దమునకు తద్భవముగా కవిల శబ్దము గలదని సూత్రార్థము.

బాలవ్యాకరణము కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు అని యుదాహరించి, గ్రామ్యములని పరిగణించెను. ఇందు పూర్వశబ్దము 'కపిల' సంస్కృతము. ఉత్తరశబ్దములు తెలుగుశబ్దములు. కావున, ఇవి దుష్టసమాసములై గ్రామ్యములు కావలయును.

ప్రౌఢవ్యాకరణకారుడు ప్రస్తుతసూత్రమువలన నిట్టియెడల 'కపిల' అను సంస్కృతరూపము కాక 'కవిల' అను తద్భవరూపమే పూర్వపదముగా నున్నట్లు సూచించుచున్నాడు. అప్పుడు రెండును తెలుగు శబ్దములే యగుటవలన ఆచ్ఛిక సమాసముగా పరిగణింపవచ్చును. అప్పుడు వానిని గ్రామ్యములుగా పరిగణింపవలసిన యవసరము లేదు.

ప్రౌఢవ్యాకరణకారుడు చూపిన యుదాహరణము మిక్కిలి బలమైనది. ప్రాసస్థానమున 'వ' కార ముండుటచే రెండవపాదము మొదట 'కవిలకన్నులు' అనియే యున్నదని యంగీకరించి తీరవలయును. ఒకే వరుసలో, ఒకేచోట 'కవిల' యని యొకమారును 'కపిల' అని యొకమారును కవి వాడియుండునని యూహించుటయు సమంజసము కాదు. కావున 'కపిలకన్నులు' మున్నగువానియందలి పూర్వశబ్దమును 'కవిల' యని యంగీకరించి, ఆ సమాసములను అగ్రామ్యములని గ్రహించుటయే సమంజసము.

[చిన్నయసూరి 'అర్థవ్యవహారంబుల' అని మొదలయిన సూత్రమునకు చూపిన లక్ష్యములలో కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము అను రెండింటిని సీతారామాచార్యులు తద్భవములుగా నిరూపించుటకు యత్నించెను. పై వ్యాఖ్యానమువలన నవి యట్లగుటకు వీలుకాదని తేలినది. తరువాతి లక్ష్యమైన 'జీవగఱ్ఱ' యను దానిని ప్రౌఢవ్యాకరణము స్పృశింపలేదు. అనగా, దానిని అనింద్యగ్రామ్యముగా అంగీకరించెననియే అర్థము. ఆ తరువాతనున్న 'కపిలకన్నులు' మున్నగు మూడు లక్ష్యములయందును ఒకే మార్పును సూచించి ప్రౌఢవ్యాకరణము బాలవ్యాకరణమును సవరించుచున్నది. ఈ సవరణము సమంజసమై అంగీకారయోగ్యమై యున్నది.]

—○—

# తత్సమ పరిచ్ఛేదము

**1. డు ము వు లు ప్రథమ.** (కా - ౧)

వ్యాఖ్య - డు ము వు లు - అను నాలుగు ప్రత్యయములును ప్రథమా విభక్తియం దగునని సూత్రార్థము. ఇకముందు రాబోవు సూత్రములయందు "ప్రథమ యగు" నని చెప్పినప్పుడు పై నాలుగింటిలో నేదో యొక ప్రత్యయము కలుగుచుండు నని భావము.

"సంస్కృత ప్రాకృత తుల్యంబైన భాష తత్సమంబు". కావున సంస్కృతమునందిగాని ప్రాకృతమునందిగాని చెప్పుకొనిన ప్రాతిపదికలకు ఏవిధమయిన మార్పులు లేకుండ తెలుగు ప్రత్యయములను చేర్చి వాడుకొనిన తత్సమములని యందురు. ప్రస్తుతపరిచ్ఛేదమునందు చిన్నయసూరి అట్టి ప్రాతిపదికములపై చేరు ప్రత్యయములనుగూర్చి చెప్పుచున్నారు. వీనికే విభక్తి ప్రత్యయములని పేరు.

**2. ను వర్ణంబు ద్వితీయ** (కా - ౨)

వ్యాఖ్య - 'ను' అను ప్రత్యయము ద్వితీయావిభక్తియం దగునని సూత్రార్థము.

ఆంధ్ర శబ్దచింతామణియందును, తదితర వ్యాకరణములందును 'నిన్, నున్, లన్, కూర్చి, గురించి' యను నైదింటిని ద్వితీయావిభక్తి ప్రత్యయములుగా పేర్కొనుట జరిగెను. చిన్నయసూరి యెంతో సమంజసముగా నిర్ణయము చేసికొని 'ను' అను వర్ణమును మాత్రమే ప్రత్యయముగా గ్రహించెను. 'నిన్' అనునది దానియొక్క రూపాంతరమే కాని మరొక ప్రత్యయము కాదు. 'లన్' అనునది ఒక ద్వితీయా విభక్తియందు మాత్రమే కాక ద్వితీయ మొదలుకొని సప్తమి వరకుగల అన్ని బహువచన రూపములందును ప్రత్యయమునకు పూర్వమందు ఆగమముగా చేరును. కావున దీనిని ప్రత్యయ మనుట సరికాదు. కూర్చి, గురించి యనునవి ద్వితీయావిభక్తితోడి రూపములపై చేరు క్త్వార్థకరూపములు. వీనికి కర్మప్రవచనీయములని పేరు. కావున ఇవియు ద్వితీయావిభక్తి ప్రత్యయములు కాజాలవు. కావుననే చిన్నయసూరి 'ను' అను నొక్క వర్ణమునే ప్రత్యయముగా గ్రహించెను.

**3. చేత తోడ తృతీయ.** (కా - 3)

వ్యాఖ్య - చేత, తోడ - అను రెండు ప్రత్యయములును తృతీయా విభక్తియం దగునని సూత్రార్థము.

దున్నది గావున సంధి యగును. అనగా పూర్వస్వరమైన ఉత్తునకును, పరస్వరమైన అత్తునకును - ఈరెండింటికి బదులుగా పరమందున్న అచ్చొక్కటియే వచ్చును. అప్పుడు 'రాముఁ డతఁడు' అవి యగును.

అట్లే అన్ని యుదాహరణములందును పూర్వపదములు హ్రస్వమైన ఉకారమును అంతమందు కలిగియున్నవి. వాని పైని అచ్చు వచ్చినప్పుడు సంధి యగును.

[సూత్రమున 'అగును' అని యుండుటచేత 'నిత్యముగ నగు' నని కొందరు భ్రమపడుచున్నారు. ఈ రెండింటికిని భేదము గలదు. ఈ సూత్రమునందలి విధికి భిన్నముగా మఱొకవిధి యుండనంతవరకు ఈ నియమము ననుసరింపవలయునని యర్థము. భిన్నముగా విధించినప్పుడు ఈ సూత్రము పనిచేయదు. ఉదాహరణములందు పరపదములకు మొదట అచ్చుల నన్నింటిని నిచ్చి 'ఋ ౠ' అను అచ్చులనీయలేదు, దానికి కారణము - ప్రకీర్ణక పరిచ్ఛేదము మొదటి సూత్రమున ఋ ౠ వర్ణములను రల తుల్యములుగా నిర్ణయించుట. అతఁడు + ఋషి = అతఁడు ఋషి అనియే యుండును. ఋ వర్ణము ర వర్ణముతో తుల్యమగుటవలన సంధి కవకాశము లేకపోయినది. ఇట్టివాని కవకాశము కల్పించుటకే సూరి సూత్రమున 'నిత్యము' అని యనక 'అగును' అని మాత్రమే యనెను. అందువలననే తరువాతి సూత్రమునకును అవకాశము కలిగినది.

**2. ప్రథమేతర విభక్తి శత్రర్థ చు వర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగు. (బా - ౨)**

నన్నున్ + అడిగె = { నన్నడిగె / నన్నునడిగె

నాకొఱకున్ + ఇచ్చె = { నాకొఱకిచ్చె / నాకొఱకు నిచ్చె

నాకున్ + ఆదరువు = { నాకాదరువు / నాకు నాదరువు

నాయందున్ + ఆశ = { నాయందాశ / నాయందు నాశ

ఇందున్ + ఉన్నాఁడు = { ఇందున్నాఁడు / ఇందు నున్నాఁడు

ఎందున్ + ఉంటివి = { ఎందుంటివి / ఎందునుంటివి

వచ్చుచున్ + ఉండెను = { వచ్చుచుండెను / వచ్చుచు నుండెను

చూచుచున్ + ఏగెను = { చూచుచేగెను / చూచుచు నేగెను

వ్యాఖ్య - ప్రథమేతరవిభక్తి యని యనగా ద్వితీయ మొదలుకొని సప్తమి వరకు గల విభక్తులని యర్థము. శత్రర్థ చ వర్ణ మని యనగా వర్తమానకాలము నందు వచ్చు నటువంటి 'చు' అను ప్రత్యయము. ఉదంతములైన ప్రథమేతర విభక్తులు నాలుగు. అవి 'ను, కొఱకు, కు, అందు' అనునవి. ఈ నాలుగింటి యొక్కయు 'చు' అను ప్రత్యయము యొక్కయు ఉకారమునకు సంధి వైకల్పికముగా నగునని సూత్రార్థము

వైకల్పికమని యనగా సూత్రముచే విధించినకార్యము జరుగుటకు గాని, జరుగకుండుటకు గాని యవకాశముండుట. అనగా సూత్రవిధి జరుగుటవలన ఒక రూపము, జరుగకుండుట వలన మరొకరూపము - రెండు రూపములు కలుగును.

నన్నున్ + అడిగె - అని యున్నప్పుడు పూర్వరూపము ద్వితీయావిభక్తి యందున్నది. ఉకారము అంతమందున్నది. కావున సంధి వచ్చుచో ద్రుతమునకు లోపము కలిగి, పూర్వమందున్న ఉకారమునకును పరమందున్న అకారమునకును బదులుగా పరమందలి అకారమే యేకాదేశముగా వచ్చి 'నన్నడిగె' అని యగును. ఇది సంధి వచ్చిన రూపము. పక్షాంతరమున సంధి రానియెడల ద్రుతము తరువాతి యచ్చుతో సన్నికర్షపొంది (న్ + అ) 'నన్ను నడిగె' అని యగును.

ఇట్లే తక్కిన యుదాహరణములందును రెండేసి రూపములు గలవు. ఇందు, ఎందు - అనునవి విభక్తి ప్రత్యయములు కావు. సప్తమీవిభక్తి యగు 'అందు' అను ప్రత్యయముతో సామ్యము కలిగియుండుటచేత వానిని 'ప్రత్యయప్రతిరూపము' లని యందురు. కావుననే 'అందు' అను ప్రత్యయముతో పాటుగనే 'ఇందు, ఎందు' అను వానిని కూడ గ్రహించి వైకల్పిక సంధిని నిర్వహింపవలయును.

౩ సంధి లేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమం బగు. (బా - ౬)

ఆగమం బనగా వర్ణాధిక్యంబు.

మా + అమ్మ = మా యమ్మ

మీా + ఇల్లు = మీా యిల్లు

మూా + ఊరు = మూా యూరు

**వ్యాఖ్య - యట్ + అగమము = యడాగమము = యవర్ణము అగమముగా వచ్చుట యని యర్థము. అగమము అనియనగా అదనముగా వచ్చి చేరునదని యర్థము.**

['యట్' అను దానియందు టకారమును ఇత్సంజ్ఞ అని యందురు. 'ఆద్యన్తౌ టకితౌ' అను సూత్రమునుబట్టి టకార మిత్సంజ్ఞగా గలది పూర్వమందును, కకార మిత్సంజ్ఞగా కలది అంతమందును చేరవలయును యడాగమము (యట్ + అగమము) అని యన్నప్పుడు టకార మిత్సంజ్ఞ యగుటచే విధింపబడిన వర్ణమునకు పూర్వమందు యవర్ణము వచ్చిచేరును. రుగాగమము (రుక్ + అగమము) అని యన్నప్పుడు విధింపబడిన వర్ణమునకు పరమందు రువర్ణము వచ్చి చేరును.]

**పూర్వమందును పరమందును స్వరములే యుండియు సంధి కలుగనియెడల, పరస్వరమునకు పూర్వమందు 'య' అను వర్ణము అదనముగా వచ్చి చేరునని సూత్రార్థము.**

**మీ + ఇల్లు అని యనునప్పుడు పూర్వస్వరము దీర్ఘము; పరస్వరము 'ఇ'. తెలుగునందు (ఆమ్రేడిత సంధియందు తప్ప) దీర్ఘముమీద సంధిలేదు. కావున యడాగమము కలిగి 'మీ + య + ఇల్లు = మీయిల్లు' అని యగును. ఇట్లే మాయమ్మ, మాయూరు - అను రూపములందును పరస్వరములగు 'అ, ఊ' అను వర్ణములకు పూర్వమందు యవర్ణము అదనముగా చేరినది.**

అగమి యకారంబు సత్వంబునకు సంధినిత్యము - ప్రయోగము సామర్థ్యము వలన ఈ నియమమును పాటింపగా పై రూపము లేర్పడును.

[సంధి లేనిచోట అని యనుటచే రెండు స్వరములు సన్నిహితము లైనప్పుడనియే గ్రహింపవలయును. సంధియగుటకు తగినస్థితి యుండి సంధిరానిచో అప్పుడుమాత్రమే పరస్వరమునకు యడాగమ మగును. వ్యంజనాక్షరమునకు పరమందున్న స్వరమునకు యడాగమమురాదు. దానిని స్పష్టముచేయుటకే సూరి "స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు" అని యనెను.]

**4. అత్తునకు సంధి బహుళముగా నగు. (బా - ౪)**

మేన + అల్లుఁడు = { మేనల్లుఁడు / మేన యల్లుఁడు }

పుట్టిన + ఇల్లు = { పుట్టినిల్లు / పుట్టినయిల్లు }

చూడక + ఉండెను = { చూడకుండెను / చూడక యుండెను. }

బహుళగ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధనాంతంబులకు సంధి లేదు.

అమ్మ + ఇచ్చెను = అమ్మ యిచ్చెను

దూత + ఇతఁడు = దూత యితఁడు

చెలువుఁడ + ఇందము = చెలువుఁడ యిందము

సంస్కృతీయంబునకు సంధి యగు నని యథర్వణాచార్యులు చెప్పిరి గాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు. ఆధునికకృతులం దొకానొకచోట స్త్రీ వాచక తత్సమంబులకు సంధి కానంబడియెడు॥ గంగను తాసె - నెలఁ తిచ్చెను॥ వెల యాల్వాదుల సంధిలేమి బాహుళకముచేతనే యని యూహించునది.

వ్యాఖ్య : బహుళమనగా అనేకవిధములుగా నని యర్థము. కాని వ్యాకర్తలు ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యత్వము - అని అర్థవిశేషములను నాలుగు విధములుగా చెప్పిరి. ప్రవృత్తి యనగా నిత్యముగా వచ్చుట; అప్రవృత్తియనగా నిత్యముగా రాకుండుట ; విభాష యనగా వచ్చుట రాకుండుట యనురెండు నగుట ; అన్యత్వము అనగా సూత్రము నందలి నిర్దేశమునకు అన్యవిధానము కలుగుట కాని, సూత్రమునందలి విధానము అన్యమునకు కలుగుట కాని జరుగుట.

ఈ నాలుగువిశేషములను బహుళము విధించినపుడెల్ల వర్తిల్లనక్కరలేదు. విభాషకు క్రిందివి యుదాహరణములు-

మేన + అల్లుఁడు - అని యున్నప్పుడు సంధియైనచో 'మేనల్లుఁడు' అని యగును. సంధి కానిచోట పరస్వరమునకు పూర్వమందు యకారము అదనముగా చేరి 'మేన + య + అల్లుఁడు = మేనయల్లుఁడు' అని యగును. ఇట్లే శరు వాతి రెండు లక్ష్యములందును సంధియై యొకరూపమును, సంధి రాక మరియొక రూపమును - రెండు విధములగు రూపములు కలుగుచున్నవి.

సూత్రమున 'బహుళము' అని చెప్పుటచేత కొన్ని యెడల అప్రవృత్తియు మండవచ్చును. స్త్రీవాచకము(స్త్రీలను చెప్పునట్టి పదము)లకు, తత్సమము(సంస్కృత ప్రాకృతతుల్యములగు పదము)లకు, సంబోధనాంతము (అంతమందు సంబోధన మునుగల పదము)లకును సంధిలేదు. అమ్మ + ఇచ్చెను - 'అమ్మ' స్త్రీవాచకము కావున ఇచ్చట సంధిలేదు. యడాగమము కలిగి 'అమ్మ + య + ఇచ్చెను = అమ్మ యిచ్చెను' అని యగును. దూత యనునది తత్సమశబ్దము. కావున 'దూత + ఇతఁడు' అని యున్నపుడు సంధి కలుగక 'దూత యితఁడు' అనియే యగును. 'చెలువుఁడ' యనునది సంబోధనాంతము. 'చెలువుఁడ + ఇందము' అని యున్నప్పుడు 'చెలువుఁడ యిందము' అని యడాగమముతోడి రూపముమాత్రమే యగును. ఇవి అప్రవృత్తికి ఉదాహరణములు.

సంస్కృతీయము = తత్సమము. మృగ్యము = వెదకదగినది (లేదనియే భావము). అధర్వణాచార్యులు "కుత్రచిత్ సంస్కృతీయోఽపి ప్రాజ్ఞోఽవ్యతత్వ్యతో భవేత్." అని యనెను. అనగా కొన్నియెడల సంస్కృతీయస్వరంబునకును లోపము కలుగు నని యర్థము. దానికి వ్యాఖ్య వ్రాయుచు అహోబలపతి "సంస్కృత సమాంతస్థితస్యాచోఽపి క్వచిత్సంధిః" అని వ్రాసెను. సంస్కృతసమముల యంత మందున్న యచ్చునకుగూడ కొన్ని చోట్ల సంధి యగునని యర్థము. చిన్నయసూరి అధర్వణునికి పూర్వమందు ఇట్టిప్రయోగము మృగ్యము అని వ్రాసి నిరాకరించెను.

ఆధునిక కావ్యములు = ఇటీవలి కావ్యములు (అనగా అధర్వణాచార్యుల యనంతరము వచ్చిన కావ్యములని భావము.) గంగ + అను కాసె - అని యున్న ప్పుడు పూర్వపదము తత్సమము కావున సంధి కారాదు, యడాగమము కలిగి 'గంగ యను కాసె' అని యుండవలయును. అట్లే 'నెలఁత' అను స్త్రీవాచకముమీద 'ఇచ్చెను' అని వచ్చినప్పుడు 'నెలఁత యిచ్చెను' అను రూపము ఏర్పడవలయును. కాని ఆముక్తమాల్యదయందు ఈ రెండుచోట్లను గంగనుకాసె, నెలఁతిచ్చెను - అని సంధితోడి రూపములే కన్పించుచున్నవి. వీనినిబట్టి అధర్వణాచార్యులు 'సంస్కృతీయంబునకును సంధియగు'నని చెప్పుటకు వీలులేదు. ఎందుచేతననగా అధర్వణాచార్యులు గతించిన యనంతరమే యీ ప్రయోగములు చేయబడినవి. కావున ప్రయోగము లేకుండగనే అధర్వణుడు సూత్రము నిర్మించెనని సూరి నిశ్చయము.

వెల + ఆలు - అని యున్నప్పుడు 'వెలయాలు' అను రూపము మాత్రమే యుండవలయును. 'వెల' యను శబ్దము స్త్రీ వాచకముకాని, తత్సమముకాని, సంబోధ

నాంతముకాని కాదు. ఐనను సంధి కారాదని నిషేధము కలదు. కాబట్టి యడాగమము తోడి రూపము మాత్రమే యగును. ఇది అన్యత్వమునకు ఉదాహరణము.

[చిన్నయసూరి అత్వసంధికి నిత్యవిధిని 'బాహుళకముచే నిటసంధి నిత్యము'(బా. క్రి. 117)అని జ్ఞాపనము చేసెను. వెనుకటి యడాగమ విషయము ననుసరించి యీ సూత్రము వచ్చుట, అచ్చటసైతము దీనిప్రవృత్తిని గుర్తింప జేయుటకే.]

**౫. శ్రేష్ఠతావాచకంబు లగు నార్యాంబాద్యర్థక శబ్దంబులు పరంబు లగుచో నన్నియచ్చులకును సంధి నిత్యము. (ప్రౌ - ౧)**

రామయ్య - సామయ్య - సీతమ్మ - లక్ష్మమ్మ మొ॥ అది శబ్దము అన్న అక్క అప్పలను దెలిపెడు.

వ్యాఖ్య - శ్రేష్ఠత్వమును తెలుపునటువంటి అయ్య, అమ్మ మున్నగు అర్థములు గల శబ్దములు పరములగునప్పుడు అచ్చులకన్నింటికి సంధి నిత్యముగా నగునని సూత్రార్థము. రామ + అయ్య - అని యున్నప్పుడు తొలుతటిది తత్సమము. కావున సంధి యగుటకు వీలులేదు. కాని యిది సంజ్ఞావాచకముగునచే ప్రస్తుత సూత్రమునుబట్టి నిత్యముగా సంధియై "రామయ్య" అనియగును. "సామి + అయ్య" అని యున్నప్పుడు "సామయ్య" అని సంధి యగును.

"సీత" అనునది స్త్రీవాచకము, కావున సంధి జరుగరాదు. కాని ప్రస్తుత సూత్రమునుబట్టి "సీతమ్మ" అని సంధియగును. "లక్ష్మి + అమ్మ"అని యున్నప్పుడు "లక్ష్మమ్మ" అని యగును.

బాలవ్యాకరణమునందు అత్వసంధిని బహుళముగా పేర్కొన్నను అప్రవృత్తి, విభాష, అన్యత్వము - అను మూడింటికి మాత్రమే యుదాహరణములు గలవు. ప్రవృత్తికి ఉదాహరణముగా రామయ్య, సీతమ్మ మున్నగు వీనిని తీసికొన వచ్చును. కావున, ఈసూత్రము బాలవ్యాకరణమునకు పూరకము.

నిత్యము అని యున్నప్పుడు ఎట్టిపరిస్థితులయందైనను ప్రవర్తించి తీర వలయును. "కృతాకృతప్రసంగి నిత్యంబు నాఁబడు"నని నిర్వచనము. పాండురంగ మాహాత్మ్యమునందు రామకృష్ణకవి "అమ్మాటియమ్మ" అని సంధికాని రూపమును ప్రయోగించెను. దీనినిబట్టి క్వాచిత్కముగా అర్యాంబాద్యర్థక శబ్దములు పరమైనప్పుడు సంధికాకుండ నుండవచ్చునని తెలుచున్నది. పై కల్పితముగా 'అమ్మాఇమ్మ' అనురూప

ముతో పాటుగా, 'అమ్మాజియమ్మ' అనురూపముకూడ నుండవచ్చునన్నమాట. కావున, సూత్రమునందు 'సంధి నిత్యము' అని గాక 'సంధి యగు' అని యున్నచో సమంజసముగా నుండును.

ఆర్య + అంబా + ఆది + అర్థకశబ్దంబులు = ఆర్యాంబాద్యర్థక శబ్దంబులు. ఇందున్న 'ఆది' శబ్దముచేత అయ్య, అమ్మ అను మాటలతో పాటుగా అన్న అక్క అప్ప అను మాటలను కూడ గ్రహింపవలయు నని వ్యాకర్త సూచించుచున్నాడు. గోపన్న - తిమ్మక్క - జోగప్ప మున్నగునవి యుదాహరణములు.

**6. ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు. (బా - ౫)**

ఏమి - మఱి - కి (షష్ఠి) - అది - అవి - ఇది - ఇవి - ఏది - ఏవి॥ ఇది యాకృతి గణంబు.

ఏమి + అంటివి = { ఏమంటివి / ఏమి యంటివి

మఱి + ఏమి = { మఱేమి / మఱియేమి

హరికిన్ + ఇచ్చె = { హరికిచ్చె / హరికి నిచ్చె

వ్యాఖ్య - ఏమి + ఆదులు = ఏమ్యాదులు = ఏమి మున్నగునవి. ఏమి మున్నగు శబ్దముల కడపటి ఇత్వమునకు సంధి వైకల్పికముగా నగు నని సూత్రార్థము.

[ భాషలోని శబ్దముల నన్నింటిని స్థూలముగా క్రియలు, క్రియేతరములు అని రెండువిధములుగా విభాగింపవచ్చును. క్రియలుకాని వన్నియు క్రియేతరములు, క్రియేతరముల కొననున్న యిత్వమునుగూర్చి యీ సూత్రమున ప్రస్తావింపబడు చున్నది.]

ఏమి మున్నగు శబ్దములయొక్క చివర హ్రస్వమైన ఇకారము ఉన్నది. దీనికి పరమందు అచ్చు వచ్చిన యెడల సంధి జరిగి యొకరూపమును, సంధి జరుగక మరొకరూపమును రెండురూపములు రావచ్చును. ఏమి + అంటివి - అని యున్నపుడు పూర్వస్వరమైన ఇత్తునకు, పరస్వరమైన అత్తునకు బదులుగా అత్వమే రాగా 'ఏమంటివి' అని యగును. ఇది సంధియైన రూపము. సంధి కానియెడల పరస్వర

మునకు ఏ మ యవర్ణము ఆగమమై ఏమి + య + అంటివి = ఏమి యంటివి అని యగును ఇట్లే 'మఱి + ఏమి' అని యున్నప్పుడు 'మఱేమి. మఱియేమి' అని రెండురూపములు వచ్చును.

హరికిన్ + ఇచ్చె - అని యున్నప్పుడు సంధి అయిన యెడల రెండచ్చుల నడుమనున్న ద్రుతమునకు లోపము వచ్చును. పిమ్మట పూర్వపరస్వరంబులకు రెండింటికి బదులుగా పరస్వరమొక్కటే వచ్చి 'హరికిచ్చె' అనురూప మేర్పడును. సంధి రానిపక్షమున మొదటిపదము చివరనున్న నకారము తరువాతి 'ఇ' వర్ణముతో సన్నికర్ష పొంది 'హరికి నిచ్చె' అనియగును.

[ఇచ్చట అచ్చు వ్యంజనమునకు పరమందుండుటచే యడాగమము కలుగదు.]

ఏమి, మఱి మొదలగువానిని ఏమ్యాదులు అని యందురు. కి (షష్ఠి) అని యనగా షష్ఠీవిభక్తియందు వచ్చు 'కి' ప్రత్యయమని యర్థము. ఆకృతిగణము అని యనగా ఆకారమును బట్టి నిర్ణయింపదగిన సమూహము. క్రియాపదములు కాక, రెండు మూడక్షరముల పరిమితి గల పదములన్నియు ఏమ్యాదులలో చేరును. వీనికి సంధి వైకల్పికము.

[అవికాక, మిగిలిన క్రియేతరముల ఇత్వమునకు సంధి చేయరాదని భావము. క్రియలనుగూర్చి తరువాతి సూత్రములందు ప్రస్తావింపబడుచున్నది.]

**7. క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు.**

**(బా - ఒ)**

వచ్చిరి + అప్పుడు = { వచ్చిరప్పుడు / వచ్చిరి యప్పుడు

వచ్చితిమి + ఇప్పుడు = { వచ్చితిమిప్పుడు / వచ్చితిమి యిప్పుడు

వ్యాఖ్య - క్రియాపదముల చివరనున్న ఇత్వమునకు సంధి వైకల్పికముగా నగునని సూత్రార్థము.

'వచ్చిరి' అనునది ప్రథమపురుష బహువచన భూతకాలక్రియ: ఇదంతము. దీనికి అచ్చు పరమందున్నప్పుడు సంధి జరిగినయెడల 'వచ్చిరప్పుడు' అని యగును. వైకల్పికమని యనుటచేత సంధి జరుగనియెడల యడాగమము కలిగి 'వచ్చిరి +

య + అప్పుడు' అని యుండును. ఆగమ యకారంబు నత్వంబునకు సంధినిత్యము. కావున 'వచ్చిరి యప్పుడు' అను రూపము సిద్ధించును.

'వచ్చితిమి' అనునది ఉత్తమపురుష బహువచన భూతకాలక్రియ: ఇదంతము. దీనికి అచ్చు పరమందున్నప్పుడు సంధియైె యొకరూపము, సంధి కాక మరొకరూపము- రెండురూపము లేర్పడును. లక్ష్యములందు ఇదంతములైన ప్రథమపురుష, ఉత్తమ పురుష మాత్రమే చూపబడినవి. వీనికి సంధి వైకల్పికముగా విధింపబడినది.

[భూతకాలమున మధ్యమపురుషక్రియలు ఇదంతములై యుండును. భూత కాలమున ఉత్తమపురుషైకవచనము, తద్ధర్మార్థకమునందలి యొక రూపము, క్త్వార్థకరూపము కూడ ఇదంతములై యుండును. ప్రస్తుత సూత్రముచేత వైకల్పిక సంధిని విధించి, తరువాతి సూత్రములచేత దానిని వరుసగా వారించుచున్నారు. విధి లేనియెడల నిషేధము కలుగదు. కనుక ప్రస్తుత సూత్రమున విధించుట యావశ్యకమైనది.]

**8. మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధి యగు.**

(బా - ౭)

ఏలితివి + అపుడు = ఏలితివపుడు

ఏలితి + ఇపుడు = ఏలితిపుడు

ఏలితిరి + ఇపుడు = ఏలితిరిపుడు.

వ్యాఖ్య - యుష్మదర్థకము (నీవు, మీరు)తో అన్వయించుక్రియ మధ్యమపురుష క్రియ. ఇది భూతకాలమున ఏకవచన బహువచనముల రెండింటను ఇదంతమై యుండును. ఈ క్రియకు పరమందు అచ్చున్న యెడల సంధి జరుగునని సూత్రార్థము.

'ఏలితివి' అనునది భూతకాల మధ్యమ పురుషైకవచనము; చిట్టచివర ఇత్వము కలదు. పరమందు అచ్చు వచ్చి 'ఏలితివి + అపుడు' అని యుండగా పూర్వపర స్వరము (ఇ + అ) లకు బదులుగా పరస్వరము (అ) వచ్చి 'ఏలితివపుడు' అని యగును.

మధ్యమ వకారమునకు లోపము కలిగి 'ఏలితి' అను రూపముకూడ వచ్చును. అప్పుడు కూడ 'ఏలితి + ఇపుడు=ఏలితిపుడు' అని సంధి వచ్చును. 'ఏలితిరి' అను నది భూతకాల మధ్యమపురుష బహువచనము కావున సంధి యగును.

9 క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు. (బా - ౮)

వచ్చి + ఇచ్చెను = వచ్చియిచ్చెను.

వ్యాఖ్య - భూతకాలికమైన అసమాపకక్రియ క్త్వార్థకము. ఇది ఇదంతమై యుండును. క్త్వార్థకము తుదియున్న ఇత్వమునకు సంధి చేయరాదని సూత్రార్థము.

'వచ్చి' యనునది క్త్వార్థకము. దీనికి 'ఇచ్చెను' అనునది పరముకాగా 'వచ్చి + ఇచ్చెను' అని యగును ఇట్టియెడల సంధి లేదని ప్రస్తుతసూత్రము నిషేధించుచున్నది. కావున స్వరంబు (ఇ) కంటెం బరంబైన స్వరంబు (ఇ) నకు యడాగమంబు కలిగి 'వచ్చి + య + ఇచ్చెను' అని యగును. ఆగమయకారంబు నత్వంబునకు సంధి నిత్యము. కావున 'వచ్చి యిచ్చెను' అను రూపము సిద్ధించును.

10. ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుం జూపట్టెడి.

(ప్రౌ - ౨)

భూతకాలికాసమాపకక్రియయొక్క యికారమునకుం బ్రామాణికప్రయోగములందును కొన్నియెడల సంధి గనంబడుచున్నదని యర్థము॥ చాపము నాకందిమ్మనుడు॥ భార. విరా. ఆ౪॥ వెలు చిట్టంబుధినాథనందనులు దోర్వీర్యంబు సాలించి యం, దలుపాఱంగ॥ నిర్వ. ఆ౫॥ ఎఱింగెఱింగి నా వలువిది మేల కట్టుకొని వచ్చును దానవి॥ భాగ. స్కంధ॥ నేఁడే తెంచు ప్రయత్నమున్న నకటా! నీచేతఁ జెప్పింపఁడే॥ ప్రభా. ౪ ఆ. మొ॥

వ్యాఖ్య - ఇప్రత్యయాంతావ్యయము = క్త్వార్థకము. క్త్వార్థకముయొక్క ఇత్వమునకును సంధి కలదని సూత్రార్థము. సూత్రమునందు 'చూపట్టెడి' అని వాడుటచేత, పూర్వప్రయోగములు కలవని చూపుటయే యిచ్చట వ్యాకర్త యొక్క యభిప్రాయము. చిన్నయసూరి బాలవ్యాకరణమునందు క్త్వార్థకేకారమునకు సంధి లేదని పూర్తిగా నిషేధించెను. అట్టియెడల పూర్వకవి ప్రయోగము లుండుటకును వీలులేదు. ప్రౌఢవ్యాకరణము పూర్వకవి ప్రయోగము లున్నవని చూపుచుండుటచేత సూరి నిర్ణయము సరికాదని యనిపించును.

ఆధర్వణకారికలయందు 'క్త్వార్థేతో న భవేత్సదా' అని కలదు. క్త్వార్థంబైన యిత్తున కెప్పుడును సంధి కాదు - అని యీవాక్యమున కర్థము. సూరి యీ వాక్యమున కనుగుణముగనే తానును సూత్రించెను. కొందరు ఈ సూత్రమునకు

విపరీతవ్యాఖ్యానము చేసిరి. 'ఎప్పుడును సంధి కాదు'అని యనగా'అత్యంతనిషిద్ధ'మని యర్థము కాదనియు, 'అప్పుడప్పుడు సంధి కావచ్చు'నవియే దాని యర్థమనియు వారి యభిప్రాయము. ప్రౌఢవ్యాకరణముకూడ ఆ యభిప్రాయమున కనుగుణముగానే ఉదాహరణములను చూపుచున్నది.

మొదటిది భారతమునందలిది. "అందిమ్ము" అనునది. ప్రౌఢవ్యాకరణ కారుని యభిప్రాయమునుబట్టి "అంది + ఇమ్ము" అనునది విభాగము. ప్రస్తుత విభాగమునుబట్టియైనచో "అందుకొని యిమ్ము" అనునది అర్థము కావలయును. పద్యసందర్భమునుబట్టి యైనచో 'అందుకొని యిమ్ము' అను నర్థము కాక 'అందు నట్లుగా ఇమ్ము' అను నర్థము కావలయును. వ్యవహారమునందును "నీచేతిలోని కలము నందిమ్ము" అని యన్నప్పుడు 'అందుకొనుము' అను నర్థముకాక 'అందు నట్లుగా ఇమ్ము'అను నర్థముమాత్రమే కలుగుట పరిచితవిషయమే. భారతమున బృహన్నల యుత్తరునితో చెప్పుచున్న వాక్యమిది. 'అందు దొడ్డ విల్లున్నది, నావిని నాకందిమ్ము' అన్నది దాని భావము. కావున 'అంది' అను క్త్వార్థకరూపమును గ్రహించి యర్థము చెప్పుట సంగతము కాదు.

"అందిమ్ము" అనునది శబ్దపల్లవరూపము. రెండుధాతువుల కలయికవల్ల ఏర్పడినది. అందు + ఇచ్చు = అందిచ్చు. ఈ రూపమేర్పడిన పిమ్మట మధ్యమ మువర్ణకముతోడి రూపము ఏర్పడినది. కావున నిచ్చట ఇత్వము కలదనుట యెంత మాత్రమును సమంజసముకాదు. దీనినిబట్టి క్త్వార్థకేకారసంధి కలదనుటయు సంగతము కాదు.

రెండవ యుదాహరణము నిర్వచనోత్తర రామాయణము నందలిది. వెలిచి + ఇట్లు = వెలిచిట్లు అయ్యెనని వ్యాకర్త దీనిని చూపెను. ముద్రితప్రతు లన్నింటి యందును 'వెలిచిట్లు' అనురూపమే అచ్చట కనిపించుచున్నది. దీనినిబట్టి క్త్వార్థకేకా రమునకు ప్రసక్తి యిచ్చటను కనిపింపదు.

ఎఱింగెఱింగి - అనుచోట నున్నది క్త్వార్థకేకారసంధి యనుట నిశ్చయము. 'ఎఱింగి' అను ఇదంతరూపమునకు పరమందు "ఎ" అను అచ్చు వచ్చి సంధి యైనది. అటుకానిచో దీనిని ఇకముందు చెప్పబోవు అమ్రేడిత సంధికి నుదాహరణ ముగా తీసికొనవచ్చును. కాని బాలవ్యాకరణమునుబట్టి యైనచో అమ్రేడితము పర మైనప్పుడు పైతము క్త్వార్థకేకారమునకు సంధి రాదను నిషేధము కలదు.

పీచేతఁ జెప్పింపఁడే - అనుచోట 'చెప్పి + అంపఁడే' అనురీతిగా భావించుట చేత ప్రౌఢవ్యాకరణము దీనిని క్త్వార్థక సంధికి ఉదాహరణముగా చూపెను. కాని ప్రభావతీ ప్రద్యుమ్నమునందలి యీ యుదాహరణము "చెప్పింపఁడే" యనురూపమున ముద్రితప్రతులందు కనబడుచున్నది. కావున, ఇదియు ప్రస్తుతసూత్రమునకు లక్ష్యము కాజాలదు.

[పైని చూపిననాలుగు లక్ష్యములందును నిజమునకు 'ఎఱింగెఱింగి' యనునదొక్కటియే క్త్వార్థకమునకు సంధియైనచోటు. ఇచ్చట పూర్వపరవర్ణములు (ఇ + ఎ) సవర్ణములు. చిన్నయసూరి తాను వ్రాసిన సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణమునందు "న క్త్వః" అని తొలుత క్త్వార్థక సంధిని పూర్తిగా నిషేధించి, అనంతరసూత్రమున "క్వాపి సవర్ణే దృశ్యతే" అని సవర్ణము పరమైనపుడు క్వాచిత్కముగా కనిపించుచున్నదని అంగీకరించెను. దీనినిబట్టి 'ఎఱింగెఱింగి' మున్నగు ప్రయోగములు సూరికిని సమ్మతములే యనవలసివచ్చును. భారతమునందు కాని, ప్రామాణికులయిన యనంతరకవులయందుగాని యిట్టిసంధికి లక్ష్యములు లేకుండుటచే సూరి బాలవ్యాకరణమునందు దానిని నిషేధించెను. అసవర్ణములు పరమైనప్పుడు సంధియగుట యాతని కెంతమాత్రమును సమ్మతము కాదు. ప్రౌఢ వ్యాకరణకారుడు నట్టి నిర్వాహకములగు లక్ష్యములను చూపలేదు. అనంతర కాలికులలో నట్టి ప్రయోగములు గలవు. కాని వానికి అంతటి ప్రామాణ్యసిద్ధి లేదు. ]

## 11. ఇఁకాంతములకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు

(బా - ౯)

ప్రథమేతర విభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని.

వచ్చున్ + ఇపుడు = వచ్చునిపుడు

చూడన్ + అయితి = చూడనయితి

ఉండెడిన్ + అతఁడు = ఉండెడి నతఁడు

ఇఁక - ఇఁగ - ఎట్టకేలకు - ఎట్టకేని॥ ఈయవి యిఁకాదులని తెలియంగునది. వీనికి సంధి వైకల్పికము.

వ్యాఖ్య - ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని - అను నాలుగింటికితప్ప మిగిలిన ద్రుతప్రకృతికములకు సంధిలేదని సూత్రార్థము.

ద్రుతము (నకారము)ను అంతమందు కలవి ద్రుతప్రకృతికములు. వీనికి అచ్చు పరమందున్నను సంధి చేయరాదు. కాని ఇఁకన్, ఇఁగన్, ఎట్టకేలకున్, ఎట్టకేలన్ - అను ఈ నాలుగు ద్రుతప్రకృతికములకును వైకల్పికముగా సంధి చేయవచ్చును. ఇఁకన్ + అతఁడు = ఇఁకతఁడు: ఇఁక నతఁడు అను విధముగా రెండేసి రూపములు కలుగును.

[పై యుదాహరణములందు వచ్చున్, చూడన్, ఉండెడిన్ - అన్నవి పూర్వ శబ్దములుగా ప్రదర్శింపబడినవి. నిజమున కివి వీని సహజరూపములు కావు. వచ్చును, చూడను, ఉండెడిని - అన్నవి సహజరూపములు. 'అచ్చు పరంబగు నపుడు ద్రుతస్వరంబునకు లోపము నిత్యము' అను నియమమునుబట్టి పై యన్ని యెడల అచ్చునకు లోపము కలిగి 'వచ్చున్' మున్నగు రూపము లేర్పడినవని గుర్తుంచుకొనవలయును.]

వచ్చున్ + ఇపుడు - ఇందు పూర్వశబ్దము తద్ధర్మార్థకము: ద్రుతప్రకృతికము: ఇఁకాదులలోనిది కాదు. అందువలన సంధి కారాదు. పూర్వశబ్దము చివర నున్న నకారము తరువాతి 'ఇ' వర్ణముతో సన్నికర్ష పొంది "వచ్చు నిపుడు" అని మాత్రమే యగును. తక్కిన రెండు లక్ష్యములందును ఇట్లే నకారము తరువాతి యచ్చుతో సన్నికర్ష పొందును.

[వచ్చితిని అనునది భూతకాలమున ఉత్తమ పురుషైక వచనము. వచ్చెడిని - తద్ధర్మార్థకము. ఈ రెండును ఇదంతములవలె కనిపించును. బా. వ్యా. 9వ సూత్రము ప్రకారము వైకల్పికసంధి చేయవలయు ననిపించును. కాని యీ రెండును ద్రుతప్రకృతికము లగుటచే ప్రస్తుతసూత్రమునకు లక్ష్యము లగు చున్నవి. ఇవి ఇఁకాదులలోనివి కానందువలన వీనికి సంధి చేయరాదు. కావున వచ్చితిని + అప్పుడు = వచ్చితినప్పుడు: ఉండెడిని + అతఁడు = ఉండెడి నతఁడు - అను విధముగా సంధిలేని రూపములే యగును. సంధియైనచో ద్రుతమునకు లోపము కలిగి అనిష్టరూపములు వచ్చును. కావున సంధి చేయరాదు.]

ప్రథమేతరవిభక్తి యని మొదలయిన (బాల.) రెండవ సూత్రమునందలి యుదాహరణములుకూడ ద్రుతప్రకృతికములే. ప్రస్తుతసూత్రమువలన వానికి పైతము సంధి లేకపోవలసివచ్చును. దానిని వారించుటకు "ప్రథమేతరవిభక్తి విధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని" అని సూరి వివరణమందు తెల్పెను. రెండవ సూత్రమునకు లక్ష్యములు ఐదు మాత్రమే. ప్రస్తుతసూత్రమునుబట్టి ఆ వైకల్పికసంధిని తొలగించినచో, ఆ సూత్రమును ప్రవర్తించుటకు అవకాశము కలుగదు. ఆ వైకల్పిక

విడిచి పెట్టుకొన్నను, ఇంకను ద్రుతప్రకృతికము లనేకముగా నుండుటచే ప్రస్తుత సూత్రమునకు అవకాశము కలదు. కావున "నిరవకాశా విధయః సావకాశాన్ విధీన్ బాధన్తే" అను నియమమునుబట్టి అవకాశముగల ప్రస్తుతసూత్రము రెండవ సూత్ర విషయమునందు వ్యవహరింపకుండ నుండిపోవును. అనగా ప్రథమేతర విభక్తి ఉత్వమునకు, శత్రర్థక చువర్ణమునకు వైకల్పికసంధి యగుటకు ప్రస్తుతసూత్రము బాధకముకా దని భావము.

ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని అను నాలుగింటికిని - ను, కొలఁది, కి, కు, అందు అను ప్రత్యయముల నంతమందు గలిగిన శబ్దములకును - ఇందు, ఎందు అను ప్రత్యయ ప్రతిరూపములకును - శత్రర్థక చు వర్ణమునకును దప్ప మిగిలిన ద్రుతప్రకృతికములకు సంధి కారాదు.

12. కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబులం ద్రుతంబున కచ్చు పరం బగుచో ద్విత్వంబు చూపట్టెడి. (ప్రౌ - 3)

ఘనచక్రాయుధ నిష్ఠురక్షత గళద్రక్తాస్య సర్వాంగుని, న్ననుభూతాప్రతిమ ప్రగల్భపరివాదాంతర్గతోద్విక్రమున్॥ ఉ. హరి. ౬. ఆ॥ సర్వమున్నతని దివ్యకళామయమంచు విష్ణునం, దుల్లముసేర్చి॥ భాగ. ౭. స్కం॥ తరుణీశాత కటాక్షవీక్షల శానల్ధారొఁగన్న చోట్లుం బలె, న్నురుశోభా విభవాకరంబులగుచున్ రోమాంకురస్థానముల్, పరఁగున్॥ కళా. ౭ ఆ॥ (నన్నయభట్టారకుఁడు 'అన్నిష్టసఖు నూఁదియున్న దాని' అని ప్రయోగించి "లుక్సంశ్లేషౌనాచి ద్రుతస్య" అని సంశ్లేషమును నిషేధించుట ప్రయోగవైరళ్య సూచనార్థం బని యెఱుంగునది.)

వ్యాఖ్య - ద్రుతప్రకృతికములకు (కొన్నింటికి తప్ప) సంధి లేనందువలన, అచ్చుపరమైనప్పుడు సన్నికర్షను పొందవలయునని యింతవరకు జరిగిన గ్రంథమును బట్టి తెలియుచున్నది. ప్రస్తుతసూత్రమున ప్రౌఢవ్యాకర్త అచ్చు పరమైనపుడు ద్రుతమునకు ద్విత్వము కలుగుచున్నట్లు ప్రయోగములనుబట్టి చూపుచున్నాడు. 'కొన్ని యెడల' అని చెప్పుటచేత సాధారణముగా సన్నికర్షను బొందుటయే లక్షణమైనను, ద్విత్వమును బొందుట సైతము అక్కడక్కడ కలదని ఆయన యభిప్రాయము.

'సర్వాంగునిన్ + అనుభూత' అనుచోట ద్రుతము తరువాతి యచ్చుతో కలిసినప్పుడు ద్విత్వము నొందినది. కావుననే 'సర్వాంగునిన్ననుభూత' యను రూప

మేర్పడినది. కాని యిచ్చట మరొక పాఠ మున్నదని బులుసు వేంకటరమణయ్య గారు "ఆమచుం గృష్ణుఁడు వోయినం బిదప బాణామ ర్త్యవైరికులము, ధ్వజచక్రాయుధ విస్ఫుర శతగళద్రక్తార్ద్రి సర్వాంగు న, భ్యసనభూత...." అని చూపిరి. ఈ పాఠమున ప్రావస్థానమున "అభ్యసనభూత" అని యున్నది. ప్రౌఢవ్యాకర్త చూపిన ద్రుత ద్విత్వమునకు ఇక్కడ స్థానము లేదు.

"సర్వమున్ + అతని" అనుచోట ద్రుతమునకు ద్విత్వము కలిగి "సర్వ మున్నతని" అని యైనది. దీనిని ద్రుతద్విత్వమునకు లక్ష్యముగా అంగీకరించి తీర వలయును. అట్టిదే "బలెన్ + ఉరుకోలా" అని యున్నప్పుడు "బలెన్నురుకోలా" అని ద్విత్వముతో కూడికొనిన రూపము కూడ.

కావున పాఠాంతర ముండుటచే నాచన సోమనాథుని ప్రయోగమును కాదను కొన్నను, పోతన సూరనల ప్రయోగములు ప్రస్తుతసూత్రమునకు లక్ష్యములుగా నరిపోవు చున్నవి. ఇట్టివింకను మరికొందరయందు కనబడుచున్నవనుట వాస్తవము.

["సంస్కృతమున 'ఙమోహ్రస్వాదచి ఙముణ్నిత్యమ్' అను పాణినీయ ముంబట్టి ద్రుతమున కచ్చు పరమగునపుడు ద్విత్వమువచ్చి 'సన్నచ్యుతః' 'పచ న్నయమ్' అని యైనట్లే తెలుగునందును ద్రుతమునకుఁ బిదప నచ్చుండెనేని ద్విత్వము చేయవచ్చును, కాన నీ సూత్రము లేకున్నను దోషము లేదు. 'అనుక్త మన్యతో గ్రాహ్య'మ్మను నాథర్వణ కారికచే సంస్కృతమర్యాదను క్వాచిత్కముగ నిందు గ్రహింపవచ్చును" అని కుమారదేవపండితీయమున కలదు. ఇది యిట్లే గ్రహించుట యెన్నో యపకతవకలకు కారణము కాగలదు. 'ఇకో యణచి' 'అద్ గుణః' మున్నగువానిని తెలుగుపదముల సంధి విషయమున నుపయోగింతుమా? కవి + అభిప్రాయము = కవ్యభిప్రాయము అని యగుచున్నది కావున కవి + అతఁడు అని యున్నప్పుడుకూడ యణాదేశమును చేయవచ్చునా? కాబట్టి 'అనుక్త మన్యతో గ్రాహ్యమ్' అనునది యితరభాషావిషయము కాదు. తెలుగు భాషకు సంబంధించి, యితరవ్యాకరణములలో నున్నదానిని గ్రహింపవచ్చు ననియే కాని, అన్య భాషావిషయములను గూడ గ్రహింపవలయునని కాదు. కావున ద్రుతద్విత్వము విషయమున ప్రౌఢవ్యాకర్త మాటన అవశ్యకమనుట నిర్వి వాదము ]

ప్రౌఢవ్యాకర్త యీవిధముగా ద్రుతమునకు ద్విత్వము నన్నయభట్టారకుఁడే చేసెనని చూపుటకు "అన్నిష్టసఖి నూఁదియున్న దాని" అనుప్రయోగము నుదాహరించు చున్నాఁడు. కాని, యిది యే విధముగను ప్రస్తుతసూత్రమునకు లక్ష్యము కాఁజాలదు.

ఆ విషయము తెలిసియే మరల నింకొకమారు దీనిని వేరొకచోట (ప్రౌఢ - ౯) ఉదాహరించుచున్నాడు.

'అన్ + ఇష్టసఖి' అనునది 'అన్నిష్టసఖి' అని అయ్యెనని ఆయన అభిప్రాయము. 'అను' అనునది తద్ధర్మార్థకము. దీని ఉత్వమునకు లోపమువచ్చి 'అన్' అని అయ్యెను. ఆ తరువాత అచ్చు వచ్చుటచే నకారమునకు ద్విత్వము వచ్చెను. ఇక్కడ కొన్ని ప్రశ్నలు గలవు. సూత్రమునందు 'ద్రుతంబున కచ్చు పరంబగుచో' అని కలదు. అనగా ఇచ్చటి నకారము ద్రుతమై యుండవలయును. "అను" అన్న తద్ధర్మార్థకరూపమునందలి ను వర్ణము ద్రుతము కాదు. అది అంగికమైన నకారము. ప్రౌఢవ్యాకర్తయే ప్రత్యయాగమావ్యయాత్మకమైన నకారము మాత్రమే ద్రుతమని చెప్పెను కదా! కావున ద్రుతవిషయికమయిన యీ సూత్రమునకు "అన్నిష్టసఖి" అనునది లక్ష్యము కాజాలదు.

మరొక ప్రశ్న కూడ కలదు. "అన్నిష్టసఖి" అని యున్నప్పుడు విభాగము పూర్వముచేసినట్లే చేయవలయునా? అది సరియైనదేనా? 'తత్పూగవమున వింటపట్టూంల మునవల్లి, యన్నిష్టసఖి నూ(ది యున్నదాని' అనునది పూర్తిపాదము. ఒద్దువమన్న పెనుదీగ యనునటువంటి ఇష్టసఖిని ఆధారముగా చేసికొనియున్న దేవయానిని యయాతి చూచెను. సందర్భమది. అన్నిష్టసఖి అని యనగా అన్నటువంటి యిష్టసఖి యని యర్థము. కావున "అన్న + ఇష్టసఖి" అని యుండి అకారలోపసంధియై "అన్నిష్టసఖి" అని యయ్యెను. సంధికాని యెడల "అన్నయిష్టసఖి" అని యడాగమము తోడి రూపమే యుండును.

"అలుక దాసియున్ సుతుఁడు నన్నిని వాయని ధర్మముల్ మహిన్" - ఇది యును నన్నయభట్టారకుని ప్రయోగమే. "అన్నిని" యనుచోట 'అన్న + ఇని' అని విభాగముచేసి యర్థము చెప్పుకొనుట సుకరము కదా! మరొక ప్రయోగము కూడ చూతము. 'వృత్రుఁ డన్న సుర గర్వించి' యని నన్నయ ప్రయోగమే. 'అన్న + అసుర' అనియే విభాగము చేయవలయును. 'వృత్రుఁ డనునటువంటి అసుర' యని యర్థము. ఇంకను పెక్కుప్రయోగములను చూపవచ్చును. ఇన్ని యుదాహరణములు భారతమున నన్నయభట్టారకుని రచనమునందే లభించుచుండగా ప్రయోగవైరళ్యమునకు తావెక్కడ? 'అన్నిష్టసఖి' యనుచోట ద్రుతము ప్రసంగము లేనేలేదనియు, సంధివశమున నకారమునకు ద్విత్వము వచ్చుట అను ప్రసంగము కూడ లేదనియు, అచ్చటనున్న నకార ద్విత్వము పూర్వసిద్ధమే యనియును సిద్ధాంతము.

ఇంక 'ఉక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య' అను చింతామణీ సూత్రమును గుఱించి యాలోచింతము. ద్రుతమున కచ్చుపరమైనప్పుడు లోపసంశ్లేషములు రావని దాని యర్థము. ఈ సూత్రమును చెప్పిన సందర్భమునుబట్టి యర్థముచేసికొనుట యవసరము. కావున చింతామణియందలి పూర్తిశ్లోకము నుదాహరింతును.

"సర్వత్రాజ్వత్ కార్యం జ్ఞేయం యన్య ద్రుత ప్రకృతికేభ్యః
ఉక్సంశ్లేషౌ నా చి ద్రుతస్య సర్వత్ర ఉక్సమాసేషు."

ఇందు మూడు సూత్రములు గలవు. మొదటిది - ద్రుతప్రకృతికములమీది యకారంబున కన్నియెడల నచ్చునకువలెఁ గార్యంబగు॥ రెండవది - ద్రుతంబున కచ్చుపరంబైన లోపసంశ్లేషంబులు లేవు॥ మూడవది - సమాసద్రుతంబున కన్ని యెడల లోపంబగు.

చింతామణి ప్రణాళికనుబట్టి ఎవఁడు, ఎక్కడ మున్నగునవి యెవఁడు, యెక్కడ అని యకారాదులుగనే యుండును. అట్లు యకారాదులయిన పదములు పరమందున్నపుడు తొలివర్ణమును అచ్చుగా భావించి సంధి జరుపవలయునని వ్యాకర్త యభిప్రాయము. అనగా అచ్చటి తొలి వ్యంజనము తొలఁగి పోవునని యర్థము. అతనిన్ + యెక్కడ = అతని నెక్కడ అనియే యగును. ఇక్కడ 'యె' అను దానియందలి వ్యంజనమును దొలగించి 'ఎ' యను నచ్చునే పరిగణించుట జరుగును. 'అజ్వత్ కార్యం జ్ఞేయ'మ్మనుట యందుకొరకే. ఇప్పుడు 'అచ్చుల కెట్లగును ?' అను ప్రశ్న యుదయించును. దానికి సమాధానముగా రెండవసూత్రము ప్రవర్తించును. లోపము కాని సంశ్లేషము కాని రాదని యిందు సూచించుటచే 'అతని యెక్కడ' అని 'అతనిన్యెక్కడ' అని రెండు అనిష్టరూపములను పరిహరించుటయు జరుగును. సంశ్లేష మనగా 'మీది హల్లుతో కూడికొనుట' యని యర్థము. పరమందు హల్లు లేనప్పుడు 'సంశ్లేషము' అను మాటయే అర్థరహితమగును. కావున చింతామణీ సూత్రము యకారాదులయిన తెలుగుపదములు పరమైనప్పుడు ద్రుతమునకగు కార్యము సూచించుటకు ప్రవర్తించుచున్నదనుట స్పష్టము. చిన్నయసూరి "యకారంబుమ వువూవొవో లను దెలుఁగుమాటలకు మొదట లేవు" అని సంజ్ఞాపరిచ్ఛేదమున సూత్రించి మార్గాంతరమున దీనినిసాధించుట జరిగిపోయినది. కావున చింతామణీ సూత్రము ప్రస్తుతవిధికి నిర్వాహకము కాజాలదు. ద్రుతప్రసంగమే లేనిచోట ద్రుత విషయికమైన సూత్రము సాధకము కాదుగదా !

దీనినిబట్టి నన్నయభట్టారకుడు తాను వ్రాసిన సూత్రమునకు విరుద్ధముగా తానే ప్రయోగము చేసెననుట సరికాదని నిర్ణయము.

**13. అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు.**

**(కా - ౧౦)**

ద్విరుక్తమునియొక్క పరరూప మామ్రేడిత మనంబడు. తఱుచుగ ననుటచే నొకానొకచోట వైకల్పికసంధియుం గలదని తాత్పర్యము.

ఔర + ఔర = ఔరౌర

ఆహా + ఆహా = ఆహాహా

ఎట్టా + ఎట్టా = ఎట్టెట్టా

ఓహో + ఓహో = ఓహోహో

ఏమి + ఏమి = ఏమేమి; ఏమి యేమి

ఏగి యేగి అనుచో క్త్వార్థంబగుట సంధిలేదు.

వ్యాఖ్య - ద్విరుక్తము = రెండుసారులు పలుకబడినది. పరరూపము = తరువాతిరూపము. ఒకేమాటను రెండుసారు లుచ్చరించినచో రెండవసారి యుచ్చరించిన మాటను ఆమ్రేడితమని యందురు.

మొదటిమాట చివరియచ్చునకు పరమందు రెండవమాట మొదటియచ్చు ఉండగా సంధి తఱుచుగా నగునని సూత్రార్థము. తరుచుగా నని యనుటచేత స్వల్పముగా వికల్పసంధియు జరుగ వచ్చును.

ఔర + ఔర - అని యున్నప్పుడు క్రింద రెండంకె వేసిన రూపము ఆమ్రేడితము. పూర్వశబ్దముచివర 'అ' అను అచ్చున్నది. ఆమ్రేడితమునకు మొదట 'ఔ' అను అచ్చున్నది. కావున పూర్వపరస్వరములకు రెండింటికి బదులుగా పరస్వర మొక్కటియే వచ్చి 'ఔరౌర' అని యైనది.

[పూర్వశబ్దము చివర 'అ' వర్ణముండుటచే అత్వసంధి చేయునెడల అప్రవృత్తిక, విభాషకుకూడ అవకాశము కలిగెడిది. అట్లు చేయరాదని ప్రస్తుత సూత్రము వలన నియమింపబడుచున్నది.]

తరువాతి మూడు లక్ష్యములందును పూర్వశబ్దములు దీర్ఘాంతములు. తెలుగున దీర్ఘమునకు సంధిలేదు. అయినను ఆమ్రేడితము పరమగునప్పుడు సంధి జరుపబడుచున్నది. ఇది యొక్కటియే దీర్ఘమునకు సంధి జరుగు స్థలము.

ఏమి + ఏమి - అనునప్పుడు 'ఏమ్యాదుల' అని మొదలయిన సూత్రమును బట్టి వైకల్పికసంధి యంగీకృతము. ప్రస్తుతసూత్రముచేత నిత్యసంధి విధింపబడి

'ఏమేమి' యనునాకేరూపము వచ్చునేమో యను భ్రమ కలుగవచ్చును. ఆ భ్రమను వారించుటకై సంధియైన రూపము, సంధికాని రూపము రెండును చూపబడినవి.

ఏగి + ఏగి - అనునప్పుడు పూర్వశబ్దముచివర అచ్చున్నది; పరమందు ఆమ్రేడితమున్నది. అయినను 'ఏగి' అనునది క్త్వార్థకమగుటచేత "క్త్వార్థంబైన ఇత్తునకు సంధిలేదు" అను నియమముప్రకారము సంధి నిషేధింప బడినది. కాబట్టి స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమము కలిగి ఏగి + య + ఏగి = ఏఁగి యేఁగి అనియైనది.

**14.** అందువగాగమంబులు దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు (బా - ౧౧)

మూర + ఎఁడు = మూరెఁడు

వీసె + ఎఁడు = వీసెఁడు

అర్థ + ఇంచు = అర్థించు

నిర్జ + ఇంచు = నిర్జించు

అందువగాగమంబులు పరంబులగునపుడు యథాసంభవముగా గ్రహించునది. రాములందు - రాములయందు - హరియందు - ఎనిమిదవది - ఎనిమిదియవది.

వ్యాఖ్య - అందు + అవగాగమంబు=అందువగాగమంబులు. 'అందు' అన్నది సప్తమీ విభక్తిప్రత్యయము. 'అవ' అన్నదిసంఖ్యకు పూరణార్థమునందు చేరునటువంటి ఆగమము. అందు అనుప్రత్యయమును, అవ యను ఆగమమును గాక మిగిలిన అపదముయొక్క తొలియచ్చు పరమందున్నచో అచ్చునకు సంధి యగు నని సూత్రార్థము.

అపదము యని యనగా పదము కానిది యని యర్థము. ప్రకృతిప్రత్యయముల కలయిక వలన నేర్పడి అర్థవంతమై యుండునది పదము. దానికి భిన్నమైనది అపదము. ప్రత్యయములు, ఆగమములు మున్నగునవి అపదములు. అవ, ఎఁడు, ఇంచు - మున్నగునవి యుదాహరణములు.

మూర + ఎఁడు - ఇచ్చట 'ఎఁడు' అనునది మానార్థము (కొలత)లో వచ్చును. కావున సంధి కాగా 'మూరెఁడు' అని యగును. 'వీసెఁడు' అను రూపము కూడ నిట్టిదే

ఇంచు అనునది ఆగమము. అర్థ + ఇంచు - అనునప్పుడు సంధియై 'అర్థించు' అని యగును. విర్జి + ఇంచు - అనునప్పుడు 'విర్జించు' అని యగును. ఆపదమున కగు సంధి కావున దీనికి 'పదమధ్యసంధి' యని పేరు కలదు.

అందు, అవ - అను ఆపదములు పరమందున్నప్పుడేమి కావలయును ? దీనికి యథాసంభవముగా (రూపము లేర్పడిన విధముగా) గ్రహింపు దని సమాధానము.

రాముల + అందు - అనునప్పుడు సంధియై "రాములందు" అనియొక రూపము; సంధి కాకుండ "రాములయందు" అని మరొకరూపము - రెండురూపములు కలుగును. ఎనిమిది + అవది = ఎనిమిదవది (సంధియైనరూపము) - ఎనిమిది యవది (సంధికానిరూపము) - అని రెండురూపములు వచ్చును. హరి + అందు= హరియందు. సంధికాదు కావున యడాగమములోడి రూపమొక్కటియే వచ్చును.

[సూరి నిర్వచనము ప్రకారము సంధి యింతటితో సమాప్తము. కావుననే యీపైని సంధి యనుపదమును వాడలేదు.]

15 కుఱు చిఱు కఱు నడు నిడు శబ్దముల అఱల కచ్చుపరంబగు నపుడు ద్విరుక్త టకారం బగు (బా - ౧౨)

కుఱు + ఉసురు = కుట్టుసురు

చిఱు + ఎలుక = చిట్టెలుక

కడు + ఎదురు = కట్టెదురు

నడు + ఇల్లు = నట్టిలు

నిడు + ఊరుపు = నిట్టూరుపు

వ్యాఖ్య - ద్విరుక్తటకారము = రెండుసారులు పలుకబడిన టకారము (ట్ + ట్). ద్విరుక్తము, ద్విత్వము, ద్విర్వచనము - అనునవి సమానార్థకములు.

అచ్చుపరమైనప్పుడు కుఱు, చిఱు - అను శబ్దముల ఱ కారమునకును కడు, నడు, నిడు - అను శబ్దముల డకారమునకును బదులుగా ద్విరుక్త టకారము వచ్చునని సూత్రార్థము.

'కుఱు' అను శబ్దమునందు చిట్టచివరి యక్షరము ఱు (ఱ్ + ఉ). 'ఉసురు' అను శబ్దము పరమైనప్పుడు ఱ కారమునకు ద్విరుక్త టకారము వచ్చును. కుట్ + ట్ + ఉ + ఉసురు = కుట్టు + ఉసురు. ఈ పిదప ఉత్వసంధి వచ్చి 'కుట్టుసురు' అని యగును.

కుఱు, చిఱు, నడు, విడు - అను శబ్దములకు ప్రాథమిక రూపములు కుఱుచ, చిఱుత, నడుము, విడుద అనునవి. సమాసవృత్తియందు వాని కడపటియక్షరములు లోపించును. అప్పు డవి తరువాతి శబ్దముతో సమసించి "కుట్టుసురు" మున్నగు విధముగా నగును. సమాసము కానియెడల కుఱుచయుసురు, చిఱుతయెలుక, నడుమిల్లు, విడుదయూతుపు మున్నగువిధముగా నుండును. సూత్రమున సూరి "సమాసము నం"దని చెప్పకున్నను, సమాసవృత్తియందు మాత్రమే యగు అంత్యాక్షరలోపము గల పదములనే ఉదాహరణములయం దిచ్చుటవలన ఈ సూత్రము సమాసవృత్తియందే ప్రవర్తించు నని చెప్పనగును.

[కడు + ఎదురు = కట్టెదురు అను ఉదాహరణమును జూచి సూరి యిక్కడ ద్విరుక్తటకార విధి వైకల్పికమని సవరించుకొన వలసినదని కొందర నిర్ణయము. ఆ నిర్ణయము భ్రాంతిమూలకము. సమాసమైనపుడు 'కడు + ఎదురు = కట్టెదురు' అనియే యగును. సమాసము కానియెడల 'కడు + ఎదురు = కడునెదురు' అని యగును. కడునడలు, కడునెండ మున్నగు ప్రయోగము లిట్టి వ్యస్త రూపములు.]

**18. చిట్టడవిఁ జిట్టి.** (ప్రౌ - ౪)

ఇయ్యది తదితరంబులకును నుపలక్షణంబని యెఱుంగునది॥ చిట్టడవి, చిట్టాముదము, చిట్టీఁదు, చిట్టుడుకు, చిట్టెలుక, చిట్టేలకి॥ ఇత్యాదులందుఁ బూర్వపదంబు చిట్టి శబ్దమని యర్థము. ఇవి సంజ్ఞావాచకములుగాన సంధి నిత్యము. హల్లు పరంబగుచో ద్విత్వంబునకు లోపంబు వైకల్పికంబు॥ చిట్టిచాప, చిటిచాప, చిట్టితాళము, చిటితాళము మొ.

వ్యాఖ్య - చిట్టడవి యను సమాసమునందలి పూర్వశబ్దము 'చిట్టి' యని గ్రహింపవలయునని సూత్రార్థము. తరువాతి వివరణమునందు 'చిట్టడవి' యందు మాత్రమే కాక 'చిట్టాముదము' మున్నగు ఇతర సమాసములందును పూర్వశబ్దము 'చిట్టి' యనునదియే యనియు, పైదానిని బట్టియే తక్కినవానిని గూడ స్వీకరింప వలయుననియు 'ఉపలక్షణము' అను మాటచే సూత్రకర్త సూచించుచున్నాడు.

చిట్టడవి - అనుచోట ఈయన యభిప్రాయమునుబట్టి 'చిట్టి + అడవి' అని రెండు పదములు గలవు. పూర్వశబ్దము ఇదంతము. కావున ఏమ్యాదులకు వలె వైకల్పిక సంధి వచ్చినచో చిట్టడవి, చిట్టి యడవి అని రెండురూపములు రావలసి వచ్చును. కాని రెండవది అనిష్టరూపము. దానిని పరిహరించుటకుగాను 'ఇవి సంజ్ఞా

వాచకములు గాన సంధి నిత్యము' అని జ్ఞాపనము చేయుచున్నారు. సంజ్ఞా వాచకము లని యనగా పేరు లని యర్థము. వ్యాకర్త యభిప్రాయమున 'చిట్టడవి' మున్నగు నవి సంజ్ఞాప్రయుక్త విశేషణములు. వానినే సంజ్ఞావాచకములని వాడుచున్నారు. కాని "చిట్టడవి యనునది ఏదో యొక యడవికి పేరు కాదు. అది యొకజాతికి చెందిన యడవికి పేరు. కావున ప్రౌఢవ్యాకర్త అనుసరించిన ప్రణాళికమునుబట్టియే యిది జాతిప్రయుక్తవిశేషణ మగునేకాని సంజ్ఞాప్రయుక్తవిశేషణము కాదు. తక్కినవాని విషయము కూడ అట్టిదే.

వాదముకొఱకు వీనిని సంజ్ఞావాచకములుగా పరిగణించి నిత్యసంధి నంగీకరించినను బాలవ్యాకర్త చెప్పిన సూత్రమునకు నష్టము వాటిల్లదు. అందు 'చిఱు' అనునది మాత్రమేకాక, కుఱు, కడు, నడు, నిడు అనునవికూడ కలవు కదా! వాని విషయమున బాలవ్యాకరణరీతి ననుసరించి ద్విరుక్తటకారము వచ్చునని యంగీకరింపక తప్పదుకదా! వానికి ప్రౌఢవ్యాకర్త యేమియు సవరణము సూచింపలేదు. అందువలన 'చిట్టడవిని' ఇత్యాదులందు 'చిఱు' అనునది పూర్వశబ్దము కాదని తిరస్కరించినను 'కుట్టుసురు' అనియున్నప్పుడు 'కుఱు'ను పూర్వశబ్దముగా గ్రహింపక తప్పుటలేదు. ఒకే విధమైన ప్రక్రియ ననుసరించుచున్న కొన్నిశబ్దములనుండి ఒక్కదానిని పృథక్కరించి, వేరొకప్రణాళిక ననుసరించుట ప్రయోజనవంతము కాదు.

మఱొకవిషయము. బాలవ్యాకర్తకు 'చిట్టి'యను శబ్దమున్నట్లు తెలియక, యిట్లు 'చిఱు' పదమును స్వీకరించెనని యనుటకు వీలులేదు. ప్రకీర్ణక పరిచ్ఛేదమున "అక్కటాదుల జడ్డకు లోపంబు విభాషనగు" అను సూత్రమునగల ఉదాహరణములలో 'చిట్టి' శబ్దమును గూడ చేర్చి చూపును. దానివిబట్టియే 'చిటి' యను రూపము కూడ నేర్పడుచున్నది. కావున ఇది గతార్థమే. ప్రౌఢవ్యాకర్త దీనిని మరల చెప్పుట యవసర మనిపింపదు.

ఇంతకును "చిట్టడవి" మున్నగునవి సంజ్ఞావాచకములు కావు. కావున "చిట్టి" యనునదే పూర్వశబ్దమైనయెడల నిత్యసంధి రావలసిన యగత్యము లేదు. బాలవ్యాకర్త విధానము శాస్త్రసమ్మత మగుటయే కాక తమిళ కన్నడ రూపసాధన విధానమున కనుకూలమై యున్నది. అనగా భాషాసంప్రదాయము ననుసరించి యున్నదని భావము.

**17. ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు.**

(బా - ౧౩)

వాఁడు + కొట్టె = { వాఁడు గొట్టె / వాఁడు కొట్టె

అపుడు + చనియె = { అపుడు సనియె / అపుడు చనియె

నీవు + టక్కరివి = { నీవు డక్కరివి / నీవు టక్కరివి

మీరు + తలఁడు = { మీరు దలఁడు / మీరు తలఁడు

వారు + పోరు = { వారు వోరు / వారు పోరు

అప్పు డిప్పు డెప్పు డను శబ్దములు నిత్యైకవచనాంతములు. వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థమని యెఱుంగునది. ఈ కార్యము కళలగు క్రియాపదములమీద - సహితము కానంబడియెడిని.

రారు + కదా = { రారు గదా / రారు కదా

వత్తురు + పోదుగు = { వత్తురు వోదురు / వత్తురు పోదురు

వ్యాఖ్య - ప్రథమావిభక్తికి పరమైన పరుషము (కచటతప) లకు గసడదవలు బహుళముగా నగునని సూత్రార్థము. ఇచ్చట పరుషములతోపాటు దంత్య చకారమును గూడ గ్రహింపవగును.

డు, ము, వు, లు - అనునవి ప్రథమావిభక్తి ప్రత్యయములు. మొదటి మూడును ఏకవచనమున, నాలుగవది బహువచనమున వచ్చును.

వాఁడు + కొట్టె - మున్నగుచోట గసడదవాదేశము వికల్పముగానై "వాఁడు గొట్టె; వాఁడు కొట్టె" అను విధముగా రెండేసి రూపములు వచ్చును. పూర్వ మందును, పరమందును రెండును తెనుగుశబ్దములే. అందువలన అచ్చికమైన ప్రథమ మీది అచ్చిక పరుషములకు గసడదవలు వికల్పముగా నగు నన్నమాట. పీవు,

మీరు, వారు - అనునవి కర్తృపదములు. ప్రథమా విభక్తిప్రత్యయము వానిచివర కనిపింపకపోయినను, "ప్రాతిపదిక సంబోధ నోక్తార్థంబులం బ్రథమ యగు" అను నియమమునుబట్టి ప్రథమావిభక్త్యంతములుగానే పరిగణింపవలయును.

రెండవయుదాహరణమందు పూర్వపదము 'అపుడు' అనునది. ఇదికూడ ప్రథమావిభక్త్యంతము కాదు. కావుననే సూరి "అప్పు డిప్పు డెప్పు డను శబ్దములు నిత్యైకవచనాంతములు" అని వివరించెను. ఇట్లనుటవలన ఆ శబ్దములు ప్రథమా విభక్త్యంతములలో సమానము లగుచున్నవి. నన్నయభట్టు కళలనుగూర్చి చెప్పుచు "సుప్" అను ప్రత్యాహారముచేత ప్రథమావిభక్తిని చెప్పియు "యదా తదా కిమే వాంశ్చ" అని "ఎప్పుడు, అప్పుడు" అను శబ్దములను మరల చెప్పెను. ఎప్పుడు, అప్పుడు అనునవి ప్రథమైకవచనాంతములేయైనచో, మొదటిలో "సుప్" అనుదాని చేతనే చెప్పినట్లైనది కదా! మరల ఏల చెప్పవలయును? అను ప్రశ్నకు సమాధాన ముగా సూరి "ప్రపంచార్థము" (= వివరణముకొఱకు) అని చెప్పెను. అనగా మొదట ప్రథమావిభక్తిని చెప్పియు "ఎప్పుడు, అప్పుడు" అనువానిని మరల చెప్పుట స్పష్టతకొఱకని యర్థము. దానినిబట్టి పై యుదాహరణములందలి "అప్పుడు" అను శబ్దము నిత్యైకవచనాంతమై ప్రథమావిభక్త్యంత మగుచున్నది.

సూత్రమున "ప్రథమమీది పరుషములకు" అని యనుట వలన ఈ కార్యము వ్యస్తపదములకే జరుగునని తెలియుచున్నది. ఇంతవరకు వికల్పమునకు ఉదాహరణ ములు చూపబడినవి.

కళ లగు క్రియాపదములమీది పరుషములకుగూడ ఈ కార్యము వికల్పముగ నగుచున్నది. 'రారు' అన్నది క్రియా పదము; కళ. 'కదా' అను శబ్దము పరమై నప్పుడు 'రారుగదా, రారుకదా' అని రెండువిధములైన రూపములు కావచ్చును. 'వత్తురు' అను క్రియాపదముపై 'పోదురు' అను పదము చేరగా 'ప' కారమునకు 'వ' కారము ఆదేశమై 'వత్తురు వోదురు' అనియు, ఆదేశము కానియెడల 'వత్తురు పోదురు' అనియు రెండురూపములు వచ్చును. ఇవి అన్యత్వమునకు ఉదాహరణ ములు.

**18. తెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవ లు రావు.** (బా. - ౧౮)

వాఁడు + కంసారి = వాఁడు కంసారి

వీఁడు + చక్రపాణి = వీఁడు చక్రపాణి

ఆయుధి + టంకృతి = ఆయుధి టంకృతి
అది + తథ్యము = అది తథ్యము
ఇది + పథ్యము = ఇది పథ్యము.

వ్యాఖ్య - పూర్వపదము తెనుగై వరపదము తత్సమమైనయెడల గసడదవా దేశము రాదని సూత్రార్థము.

'వాఁడు' అనునది తెనుగుశబ్దము. 'కంసారి' అనునది తత్సమము. (స్థిరవర్ణమునకు ముందు బిందువు తెలుగుశబ్దములలో నుండదు.) కావున ఇచ్చట కకారమునకు గకారమురాదు. అందువలన 'వాఁడు కంసారి' అనియే యుండును.

[ చక్రపాణి - అకారముతోడి చవర్గము తత్సమములందు మాత్రమే తాలవ్యము, టంకృతి - ఋవర్ణము తెలుగున గల ఋప్పదియాఱు పదములలోనిది కాదు. తథ్యము, పథ్యము - వీనియందలి థ వర్ణము వర్గయుక్కు, వర్గయుక్కులు తత్సమములందుమాత్రమే కలవు. ]

కావుననే పై యుదాహరణములందు తత్సమముల తొలి పరుషములకు గసడద వాదేశము కలుగలేదు. ఇవి అప్రవృత్తికి ఉదాహరణములు.

19. కొన్నియెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక కతపలకు గద వలు గానంబడియెడి. (ప్రౌ - ౬)

కొన్నియెడల ననఁగాఁ బ్రాసంబులం దని యర్థము॥ వీరల్గోపించిన నంతకుండుఁ జేడు, మీరాయోర్చువారు॥ ఉ. హరి ౪౮. ॥ ఇట్లు దపంబు సేయుచుండుదు॥ నిర్వ. ౫౯॥ వేదనములు॥ విజ్ఞా. ప్రా. ౪కాం. ॥ మొ.

వ్యాఖ్య - తెనుగు శబ్దములమీది తత్సమశబ్దముల యాదియందున్న క, త, ప - అను మూడు వర్ణములకును మారుగా గ, ద, వ - అను వర్ణములు వచ్చుట ప్రయోగములందు కనిపించుచున్నదని సూత్రార్థము. ఇది విధిసూత్రము కాదు. ఉన్నదని చెప్పుటయే దీని యుద్దేశము.

సూరి "తెనుఁగులమీఁది" అని మొదలిడిన సూత్రమునందు సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావని నిర్ణయించెను. ప్రస్తుతసూత్రము దానిని సవరింప సమర్థమై యున్నది.

'కొన్ని యెడల' అనుమాటను వివరించుచు "ప్రాసంబులందు" అని సూత్ర కర్త యర్థము చెప్పెను. కాని దానినట్లు పరిమితము చేయవలసిన యవసరము లేదు ప్రాసంబులందు పైతము ప్రయోగించువారు తక్కినచోట్ల ప్రయోగించుటకు సంకోచింపరు. అటుకాక ప్రాసనిర్బంధముచే అట్టిప్రయోగములను జేసిరని యన్నచో కవుల సమర్థతను శంకించినట్లే యగును. అది కూడని పని. తక్కినచోట్ల నున్న ప్రయోగములను లేఖకులో పాఠకులో ముద్రాపకులో, సులభముగా దిద్దుటకు వీలుండుటచే దిద్దియుందురు. కావున, ఒక ప్రయోగము యొక్క సుస్థితిని నిర్ణయింపవలయునన్న పద్యములయందలి ప్రాసస్థానములను, యతిస్థానములను మిక్కిలి తోడ్పడును. ఇట్టిచోట్లగల రూపములను దిద్దుట శ్రమసాధ్యము. కావున, ప్రాసములందు కనిపించు రూపములను ప్రామాణికములుగా గ్రహింపవచ్చును. కాని, వీనిని ప్రాసములకు మాత్రమే పరిమితము గావింపవలసిన యవసరము లేదు.

పేరల్ + కోపించిన - ఇచ్చట పూర్వమున్నది 'పేరల్' అను తెలుగు శబ్దము. 'పేరలు' అను బహువచనరూపమున చివరి ఉత్వము లోపింపగా మిగిలి నటువంటిది. పరమందు 'కోపించిన' అను క్రియారూపము గలదు. 'కోపము' అను తత్సమముపై 'ఇంచు' అని చేరి ఈ క్రియాధాతు వేర్పడినది. కావున, ఇక్కడి 'కో' అను వర్ణము సాంస్కృతికము. తెలుగు శబ్దమునకు పరమైన యీ 'కో' లోని క కారము గ కారముగా మారి 'గోపించిన' అని యైనది. కావున సూరి చెప్పిన 'రావు' అను విశేష మిక్కడ ప్రవర్తింపలేదు.

ఇట్లు + తపంబు - ఇందును పూర్వమున్నది 'లు' అను బహువచనమును గలిగి యున్న తెలుగుశబ్దము; పరమందున్నది తత్సమము. మొదటి వర్ణమైన త కారము ద కారమయ్యెను. ఇచ్చటను గసడదవాదేశము కలిగిన దనక తప్పదు.

వేయి + పణములు - పూర్వమున్నది తెలుగు శబ్దము. సామాసిక కార్యము కలిగి, అంత్యవర్ణమునకు లోపమై 'వే' అని యైనది. ఆ పిమ్మటిది తత్సమ శబ్దము. అందు మొదటనున్న 'ప' వర్ణము 'వ' వర్ణముగా మారినది.

భారతమునందు "ఎంత గుమతులైన" అని తిక్కన ప్రయోగము గలదు. ప్రౌఢవ్యాకర్త దానిని గుర్తింపలేదు. అదియు నిట్టిదే. 'ఎంత' అను తెనుగు శబ్దముపై "కుమతులు" అను తత్సమము వచ్చినప్పుడు తొలి క వర్ణమునకు గ వర్ణమాదేశ మయ్యెను. కావున దీనిని గూడ లక్ష్యముగా స్వీకరింప వచ్చును.

**20. ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు.**

**(బా - ౧౩)**

కూర + కాయ = కూరగాయలు

కాలు + చేయి = కాలుసేతులు

టక్కు + టెక్కు = టక్కుడెక్కులు

తల్లి + తండ్రి = తల్లిదండ్రులు

ఊరు + పల్లె = ఊరు వల్లెలు

వ్యాఖ్య - ద్వంద్వసమాసమునందు పూర్వశబ్దముమీది పరుషములకు గసడద వాదేశము కలుగునని సూత్రార్థము.

ఉభయపదప్రాధాన్యము గల సమాసము ద్వంద్వము. పూర్వపదమును, పర పదమును అచ్ఛికములే యైనచో అచ్ఛికద్వంద్వము. ప్రస్తుతసూత్రము అచ్ఛికద్వంద్వ ములందు మాత్రమే ప్రవర్తించును. అందువలన "మాతాపితలు" మున్నగు సాంస్కృతిక సమాసములందు ఈ మార్పు గలుగదు.

కూర + కాయ - ఇచ్చట రెండును తెలుగు పదములు. రెండింటికిని సమ ప్రాధాన్యము గలదు. కావున సమాసమైనప్పుడు క కారమునకు గ కారము వచ్చును. కూర + గాయ - రెండును గలిసినపుడు బహుత్వము నొందును. కాన చివర బహు వచన ప్రత్యయమైన 'లు' వర్ణము చేరవలయును. అప్పుడు "కూరగాయలు" అని యగును.

కాలు + చేయి - ఇచ్చటి రెండును తెలుగు పదములే. రెండింటికిని సమ మైన ప్రాధాన్యమే కలదు. కావున రెండవ పదమునందలి మొదటి యక్షరమైన 'చే' యనునది 'సే' యని మారును. రెండును కలియునపుడు బహువచనము వచ్చును. "చేయి" అనుదానికి బహువచనము "చేతులు". కావున "కాలు + చేయి" అని యున్నప్పుడు "కాలుసేతులు" అని ద్వంద్వసమాస మేర్పడును.

అట్లే తక్కినవానియందును పరుషములకు బదులుగా గసడదవలు వచ్చును. ఇవి ప్రవృత్తికి ఉదాహరణములు.

**21. కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీఁది చతపలకు సరసలు గానంబడవు.**

**(ప్రౌ - ౬.)**

అంద చందములు॥ అని. ౫ ఆ॥ అప్పచెల్లెండ్రు॥ నిర్వ. ౩ఆ॥ కండతుండెములు॥ రామా॥ రాకపోకలు॥ భాగ. ౧౦ స్క-౦.॥ మొ.

వ్యాఖ్య - ద్వంద్వసమాసమునందు తొలిపదముమీఁద వచ్చు చ త ప అను వర్ణములకు మారుగా రావలసిన స ద వ అను వర్ణములు కొన్ని ప్రయోగములందు వచ్చుట లేదని సూత్రార్థము.

చిన్నయసూరి యిట్టియెడల గసడదవాదేశము కలుగునని చెప్పెను. దానిని నిత్యవిధిగనే పరిగణింపవలయును. అయినప్పటికిని 'ఆగు'నని చెప్పుటకును నిత్యమని చెప్పుటకును భేదము కలదని యీవరకే ప్రసంగమునుబట్టి చెప్పుకొని యుంటిమి. నిత్యమని యన్నప్పుడు ఎట్టిపరిస్థితులందును ప్రవృత్తికి మారుపాటు రాదు. 'అగునని' యన్నప్పుడు మరొక యభ్యంతరము కనిపింపనంతవరకే ప్రవృత్తి గలదని యర్థము. కావున ద్వంద్వసమాసమునందలి గసడదవాదేశ విషయమున సూరియే కొంత సడలింపు సూచించుచున్నా రనవలయును.

ప్రౌఢవ్యాకర్త దీనిని గుర్తించి, ప్రయోగ పురస్సరముగా నిరూపించు చున్నాడు.

అందము + చందము - ఇచ్చట రెండును తెలుగు పదములు. కావున అచ్చిక ద్వంద్వము. మొదటిపదముమీఁద వచ్చిన, అనగా రెండవపదము మొదటనున్న చవర్ణమునకు సవర్ణము రావలసియున్నను రాలేదు: అట్లు రాకుండుటచే 'అందచందములు' అనియే యుండిపోయెను.

['ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబసమంబగు, అగుచో నా మువర్ణకంబునకు లోపంబగు'. అను ప్రౌఢవ్యాకరణము నందలి (సమాస-౨౯) సూత్రమునుబట్టి పూర్వపదమైన 'అందము' అను దానియందలి ము వర్ణకమునకు లోపము కలుగునని గ్రహింపవలయును. పూర్వశబ్దము మువర్ణకాంతమైన నెట్టుండునో బాలవ్యాకరణము చెప్పలేదు. ద్వంద్వమందలి పూర్వశబ్దము స్త్రీ సమమై యుండునని మాత్రమే తెలిపి అట్టివానినే యుదాహరించెను.]

అప్ప + చెల్లెలు - రెండు శబ్దములును అచ్చికములే, ద్వంద్వమైనప్పుడు రెండవపదము మొదటనున్న 'చె' యనునది 'సె' యని మారి 'అప్పసెల్లెండ్రు' అని కావలయును. కాని యుదాహృత ప్రయోగమునందు అట్టి యాదేశము కలుగలేదు. బహువచనమున 'చెల్లెలు' అను శబ్దము 'చెల్లెండ్రు' అని యగును. కావున అప్ప + చెల్లెలు - అని యనునప్పుడు అప్పచెల్లెండ్రు అని యగును.

[ప్రౌఢవ్యాకరణమున సమాసపరిచ్ఛేదమునందలి ౨౮ వ సూత్రమును బట్టి పూర్వపదమైన 'అప్ప' అను దాని యంతిమస్వరమునకు దీర్ఘముకూడ రావచ్చును. అట్లు వచ్చుటచే 'అప్పాచెల్లెండ్రు' అను రూపముకూడ ఏర్పడును.]

కంప + తుండెము–అనునవి 'కందతుండెములు'గా సమసించెను. రాక + పోక – అనునవి 'రాకపోకలు' అని సమసించెను. ఈ రెండుచోట్లను గూడ తకార పకారములకు రావలసిన దకార వకారములు రాలేదు. కావున, ఇదియు నిత్య విధి కాదనియు, తఱచుగా గసడదవాదేశమే కలిగినను కొన్నియెడల మాత్రము ఆదేశము కలుగని రూపములుకూడ కలవనియు సూచించుటయే యీసూత్ర ప్రయోజనము.

**22** ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు.

(బా–౧౬)

పూచెను+కలువలు=పూచెను గలువలు
తోఁచెను+చుక్కలు=తోఁచెను జుక్కలు
చేసెను+టక్కులు=చేసెను డక్కులు
నెగడెను+తమములు=నెగడెను దమములు
మొగిడెను+పద్మము=మొగిడెను బద్మము

వ్యాఖ్య – ద్రుతమునకు ప్రకృతియైనది ద్రుతప్రకృతికము. దానిమీద వచ్చు పరుషములు నిత్యముగా సరళము లగునని సూత్రార్థము. 'దంత్య తాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు' అను నియమమునుబట్టి పరుషములందు దంత్య చకారమును, సరళములందు దంత్యజకారమునుగూడ గ్రహింపవలయును.

పూచెను + కలువలు – అని యున్నప్పుడు పూర్వ పదము ద్రుతప్రకృతికము. పరమందు 'క' యున్నది. కావున ప్రస్తుత సూత్రమునుబట్టి పరుషమగు కవర్ణమునకు బదులుగా సరళమగు గవర్ణము వచ్చి 'పూచెను గలువలు' అని యగును. తక్కిన యుదాహరణములందు నట్లే పరుషముల స్థానమున సరళములు వచ్చును.

**23.** ఆదేశసరళములకు ముందున్న ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులు విభాష నగు. (బా–౧౭)

సంశ్లేషం బనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట.

పూచెను గలువలు = { పూచెం గలువలు / పూచెఁ గలువలు / పూచెన్గలువలు }

తోఁచెను జుక్కలు = { తోఁచెం జుక్కలు / తోఁచెఁ జుక్కలు / తోఁచెన్జుక్కలు }

చేసెను డక్కులు = { చేసెం డక్కులు / చేసెఁ డక్కులు / చేసెన్డక్కులు }

నెగడెను దమములు = { నెగడెం దమములు / నెగడెఁ దమములు / నెగడెన్దమములు }

మొగిడెను బద్మము = { మొగిడెం బద్మము / మొగిడెఁ బద్మము / మొగిడెన్బద్మము }

పక్షంబున స్వత్వంబగు. స్వత్వంబనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతి భావము.

వ్యాఖ్య - పూర్వసూత్రమునుబట్టి పరుషములస్థానమున వచ్చిన సరళములకు ఆదేశసరళము లనిపేరు. ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బదులుగా పూర్ణానుస్వారము గాని, అర్ధానుస్వారము గాని, సంశ్లేషముగాని విభాషగా వచ్చును. సంశ్లేష మనగా ద్రుతము మీదిహల్లుతో కూడికొనుట.

[ ఈ సూత్రమునందు పర్యాయప్రవృత్తి, అప్రవృత్తి కలవు. ఒక సూత్రము చేత విధానములు పెక్కులున్నప్పుడు, ఒక్కొక్కటి యొక్కొక్కమారే ప్రవర్తించు నెడల పర్యాయప్రవృత్తి యందురు. ఇట్టియెడల 'విభాష' అన్న పదమును వాడుట కనిపించును. ]

'తోఁచెను జుక్కలు' అని యున్నప్పుడు 'జు' అనునది 'చు' స్థానమున వచ్చినది: కావున ఆదేశసరళము. దీనికి ముందున్న ద్రుతమునకు పూర్ణబిందువు వచ్చి

నచో "తోఁచెం జొక్కాలు" అని యగును. అర్ధబిందువు వచ్చినచో "తోఁచెఁ జొక్కాలు" అని యగును. సంశ్లేషము వచ్చినచో "తోఁచెన్జొక్కాలు" అని యగును. విభాషగా నని యనుటచేత బిందు సంశ్లేషములు రాని రూపములుకూడ నుండవచ్చును. పక్షంబున (బిందు సంశ్లేషములు రానియెడల) ద్రుతమునకు స్వత్వము వచ్చును. స్వత్వమనగా ప్రకృతిభావము: అనగా ఉన్నది యున్నట్లే ఉండిపోవుట యని యర్థము. ప్రకృతిభావము కలిగినపుడు "తోఁచెను జొక్కాలు" అని యుండును. ఇట్లే తక్కిన యుదాహరణముల నూహించుకొనవచ్చును.

"నవేతి విభాషా" యని విభాషకు నిర్వచనము. నిషేధమును, వికల్పమును కలిసియున్నయెడల విభాష యని యందురు. సూత్రము ప్రవర్తించుటవలన నొక రూపము, ప్రవర్తింపక పోవుటవలన నొకరూపము వికల్పమునందు కలుగును. పైని చూపిన తోఁచెం జొక్కాలు, తోఁచెఁ జొక్కాలు, తోఁచెన్జొక్కాలు - అను మూడును సూత్రము ప్రవర్తింపగా ఏర్పడిన రూపములు: తోఁచెను జొక్కాలు - అనునది సూత్రము ప్రవర్తింపనియప్పు డేర్పడిన రూపము. ఇంతవరకు వికల్పమునకు లక్ష్యము.

రాబోవు సూత్రములందు తాను, నేను - శబ్దముల విషయమునను ప్రాతాది కార్యములందును ద్రుతమునకు సంశ్లేషమును నిషేధించును. ఇట్లు నిషేధమును, వికల్పమును కూడి యుండుటచేతనే సూత్రమున 'విభాష' యను పరిభాష వాడబడినది.

**24. ద్రుతంబునకు పరుషస్థిరంబులు పరంబులగునపుడు లోప సంశ్లేషంబులు విభాష నగు.** (కా—౧౮)

వచ్చెను+గోవులు = { వచ్చె గోవులు / వచ్చెన్గోవులు / వచ్చెను గోవులు }

మెఱసెను+ఖడ్గము = { మెఱసె ఖడ్గము / మెఱసెన్ఖడ్గము / మెఱసెను ఖడము }

వ్యాఖ్య - పరుషాక్షరములు కాని, స్థిరాక్షరములు కాని పరమందున్నపుడు ద్రుతమునకు లోపముకాని, సంశ్లేషముకాని విభాషగా నగునని సూత్రార్థము.

"అదర్శనం లోపః" అనగా కనిపింపకుండ పోవుటకు లోపమని పేరు.

వచ్చెను + గోవులు - గకారము పరళము, ముందున్న ద్రుతమునకు లోపము వచ్చినచో 'వచ్చె గోవులు' అని యగును. సంశ్లేషము వచ్చినచో "వచ్చెన్గోవులు" అని యగును. ఈ రెండును సూత్రము ప్రవర్తింపగా ఏర్పడిన రూపములు. ఇవి పర్యాయప్రవృత్తికి లక్ష్యములు. విభాష యనుటవలన సూత్రము ప్రవర్తింపకుండ నుండవచ్చును. అట్టియెడల "పక్షంబున స్వత్వంబగు" అన్న నియమమును బట్టి "వచ్చెను గోవులు" అను రూపమేర్పడును. స్థిరవర్ణములు పరమగునప్పుడు కూడ ఇట్లే మూడు రూపములు కలుగును.

**25.** వర్గయుక్పరళములు పరములగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి. (బా-౧౫)

వచ్చెను + ధాత్రీపతి = వచ్చెం ధాత్రీపతి

పాడెను + గంధర్వుఁడు = పాడెం గంధర్వుఁడు

కన్ + దోయి = కందోయి

వ్యాఖ్య - వర్గయుక్కులుగాని, పరళములుగాని పరములగునపుడు కొన్ని చోట్ల ద్రుతమునకు బదులుగా బిందువున్న యగుచున్నదని సూత్రార్థము.

వర్గయుక్కు లనగా వర్గాక్షరములందు ప్రతివర్గమున నున్న రెండవ నాలుగవ యక్షరములు. అవి యివి - ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ.

వచ్చెను + ధాత్రీపతి - ఇచ్చట ద్రుతమునకు వర్గయుక్కు పరమైనది. కావున ద్రుతమునకు ఆదేశముగా పూర్ణబిందువు వచ్చి "వచ్చెం ధాత్రీపతి" యని కూడ కావచ్చును. పూర్వసూత్రమునుబట్టి యైనచో వచ్చె ధాత్రీపతి, వచ్చెన్ధాత్రీపతి, వచ్చెను ధాత్రీపతి - యని మూడురూపము లేర్పడినవి; ప్రస్తుత సూత్రమువలన నేర్పడిన పూర్ణబిందువుతోడి రూపము నాల్గవది.

కన్ + దోయి - అని యున్నపుడు పరళము (దో) పరముందుండుటచేత ద్రుతమునకు పూర్ణబిందువు వచ్చి 'కందోయి' అని యగును. పూర్వసూత్రముచేత లోప సంశ్లేషములు రావచ్చును గాని "అంట యిఁక మఁడు" అని మొదలయిన బాలవ్యాకరణ సూత్రము(సంధి - 22) నుబట్టి నదితొలిహ్రస్వము మీద ద్రుతమునకు

లోపము రాదు. కావున సంశ్లేషముతో "కన్దోయి" అను రూపము మాత్రమే రావచ్చును.

[వర్గయుక్కులు పోగా మిగిలిన స్థిరవర్ణములు పరమైనప్పుడు ద్రుతము నకు పూర్ణబిందువు రాదని తెలుచున్నది.].

౨౯. అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు. (బా—౨౦)

వాఁడు వచ్చెన్ — వాఁడు వచ్చె — వాఁడు వచ్చెను॥ ఈ లోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితం బయి యుండు. గుర్వవసాయి యగు పద్యంబు తుదను స్వత్వంబు లేదు॥ అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్॥

వ్యాఖ్య — అవసానము=వాక్యము చివర. వాక్యము చివర నున్న ద్రుతము యొక్క స్వరమునకుగాని, ద్రుతమునకుగాని లోపము బహుళముగా నగునని సూత్రార్థము.

'వాఁడు వచ్చెను' అను వాక్యమున అవసానమందు 'ను' అను ద్రుత మున్నది. ద్రుతముయొక్క (న్ + ఉ) స్వరమునకు లోపము కలుగగా 'వాఁడు వచ్చెన్' అని యగును. ద్రుతమునకు లోపము కలిగినప్పుడు 'వాఁడు వచ్చె' అని యగును. ఈలోపము పద్యాంతములయం దైనచో, ఆ యా పద్యముల గణములనుబట్టి యుండును.

గురు + అవసాయి = గుర్వవసాయి = గురువుతో ముగియునది. పద్యముచివర గురు వుండవలసినయెడల ద్రుతము స్వత్వరూపముతో నుండదు. అట్లున్నయెడల ద్రుతము లఘువగుటవలన ఛందోనియమము తప్పును. 'అతిశయ ముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్' అనునది కందపద్యపాదము. కందపద్యము నందు రెండవ నాలుగవ పాదములచివర గురువే యుండవలయును. ఇట్టి యెడల "సేవను" అన్నట్లు స్వత్వరూప మున్నచో ఛందోనియమము తప్పును. కావున ద్రుతస్వరమునకు లోపముచేయుట ఆవశ్యకమైనది.

సూత్రమునందు బహుళమని యుండుటచేత ప్రవృత్తికి పైత మిచ్చుట నవ కాశము కలుగుచున్నది. చిన్నయసూరి కంఠోక్తిగా చెప్పకున్నను, అచ్చు పరమై నప్పుడెల్ల ద్రుతస్వరమునకు లోపము జరిగిన రూపములనే ప్రదర్శించెనమట వాస్త

వము. ఉదాహరణసామర్థ్యమునుబట్టి యిచ్చట నొకసూత్రమును నిర్మించుకొనుట యవసరము.

'అచ్చు పరంబగునపుడు ద్రుతస్వరంబునకు లోపము నిత్యము'

పై నియమమునుబట్టియే 'వచ్చున్ + ఇపుడు' (బా: సంధి - ౪) మున్నగుచోటి లక్ష్యములు సిద్ధించును.

[ఇంతేకాక 'వానిని + అరసి' మున్నగువిధముగా నున్నప్పుడు పూర్వ పదము ద్రుతాంతము కావున సంధి కారాదు; అనగా చివరి 'ని' వర్ణమునకు లోపము కలుగదన్నమాట. అట్టియెడల 'ఇ + అ' అను రెండు స్వరములు సన్ని కర్ష నొందును. ఇత్వమునకు నిత్యసంధి లేకపోవుటచేత 'యడాగమప్రాప్తిచేత అనిష్టరూపము కలుగవలసి వచ్చును. కాని పైని చెప్పికొన్న నియమము వలన ఇత్వలోపము కలుగగా 'వానిన్ + అరసి' అనియై, సన్నికర్షనొంది 'వాని నరసి' అనియగును. ఇది సంధి కాని రూపము. 'చేతను + ఇచ్చెను' మున్నగుచోట్ల సైతము సంధి కాదు. పై నియమమునుబట్టి ద్రుతస్వరమునకు లోపము కలిగి 'చేతన్ + ఇచ్చెను' అనియై సన్నికర్షవలన 'చేత నిచ్చెను' అని యేర్పడును ఇదియు సంధి కాని రూపమే.]

## 27. కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడిని.

(బా - ౨౧)

అదియునున్గాక - దివంబునుం బోలె.

వ్యాఖ్య - కొన్ని ప్రయోగములందు ద్రుతముపై మరల నకారము వచ్చుచున్న దని సూత్రార్థము. 'నకారంబు ద్రుతంబు' అని చెప్పుటచేత, ఇచ్చటసైతము ద్రుతమునే గ్రహింపవలయును. కేవల నకార ముద్దిష్టము కాదు. "కానంబడియెడి" నని చెప్పుటచేత ప్రయోగము లున్నవని యంగీకరించుటయే కాని యిట్లు ద్రుతముపై నకారము నుంచవలయునని సూరి విధించుట లేదు.

అది + కాక - అని యుండగా సముచ్చయార్థక మగు "ఉను" చేరి అది + ఉను + కాక = అదియునుగాక అని యగును. కాని సముచ్చయార్థకముపై మరల ద్రుతము చేరుటచేత అదియును + ను + గాక = అదియునుంగాక అని మరొక రూపముకూడ ఏర్పడుచున్నది. అట్లే దివంబును + పోలె = దివంబునుబోలె అని కావలసియుండగా, మరల ద్రుతము వచ్చుటచేత దివంబును + ను + బోలె = దివంబు నుంబోలె అను రూపముకూడ కొన్నియెడల కనబడుచున్నది.

ద్రుతమునకు అర్ధబిందువును, సంశ్లేషమును వచ్చిన రూపములుకూడ కావచ్చును - అదియుఁగాక, అదియునుగాక: దివంబునుఁ బోలె, దివంబునుఁబోలె.

**28. అఁట యిఁక చుఁడు శబ్దంబులందప్ప నుడితొలిహ్రస్వంబుమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు. (బా - ౨౨)**

ముంగొంగు - క్రొంబసిఁడి - కన్దోయి.

వ్యాఖ్య - అఁట, ఇఁక, చుఁడు - అను మూడుశబ్దములందు మాత్రమే మాటకు మొదటగల హ్రస్వాక్షరముపై ఖండబిందువు కలదు: ఈ మూడు పదములుదప్పగాక మిగిలిన యే పదమునందును తొలిహ్రస్వముపై అరసున్న యుండరాదు. పదమున కాదినున్న హ్రస్వముమీఁది ద్రుతమునకు లోపము చేయరాదు - అనగా, వీలునుబట్టి అట్టిచోట పూర్ణబిందువునుగాని సంశ్లేషమును గాని చేయవలయునని సూత్రతాత్పర్యము.

[పరిమాణార్థమునందు వచ్చు 'ఎఁడు' అనునది ఆగమముగుటచే అపదము. అట్లే అభావార్థమునందు వచ్చు 'ఇఁడి' అన్నది కూడ, పదములు కాకపోవుటచే అచ్చట తొలిహ్రస్వముమీద ఖండబిందు వుండుట కాక్షేపము లేదు.]

ముందు + కొంగు - బాలవ్యాకరణమునందలి ముప్పది యారవ సూత్రమున "సమాసంబున ప్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు" నని యుండుటచేత "ము + కొంగు" అని యగును. "లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమం బగు" నను తరువాతి సూత్రముచేత "ము + ను + కొంగు" అని యగును. ద్రుతముమీది పరుషము సరళముకాగా "ము + ను + గొంగు" అని యగును. "ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాష నగు" నని యునుటచేత "ముంగొంగు, ముఁగొంగు, మున్గొంగు" అని మూడురూపములు రావలసియున్నవి. ప్రస్తుతసూత్రమునుబట్టి నుడి తొలి హ్రస్వముమీద ఖండబిందువు లేదు. కావున 'ముఁగొంగు' అను అనిష్టరూపము పరిహరింపబడుచున్నది.

ప్రాఁతాదికార్యములయందు ద్రుతమునకు సంశ్లేషము లేదు. కావున 'మున్గొంగు' అను రూపముకూడ అసాధువే యని తెలినది. ఇంక మిగిలినది పూర్ణబిందువుతోడి 'ముంగొంగు' అను రూపమొక్కటియే.

క్రొత్త+పసిఁడి–అను పదములు సమసింపగా 'క్రొంబసిఁడి' అను రూప మేర్పడును. ఇచ్చటను మొదటి మాటకు మొదట హ్రస్వమే యుండుటచేత ద్రుత మునకు బదులుగా అరసున్న నిల్చుటకు వీలులేదు; క్రొత్తశబ్దము ప్రాఁతాదులలోనిదే కావున ద్రుతమునకు సంశ్లేషముకూడ వచ్చుటకు వీలులేదు. ఇట్లు అనిష్ట రూపములు పరిహరింపబడగా మిగిలిన "క్రొంబసిఁడి" యనునది యొక్కటే సాధురూపము.

కన్+దోయి–ఇచ్చట ద్రుతమునకు సరళము పరమైనది. "ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాషనగు"నను సూత్రమును బట్టి 'కన్దోయి' 'కదోయి' అను రెండురూపములు రావలసియున్నవి. ప్రస్తుత సూత్రము "కదోయి" అను అనిష్టరూపమును వారించుచున్నది. "వర్గయుక్సరళ ములు పరము లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడి యెడి"నను సూత్రమునుబట్టి "కందోయి" అని బిందుసున్నతోడి రూప మేర్పడు చున్నది.

[సూరి 'కన్దోయి' యను రూపమును విశిష్టదృష్టితో ప్రదర్శించె ననుట గమ నింపదగిన యంశము. 'కన్' అని యున్నప్పుడు చివరి నకారము నిజమునకు ద్రుతముకాదు. అది శబ్దమునందు సహజముగా నున్నదే. అందువలన, కొందరు దానినట్లే గ్రహింపవలయునని 'కన్' అను రూపమును ప్రాతాదులలో చేర్ప వలయు నని కుతూహలపడుచుందురు. కాని అక్కడ సంశ్లేషరూపము అంగీ కార్యము కానందువలన 'కన్దోయి' అని వచ్చుటకు వీలులేదు. కావున యథార్థ మెట్లున్నను 'కన్ను, కను, కన్' అనువానిలోని నవర్ణమును, పూర్వప్రయోగముల బలమునుబట్టి సూరి ద్రుతముగనే నిర్ధారించి వ్యవహరించుచున్నా డనుట స్పష్టము.]

**29. తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.**

(బా - ౨౩)

తాను+చదివె=తాఁ జదివె; తాను జదివె

తాను+వినె=తా వినె; తాను వినె

దీర్ఘంబు మీఁదిది గాన దీనికి నెఱసున్న లేదు.

వ్యాఖ్య - తాను, నేను అను శబ్దములు రెండును ద్రుతప్రకృతికములు. వీనికి చివరనున్న 'ను' వర్ణము ద్రుతము. దీనికి ఆదేశసరళములు పరములైనప్పుడు బిందుసంశ్లేషములును, పరుషస్థిరములు పరములైనప్పుడు లోపసంశ్లేషములును, విభా

షగా రావలసియుండగా - ప్రస్తుతసూత్రముచేత సంశ్లేషము నిషేధింపబడినది. అనగా ఆదేశసరళములు పరమైనపుడు బిందువును, సరళస్థిరములు పరమైనపుడు లోపమును మాత్రమే కలుగునని యర్థము.

[పైరెండు (బా. సంధి 17, 18)సూత్రములందును 'విభాష' యని వాడుట చేతనే యిచ్చట 'లేదు' అని నిషేధాత్మకమైన వ్యవస్థ కల్పించుట కవకాశము కలిగినది.]

తాను + చదివె – ద్రుతప్రకృతికముమీది పరుషమునకు బదులుగా సరళము వచ్చి 'తాను + జదివె' అని యగును. ఇప్పుడు ద్రుతమునకు బిందువు వచ్చి 'తాఀ జదివె' అని యగును. 'పక్షంబున స్వత్వంబగు' నను నియమమునుబట్టి బిందువు రానియెడల 'తాను జదివె' అని ప్రకృతిభావముతోనే యుండును. ఇట్లే "తాను + వినె" అని యున్నప్పుడు ద్రుతమునకు లోపము వచ్చి 'తా వినె' అని యొకరూపము, స్వత్వము వచ్చి 'తాను వినె' అని యొకరూపము నగును. ఈ సూత్రముచేత సంశ్లేషముతోడి అనిష్టరూపములు పరిహరింప బడినవి.

'తాను జదివె' అని యున్నప్పుడు ద్రుతమునకు అరసున్నతో పాటుగా నిండు సున్నకూడ కలుగవచ్చునేమోయను భ్రాంతి కలుగవచ్చును. "దీర్ఘముమీఁద పాధ్య పూర్ణము లేదు" అను (బాల. సంజ్ఞ - 15)సూత్రమునుబట్టి నిండుసున్న కలుగుటకు వీలు లేదు. అదే విషయమును "దీర్ఘముమీఁదిది గాన దీనికి నెఱసున్న లేదు." అని తెల్పి సూరి జ్ఞాపనము చేసెను.

ఇట్లే 'నేను' శబ్దమునకు నేఀ జదివితిని; నేను జదివితిని: నే వింటిని: నేను వింటిని - అను విధముగా రూపములేర్పడును.

## 30. సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు (బా - ౩౮)

ఎల్లయర్థములు – ఎల్ల కలుషములు॥ సర్వ పర్యాయంబయిన యెల్లశబ్దంబు ద్రుతాంతంబగున యవ్యయంబు. దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు.

వ్యాఖ్య - సమాసమునందు పూర్వపదముయొక్క చివరనున్న ద్రుతమునకు లోపము కలుగు నని సూత్రార్థము.

సంస్కృతమున గల సర్వశబ్దమునకు తెలుగున సమానార్థకమగు శబ్దము 'ఎల్లన్' అనునది, ఇది ద్రుతముతో అంతమగు అవ్యయము. లింగవిభక్తి వచన

శూన్యమైన దానిని అవ్యయ మని యందురు. అనగా లింగమునుబట్టి కాని విభక్తిని బట్టి కాని, వచనమునుబట్టి కాని మార్పుచెందవిదని యభిప్రాయము.

ఇది ద్రుతాంత మగుటచేత 'ఎల్లన్' అని యుండును. దీనికి పరమందు 'అర్థములు' అను శబ్దమున్నచో, ప్రస్తుతసూత్రముచేత ద్రుతమునకు లోపము కలిగి 'ఎల్ల + అర్థములు' అనియై యడాగమము కలుగుటచేత "ఎల్లయర్థములు" అని యగును. అట్లే "ఎల్లన్ + కలుషములు" అని యున్నప్పుడు ప్రస్తుత సూత్రముచేత ద్రుతమునకు లోపము వచ్చి 'ఎల్ల కలుషములు' అని యగును. ఎల్ల యర్థములు, ఎల్ల కలుషములు_అనునవి కర్మధారయ సమాసములు.

"ఎల్లన్" అను శబ్దమును విశేష్యమునకు ముందు వ్యస్తముగా ప్రయోగింప రాదు. ముందు విశేష్యము వచ్చి తరువాత ఎల్ల శబ్దము రావచ్చును. అర్థములెల్లన్; కలుషములెల్లన్–అనునట్లుగా అప్పటి రూపము లుండును. ఇట్టియెడల ద్రుతమునకు లోపప్రసక్తి లేదు.

**31. సర్వపర్యాయం బయిన యెల్ల శబ్దమునకు సప్తమియు, అసమాసంబున విశేష్యములకు ముందు ప్రయోగంబునుం జూపట్టెడు.** (ప్రౌ–౧)

ఎఱుఁగ సకలశాస్త్రంబుల నెల్లయందు। నధికసాత్త్వికుఁ డస్త్రీకుఁ డనఁగ జనులు॥ భార. ఆది. ౨౮॥ ఎల్ల యందును దావసియించుటెల్ల। యదియుఁ దనయందు వసియించు టంద్రు వాసు॥ దేవుఁడను పేరి కర్థంబు॥ భార. ఉ. ౩.౨॥ నేనొకండనే భిక్షానకున్ వత్తునో। యెల్లన్ శిష్యులఁ గొంచు వత్తునో॥ భీమ. ౨౮॥

వ్యాఖ్య – 'ఎల్ల' అనుదానిపై 'అందు' అను సప్తమీ విభక్తి ప్రత్యయము కలదు. కావున అది అవ్యయము కాజాలదనియు, సమాసము కాని సమయమున సైతము విశేష్యమునకు ముందు ప్రయోగించుట కలదనియు ప్రౌఢవ్యాకర్త యభిప్రాయము.

'లింగ విభక్తి వచన శూన్యాని అవ్యయాని' అను నిర్వచనమునుబట్టి లింగము కాని, విభక్తికాని, వచనముకాని యుండగూడదుకదా। ఎల్ల శబ్దముపై 'అందు' అను సప్తమీ విభక్తి ప్రత్యయము చేరి 'ఎల్లయందు' అని యయ్యెను గావున దీనిని అవ్యయ మనుటకు వీలు లేదనునది మొదటి విషయము. 'అందు' అనునది సప్తమీ విభక్తి ప్రత్యయ మన్నమాట నిజమే. కాని 'అక్కడ' అను నర్థమున 'అందు' అను శబ్దముకూడ కలదు. 'ఇక్కడ' అను నర్థమున 'ఇందు' అనియు, 'ఎక్కడ' అను

వర్థమున 'ఎందు' అనియు దానితో పోలిక గలిగిన శబ్దములు. 'అందలి వారు' మున్నగుచోట్ల వచ్చు 'అందు' ప్రదేశ వాచకమగు శబ్దమేకాని విభక్తి ప్రత్యయ మగు[illegible]కు వీలు లేదుకదా! అథర్వణకారికావళి "సాశ్రయానాశ్రయాపిస్యాత్ తత్రార్థ గతసప్తమీ" అనివ్రాసి సప్తమ్యర్థముల 'అందు' అను శబ్దము (అనాశ్రయము)ను ప్రత్యయము (సాశ్రయము)ను కూడ గుర్తించెను. కావున, పై యుదాహరణముల యందలి 'ఎల్లయందు' అను సమాసమున పూర్వశబ్దము 'ఎల్లన్' అనియు ఉత్తర శబ్దము 'అందు' అనియు నిర్ణయింపవచ్చును. రెండును సమసించునపుడు ద్రుతమునకు లోపమును, పరస్వరమునకు యడాగమమును కలిగి 'ఎల్ల + య + అందు = ఎల్లయందు' అని యగును.

[ ఇంకొక విషయము. 'ఎల్లన్' అనుదానిపై 'అందు' అను ప్రత్యయమే వచ్చియున్నప్పటికిని, దాని అవ్యయత్వమునకు భంగము కలుగవలసిన యవసరము లేదు. దానిపై, ఇతరములగు విభక్తి ప్రత్యయముల కవకాశము లేనప్పుడు దాని నవ్యయముగనే గణించుట సంస్కృత వ్యాకరణమర్యాదయే. సంస్కృతమున చిరం. చిరేణ, చిరాత్ అను మూడు రూపములలోనున్న శబ్దము నవ్యయముగానే పరిగణించుట పరిపాటి. ఇంతకును 'ఎల్లయందు' అనుచోట అట్టియవకాశము కూడ లేకుండ ఉత్తరపదమును తత్రార్థకమైన శబ్దముగా స్పష్టముగా గ్రహింపవచ్చును.]

ఇంక ప్రౌఢవ్యాకర్త ప్రతిపాదించిన రెండవ విషయము – సమాసము కాని సమయమునగూడ 'ఎల్లన్' అనునది విశేష్యమునకు ముందు ప్రయుక్తము కావచ్చునని. సూరి సమాసమునందు పూర్వమున, అసమాసమందు పరమున ప్రయుక్తమగునని చెప్పగా దానిని సవరింపబూని ప్రౌఢవ్యాకర్త యీ ప్రతిపాదనము చేయుచున్నారు. 'ఎల్లన్ శిష్యులన్' అను శ్రీనాథుని ప్రయోగము తన ప్రతిపాదమునకు సర్వవిధముల ప్రోద్బలకమని సమ్మతించి తీరవలయును. దీనిని సమాసమే యని యనవలయునన్న ముందరి శబ్దము చివర నున్న ద్రుతమునకు లోపము చేయవలయును. ఇక్కడ అట్లు కాలేదు. కావున అసమాసమునందు విశేష్యమునకు ముందు 'ఎల్లన్' అనునది ప్రయుక్తమైన దనియే యంగీకరింపవలయును. కాని యింతటి విశాలమైన తెలుగు సాహిత్యమున మరొకప్రయోగము ప్రౌఢవ్యాకర్తకుకూడ లభింపలేదు. కావున శ్రీనాథుని ప్రయోగమే యైనను "ప్రమాదో ధీమతామపి" అని యుజ్జగింపవలయునే కాని స్వీకరింపవలయు ననుట యుచితము కాదు.

[కొందరు విమర్శకులు శ్రీనాథు డిట్లు ప్రయోగింపవలయుననియే ప్రయోగించెననియు, ఈ అపప్రయోగమువలన వ్యాసుడెంతగా ఆకటతూలియున్నాడో భంగ్యంతరమున వ్యక్తము చేయుచున్నాడనియు నందురు. సందర్భమునుబట్టి అది సరసమే. వ్యాకరణ సమ్మతముకాని ప్రయోగమును వ్యాససమ్మతముగావించి శ్రీనాథుడు సౌందర్యమును సాధించిన సాధింపవచ్చును. అది సాహిత్య విషయము. వ్యాకరణదృష్టితో చూచినప్పుడు ఇది సాధుప్రయోగము కాదని యీ విమర్శనమునుబట్టికూడ తెలుచున్నది.]

**32. సమానంబుల నుడంతంబు లగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుషసరళములు పరములగునపుడు నుగాగమం బగు.**

**(రా - ౩౩)**

ఇచటం బరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులచే మూఁడు రూపంబులు. సరళంబులు పరంబులగునపుడు లోప సంశ్లేష పూర్ణబిందువులచే మూఁడు రూపములు. విధానసామర్థ్యమువలన దీనికి లోపము లేదు. వక్ష్యమాణవిధిచే స్వాత్వము లేదు.

చిగురు + కయిదువు = { చిగురుం గయిదువు / చిగురుఁ గయిదువు / చిగురు న్గయిదువు }

తళుకు + గజ్జెలు = { తళుకు గజ్జెలు / తళుకు న్గజ్జెలు / తళుకుం గజ్జెలు }

సింగపు + కొదమ = { సింగపుం గొదమ / సింగపుఁ గొదమ / సింగపు న్గొదమ }

ఉన్నతంపు + గొడుగు = { ఉన్నతంపు గొడుగు / ఉన్నతంపు న్గొడుగు / ఉన్నతంపుం గొడుగు }

పలుఁగడాదుల నీ యాగమంబు లేదండ్రు. ఈ యాగమంబొకానొకచోట స్థిరంబు పరంబగుచోఁ గానంబడియెడి గఱువపు న్మనువు.

వ్యాఖ్య - ఉదంతంబులు = హ్రస్వమైన ఉకారముతో అంతమగునవి: స్త్రీ సమములు = ప్రథమావిభక్తి యేకవచనమునం దగు డు ము వు - అను ప్రత్యయములు చివరలేని శబ్దములు: పుంపులు = కర్మధారయమున మువర్ణకమునకు బదులుగా వచ్చునవి.

సమాసములందు పూర్వశబ్దములుగా ఉదంత స్త్రీసమములు కాని, పుంపులు అంతమందు గల శబ్దములు కాని యుండి, పరమందు పరుష సరళము లున్నయెడల 'ను' ఆగమము (నుక్ + ఆగమము)గా వచ్చు నని సూత్రార్థము.

చిగురు + కయిదువు - ఇచ్చట పూర్వశబ్దము ఉదంతము: స్త్రీ సమము. పరమందు పరుషము (క) కలదు. కావున "చిగురు + ను + కయిదువు" అని యగును. ద్రుతముమీది పరుషము సరళమై, ఆదేశ సరళములకు ముందున్న ద్రుతము నిండుసున్న, అరసున్న, సంశ్లేషలను పొందుటవలన మూడు రూపములు వచ్చును. పరమందు సరళమున్నప్పుడుకూడ నుగాగమము కలుగును. తళుకు + ను + గజ్జెలు - సరళములు పరములగునప్పుడు ద్రుతము లోపమును, సంశ్లేషమును, నిండుసున్నను పొందుటవలన మూడు రూపములు వచ్చును. అట్లే పుంపులకును పరుషములు పరమైనప్పుడు మూడు రూపములను, సరళములు పరమైనప్పుడు మూడు రూపములను వచ్చును.

విధాన సామర్థ్యము=విధించుటవలని బలము. సహజముగా లేని ద్రుతమును కావలయునని ప్రస్తుత సూత్రమున విధించుటచేత పూర్వసూత్ర మిచ్చట వర్తింపదు. అనగా ఈ సమాసములందలి ద్రుతమునకు లోపము రాదు.

వక్ష్యమాణవిధి = ముందు చెప్పబోవు విధి. ముందు రానున్న (బా - 26 వ) సూత్రమునవలన సమాస ద్రుతమునకు స్వత్వము నిషేధింపబడినది. కావున 'చిగురును గయిదువు' మున్నగు అవిష్టరూపములు వారింపబడినవి.

నాలుగు + కడలు - అని యున్నప్పుడు మొదటి పదమున కంతటికి నాదేశముగా 'నలు' అనుశబ్దము వచ్చి 'నలు + ను + కడలు' అనియై నలుంగడ, నలుఁగడ, నలుగ్గడ - అని మూడు రూపములను పొందవలయును. అట్టి రూపములు కానరావు.

ముద్రితప్రతియందు 'నలుఁగడ' యని యుండుట ముద్రణదోషమైయుండును. కొందరి దృష్టిలో 'నలుగడ' యను రూపమున గసడదవాదేశము కలిగినది; నుగాగమము కలుగలేదు. ఇట్టియెడల అరసున్న, నిండుసున్న, సంశ్లేష కలుగవు.

"నలుగడాదుల నీ యాగమంబు లేదండ్రు' అను వార్తికముచేత సూరి యిచ్చట నుగాగమమును వారించుటయే వాస్తవము.'....అద్యులండ్రు' అన్నట్లే యిచ్చటను 'లేదండ్రు' అని తెల్పి పూర్వుల యభిప్రాయమును బలపర్చుట కావనగును. నలువది; అఱువది, ఇరువది, ఏడుగడ, ఇరుగడ – మున్నగుచోట్ల నెచ్చటను నుగాగమము లేదు.

సూత్రమునందు పరుషసరళములు పరములగునప్పుడే నుగాగమము విధించెను. కాని స్థిరవర్ణము పరమైనప్పుడుకూడ ఒకానొకచోట నుగాగమము కలుగుచున్నది. కావున సూరి దానిని సూచించుచున్నాడు. 'గఱువపు + మురువు'–ఇచ్చట పరమందున్నది మకారము; స్థిరవర్ణము. అయినను నుగాగమము కలిగి 'గఱువపు + ను + మురువు=గఱువపు మ్మురువు' అని యగుచున్నది. ఇది విశేషప్రయోగము.

33. సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు (కా—౨౬)

వ్యాఖ్య – సమాసమునందు పూర్వశబ్దమునకు చివర సహజముగా నున్న ద్రుతముకాని ఆగమమైన ద్రుతముకాని స్వత్వరూపమును పొందదు. ద్రుతమునకు పరుష సరళములును, స్థిరములును పరములగునప్పుడు – పక్షాంతరమున ప్రకృతి భావముకూడ పూర్వరూపములందు చూపబడినది. వ్యస్తముగా నున్నప్పుడు మాత్రమే అట్లు కావచ్చు ననియు, సమాసములందు ద్రుతమునకు స్వత్వము కలుగరాదనియు ప్రస్తుతసూత్రమున విశేషించుచున్నాడు. 'చిగురును గఱుదువు' మున్నగు షష్ఠి రూపములు ఈ సూత్రముచే పరిహరింపబడుచున్నవి.

34. తలఁద్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు. (కా – ౨౭)

తలఁబ్రాలు – ఒడిఁబ్రాలు – సేసఁబ్రాలు – ఊరఁబంది –ఊరఁబిచ్చుక – తోఁడఁబుట్టువు – తోఁబుట్టువు –ఒల్లఁబాటు – ఒడఁబాటు ఇత్యాదులు.

వ్యాఖ్య – పూర్వసూత్రమునుబట్టి సమాసద్రుతమునకు లోపము కావలసి యుండగా తలఁద్రాలు మొదలగు కొన్ని సమాసములలో ద్రుతమునకు లోపము కలుగదని సూత్రార్థము.

తలన్ + ప్రాలు - పూర్వశబ్దము సప్తమీవిభక్త్యంతము. కావున నిచ్చటి ద్రుతము విభక్తితో నున్నదే కాని వేరుకాదు. దీనికి అరసున్న, నిండుసున్న, సంశ్లేషము వచ్చి తలఁప్రాలు, తలంప్రాలు, తలప్ప్రాలు—అను రూపములు కలుగును. అంతేకాని ద్రుతమునకు లోపముచేసి 'తలప్రాలు' అను అనిష్టరూపమును వాడరాదు. ఇట్టివే తక్కిన సమాసములును. విభక్తి ప్రత్యయములకు లోపము కలుగని యిట్టి సమాసములను 'అలుక్సమాసములు' అని యందురు.

'తోడు' అను శబ్దమునకు తృతీయాంతరూపము 'తోడన్' అనునది. తోడన్ + పుట్టువు—అని యనునప్పుడు 'తోడుగా పుట్టినది' యను నర్థమున 'తోడఁబుట్టువు' అని యగును. 'తోఁబుట్టువు' అనునది కూడ ఇట్టిదే.

ఒల్లఁబాటు, ఒడఁబాటు—అను రెండింటియందును పూర్వ శబ్దములు నుజ్యంత ములు: ఒల్లను + పాటు - అనియుండి ద్రుతకార్యమువలన 'ఒల్లఁబాటు' అని యయ్యెను. 'ఒడఁబాటు' అనునది కూడ నిట్లేర్పడినదే.

పైనున్న యన్నిలక్ష్యములందును గూడ పూర్వపదాంతమున నున్న ద్రుతము ఆగమనకారమే. "తృతీయాదులకు నుగాగమంబగు" నని ప్రత్యేకముగా ద్రుతమును విధించెను. కావున నిచ్చటి నకారమును సహజసిద్ధమని యనుటకు వీలులేదు. కావున ప్రస్తుతసూత్రము "తలఁప్రాలు" మున్నగు సమాసములయందలి పూర్వపదాంత్య నకారమునకు లోపము కలుగకుండ వారించుచున్నది.

35. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగ మం బగు. (బా—తిరా)

కఱకు + అమ్ము = కఱకుటమ్ము
నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము
పసపు + అలుక = పసపుటలుక

వ్యాఖ్య — ఉత్తరపద ప్రాధాన్యముగల సమాసము తత్పురుషము. ఇది వ్యధి కరణము, సమానాధికరణము—అని రెండు విధములు. ద్వితీయాది విభక్తులకు మీది పదముతోడి సమాసము వ్యధికరణము. దీనినే తత్పురుష మనియు నందురు. విశేషణ మునకు విశేష్యముతోడి సమాసము సమానాధికరణము. ఏకవిభక్తికములయిన విశేషణ విశేష్యముల కగు సమానాధికరణమునే కర్మధారయ మని యందురు.

ప్రస్తుతసూత్రమున "కర్మధారయంబులందు" అని బహువచన ముండుటవలన కర్మధారయమును, తత్పురుషమును గూడ గ్రహింపవలెను.

కర్మధారయమునందును, తత్పురుషమునందును పూర్వశబ్దము యొక్క ఉత్వమునకు అచ్చు పరమగునప్పుడు (టుక్ + ఆగమము) "టు" వర్ణము అంతమునందు వచ్చునని సూత్రార్థము.

"కర్మధారయంబులందు" అని యనుటచేత ఇది విశేషకార్య మగుచున్నది. కావున సామాన్యమైన'ఉత్వసంధి'ముందుగా ప్రవర్తింపక టుక్కున కవకాశమిచ్చును: ఆ తరువాతనే అది ప్రవర్తించును.

కలుకు + అమ్మ-పూర్వశబ్దము ఉదంతము. విశేషణ విశేష్యముల కగు సమాసమగుటచేత కర్మధారయము. పరమందు అచ్చున్నది. కావున పూర్వశబ్దము చివరి ఉత్వమునకు పిమ్మట 'టు' వచ్చి చేరును. కలుకు + టు + అమ్మ. ఉత్వ సంధి చేయగా 'కలుకుటమ్మ' అని యగును. 'విగ్గుటద్దము' కూడ ఇట్లే యేర్పడును.

పరసము + అలుక-అని యుండగా "కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు" అను (బాల-32) సూత్రమునుబట్టి 'పరసపు + అలుక' అని యగును. ప్రస్తుత సూత్రముచేత టుగాగమము కలిగి 'పరసపుటలుక' అను రూప మేర్పడును.

వేల్పుటావు, సముద్రపు టొడ్డు - మున్నగువానివి తత్పురుషముల కుదాహరణములుగా గ్రహింపవచ్చును.

36 కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగు నపుడు టుగాగమము విభాషనగు (బా—౩౩)

పేరు + ఉరము = పేరుటురము; పేరురము

చిగురు+ఆకు = చిగురుటాకు; చిగురాకు.

పొదరు+ఇల్లు = పొదరుటిల్లు; పొదరిల్లు

వ్యాఖ్య - కర్మధారయ సమాసమునందు పేరు మున్నగు శబ్దముల కచ్చు పరమైన యెడల 'టు' విభాషగా నగునని సూత్రార్థము. కర్మధారయ మని ఏక వచనము వాడుటచే సమానాధికరణము మాత్రమే యుద్దిష్టము. కావున ఇచ్చట తత్పురుషము గ్రహింపరాదు.

పేరు + ఆదులు = పేర్వాదులు = పేరు మున్నగు శబ్దములు. "పేరు" అను శబ్దమునకు "ఉరము" అను శబ్దము పరము కాగా టుగాగమమై "పేరు + టు + ఉరము=పేరుటురము" అని యగును. విభాష నగుననుటచే, టుగాగమము రావిపక్షమున ఉత్వసంధియై "పేరు+ఉరము=పేరురము" అని యగును. తక్కిన యుదాహరణములందును రూపనిష్పత్తి యిట్లే యుండును.

[పేర్వాది సూత్రముచేత ఉదంతస్త్రీసమములైన కొన్నింటిమీది అచ్చులకు టుగాగమము విభాషగా నగుచున్నది. పుంవులమీది వానికి నిత్యమని యని పించును. కాని పట్టపేనుఁగు, తములపాకు మున్నగు వానిచేత నచ్చుటను విభాషగనే యగుచున్నది.]

37. పేదాది శబ్దంబుల కాలుశబ్దము పరం బగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు. (బా - ౫౦)

పేద - బీద - ముద్ద - బాలెంత - కొమ - జవ - అయిదువ- మనుమ - గొడ్డు ॥ ఇట్టివి పేదాదులు. ఇందు జవ్వని శబ్దంబునకు జవాదేశంబని యెఱుంగునది. "ఏకాంతమునందు నున్న జవరాండ్ర" నని ప్రయోగము.

వ్యాఖ్య - కర్మధారయ సమాసమునందు "ఆలు" అను శబ్దము పరమగునప్పుడు పేద మున్నగు శబ్దములకు విమ్మట (రుక్ + అగమము) రు వర్ణము అగమముగా నగునని సూత్రార్థము.

"పేద" అను శబ్దమునకు "ఆలు" పరము కాగా "రు" అదనముగా వచ్చి "పేద + రు + ఆలు = పేదరాలు" అని యగును. ఇట్లే బీదరాలు - ముద్దరాలు - బాలెంతరాలు - కొమరాలు - అయిదువరాలు - మనుమరాలు - గొడ్డురాలు - మున్నగురూపము లేర్పడును.

['గొడ్డు' శబ్దమునందలి చివరి ఉత్వద్విత్వంబులు లోపించి 'గొడ్రాలు' అను రూపముకూడ నేర్పడును. 'గుణవంతులలోఁ బ్రథమగణ్యుఁడు గాని కొడుకును గన్న తల్లికంటె వేఱు గొడ్రాలు కలదా ?' అని నీతిచంద్రికయందలి ప్రయోగము.]

జవ్వని + ఆలు - అని యున్నప్పుడు 'జవ్వని' అను శబ్దము నంతటిని తొలగించి తత్స్థానమున 'జవ' అను శబ్దము వచ్చును. జవ + ఆలు - అని

యుండగా రుగాగమము కలిగి 'జవ + రు + ఆలు = జవరాలు' అని యగును. అల్లసాని పెద్దన తన మనుచరిత్రమునందు 'ఏకాంతమునందున్న జవరాండ్ర'నని జవరాలు శబ్దమును ప్రయోగించెను.

౩౪. కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగు నపు డత్వంబున కుత్వంబును రుగామంబునగు. (బా — ౪౧)

ధీర + ఆలు = ధీరురాలు

గుణవంత + ఆలు = గుణవంతురాలు

ఇచ్చట వృత్తియం దాలు శబ్దము స్త్రీమాత్రపరము.

వ్యాఖ్య - కర్మధారయ సమాసమునందు 'ఆలు' శబ్దము పరముగునప్పుడు, పూర్వశబ్దము తత్సమమైనయెడల దాని అత్వమునకు ఉత్వము వచ్చి రుగాగమము కూడ నగునని సూత్రార్థము.

సంస్కృతమునందు స్త్రీలింగశబ్దము "ధీరా" అనునది. "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వం బగు" నను నియమమునుబట్టి "ధీర" యని యగును. ఇది తెలుగునందు ప్రాతిపదికగా వ్యవహరించును. "ఆలు" పరమైనపుడు అత్వమునకు ఉత్వము వచ్చి రుగాగమము కాగా 'ధీరు + రు + ఆలు' అనియై "ధీరురాలు" అని యగును.

సంస్కృతమున గల 'గుణవంతమ్' అను ద్వితీయావిభక్త్యంతరూపము రెండవలక్ష్యమునందు ప్రాతిపదికగా వ్యవహరించుచున్నది. దానిని తెలుగులోనికి తెచ్చుకొనునపుడు "దాని యంతిమ మకారంబునకు లోపం బగు". కావున 'గుణవంత' అనునది పూర్వపదమై నిలువవలయును. 'గుణవంత + ఆలు' అని యున్నప్పుడు అత్వమునకు ఉత్వము కలుగగా 'గుణవంతు + ఆలు' అనియగును; రుగాగమము కలుగగా 'గుణవంతు + రు + ఆలు = గుణవంతురాలు' అని యగును.

[తెలుగునందు సంస్కృతప్రాతిపదికలను గాక, కొన్నియెడల ప్రథమావిభక్త్యంతములను, కొన్నియెడల ద్వితీయావిభక్త్యంతములను గ్రహించి చిన్న మార్పులను జేసి ప్రాతిపదికలుగా వ్యవహరింపవలయును. ఈవిషయము తత్సమ పరిచ్ఛేదమున నింకను స్పష్టము కాగలదు.]

"ఆలు" అను మాటకు భార్య యనియు, స్త్రీ యనియు అర్థములు గలవు. వృత్తియందు భార్య యను నర్థమును గ్రహింపరాదనియు, స్త్రీ యను నర్థమును మాత్రమే గ్రహింపవలయుననియు బాలవ్యాకర్త సూచించుచున్నాడు.

వ్యాకరణశాస్త్రమునందు కృత్తు, తద్ధితము, సమాసము, ఏకశేషము, సనాద్యంత ధాతువు – అని వృత్తి అయిదు విధములుగా గలదు. ప్రస్తుతసందర్భమునుబట్టి సమాసవృత్తిని మనము గ్రహింపవలయును. ప్రస్తుతమున్న సమాసవృత్తియందు 'ఆలు' అను మాటను స్త్రీ యనునర్థమున మాత్రమే ప్రయోగింతురని తాత్పర్యము. పేదరాలు = పేదయగు స్త్రీ: ధీరురాలు = ధైర్యముగల స్త్రీ.

[భార్యయను నర్థమున తత్పురుషమునందు వాడుటకు అభ్యంతరము లేదు. అప్పుడు రుగాగమాదులు కలుగవు. పేదవానియొక్క భార్య యనునర్థమున 'పేదయాలు' అని యగును. ధీరునియొక్క భార్య యను నర్థమున 'ధీరునాలు' అని నుగాగమముతోడి రూప మగును.]

**39 కర్మధారయంబులందు ముఃవర్ణకంబునకుం బుంపు లగు.**

(బా—౭౦)

సరసము + మాట = { సరసపు మాట / సరసంపు మాట

విరసము + వచనము = { విరసపు వచనము / విరసంపు వచనము

వ్యాఖ్య – కర్మధారయములందు పూర్వశబ్దము తుదియున్న 'ము' వర్ణకము నకు ఆదేశముగా 'పు' అని కాని 'ంపు' అని కాని యగునని సూత్రార్థము. కర్మధార యము లను బహువచనముచేత సమానాధికరణమునందును, వ్యధికరణము నందును గూడ ఈ కార్యము జరుగు నని తాత్పర్యము.

'సరసము' అను శబ్దమునకు 'మాట' పరమై కర్మధారయమగుచో మువర్ణ కమునకు బదులుగా 'పు' వర్ణము వచ్చి 'సరసపుమాట' అనియగును; పూర్ణబిందువు తోడి పు వర్ణము వచ్చినయెడల 'సరసంపుమాట' అని యగును. (అర్ధబిందువు తోడి పు వర్ణమును వాడరాదు. అట్టిదాని కవకాశము లేదు.)

సముద్రము యొక్క + మరుగు - అని యున్నప్పుడు "సమాసవిభక్తికి లోపం బగు" అను విధిచేత 'యొక్క'కు లోపము కలుగగా సముద్రము +

మరుగు - అని యుండును. ఇచ్చటి 'ము' వర్ణము ఆగమమే కాని ప్రత్యయము కాదు. సూత్రమున 'వర్ణక' మని యున్నది. కావున ప్రత్యయమునే గ్రహింపవలయును. అయినను "ము వర్ణకంబునకు విధించు కార్యము ముగాగమంబునకు నగు." అను నియమమునుబట్టి యిచ్చట ముగాగమమును గూడ గ్రహింపవచ్చును. అప్పుడు సముద్రము + నురుగు = సముద్రపు నురుగు; సముద్రంపు నురుగు - అని యగును. ఇది తత్పురుషసమాసమున కుదాహరణము. సర్వస్వపేటికాకారులు ఇట్టి యెడల తత్పురుషమును స్వీకరింపరాదనియు, పూర్వప్రయోగము లట్టివి లేవనియు ననుచున్నారు. కాని అది యథార్థము కాదు. సూరియే 'సింగపుఁ గొదమ' యని యొకచోట ఉదాహరించెను. కయ్యపు బలుపు, ఐక్యంపు టెలుక, దుఃఖపుఁ దెరువు - మున్నగునవి భారతప్రయోగములు.

[ సూరి యిచ్చటి 'ము' వర్ణకమునకు 'పుంపు' లను నిత్యముగా నగు నన్నట్లే విధించెను. అయినను 'అగు' నని చెప్పుటకును 'నిత్యము' అని చెప్పుటకును భేదము గలదని ముందే ప్రస్తావించుకొంటిమి. 'కయ్యముపస' 'లోకము సమరములు' మున్నగు సమాసములందు పుంప్వాదేశము కలుగలేదు. నీతి చంద్రికయందు 'పర్వతముచేరువ' 'సంజీవకమురాపము' మున్నగువిధముగా మువర్ణమునకు మార్పు లేకుండగనే సూరి వాడియున్నాడు. ]

**40. తామర కాకు పరంబగునపుడు పుగాగమంబగు. (ప్రౌ - ౧)**

తామరపాకు నీరువలెఁ దల్లడమందిరి పౌరులందఱున్॥ ఉ. హరి. 8 ఆ॥

**వ్యాఖ్య** - 'తామరసమ్' అనుదానికి 'తామర' అనునది తద్భవము. దీనికి 'ఆకు' పరమైనపుడు 'పు' వర్ణము అదనముగా వచ్చి చేరునని సూత్రార్థము.

తామర + ఆకు - అని యున్నప్పుడు ప్రస్తుతసూత్రముచేత 'పు' వర్ణము కలిగి 'తామర + పు + ఆకు = తామరపాకు' అని యగును.

సూత్రమున 'అగు' నని యుండుటచే వికల్ప విధికి అవకాశము లేదనిపించును. అందువల్ల "పుగాగమము వికల్పంబుగ నగు"నని చెప్పినయెడల సూత్రమింకను సమర్థముగ నుండెడిది. అట్లు కానియెడల 'తామరాకు' అను ప్రసిద్ధప్రయోగమునకు అవకాశములేకుండ పోవును. ప్రస్తుతసూత్రము వర్తింపుటచేత 'తామరపాకు' అనియు, వర్తింపనియెడల 'తామరాకు' అనియు రూపములు కలుగును.

[ ఇచ్చట నింకొక విషయమును గమనించుట యవసరము. తామరపు + ఆకు - అని యున్నప్పుడు ఇదియు టుగాగమము కలుగుతావుగా పైకి కనిపించును. పుంపులయందలి 'పు' వర్ణము ముప్రత్యయమునకు ఆదేశము. అట్లు ఆదేశమైన పువర్ణమునకే అచ్చు పరమగునపుడు టుగాగమమగును. ఇచ్చటిది ఆగమ పువర్ణము. కావున దీనికి 'టు' వర్ణము కలుగదు. తములపాకు, తములపుటాకు: ఆముదపాకు, ఆముదపుటాకు - అనువాని పోలికనుబట్టియు టుగాగమము చేయ వలెననియే యనిపించును. కాని పైవానియందలి పువర్ణముకూడ ఆదేశమే యగుటచేత దానిమీద 'టు' వర్ణము వచ్చు నవకాశము కలిగినదనియు, 'తామరపాకు' అనుచోటి 'పు' వర్ణము ఆగమమగుటచే 'టు' వర్ణము కలుగ దనియు గ్రహింప వలయును. ]

**41. తఱచుగఁ గర్మధారయసమాసంబున బెన్వాదుల కడహల్లున కచ్చు పరంబగునపుడు ద్విత్వంబు గానంబడియెడి.**

(ప్రౌ–శ)

పెన్నదరులు॥ రా. యు. కాం॥ పెన్నరదము॥ రు. ౩ ఆ॥ పెన్నుద్ది॥ పాండు. ౩ ఆ॥ పెన్నాత॥ శివ. ౨ ఆ॥ పెన్నొడలు॥ భోజ. ౭ ఆ॥ కన్నాకు (కను + ఆకు)॥ భార. భీష్మ. ౧ ఆ॥ పల్లఱపు (పలు+ అఱపు)॥ హరిశ్చ. ౪ ఆ॥ మొ. తఱచుగ ననుటచే – అన్నిష్ట సఖ నూఁదియున్నదాని (అను + ఇష్టసఖ)॥ భార. ఆది. 3 ఆ॥ అన్నుర్వీశుఁడు॥ నిర్వ. ౫ ఆ॥ పెన్నురము॥ రా. యు. కాం॥ ఇత్యాదులు గ్రాహ్యంబులు. (పెను – పెనుపుశబ్దము లుప్తశేషము)

వ్యాఖ్య – పెను + ఆదులు = పెన్వాదులు – పెను మున్నగునవి. కర్మధారయసమాసమునందు, ఉత్తరపదమునందు తొలుతనున్న యచ్చుతో సన్నికర్ష పొందునప్పుడు, పూర్వశబ్దములయిన 'పెను' మున్నగువాని చివరిహల్లునకు ద్విత్వము తఱచుగా నగుచున్నదని సూత్రార్థము.

బాలవ్యాకర్త "కర్మధారయమునం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమం బగు" అని చెప్పిన సూత్రమునకు వివరణముగా ప్రౌఢవ్యాకర్త యీ సూత్రమును రచించుచున్నాడు.

పెను + అదరులు - అని యున్నప్పుడు పూర్వశబ్దము 'పెను'. అది వ్యస్తరూపముతో లేదు. 'పెనుపు' అనునది సామాసికవిధులవలన చివరిదైన 'పు' వర్ణమును పోఁగొట్టుకొనఁగా మిగిలినరూపము; కావున నిది సమాసమునందు పూర్వ శబ్దముగా నున్నప్పుడే యీ రూపమున నుండును. వ్యస్తముగా ప్రయుక్తమైనపుడు 'పెనుపు' అనియే యుండును. 'పెను' అను శబ్దమునకు పరమందు అచ్చున్నది. కావున ప్రస్తుతసూత్రముచేత నకారమునకు ద్విత్వము కలిగి 'పెన్నదరులు' అని యగును. 'పెను' అనునది ఉదంతమే యైనను, అచ్చు పరమగుచున్నను టుగా గమము రాకుండుట చేత, ఇచ్చట దీనిని చెప్పుట యావశ్యకమే.

పెన్నరదము, పెన్నుద్ది, పెన్నూత, పెన్నొతలు, పెన్నురము - అన్న లక్ష్యములు కూడ ఇట్టివే.

'పెను' అనునది 'పె + న్ + ఉ' వర్ణక్రమమును గలిగియున్నది. తుది హల్లయిన 'న' కారమునకు ద్విత్వమురాఁగా పె + న్ + న్ + ఉ = 'పెన్ను' అని యగును. తరువాత నున్న 'అరదము' నందలి తొలియచ్చుతో సంధి నొందినపుడు 'పెన్నరదము' అని యగును.

[సూత్రమునందు 'పెన్వాదుల తుది హల్లునకు' అని యున్నందువలన కుమారదేవ పండితీయము "కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే- అనుచింతామణ్యుక్తిచే నుకారలోపము జేయఁగ పెన్ + అదరులు అని యగును" అని వ్రాసెను. పూర్వశబ్దముగా వ్యాకర్త చెప్పిన 'పెను' అను దానినీ గాక 'పెన్' అని హలంతమునే గ్రహించినది. సుబోధినీవ్యాఖ్యానము కూడ దీనినే యనువదించినది. తత్త్వబోధినీ వ్యాఖ్యానము "బా. వ్యా. సూ. ౨౬ ప్రకి. చే నుత్వ లోపము వచ్చినపిమ్మట నని చెప్పుట యుచితము. [ ఉత్వము లోపించిన పక్షమునే నకారము కడహల్లు కాకపోవును ] అప్పుడు ద్విత్వ మీసూత్రముచే వచ్చుట కవకాశము లేదు. కనుక నుకారలోపము చెప్పవలసి వచ్చినది. ఈ పద్ధతిని ప్రక్రియాగౌరవమేర్పడినది. అయినను సూత్రమునకు లక్ష్యమగుటకై యిట్లు చెప్పవలసి వచ్చినది" అని వ్రాసినది. 'కడహల్లు' అని యనగా పదము తుది నున్న హల్లు అని భావించుటవలన వచ్చిన యనర్థమిది. పదమునందున్న హల్లులలో తుదిది యని దీని అర్థము. ఉన్నది 'పెను' శబ్దమని ఉదంతముగా వ్యాకర్త ప్రయోగించుచుండగా మనము దానిని మార్చుకొన వలసిన యవసరము లేదు. ప్రాంతాదులయందు 'తొలియచ్చుమీఁది వర్ణములు' అని యున్నప్పుడు తొలుదొల్త హల్లే కాని అచ్చు లేదని యాక్షేపించుట లేదుకదా! ఆక్షేపించుటయు కూడదు. అదియే సరియైన మార్గము. కుఱు చిఱు మున్నగువాని

అదలకు ద్విరుక్తటకారము విధించినపుడు అకార ఉకారములకు ద్విరుక్త టకారమును చేసి, అవశిష్టమైన ఉకారమును పైని చేర్చుచున్నాము కదా! అట్లే 'పెను' శబ్దమునందలి చివరి హల్లయిన నకారమునకు ద్విత్వముచేసి, ఆ తరువాత అవశిష్టమైన ఉత్తును తిరిగి చేర్పవలయును. ఆ తరువాత ఉత్వసంధి యగును. ప్రక్రియ యిది కాగా, చుట్టును తిరిగి వచ్చి దూరమయ్యెనని యనుకొనుట యేల? కడహల్లు అనినప్పుడు పదమునందలి హల్లులలో చివరిది అని గ్రహింపవలయును. ఇదియే వ్యాకర్త హృదయము. ]

'కన్నాకు' అను చోట పూర్వపదము 'కను' అని ప్రౌఢవ్యాకర్త సూచించెను. ఇది ధాతుజవిశేషణమే యైయున్న యెడల మూడవసూత్రము (ప్రౌఢ.) కడనే సూచించిన బాగుండెడిది. అది కాదను నభిప్రాయముతోనే వ్యాకర్త అక్కడ కాక దానిని పెన్వాదులలో చేర్చి యిక్కడ సూచించుచున్నారు. పెన్వాదులు నామములు. కావున 'కను' అన్నది నేత్రము అను నర్థము గల నామమే కావలయును. అప్పుడు దాని రూపము 'కన్ను' అని యుండును. 'కన్ను + ఆకు' అని యుండి ఉత్వసంధి జరుగుటవలన 'కన్నాకు' అని యగును. ఇది బాలవ్యాకరణమునుబట్టియే సిద్ధించును. అటుకాక "అకారంబుక్రింది అకారంబునకుం దుదినలులక్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు" అను నియమము ప్రకారము 'కన్ను' శబ్దము నందలి ద్విత్వమునకు లోపము చేయవచ్చును. కాబట్టి లోపము చేసినరూపమునే పేర్చెనని యనుకొనరాదా? అని యడుగవచ్చును. అప్పుడు 'కను + ఆకు' అనియుండుట కాక్షేపము లేదు. కాని దానికి ద్విత్వమును ప్రస్తుతసూత్రముచేత సాధించి పెట్టవలసిన యవసరము లేదు. "జడ్డక్కారంబుతోఁ బదాది స్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు" అను (బాల. ప్రకీర్ణ) నియమమునుబట్టి జడ్డకు లోపము లేనందువలన 'కన్ను + ఆకు' అనియై 'కన్నాకు' అనియే యగును. 'శ్రేష్ఠము' అను నర్థముగల యీ శబ్దమునందలి పూర్వశబ్దము 'కన్ను' అని అనుటయే సూటి పద్ధతి. కావున ప్రస్తుతసూత్రమున కిది లక్ష్యము కావలసిన యవసరము లేదు.

'పలు + అఱుపు' అనునది 'పల్లఱుపు' అయ్యెనని ప్రౌఢవ్యాకర్త విభాగము. 'పెన్వాదుల కడహల్లు' అని యనుటచేత 'పలు' శబ్దమునందలి 'ల' కారమునకు కూడ ద్విత్వము వచ్చునని సూచనము. అట్లు ద్విత్వము వచ్చి 'పల్లు + అఱుపు' అనియై ఉత్వసంధి వచ్చి 'పల్లఱుపు' అని అయ్యెనని వ్యాకర్త యభిప్రాయము.

ఇందు పూర్వశబ్దమైన 'పలు' అను దానికి రెండే యర్థములు కలవు. మొదటిది 'అనేకము' అనునది; 'పెక్కుమాటలు' అని యర్థమున్నయెడల 'పల్లఱుపులు'

అనియుండవచ్చును. కాని, వ్యాకర్త 'పల్లఅపు' అని చెప్పి యేకవచనాంతముగనే యుదాహరించెను. కావున 'పెక్కు' అను నర్థమును జెప్పుట అంత సంగతము కాదు. రెండవదైన 'దంతము' అమనర్థ మిచ్చుట సంగతము కాదు. ప్రౌఢవ్యాకర్తయే తన శబ్దరత్నాకరమునందు 'పలువ - అఅపులు' అని మరొక విభాగము కూడ చేసి బహువచనాంతముగనే ప్రదర్శించెను. అట్లైనచో సామాసికవిధిచేత 'వ' వర్ణమునకు లోపము వచ్చెనని యనుకొనవలయును. అప్పుడు దాని యర్థము 'కాలి కూఁతలు' అని కాని 'దుష్టప్రసంగములు' అనికాని యుండును. సందర్భమునుబట్టి యా యర్థము లంత సంగతములు కావు.

కావున 'పల్లఅపు' అని యన్నపుడు పూర్వశబ్దము 'పల్ల' యని గ్రహించుట అవసరము. దీనికి 'వ్యర్థము' అను నర్థము గలదు. 'పల్లార్చు' అని యనునపుడు 'వ్యర్థముచేయు' అను నర్థముకూడ కలదు. దీనికి 'పాల' అను రూపాంతరముకూడ కలదు. కావున పకారమునకు దీర్ఘములేని సమయమున లకారమునకు ద్విత్వముండి తీరవలయు నని తేలుచున్నది. దీనినిబట్టి 'పల్లఅపు' అను మాటకు వ్యర్థ ప్రసంగము: నిష్ప్రయోజనమైన యఅపు అను నర్థములు వచ్చును. అవి సందర్భ సంగతములై యుండును. కావున 'పల్ల + అఅపు' అనునవి అత్వసంధియై 'పల్లఅపు' అని అయ్యెననుకొనవలయును. అప్పుడు ప్రస్తుతసూత్రమున కిది కూడ లక్ష్యము కాక పోవలసి వచ్చును.

అన్నిష్టసఖి, అన్నుర్వీశుఁడు - అను వానిలోనిది 'అను' అన్న తద్ధర్మార్థక విశేషణమని వ్యాకర్త యభిప్రాయము. అది యట్లే యైనప్పటికిని దానిని సెన్నాదులలో చేర్చుకొనదలచుట యుక్తిసహము కాదు. ప్రౌఢవ్యాకరణమునందలి మూడవ సూత్రముచేతనే యిట్టిరూపములను సాధింపబూనియు మరల వాని నిక్కడ చేర్చు కొనుట, వీని విషయమున వ్యాకర్త కొకనిశ్చయ మేర్పడ లేదన్నవిషయమును తెలియజేయుచున్నది. నిజమునకు ఇచ్చట పూర్వశబ్దము 'అన్నను' అను నుబంత రూపమని ముందే (ప్రౌఢ - 3) చెప్పుకొంటిమి. కావున, అవియు ప్రస్తుతసూత్రమునకు లక్ష్యములు కావు.

'పెన్నురము' అనుచోట 'పెను' అనునదే పూర్వశబ్దము. ద్విత్వము వచ్చుచున్నమాటయు యథార్థమే. ఇంతకు ముందే యిట్టి యుదాహరణము లిచ్చియు, మరల దీనిని చివరిలక్ష్యముగా నిచ్చుటకు ప్రౌఢవ్యాకర్త యొక ఫలము నాశించెను. ఈ సమాసములయందు ఉత్తరశబ్దము తెనుగే కావలసిన యక్కఱ లేదని. తత్స

ననుకూడ నై యుండ వచ్చునని సూచించుట ఆయన యభిప్రాయము. పెను + ఉరము - అనినప్పుడు ఉత్తరపదము తత్సమము. అది పరమైనప్పుడు సైతము నకారమునకు ద్విత్వమువచ్చి 'పెన్ను + ఉరము = పెన్నురము' అని యయ్యెను.

మొత్తము మీద ఈ సూత్రలక్ష్యములన్నిటను 'పెను' అనునది పూర్వ శబ్దముగా నున్నప్పుడు మాత్రమే నకారహల్లునకు ద్విత్వము వచ్చుట కనబడుచున్నది. తక్కినవి లక్ష్యములు కాజాలవు. ఇట్టియెడల వ్యాకర్త అతివ్యాప్తి లేకుండునట్లు సూత్రరచనము గావించి, దానికి తగినలక్ష్యములను మాత్రమే చూపిన బాగుండెడిది.

**42. ఉదంతమగు తద్ధర్మార్థకవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమం బగు. (బా – ౩౩)**

చేయు + అతఁడు = చేయు నతఁడు

చేసెడు + అతఁడు = చేసెడు నతఁడు

వ్యాఖ్య - ధాతువుయొక్క అర్థమును బోధించునది తద్ధర్మార్థకము. అనగా భూతభవిష్యద్వర్తమానకాలములలో నేకాలమును నిర్దేశింపకుండ నుండునదని తాత్పర్యము. వచ్చు, వచ్చెడు, వచ్చెడి - మున్నగునవి తద్ధర్మార్థకములు. విశేషణములుగా వాడినచో వానినే తద్ధర్మార్థక విశేషణము లని యందురు.

[ ధాతుజ విశేషణముతోడి సమాసము కర్మధారయ మగును. కావున (బా. 28) "కర్మధారయంబులందు" అని మొదలయిన సూత్రమునుబట్టి వచ్చెడి టుక్కును ప్రస్తుతసూత్రము బాధించును. అంతేకాక, ధాతుజవిశేషణము పూర్వ శబ్దమైనపుడు నుగాగమమును విధించుచున్నది. ]

'చేయు' అనునది తద్ధర్మార్థక విశేషణము; ఉదంతము. కావున అచ్చు పరమైనపుడు నుగాగమమై 'చేయు + న + అతడు = చేయు నతఁడు' అని యగును 'చేసెడు + అతఁడు' అని యుండగా నుగాగమమై 'చేసెడు నతఁడు' అని యగును. 'చేసెడి' అను తద్ధర్మార్థకము కూడ కలదు. కాని అది ఉదంతము కానందువలన ప్రస్తుతము ప్రసక్తము కాదు.

**43 షష్ఠీసమాసంబునం దుకార ఋకారములకచ్చు పరమగునపుడు నుగాగమం బగు. (బా – 3౪)**

రాజు (యొక్క) + ఆజ్ఞ = రాజునాజ్ఞ

విధాతృ (యొక్క) + ఆనతి = విధాతృనానతి

వ్యాఖ్య — షష్ఠీవిభక్త్యంత మగు పూర్వశబ్దముయొక్క ఉకార ఋకారము లకు అచ్చు పరమైన యెడల నుగాగమ మగును. ఇది తత్పురుష సమాసమునందు జరుగును.

రాజుయొక్క + ఆజ్ఞ — అని యున్నపుడు పూర్వశబ్దము షష్ఠీవిభక్త్యంతము. బాలవ్యాకరణమునందలి సమాసపరిచ్ఛేదములోని యిరువదైదవ సూత్రమున "సమాసవిభక్తికి లోపం బగు లట్టునకుఁ గాదు" అని యనుటవలన యొక్కకు లోపమువచ్చి 'రాజు + ఆజ్ఞ' అని యగును. పూర్వశబ్దము ఉదంతము. అచ్చు పరమైనది. కావున నుగాగమము కలిగి రాజు + న + ఆజ్ఞ = రాజునాజ్ఞ అని యగును. ఇట్లే విధాతృ + ఆనతి = విధాతృనానతి అని యగును.

[విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వ త్రీవద్భావంబులు విభాష నగు.(బా. తత్సమ. 53)అను సూత్రమునుబట్టి ఋకారాంతముగా తెనుగున పైని చూపిన ఐదు శబ్దములు మాత్రమే వాడ దగి యున్నవి. విధాతృయొక్క. ధాతృయొక్క. దాతృయొక్క. సవితృయొక్క. నేతృయొక్క - అని వాడవచ్చును. తక్కిన ఋకారాంతములకు అత్వత్రీవద్భావములు నిత్యములగుటచే మాతయొక్క, పితయొక్క, భ్రాతయొక్క - అనువిధముగా నగును. కావున ప్రస్తుతసూత్రమునకు విషయము కావన్నది గుర్తుంచుకొనవలయును.]

**44** కొన్నిచోట్ల షష్ఠీ సమాసంబునం దుకారంబున కచ్చు పరంబగు నపుడు నుగాగమంబునకు లోపంబు నగు (ప్రౌ-౧౦)

గోకుల మిల్లిలు దప్పకుండ లక్ష్మీపతి గ్రుమ్మరున్ గడియ సేపున రేపున॥ హరి. పూ. ౫ ఆ॥ దినవెచ్చమునకునై తన మేనఁ గల సొమ్ము కొడుకక బచ్చింటఁ గుదువపైచు॥ పాండు. 3 ఆ॥ శిరసందం బరయున్ ॥ కళా. ౭. ఆ॥ మొ.

వ్యాఖ్య — షష్ఠీవిభక్త్యంతమయిన శబ్దము పూర్వమందుండి పరమందచ్చున్నచో, కొన్నియెడల పూర్వశబ్దముయొక్క ఉత్తుమీది ఆగమ నువర్ణము లోపము నొందవచ్చు నని సూత్రార్థము.

బాలవ్యాకర్త చెప్పిన పూర్వసూత్రమునకు సవరణముగా ప్రౌఢవ్యాకర్త దీనిని వ్రాయుచున్నారు. సూత్రమునకు చివర "నుగాగమంబునకు లోపంబు నగు" నని సముచ్చయార్థకమును వాడుటచే నుగాగమ ప్రాప్తిని అంగీకరించుటయు, కొన్ని

యెడల మాత్రమే అట్లు కలిగిన నుగాగమము లోపించుటయు జరుగుచున్నదని సూచించుచున్నాడు. కనుక ఇది నవరణముగా కాక, పూరణముగానే భావింపదగి యున్నది.

[ఇంతకును సూత్రమునందు నుగాగమమునకు లోపము చెప్పుటవలనే ప్రక్రియయందు భారము హెచ్చుచున్నది. అట్లు కాక ఇతరస్థలములలో చెప్పినట్లు 'నుగాగమంబులేదు' అనికాని 'నుగాగమంబు కానంబడదు' అని కాని చెప్పిన యెడల ప్రక్రియ యింతకంటె సులభమై యుండెడిది.]

గోకులము యొక్క + ఇల్లిలు = గోకుల మిల్లిలు — అని ప్రౌఢవ్యాకర్త భావించిన విభాగము. ఇది యిట్లే యైనప్పుడు సమాసవిభక్తికి లోపమై 'గోకులము + ఇల్లిలు' అనియగును. అపుడు "షష్ఠీసమాసంబున" అని మొదలయిన బాల వ్యాకరణ సూత్రమునుబట్టి 'గోకులము + ను + ఇల్లిలు' అనియై 'గోకులము నిల్లిలు' అని కావలయును. ఇట్టియెడల ప్రస్తుతసూత్రము నుగాగమమునకు లోపము విధించుటచే 'గోకులము + ఇల్లిలు' అనియుండి, ఉత్వసంధిపై 'గోకులమిల్లిలు' అని యగును. ఇది ప్రౌఢవ్యాకర్త కల్పితమైన మార్గము.

కాని, యిచ్చిన యుదాహరణమున కింతకంటె సుకరమైన యన్వయము గోచర మగుచున్నది. "ఇల్లిలు తప్పకుండ లక్ష్మీపతి గోకులము గ్రుమ్మరు"నని యన్వయము చెప్పినయెడల సమాసప్రసంగమే తలయెత్తదు. అదియే యిచ్చటనుచిత మని తోచుచున్నది. "గోకులమును గ్రుమ్మరును"అని ద్వితీయావిభక్తియుండగా "జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు" అను (బా. కారక - ౨౪) నియమమును బట్టి 'గోకులము గ్రుమ్మరును' అని యగును. కావున నిచ్చట సమాస మున్న దనుకొనుటయే సంగతము కాదు.

బచ్చు యొక్క + ఇంటన్ = బచ్చింటన్. ఇచ్చట బాలవ్యాకరణ విధిని బట్టి 'బచ్చునింటన్' అని కావలసియుండగా ప్రస్తుతసూత్రముచేత నుగాగమలోపము కలిగి 'బచ్చు + ఇంటన్ = బచ్చింటన్' అని అయ్యెను.

శిరసు యొక్క + అందము = శిరసందము. ఇదియు పూరణమే. బాల వ్యాకరణమునుబట్టి 'శిరసునందము' అని నుగాగమముతోడి రూపముమాత్రమే వచ్చు చుండగా, ప్రస్తుతసూత్రము 'శిరసందము' అని నుగాగమము లేని రూపమును గూడ సాధించుచున్నది.

హరివంశ ప్రయోగము లక్ష్యము కాకున్నను, తక్కిన రెండు లక్ష్యములను బట్టి ప్రస్తుతసూత్ర మావశ్యకమే యగుచున్నది. సూరి సూత్రమునందు 'అగు' అని మాత్రమే చెప్పుట వలన, క్వాచిత్కముగా ఇట్టిరూపముల కవకాశము వదలి యున్నాడనుట భావ్యము.

**45 ఉదంతస్త్రీసమంబులకును, పుంపులకు, నదంతగుణ వాచకం బులకును దనంబు పరంబగునపుడు నుగాగమం బగు.**

(బా - ౩౩)

సొగసు + తనము = { సొగసుందనము / సొగసుఁ దనము / సొగసున్దనము }

సరసపు + తనము = { సరసపుం దనము / సరసపుఁ దనము / సరసపు న్దనము }

తెల్ల + తనము = { తెల్లందనము / తెల్లఁదనము / తెల్లన్దనము }

వ్యాఖ్య - ప్రథమైక వచన ప్రత్యయము లోపించిన ఉదంత శబ్దములు ఉదంత స్త్రీసమములు: కర్మధారయములందు మువర్ణమునకు ఆదేశముగా వచ్చినవి పుంపులు; హ్రస్వమైన అకారమును అంతమందు గలిగి గుణమును బోధించునవి అదంత గుణ వాచకములు. వీనికి తద్ధితప్రత్యయమైన 'తనము' పరమందున్నప్పుడు 'ను' ఆగమ ముగా నగునని సూత్రార్థము.

[విభక్త్యంతములగు శబ్దములమీద భావార్థము, మతుబర్థము మున్నగు వానియందు ప్రయోగించెడు ప్రత్యయములు తద్ధితములు. ఇచ్చట 'తనము' భావా ర్థమునం దగును. సమాసవృత్తియందు జరుగు కార్యములు తద్ధితవృత్తియందును జరుగును. సమాసమునందు వలెనే విభక్తి లోపము తద్ధితవృత్తియందు నగును. అట్లే మువర్ణమునకు పుంపులుకూడ నగును.]

సొగసుయొక్క + తనము – వృత్తియందు విభక్తికి లోపము కలుగును. 'సొగసు' ఉదంతస్త్రీసమము. దీనికి 'తనము' పరమైనది కావున నుగాగమము కలు

గును _ సొగసు +ను + తనము. ద్రుతకార్యము వలన పరుషము సరళమగును‌_ సొగసు +ను + దనము. ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషగా రాగా సొగసుందనము, సొగసుఁదనము, సొగసుద్దనము _ అని మూడురూపములు వచ్చును. సమానమగుటచే ఇచ్చటి ద్రుతమునకు స్వత్వము కలుగదు. విధానసామర్థ్యమువలన లోపము కలుగరాదు.

సరసపు + తనము _ ఇచ్చట పూర్వశబ్దము మువర్ణమునకు బదులుగా పువరము నొందిన రూపము. తెల్ల + తనము _ ఇచ్చట పూర్వశబ్దము అదంత గుణవాచకము. వీనికివి నుగాగమము కలిగి ద్రుతకార్యమువలన మూడేసి రూపములు వచ్చును.

[బాలవ్యాకరణమున "సమాసంబున నుదంతంబులదు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుసరళములు పరములగునపుడు నుగాగమంబగు" అని యిరువదైదవ సూత్రము గలదు. దానిచేతనే ఉదంతస్త్రీసమములు, పుంపులు పూర్వముండి పరమందు పరుష మున్నయెడల నుగాగమము కలుగుచున్నది. ప్రస్తుతసూత్రము అదనముగా అదంతగుణవాచకమును పూర్వశబ్దములలో చేర్చు కొన్నది. అంతమాత్రమున క్రొత్త సూత్ర మవసరమా ? అయినను దాని ననుబంధముగా వివరణమునం దిచ్చుకొనుట బాగుండును గాని ప్రధానసూత్రముగా నిచ్చుట బాగుండునా ? ఒకే విషయమును రెండు సూత్రముల వలన సాధించుట పునరుక్తి యనిపించుకొనదా ? — యిట్టి ప్రశ్న లుదయించుట కిచ్చట సూరి యవకాశమును గల్పించెను. కేవలము నుగాగమ ప్రాప్తియే యుద్దిష్టమైన యెడల సూరి పద్ధతి దోషజుష్ట మనక తప్పదు. కాని యిది యిట్టిదికాదు. కొన్ని యెడల బాలవ్యాకర్త సూటిమార్గమును విడిచిపెట్టి సుందరమైన భంగ్యంతరము ననుసరించుట కనిపించుచుండును. అట్టి చోటులందిది యొకటి. 'తనము' ప్రత్యయ మేయే రూపములకు వచ్చునో సూచించుటయే వ్యాకర్త యభిప్రాయము. దానినట్లే చెప్పినయెడల ఇది యోగ్యమగు స్థలముకాదు; తద్ధితపరిచ్ఛేదమువరకు ఆగవలయును. కావున భఙ్గ్యంతరమున అవకాశము కల్పించుకొని "భావార్థమునందు ఉదంతస్త్రీసమములకును, పుంపులకును, అదంతగుణవాచకములకును 'తనము' పరమగును" అనుభావముతో ప్రస్తుతసూత్రమును రచించెను. నుగాగమప్రాప్తి యన్నది అనుషంగికమే కాని ప్రధానఫలము కాదు. ప్రధానమైనది 'తనము' అను తద్ధిత ప్రత్యయము చేర్చుకొనుటకు వీలయిన రూపములను సూచించుటయే. అందువల్లనే తద్ధిత పరిచ్ఛేదమున "తనవర్థకంబు త్వార్థంబునందగు" అని మాత్రమే తెల్పి దాటవేసెను. నిజమునకు అదియే చాలైనను, అచ్చట 'కృతము'నకు బదులుగా [illegible] రూపములను జూపవలసియున్నది.

కావున సూరి యీ మార్గము ననుసరించి, అచ్చట తన ప్రణాళికకు భంగపాటు లేకుండ, ప్రయాస కలుగకుండ చేసికొనెను. ]

**46. సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు.** (బా - ౩౬)

ప్రాఁత + ఇల్లు = ప్రాయిల్లు; ప్రాఁతయిల్లు

లేఁత + దూడ = లేదూడ; లేఁతదూడ

పూవు + రెమ్మ = పూరెమ్మ; పూవురెమ్మ

వ్యాఖ్య - 'ప్రాఁత' మున్నగునవి పూర్వశబ్దములుగా నుండి తరువాతి శబ్దములతో సమసించునపుడు, వాని తొలియచ్చు మీది వర్ణముల కన్నింటికి బహుళముగా లోపము కలుగునని సూత్రార్థము.

'ప్రాఁత' అను శబ్దమునందు తొలియచ్చు 'ప్రా'లోని 'ఆ'; తరువాత నున్నవి అర్ధానుస్వారము, త వర్ణము. కావున, ఈ సూత్రముచేత ఆ రెండింటికి లోపము రాగా 'ప్రా + ఇల్లు' అనియగును. దీర్ఘముమీద సంధి లేనందువలన యడాగమమై 'ప్రాయిల్లు' అని యగును. ఇది బహుళకార్యమగుటచేత ఇచ్చట లోపము విభాషగా నగును. లోపము రానిపక్షమున యడాగమమై 'ప్రాఁతయిల్లు' అనియే యుండును. అట్లే సరళము, స్థిరము పరమైనప్పుడు కూడ విభాషగా లోపమైనట్లు ఉదాహరణములు చూపబడినవి.

**47. లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమంబగు.** (బా - ౩౭)

ప్రాఁత + కెంపు = ప్రాఁగెంపు

లేఁత + కొమ్మ = లేఁగొమ్మ

పూవు + తోఁట = పూఁదోఁట

మీఁదు + కడ = మీఁగడ

కెంపు + తామర = కెందామర

చెన్ను + తోవ = చెందోవ

చెన్ను శబ్దము వృత్తిని శోణార్థకంబు: బహుళ గ్రహణముచే మీఁదు ప్రభృతులందు నిట లోపంబు నిత్యంబు; వ్యవస్థిత విభాషచే నీఁదుతంబునకు సంశ్లేషంబు లేదు.

వ్యాఖ్య - పూర్వసూత్రమునుబట్టి లోపింపగా మిగిలిన యక్షరము (లుప్త శేషము)నకు పరుషములు పరములైనపుడు ను వర్ణము (నుక్ + ఆగమము) అదనముగా వచ్చి చేరునని సూత్రార్థము.

'ప్రాఁత + కెంపు' అని యున్నప్పుడు తొలియచ్చు మీది వర్ణములకు లోపము విభాషగా కలుగవచ్చును. లోపము కలిగినచో అంసున్నయు, తవర్ణమును పోయి 'ప్రా' యను నక్షరము మాత్రము మిగులును. ఇదియే లుప్త శేషము. దీనికి పరమందు 'కె' అను పరుష ముండుటచేత ప్రస్తుతసూత్రమునుబట్టి 'ను' అదనముగా వచ్చి 'ప్రా + ను + కెంపు' అని యగును. ఈ న వర్ణము ద్రుతమగుటచే, ద్రుతకార్యము కలిగి 'ప్రాఁగెంపు' అను రూప మేర్పడును. దీర్ఘముమీది దగుట వలన ఈ ద్రుతమునకు బిందుసున్న రాదు.

వ్యవస్థిత విభాష = విభాష యను వ్యవస్థ (నియమము)ను కల్పించుట. "ఆదేశ పరకములకు" అని మొదలయిన బాలవ్యాకరణసూత్రమునందు 'విభాష' యను పదమును వాడుటచేత ప్రాతాదులయందు సంశ్లేషము నిషేధింపబడినది. కావున సంశ్లేషముతోడి రూపము కలుగుటకు వీలులేదు. సామాసికద్రుతమునకు స్వత్వము లేదు. కావున 'ప్రాఁగెంపు' అను రూపమొక్కటియే వచ్చును.

పూర్వసూత్రము బహుళముగా వర్తించునదగుటచే, తొలియచ్చు మీదివర్ణములకు లోపము రానియెడల 'ప్రాఁతకెంపు' అని యుండును. తరువాతి రెండులక్ష్యము లందు ఇట్లే లోపము వచ్చినయెడల నుగాగమమై లేఁగొమ్మ, పూఁదోఁట - అని రూపము లేర్పడును. లోపము రానియెడల లేఁతకొమ్మ, పూవుఁదోఁట - అని రూపము లేర్పడును.

[ పూవు + తోఁట - అని యున్నప్పుడు "సమాసంబుల నుదంతంబు లగు స్త్రీసమంబులకు" నన్న (బాల ౭-౨౫) సూత్రమునుబట్టి నుగాగమము కలిగి పూవుఁదోఁట- పూవుందోఁట, పూవున్దోఁట - అని మూడురూపము లేర్పడును. ]

మీఁదు ప్రభృతులు = మీఁదు మొదలుగా గల శబ్దములు. మీఁదు, కెంపు, చెన్ను - అను శబ్దముల తొలియచ్చు మీఁది వర్ణములకు లోపము నిత్యము. కావున లు ప్తశేషమునకు పరుషములు పరమైనపుడు నుగాగమ మగును. మీ + న + కడ = మీఁగడ.

కె + న + తామర. ద్రుతకార్యము జరిగి 'కె + న + దామర' అనియై "ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష నగు" అను నియమమునుబట్టి అరసున్న, నిండుసున్న, సంశ్లేషము రావలసి యున్నప్పటికిని 'కెందామర' అని పూర్ణబిందువుతోడి రూపమొక్కటియే వచ్చును. "అట, యిఁక, చుఁడు" అని మొదలయిన (బాల - ౨౨) సూత్రమునుబట్టి నడితొలి హ్రస్వముమీద ఖండబిందు వుండరాదు. వ్యవస్థితవిభాషచే ఇక్కడి ద్రుతమునకు సంశ్లేషము కలుగరాదు. కావున పూర్ణానుస్వారముతోడి రూపము మాత్రమే వచ్చును. 'చెందొవ' యను రూపముకూడ నిట్లే యేర్పడును. వీనికి లోపము నిత్యము గావున వేరురూపములు కలుగక మీఁగడ, కెందామర, చెందొవ అను రూపములతోనే యుండును.

'చెన్ను' అను శబ్దమునకు అందము, ఎరుపు - అను నర్థములు కలవు. వృత్తిని (సమాసమునందు) చెన్ను శబ్దమునకు 'ఎరుపు' అను నర్థము మాత్రమే కలుగును. శోణార్థము అని యనగా ఎరుపు అను నర్థము కలదని యర్థము. చెందొవ అని యనగా 'ఎఱ్ఱని కలువ' యని యర్థము.

## 48. పూ పూవు. (ప్రౌ - ౧౧)

అసమాసంబునం బూశబ్దము పూవుశబ్దముయొక్క పర్యాయ ముగాఁ గానంబడియెడి నని యర్థము॥ కాలకంఠుని శిరసుపూ ౫౫న ౫౦౯॥ కాశీ. ౧ ఆ॥

వ్యాఖ్య - 'పూవు' అను శబ్దమునకు పర్యాయవాచకముగా 'పూ' అను శబ్దము కూడ కలదని సూత్రార్థము.

చిన్నయసూరి 'పూవు' అను శబ్దమును ప్రాతాదులలో చేర్చి సమాసమునందలి పూర్వశబ్దమైనపుడు తొలియచ్చుమీఁది (వు) వర్ణమునకు లోపము కలుగజేసెను. దానినిబట్టి సమాసమునందు మాత్రమే 'పూ' అను ఏకాక్షరపదమును సూరి యంగీకరించె ననవచ్చును. దానికి నవరణముగా ప్రౌఢవ్యాకర్త సమాసము కాని యప్పుడు

పైతము 'పూ' అను శబ్దము కలదని చూపుచున్నారు. "అసమాసంబునో" అని యనగా 'సమాసములందు పూర్వశబ్దము కానప్పు'డని సందర్భమునుబట్టి గ్రహింప వలసి యున్నది. ఇది యింతవరకు మాత్రమే అయినయెడల దీని నిక్కడ కాక, శబ్దపరిచ్ఛేదమున చెప్పుకొనుట యుచితముగా నుండును. పైకి ఇట్లే కన్పించుచున్నను 'పూరెమ్మ' మున్నగుచోటులందు పూర్వశబ్దము 'పూవు' అని కాక 'పూ' అని నవ రింపవెంచుటయే సీతారామాచార్యుల యభిప్రాయము.

'కొలకంటుని శిరసుపూ గగనగంగ' అను శ్రీనాథుని ప్రయోగమున 'పూ' అను శబ్దము సమాసోత్తరపదమై కనిపించుచున్నది. దీనికి తరువాతి శబ్దముతో సమాస సంబంధము లేకున్నను 'వు' లోపము గలిగియే యున్నది. కావున 'పూ' అను శబ్దము కూడ ఉన్నట్లే గ్రహింపవలయునని ప్రౌఢవ్యాకర్త నిశ్చయము.

ఇది యిట్లే ఉన్నదనుకొందము. 'పూ + రెమ్మ = పూరెమ్మ' అనురూప మేర్పడుటకు నెట్టి యిబ్బందియు లేదు. కాని 'పూఁదోఁట' మున్నగుచోట్ల క్రొత్త యిబ్బందుల నెదుర్కొనవలసి వచ్చును. పూ + తోఁట - అని యున్నప్పుడు 'పూతోఁట' అను అనిష్టరూపము మాత్రమే యేర్పడును. ఇది లుప్తశేషము కానందు వలన దానికి విధించిన నుగాగమమును దీనికి కలిగించుటకు వీలులేదు. 'పూవుఁదోఁట' మున్నగునెడల వచ్చినట్లు 'ను' వర్ణము ప్రస్తుతస్థలమున వచ్చుటకు వీలులేదు. 'పూవు' అనునది ఉదంత స్త్రీసమము గావున పరమందు పరుషమున్నప్పుడు నుగాగ మము నొందినది. 'పూ' అనునదియు స్త్రీసమమే; దీర్ఘాంతముగుటవలన ఉదంతమున కగు కార్యము దీనికి జరుగదు. కావున, ఉన్న ప్రణాళికను బట్టి, పూర్వశబ్దము 'పూ' అయినయెడల 'పూఁదోఁట' మున్నగురూపములను సాధించు ఉపాయ మేమాత్ర మును లేదు. ప్రౌఢవ్యాకర్తయు దీని విషయమున తానేమియు మార్గము చూపలేదు. కావున పూరెమ్మ, పూరేక మున్నగురూపములను 'పూ' శబ్దముతో సాధించుకొన్నను 'పూఁదోఁట' మున్నగు రూపములను సాధింప వలయుననిన 'పూవు' శబ్దము నాశ్ర యింపక తప్పదు.

పై ప్రయోగమునందు 'శిరసుపూ' అనుచోట ఏకాక్షర శబ్దమే కలదు. శ్రీనాథుడే 'చిన్నిపూ' అని మఱొకచోట వాడెను. నంది తిమ్మన 'తలపూవాడుక' అని 'పూ' శబ్దమును వాడెను. కావున 'పూవు' శబ్దమునకు 'పూ' అన్న రూపాంతరము గలదనుట నిశ్చయమే. ప్రౌఢవ్యాకర్త దీనితోపాటుగా చే, రే, వే - యనువానిని

గాక చేయి, రేయి, వేయి - యనువానికి రూపాంతరములుగా చెప్పి యుండిన యోగ్యముగా నుండెడిది. ఇంతకును ప్రాంతాదుల విషయమున విధి ప్రయోజకము కాదని పైని చూచితిమి.

49. క్రొత్తశబ్దమునందు ఆద్యక్షరశేషంబునకుం గొన్నియెడల ముగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు. (రా - ౩౮)

క్రొత్త + చాయ = క్రొంజాయ
క్రొత్త + చెమట = క్రొంజెమట
క్రొత్త + పసిఁడి = క్రొంబసిఁడి
క్రొత్త + కారు = క్రొక్కారు
క్రొత్త + తావి = క్రొత్తావి

పరుషేతరంబులు పరంబులగునపుడు ముగాగమప్రాప్తి లేమిం జేసి వానికి ద్విత్వంబగు.

క్రొత్త + గండి = క్రొగ్గండి
క్రొత్త + నన = క్రొన్నన
క్రొత్త + మావి = క్రొమ్మావి

క్రొంధూళి, క్రొంజడ లని ప్రయోగంబులు కానంబడియెడి. బహుళగ్రహణముచేతఁ గ్రొత్తకుండ లిత్యాదుల లోపంబు లేదు. క్రీఁగడుపు - క్రీఁగాలు - క్రీఁదొడ ఇత్యాదులం గ్రిందు శబ్దమునకు ఆద్యక్షరశేషంబునకు దీర్ఘము బహుళగ్రహణము చేత నని యెఱుంగునది.

వ్యాఖ్య - ఆద్యక్షరశేష మనియనగా మిగిలియున్న మొదటి యక్షర మని యర్థము. 'ప్రాంతాదుల'అని మొదలగు పూర్వసూత్రమునుబట్టి 'క్రొత్త' శబ్దములోని 'త్త' లోపించును. 'క్రొ' అనునది ఆద్యక్షరశేషము. దీనికి కొన్నియెడల ఆగమముగా 'ము' వచ్చును. కొన్నియెడల మీది హల్లునకు ద్విత్వము వచ్చును. (మీది హల్లనగా - అవి యనుటచే అచ్చుపరమందున్నప్పుడు ఈ సూత్రము ప్రవర్తింపదు.)

'క్రొత్త + చాయ' అని యున్నప్పుడు 'త్త' లోపించి 'క్రొ + చాయ' అని మిగులును. ముగాగమము కలిగి 'క్రొ + ము + చాయ = క్రొంజాయ' అని

యగును. క్రొంజెమట, క్రొంబసిఁడి - అనునవి కూడ నుగాగమ మగుటచేత ఏర్పడు రూపములే.

'క్రొత్త + కారు' అని యున్నప్పుడు 'త్త' లోపించి 'క్రొ + కారు' అని యగును. మీఁది హల్లునకు ద్విత్వము కలిగినప్పుడు 'క్రొక్కారు' అని యగును. క్రొత్తావి, క్రొగ్గంది క్రొన్నన, క్రొమ్మావి - అనునవి కూడ మీఁదిహల్లునకు ద్విత్వము వచ్చుటవలన ఏర్పడు రూపములే.

పరుష + ఇతరములు = పరుషేతరములు. పరుషములు పరము లగునప్పుడు వెనుకటి సూత్రమును బట్టి నుగాగమము కాగలదు. పరుషములు కానివి - అనగా సరళములుకాని స్థిరములుకాని పరమైనప్పుడు నువర్ణము కలుగదు. కావున మీఁది హల్లునకు ద్విత్వ మొక్కటియే కలుగును. పరుషములు పరమైనప్పుడు నుగాగమమైనను కలుగవచ్చును; ద్విత్వమైనను కలుగ వచ్చును. రెండింటిలో నేది యగునన్నది ప్రయోగములనుబట్టి గుర్తించుకొనవలయును.

కెంధూళి, కెంజిరలు - అను రెండు ప్రయోగములందును పరమందు పరుషేతరములు గలవు. ఐనప్పటికిని, పరుషములు పరమైనప్పుడు కలిగినట్లే లుప్తశేషమునకు నుగాగమము కలిగి ద్రుతకార్యము జరుగుచున్నది. కావున ఈ రెండును విశేష ప్రయోగములు.

"ప్రాతాదుల" నని మొదలిడిన (బాల - ౩౬) సూత్రమునందు "బహుళము" అని చెప్పుటచేత 'క్రొత్త + కుండలు' మున్నగువిధముగా నున్నప్పుడు తొలి యచ్చుమీఁది వర్ణములకు లోపము కలుగరాదు. అనగా 'క్రొత్తకుండలు' అనియే యుండిపోవును.

'క్రిందు + కడుపు' మున్నగు విధముగా నున్నపుడు తొలియచ్చుమీఁది వర్ణములకు లోపము కలిగి 'క్రి + కడుపు' అని యగును. లుప్తశేషమునకు పరుషము పరమగుటచే నుగాగమము కలిగి 'క్రి + ను + కడుపు' అని యగును. బహుళమువందు అన్యత్వముకూడ అంతర్భాగమై యుండుటచే క్రిందుశబ్దముయొక్క లుప్తశేషమునకు దీర్ఘము వచ్చును. అప్పుడు 'క్రీ + ను + కడుపు' అనియై ద్రుతకార్యము జరిగి 'క్రీఁగడుపు' అని యగును.

**50. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడు (బా - [illegible])**

ఒకానొక శబ్దంబున కొకానొకశబ్దము పరంబగునపుడు తొంటి యట్లు లోపనుగాగమంబులును గొండొక శబ్దమున కొకానొకశబ్దము పరంబగునపుడు లోప ద్విత్వంబులును ప్రయోగంబునందుఁ జూపట్టెడు నని తాత్పర్యము.

పది + తొమ్మిది = పందొమ్మిది
తొమ్మిది + పది = తొంబది
వంక + చెఱఁగు = వంజెఱఁగు
సగము + కోరు = సంగోరు
నిండు + వెఱ = నివ్వెఱ
నిండు + వెఱఁగు = నివ్వెఱఁగు
నెఱి + తఱి = నెత్తఱి
నెఱి + నడుము = నెన్నడుము
నెఱి + మది = నెమ్మది
నెఱి + వడి = నెవ్వడి

ఇత్యాదులు ప్రయోగంబువలనం దెలియునది.

వ్యాఖ్య - ప్రాతాదులలో చేరని శబ్దములకుకూడ ఒక శబ్దము పరమగు నప్పుడు లోప నుగాగమములును, ఒకశబ్దము పరమగునప్పుడు లోపద్విత్వములును కనబడు నని భావము. ఏదో పదమునకు ఏదో పదము పరమగునప్పుడు ఇవి వచ్చు నని యర్థము చేసికొనరాదు. పైనున్న ప్రయోగములనుబట్టి ఏ పదమున కే పదము పరమైన ఏమార్పు వచ్చెనో గ్రహింపవలయును.

మొదటి నాలుగు లక్ష్యములందును తొలియచ్చుమీది వర్ణములకు లోపమును, నుగాగమమును కలిగినవి. తరువాతి లక్ష్యములందు తొలియచ్చుమీది వర్ణములకు లోపమును మీది హల్లునకు ద్విత్వమును కలిగినవి.

ఎప్పుడేమి చేయవలయునన్నది ప్రయోగములనుబట్టి తెలిసికొన వలయును.

[ప్రాతాదుల కార్యము బహుళమగుట వలన ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యత్వము - అను నాలుగు విధములు గలవు. మీఁగడ, కెందామర,

చెందొవ - అనునవి ప్రవృత్తికి లక్ష్యములు. క్రొత్తకుంతలు మున్నగునవి అప్రవృత్తికి లక్ష్యములు. ప్రాఁతకెంపు, ప్రాఁగెంపు - అని ద్వైవిధ్యము గల రూపములు విభాషకు లక్ష్యములు. క్రీఁబొడ, కెంధూళి, పందొమ్మిది - మున్నగునవి అన్యత్వమునకు లక్ష్యములు. ]

**51. సమాసమందుఁ దత్సమంబు పరంబగునపుడును నుగాగమాదులు గానంబడియెడి** (ప్రౌ - ౧౨)

ముంగోపము, వింజామరము మొ. (వెల్ల + చామరము) సంధియందు వర్ణ వికారము (చూ॥ సమాసపరిచ్ఛేదము ౭ సూ.)

వ్యాఖ్య - సమాసమందు ఉత్తరపదముగా తత్సమ మున్నప్పుడును 'ను' వర్ణము ఆగమముగా వచ్చుట మొదలయినవి జరుగునని యర్థము.

సూత్రమును సూత్రముగా గ్రహించినయెడల, ఇందు అనిర్దిష్టత యెక్కువగా నున్న దనవలసి వచ్చును. నుగాగమాదులు అని యన్నప్పుడు ఆది శబ్దముచేత టుగాగమము మున్నగువానిని గ్రహింపవలయు నని భావము; అయినచో తత్సూచకముగా ఒక లక్ష్యమునైనను చూపిన బాగుండును. "సమాసంబుల నుదంతంబులగు" (బాల - ౨౫) అను సూత్రమున నుగాగమము విధింపబడినది. అందు ఉదాహరణములలో ఉత్తరపదముగా తత్సమము చూపబడలేదు, కావున విధి యారంభించె నని యనుకొనవచ్చును. 'వేలుపు + తపసి' అని యున్నప్పుడు నుగాగమము కలిగి 'వేలుపుందపసి' అని యగును. అట్లే టుగాగమము కూడ రావచ్చును. 'మబ్బు + అంబరము' అని యున్నప్పుడు "కర్మధారయంబులం దుత్తునకచ్చు పరంబగునపుడు టుగాగమంబగు" అను (బాల - ౨౮) సూత్రమును బట్టి 'మబ్బుటంబరము' అని యగును. తరువాతి సూత్రవిషయమున సూరియే 'పేరు + ఉరము' అని తత్సమ శబ్దము నుత్తరపదముగా చూపించియున్నారు. కావున పేరుటురము, పేరురము - అను రెండురూపములు కలుగును.

"కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగు" అను (బాల - ౩౨) సూత్రమునుబట్టి 'పరసము + మాట' అని యున్నప్పుడు పరసపుమాట, పరసంపుమాట - అని రెండు విధములుగా నగును. దాని దిగువనే 'వచనము' అను తత్సమ పదమును ఉత్తరపదముగా సూరియే చూపెను. తరువాతి సూత్రవిషయమునఁ 'చేయు + అతఁడు' మున్నగు విధముగా తెలుగు పదమును చూపెను. 'అర్జునుఁడు' అని తత్సమము ఉత్తరపదమైనచో 'చేయు నర్జునుఁడు' అని యప్పుడు సైతము నుగాగమము

వచ్చును. "షష్ఠీసమాసమునందు" అని మొదలయిన (బాల - ౩౪) సూత్రోదాహరణములలో మొదటిదే 'రాజుమొక్క + అజ్ఞ' అనునది. ఇచ్చట ఉత్తరపదము తత్సమమే; నుగాగమము కలుచునే యున్నది. కావున పైనిచెప్పిన యన్ని సమాసములందును తత్సమము ఉత్తరపదముగా నుండవచ్చుననియు, నుగాగమాదులు వచ్చుననియు, స్పష్టముగానే తెలియుచున్నది. బాలవ్యాకర్తయే పేరుటురము, విరసపు వచనము, రాజు నాజ్ఞ — అను సమాసములందు తత్సమములను ఉత్తరపదములుగా నిల్పి యుదాహరించెను. కావున, ఇదియే విషయమైనయెడల ప్రస్తుత ప్రౌఢవ్యాకరణ సూత్రము వ్యర్థమని యనవలయును.

ఉదాహరణములనుబట్టి చూచినప్పుడు ప్రౌఢవ్యాకర్త ప్రాతాదులతోడి సమాసమునే యుద్దేశించుచున్నాడని తెలియును. కాని దానినట్లు సూచింపజాలిన పదమేమియు సూత్రమున లేదు. అది సూత్రరచనమునందలి వెలితియే. దాని నట్లుంతము. ఈ యభిప్రాయమునుబట్టి సూత్రము భావము నిట్లు గుర్తింపవచ్చును.

సమాసమునందు ప్రాతాదులకు తత్సమములు పరమైనప్పుడుకూడ తొలియచ్చుమీది వర్ణములకు లోపము బహుళముగానై, పరుషములకు ముందు నుగాగమము కూడ నగునని సూత్రార్థము. ఇక్కడ 'ఆది' శబ్దముచేత వర్ణలోపము, వర్ణ వికారము మున్నగువానిని చెప్పవలయును.

ప్రాతాది కార్యములయందు సూరి యెచ్చటను ఉత్తరపద మాచ్ఛికమే అయి యుండవలయు నని చెప్పలేదు. అయినను ఉదాహరణములందు తత్సమము ఉత్తర పదముగా కవిపింపనందున స్పష్టతకై ప్రౌఢవ్యాకర్త దీనిని చెప్పదలచి యుండును. నిజమునకు సూరి అట్టిసమాసమును చెప్పకపోలేదు. "క్రొత్తశబ్దమునకు" అని మొదలయిన (బాల - ౩౭) సూత్రముక్రింది వివరణములో 'కెంధూళి' అను సమాసము కలదు. ఉత్తరపదము 'ధూళి' యనునది తత్సమమే. బహుజనపల్లివారు దానిని గమనింపక పోవుటయే యీ సూత్రరచనకు హేతువేమో !

'ముంగోపము' అను సమాసము 'ముందు + కోపము' అను రెండు పదములవలన నేర్పడెను. ఇందు ఉత్తరపదమైన 'కోపము' తత్సమము. ఇది పరమైనపుడు తొలియచ్చు మీది వర్ణములు లోపము కాగా 'ము + కోపము' అనియై లుప్తశేషమునకు పరుషము పరమగుటచేత నుగాగమము కాగా 'ము + సు + కోపము' అనియై ద్రుతకార్యము జరిగి 'ముంగోపము' అని యగును.

[తత్త్వబోధినీ వ్యాఖ్యాత 'ముందు'. అను శబ్దమును గాక 'మున్ను' అను శబ్దమునందలి ఉత్వద్విత్వములకు లోపము చేసి అవశిష్టమైన 'మున్'అనుదానినే పూర్వశబ్దముగా నిల్పుచున్నారు. అట్లయినచో నకారము ద్రుతము కాదు. కావున సరళముకాని, పూర్ణబిందువు గాని కల్గుటకు వీలుండదు. గసడదవాదేశమువలన 'మున్గోపము' అని చేయవచ్చును; కాని 'మున్కోపము' అను అనిష్టరూపమును వారించుటకు మార్గములేదు. కావున 'ముందు' శబ్దముగా గ్రహించుటయే యుత్తమము.]

వెల్ల + చామరము - అని యున్నపుడు తొలియచ్చుమీది వర్ణములకు లోపమువచ్చి 'వె + చామరము' అని యగును. పరమందు పరుషముండుటచే ముగాగమము కలిగి 'వె + ము + చామరము' అనియై ద్రుతకార్యము జరిగి 'వెంజామరము' అని యగును. సంధియందు వర్ణవికారము జరుగునన్న సూచన వలన 'వె' అన్నది 'వి' గా మారును. అప్పుడు 'వింజామరము' అని యగును. ఇది ప్రౌఢవ్యాకర్తకు అభిమత మగు మార్గము.

కొందరు 'వీచు + చామరము' అనునవి 'వింజామరము' అగునని యనుచున్నారు. అప్పుడు 'వీ + ను + జామరము' అని యైన పిమ్మట తొలిదీర్ఘమునకు హ్రస్వమును చెప్పికొనిన చాలును. తొలిహ్రస్వముమీద అరసున్నయుండదు. కావున ద్రుతమునకు బిందుసున్న కలిగి 'వింజామరము' అని యగును.

ప్రౌఢవ్యాకర్త యీసమాసములను మరల సమాస పరిచ్ఛేదమునందలి ఏడవ సూత్రముచేత మరికొన్ని సమాసములతో కలిపి సాధించును. పనికట్టుకొని రెండుమారులు సాధించిన యీ సమాసములు బాలవ్యాకరణమువలన సిద్ధించినవే యన్న సంగతి పై ప్రసంగమువలన స్పష్టమగుచున్నదికదా ! కావున ఈ సూత్రము నిష్ప్రయోజన మని నిర్ణయింప వచ్చును.

**52. అను కొను లోనగు ధాతుజవిశేషణముల యంత్యోకారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబు (ప్రౌ-౧౬)**

గిరివ్రజమున్పురంబు॥ భార. సభా. ౧ ఆ॥ జడిగొన్ కోర్కుల నింతి తాను మగవేషంబూని॥ సత్య. ౩ ఆ॥ తోడువింటివాఁడు చన్ త్రోవఁ బోక॥ అము. ౬ ఆ॥

వ్యాఖ్య - ధాతుజవిశేషణములయిన అను, కొను మొదలయిన వాని కడపటి ఉత్వమునకు హల్లు పరమగునపుడు లోపము వికల్పముగా నగు నని సూత్రార్థము.

'అను + పురంబు' అనుచోట పూర్వపదమైన 'అను' ఉదంతమైన ధాతుజ విశేషణము. పరమందు హల్లు ఉండుటచే కడపటి ఉత్వమునకు లోపము రాగా 'అన్ + పురంబు' అని యగును. ఈ లోపము వైకల్పికమగుటచేత లోపము రానియెడల 'అనుపురంబు' అనియే యుండును. ఎట్లున్నను, ఇది కర్మధారయ సమాస మగును.

'జడిగొను + కోర్కులు' అనునప్పుడు 'కొను' లోని ఉత్వమునకు లోపము వచ్చి 'జడిగొన్కోర్కులు' అని యగును. లోపమురాని యెడల 'జడిగొను కోర్కులు' అనియు నుండవచ్చును. 'చను + త్రోవ' అనియున్నప్పుడు ఉత్వ లోపమై 'చన్త్రోవ' అనియు, కాకుండుటవలన 'చనుత్రోవ' అనియు కావచ్చును.

ఈ విషయముకూడ బాలవ్యాకరణమున ప్రసంగింపబడియే యున్నది. ప్రకీర్ణక పరిచ్ఛేదమున "పదాంతంబులయి యసంయుక్తంబులయిన మలురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు" అను పదాఱవ సూత్రమునుబట్టి పైవన్నియు సుసాధములే.

[ కుమారదేవపండితీయము పైసూత్రమును దెల్ప "సమస్త పద మధ్య గతము లైనప్పు"డనుకొన్నాదులకుం బ్రయోగంబులం గానవచ్చు నం త్యోత్వ లోపము అవ్వానికి పదాంత లేమి ఉక్తబాల సూత్రమునకు లోఁగదు కాన దానిని సాధింప నీపృథక్సూత్రారంభ మని గ్రాహ్యము" అని వ్రాసెను. సమాసము నందలి పూర్వపదము అంతము కాకయే ఉత్తరపదము ప్రారంభము కాదు. అట్టియెడల పదాంతత్వము లేకుండుట యననేమియో స్పష్టమగుట లేదు. కాక, సమాసమంతయు ఏకపదమే యగుటవలన పూర్వపదమునకు పదత్వము లేదని యభిప్రాయమా ? అది సమాసము సిద్ధించిన తరువాతి విషయము. అప్పటికిని "పేదాది శబ్దంబులకు" మున్నగువిధముగా వ్యాకర్తలే వాడుచుండగా వానికి పదత్వము లేదని కాని పదాంతత్వము లేదని కాని యనుట యెట్లు ? పైయాక్షేపము నిలుచునది కాదు. ]

బాలవ్యాకరణ సూత్రమును బట్టియే పై రూపములును, ఇంకను మరికొన్ని (పల్వరుస, పల్మ్రాలు, తార్కొను, మార్పాటు) రూపములును సిద్ధించుచున్నవి. సమాసములందును, అసమాసములందును గూడ ఆ సూత్రము వర్తించును.

కావున ప్రస్తుతప్రౌఢవ్యాకరణ సూత్రము అనావశ్యకము.

**53 నెన్నడాములన్ నెఱి దగు** (ప్రౌ - ౧౪)

నెన్నడ, నెన్నడుము - ఇత్యాదులయందు నెఱి శబ్దము పూర్వ పదంబుగా నుండుట యుక్తమగునని యర్థము. నెఱి పూర్ణార్థకము; నెఱి రమ్యార్థకము.

వ్యాఖ్య - నెన్నడ మున్నగు సమాసములందు పూర్వశబ్దము 'నెఱి' యని యుంచిన బాగుండునని సూత్రార్థము.

ఇది సూరి చూపిన విభాగమునకు సవరణము. "అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి" అను సూత్రమునకు లక్ష్యముల నిచ్చుచు నెత్తఱి, నెన్నడుము, నెమ్మది, నెవ్వడి - అను సమాసములందలి పూర్వ శబ్దము 'నెఱ' యని చూపెను. ప్రౌఢవ్యాకర్త వానిఁ "నెన్నడ" అను సమాసమును కూడ జోడించుచు, ఇక్కడి పూర్వశబ్దము "నెఱి" యని సూచించుచున్నాడు. "నెఱ" యనగా "నిండైన" అని యర్థము. "నెఱి" యనగా "మనోహరమైన" అని యర్థము. "నెన్నడ" అన్నప్పుడు "నిండైన నడక" అను నర్థమున "నెఱ + నడక' అని విభాగింపవచ్చును. కాని 'నెన్నడుము' అనుచోట 'నిండైన నడుము' అని చెప్పుట సౌందర్యభంజకముగా నుండును. ఉన్నదో లేదో యని యనిపించు నడుము సుందరమై యుండునుగాన నిండైన నడుమునకు సౌందర్యములేదు. కావున 'నెఱి + నడుము' అని మనోహరమైన నడుము అన్న యర్థము చెప్పుటయే బాగుగా నుండును.

కాని సూరి చూపిన 'నెమ్మది' యను సమాసమును 'సంపూర్ణ హృదయము' అను వాడుకకు పర్యాయముగా తీసికొనుటయే బాగుగా నుండును. ఇచ్చట రమ్యార్థకమైన 'నెఱి' కంటె పూర్ణార్థకమైన 'నెఱ' రమ్యతరము. 'నెవ్వడి' అని అన్నప్పుడు పూర్ణవేగము అని యనుటయే అందముగా నుండును గాని అందమైన వేగము అని యనుట అందముగా నుండదు. 'నెవ్వగ' అని యన్నప్పుడు 'మనోహరమైన దుఃఖము' అని యర్థము చెప్పుట అసమంజసముగా నుండును. కావున 'నిండు దుఃఖము' అను నర్థము చెప్పి 'నెఱ' అను దానినే పూర్వశబ్దముగా గ్రహించి తీర వలయును.

ఇట్టి సమాసములందు అర్థమునుబట్టి నెఱి, నెఱ అను వానిలో తగినవానిని పూర్వశబ్దముగా గ్రహించుట యుచితము.

నెన్నడుము నెమ్మొగము - మున్నగు కొన్నిచోట్ల "నెఱి" యనుపదమే తగి యుండును. నెన్నడ, నెత్తఱి, (తగిన సమయము) నెమ్మది, నెమ్మనము, నెవ్వగ, నెవ్వడి, నెవ్వలి, నెవ్వెంగు - మున్నగు పెక్కుచోట్ల "నెఱ" యనునదియే పూర్వ పదముగా నుండుట తగియుండును. "నెఱ" యనుమాటకు "పూర్ణము" అను నర్థముమాత్రమే కాక ప్రశస్తము, నిశితము, ఉచితము, సమర్థము - అను నర్థములు కూడ కలవు. సందర్భమునుబట్టి ఆయాయర్థములను గూడ చెప్పికొనవలయును.

**54. కొన్నియెడల నవర్ణంబు పరంబగునపుడు పూర్వపదాంత్య డకారంబు నకారంబగు** (ప్రౌ - ౧౩)

రెన్నాళ్లు - పదిదినములైదు ప్రొద్దులు, పసపడి రెన్నాళ్లు నొక్క పగలున్ రేయున్॥ భార. ఆది. ౧ ఆ॥ మూన్నాళ్ళు - చెఱంగు మాసిన మూన్నాళ్ళు సిగ్గుతోడఁ బతివిలోకనమార్గంబు పరిహరించి॥ కాశీ. ౩ ఆ॥ వేన్నీళ్ళు - నీళ్ళనీళుల నొండె వేన్నీళ్ళనొండెఁ గడవ త్రాతఁ దోమిన నొండెఁ గలుగు శుద్ధి॥ మార్క. 3 ఆ॥

వ్యాఖ్య - సమాసమునందు ఉత్తరపదమునందలి తొలి నకారము పరమందుండగా, పూర్వపదము చివరనున్న డకారము కొన్నియెడల నకారముగా మారునని సూత్రార్థము.

'రెండు + నాళ్ళు' అని యుండగా ప్రస్తుత సూత్రమునుబట్టి 'డ' కారమునకు నకారము వచ్చునెడల 'రె + ం + (న్ + ఉ) + నాళ్ళు' అని కావలయును. ప్రౌఢవ్యాకర్త పూర్ణబిందుపూర్వకమైన డు వర్ణమునకింతటికి బదులుగా నవర్ణమును భావించెను. కాని, దానిని సూత్రబద్ధము చేయుటలో సాఫల్యము నొందలేదు. దాని సట్లుంతము. పూర్ణబిందు పూర్వకమైన డువర్ణమునకు పొల్లు నకారము వచ్చిన 'రె + న్ + నాళ్లు = 'రెన్నాళ్లు' అని యగును. 'కొన్ని యెడల' అని చెప్పుటచే నకారము కలుగని పక్షమున 'రెండు నాళ్లు' అని యుండవచ్చును.

'మూఁడు + నాళ్లు' అని యున్నపుడు బిందుపూర్వకమైన డువర్ణమునకు బదులుగా 'న్' అని వచ్చి 'మూ + న్ + నాళ్లు = మూన్నాళ్లు' అని యగును. 'వేన్నీళ్లు' అని అన్నపుడు 'వేడి + నీళ్లు' అని విభాగము. ఇక్కడకూడ బిందు పూర్వక డువర్ణమునకు నకారము ఆదేశము కాగా పై రూపమేర్పడును.

మూన్నాళ్లు, వేన్నీళ్ళు – అను రెండులక్ష్యములందును ద్విత్వమునకు పూర్వమందు దీర్ఘము కలదు. కావున "ద్విరుక్తంబగుహల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను (బాల - సమాస. ౧౩) సూత్రమునుబట్టి తొలి దీర్ఘమునకు హ్రస్వము కావలసియుండును. ప్రయోగములందు హ్రస్వము లేదు. కావున ప్రౌఢవ్యాకర్త దానిని వారించుట వాంఛనీయము.

ఇట్టి ప్రయోగము లింకను బెక్కులు గలవు. ప్రౌఢవ్యాకర్త వీనివి మాత్రమే గ్రహించి తక్కిన వానిని విడువవలసిన యవసరము లేదు.

ఏన్నాళ్ళు - అని యున్నప్పుడు 'ఏఁడు + నాళ్ళు' అను రెండు పదములు సమసించును. "కూడు పెట్టక యేన్నాళ్ళు కుతిల పఱచి। గాసి సేయుట యిది తప్పు గాదె తనకు" అని భీమేశ్వరపురాణ ప్రయోగము.

పేన్నీళ్ళు - అని యున్నప్పుడు 'పేఁద + నీళ్లు' అను రెండుపదములు సమసించును. "తటుకున గ్రామప్రదక్షిణం బొనరించి, వచ్చినచోటఁ బేన్నీళ్ళు చల్లి" అని వేణుగోపాలశతకప్రయోగము. ఇంతవరకు చెప్పినవి సస్వరబిందుపూర్వక డకారముతోడి రూపములు పూర్వపదములుగా గల సమాసములు.

ఇన్నాళ్లు, కొన్నాళ్ళు, ఎన్నాళ్ళు మున్నగుచోట్ల ద్విత్వముతోడి నివర్ణమునకు పొల్లు నకారము ఆదేశముగా వచ్చుచున్నది. సమాసరూపమున పూర్వముచెప్పికొన్న వానికివి వీనికిని సామ్యము గలదు. ఇన్ని + నాళ్లు = ఇన్నాళ్లు. "తెఱవ। యిన్నాళ్లు నడుగఁ బుత్తేఁడు విన్ను" అని శృంగార నైషధప్రయోగము. కొన్ని + నాళ్లు = కొన్నాళ్లు. "కొన్నాళ్ళకుఁ గేళిశైలమునఁ బాటించె న్మహీజాని మ। న్ననఁ జైత్యలశిరంబుపై మృదుపదన్యాసంబు గావించుచున్" అని వసుచరిత్ర ప్రయోగము. ఎన్ని + నాళ్ళు = ఎన్నాళ్ళు. "ఎన్నాళ్ళకే। నెట్టేనొక్క తపస్వి యొక్క ప్రతి రాఁడే చూడఁడే" అని ఆముక్తమాల్యదా ప్రయోగము.

చన్నీళ్లు, వెన్నెల మున్నగుచోట్ల పూర్వశబ్దము చివరనున్న అదంతలకార ద్విత్వమునకు ఆదేశముగా 'న్' వచ్చుచున్నది. చల్ల + నీళ్లు=చన్నీళ్లు. "దినముఁ జన్నీళ్ల మజ్జనమాడఁ జలిబెఁకు నీకంచు వేన్నీళ్ల నెమ్మిగాఁచు" అని వైజయంతీ విలాసమునందలి ప్రయోగము. వెల్ల + నెల = వెన్నెల. "చిన్ని వెన్నెలకందు వెన్నెలయన్ని దిశాన్థిఁ గాసిమిన వెలువ తోఁబుట్టు మాకు" అని వసుచరిత్ర ప్రయోగము.

ఇట్లే యింకను జెప్పఁగలవు. వీనినన్నింటిని "అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గనంబడి మెడి" అను సూత్రమునకు లక్ష్యములుగానే చేప్పుకొనవచ్చును. అన్ని యెడల తొలియచ్చుమీఁది వర్ణములకు లోపమును, మీదిహల్లునకు ద్విత్వమును గలుగుచున్నవి. ఇంతకంటె భిన్నమగు ప్రక్రియ యవసరము కాదు. కావున వీనిని 'అన్యంబులలో' అంతర్భవింపజేసికొనుటయే ఔచిత్యవంతముగా నుండును. అపుడుకూడ మూన్నాళ్ళు, వేన్నీళ్ళు – అను సమాసముల తొలి దీర్ఘమునకు హ్రస్వము రాకుండ వారించుకొనవలయును. ప్రాతాదులవిధి బహుళ మగుటచే అట్లు వారించుట సులభమే. ప్రౌఢవ్యాకర్త అవలంబించిన పద్ధతియు, సూత్రరచనయునుగూడ సమర్థముగా లేవు. పైగా లక్ష్యముల నైనను అధికముగా చూపలేదు.

55. ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదుల తొలియచ్చుమీఁది వరంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు (బా - ౮౦)

ఈ సూత్రంబునకు భృశార్థంబునందు ద్విరుక్తంబు విషయంబని యెఱుంగునది.

కడ + కడ = కట్టకడ

ఎదురు + ఎదురు = ఎట్టయెదురు

కడ - ఎదురు - కొన - చివర - తుద - తెన్ను - తెరువు - నడుము - పగలు - పిడుగు - బయలు - మొదలు॥ ఇత్యాదులు కడాదులు.

వ్యాఖ్య – 'కడ' మున్నగుపదములు అత్యంతార్థమున ద్విరుక్తము లైనపుడు పూర్వ పదము తొలియచ్చుమీది వర్ణముల కన్నింటికి బదులుగా అదంతమైన ద్విరుక్త టకారము (ట్ట) ఆదేశముగా నగునని సూత్రార్థము.

భృశ + అర్థము = భృశార్థము = అధిక మను నర్థము.

'కడ + కడ' అని యున్నప్పుడు రెండవ 'కడ'ను ఆమ్రేడితమని యందురు. ఇది పరమందున్నది గాన తొలిపదములోని తొలియచ్చుమీది వర్ణముల కన్నింటికి లోపము గలుగును. క + కడ. లోపించినవాని స్థానమున 'ట్ట' అనునది వచ్చును. 'క + ట్ట + కడ = కట్టకడ. ఇట్లే తక్కిన రూపములు కూడ అగును – ఎట్టయెదురు, కొట్టకొన, చిట్టచివర. తుట్ట తుద, తెట్టతెన్ను, తెట్టతెరువు. నట్టనడుము, పట్టపగలు, పిట్టపిడుగు, బట్టబయలు, మొట్టమొదలు.

ఇత్యాదులు = ఈ మొదలుగా కలవని యర్థము. 'ఇత్యాదులు కడాదులు' అని అనుటచే ఇట్టివానిని ప్రయోగములనుబట్టి యిందు చేర్చుకొనవలయునని భావము.

56. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు. (బా - ౪౧)

అప్పటికిన్ + అప్పటికిన్ = { అప్పటప్పటికిన్ / అప్పటి కప్పటికిన్

అక్కడన్ + అక్కడన్ = { అక్కడక్కడన్ / అక్కడ నక్కడన్

ఇంటన్ + ఇంటన్ = { ఇంటింటన్ / ఇంటనింటన్

ఊరన్ + ఊరన్ = { ఊరూరన్ / ఊరనూరన్

ఇంచుక నాఁ డిత్యాదులందు బహుళ గ్రహణముచేత సంధి మాత్రరలోపంబు నగు.

ఇంచుక + ఇంచుక = { ఇంచించుక / ఇంచుకించుక

నాఁడు + నాఁడు = { నానాఁడు / నాఁడు నాఁడు

వ్యాఖ్య - ఆమ్రేడితము పరమందున్నప్పుడు పూర్వశబ్దముయొక్క విభక్తికి లోపము బహుళముగా కలుగునని సూత్రార్థము. (బహుళ మనుటవలన కొన్ని యెడల విభక్తి లోపము వికల్పముగ జరుగుచున్నది; కొన్ని యెడల విభక్తికి బదులుగా అంతిమాక్షరము వికల్పముగా లోపించుచున్నది.)

'అప్పటికిన్ + అప్పటికిన్' అని యున్నప్పుడు రెండవ శబ్దము ఆమ్రేడితము. అది పరమై పూర్వశబ్దము తుదినున్న 'కిన్' అను విభక్తికి వికల్పముగా లోపమును కలిగించుచున్నది. లోపము కలిగిన యెడల 'అప్పటి + అప్పటికిన్' అనియై ఆమ్రేడితసంధి యగుటచేత 'అప్పటప్పటికిన్' అని యగును. లోపము రాని యెడల 'అప్పటికిన్ + అప్పటికిన్' అనియుండి సంధియై నడుమనున్న ద్రుతము

తొలగి పోవును. 'అప్పటికప్పటికిన్' అను రూపమేర్పడును. ఏమ్యాదులలోనిది కావున కి షష్ఠికి (అప్పటికిన్) సంధి రానియెడల 'అప్పటికి నప్పటికిన్' అను రూపముకూడ నగును. తక్కిన లక్ష్యములందును విశ్లే విభక్తికి లోపము కలిగి యొక్క రూపము, కలుగక మరొక్క రూపము వచ్చినవి.

'ఇంచుక + ఇంచుక' అని యున్నప్పుడు తొలిపదముయొక్క తుది యక్షరమునకు వికల్పముగా లోపము కలుగును. కలిగినయెడల 'ఇంచు + ఇంచుక' అనియై సంధి కలిగి 'ఇంచించుక' అని యగును. లోపము కలుగనియెడల 'ఇంచుకించుక' అని యగును. సంధి కానియెడల యడాగమము కలిగి 'ఇంచుకయించుక' యనియును గావచ్చును. అట్లే 'నాఁడు' అను శబ్దమున అంతిమాక్షరమునకు లోపము కలిగినయెడల 'నానాఁడు' అనియు, కలుగనియెడల 'నాఁడు నాఁడు' అనియు రూపములుండును.

57 అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. (బా—౪౨)

అందదుకు – ఇఱ్ఱింకులు – ఇల్లిగ్గులు – చెల్ల చెదరు – చెల్లాచెదరు – తుత్తుమురు – తుత్తునియలు – మిఱుమిట్లు॥ ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య – అందదుకు మున్నగునవి ప్రయోగమునుబట్టియే గ్రహింపదగినవని యర్థము.

'అదుకు + అదుకు' అని యున్నప్పుడు రెండవ 'అదుకు' ఆమ్రేడితము. ఆమ్రేడితము పరమైనప్పుడు పూర్వశబ్దము పెక్కుమార్పులకు లోనగుచున్నది. ఒక్కొక్క లక్ష్యమునందు ఒక్కొక్కమార్పు గోచరమగుటచే, వానిని ప్రయోగము ననుబట్టి గ్రహింపవలయునని వ్యాకర్త తెలుపుచున్నాడు.

అదుకు + అదుకు = అందదుకు
ఇంకులు + ఇంకులు = ఇఱ్ఱింకులు
ఇగ్గులు + ఇగ్గులు = ఇల్లిగ్గులు
చెదరు + చెదరు = చెల్లచెదరు: చెల్లాచెదరు
తుమురు + తుమురు = తుత్తుమురు

తునియలు + తునియలు – తుత్తునియలు

మిట్లు + మిట్లు = మిఱుమిట్లు.

'ఇత్యాదు లెఱుంగునది' అని యనుటవల్ల విఱ్ఱవీగు, చెచ్చెర, విచ్చలవిడి మున్నగువానినికూడ గ్రహింపవచ్చును. ఇట్లే ఒకానొక, తునాతునుకలు మున్నగునవి కూడ వీనియందే చేరుట కవకాశము కలదు.

58. హలవసానంబులు పరంబులగునపు డేమి శబ్దమ్ముయొక్క మికారమ్మునకు లోపంబు వైకల్పికంబు. (ప్రౌ - ౧౬)

నీకే బ్రాఁతియే వెన్నలుం బాలున్॥ హరి. పూ. ౫ ఆ॥ శవము క్రియ నుండెదిదే॥ భాగ. ౬ స్కం.॥

వ్యాఖ్య – హల్లుకాని అవసానముకాని పరమగునపుడు 'ఏమి' అను శబ్దము నందలి మివర్ణమునకు లోపము వైకల్పికముగా నగునని సూత్రార్థము.

'నీకేమి + బ్రాఁతియే' అని యున్నప్పుడు పరమందు హల్లుండుటచేత పూర్వమున్న ఏమి శబ్దమునందలి 'మి' యను వర్ణమునకు లోపము గలిగి 'నీకే బ్రాఁతియే' అని యగును. 'ఇదేమి' అని యన్నప్పుడు అవసానము పరమైనది. అవసానము అని అనగా చివర అని యర్థము. అనగా పైనేమియు వర్ణములు లేనప్పుడు కూడ 'ఏమి' శబ్దములోని 'మి' లోపింపవచ్చును. కావున 'ఇదేమి' అనునది వాక్యాంతమున నుండుటచే 'మి' వర్ణము లోపించి 'ఇదే' అని యగును.

ఇది వైకల్పికవిధి యగుటచేత 'మి' వర్ణమునకు లోపమురాని పక్షమున 'నీకేమి బ్రాఁతియే' యనియు 'ఉండెదిదేమి' అనియు నుండవచ్చును. సూత్రకర్త చెప్పకున్నను ఇట్లు 'మి' వర్ణమునకు లోపమువచ్చు ప్రయోగములు మిక్కిలి యరుదుగా నున్నదని గుర్తుంచుకొనుట యవసరము.

59 షష్ఠీ సమాసమందలి నిలల మీఁది యచ్చులకు హల్లు పరంబగుచోఁ గొన్నియెడల లోపంబు గానంబడియెడి. (ప్రౌ-౧౭)

ప్రీతిన్ సూరెల నశ్వినీసుతుల రాఁ బెంపొందు నింద్రున్వలెన్ ॥ ఉ. రా. ౨ఆ॥ తూలె రజనీచరభాస్కరబింబముల్ రుచుల్॥ రామా. ౫ఆ॥ అబ్జాసనాంకముల్ పెంపు॥ చంద్రా. ౧ఆ॥

వ్యాఖ్య - షష్ఠీసమాసమందు ఉత్తరపదమునందలి హల్లు పరమగునప్పుడు పూర్వపదము పైని గల నిగాగమ లఢాగమముల మీది యచ్చులకు లోపము కొన్ని యెడల కనిపించుచున్న దని సూత్రార్థము. 'కొన్నియెడల' అని యనుటచే ప్రయోగ వైరళ్యమును గమనించుట యవసరము.

ద్వితీయాదివిభక్తులు పరమగునప్పు డేకవచనమున డుమంతమునకు నిగాగమము కావలయు నను నియమముచే 'ఇంద్రునియొక్క' అని యగును. దానిపై 'వలెన్' అను ఉపమా వాచకమురాగా, సమసించును. "సమాసవిభక్తికి లోపంబగు" అను నియమముచే 'యొక్క' లోపింపగా "ఇంద్రుని + వలెన్" అని యగును.

ప్రస్తుత సూత్రముచేత 'వ' పరమందుండగా 'ని' వర్ణములోని అచ్చునకు లోపము కలిగి 'ఇంద్రున్ + వలెన్=ఇంద్రున్వలెన్' అని యగును.

ఇక్కడ ముద్రిత ప్రతులయందు 'ఇంద్రుంబలెన్' అను పాఠాంతరము కన బడుచున్నది. అప్పుడు పూర్వపదము ద్వితీయాంతమై యున్నదనవలయును. కావుననే 'ఇంద్రున్ + బలెన్' అని యుండగా "వర్గయుక్సరళంబులు పరములగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి" అను నియమమును బట్టి 'ఇంద్రుంబలెన్' అని కావచ్చును.

"బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లఢాగమంబగు" అను విధిబట్టి "బింబముల యొక్క + రుచులు" అని యగును. "సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుఁ గాదు" అని యనుటచేత విభక్తికి మాత్రమే లోపము కలిగి'బింబముల + రుచులు = బింబముల రుచులు' అని యగును. ప్రస్తుత సూత్రముచేత 'ల' వర్ణమునకు హల్లు పరమందుండుటచే స్వరలోపము కలుగవచ్చును. కలిగినయెడల 'బింబముల్ రుచులు' అను రూపము కలుగును. 'అజ్ఞానాంకముల + పెంపు' అని యున్నపుడుకూడ లఢాగమముమీది స్వరమునకు లోపము కలిగి 'అజ్ఞానాంకముల్ పెంపు' అని కావచ్చును. ఇట్టిదే మనుచరిత్రము నందలి 'తామరసనేత్రలిండ్ల బందాలుకారె' అనునది కూడ.'తామరసనేత్రల + ఇండ్లన్' అన్నప్పుడు లఢాగమము మీది అత్వమునకు లోపము వచ్చి, అవశిష్టమైన పొల్లులకారము తరువాతి 'ఇ' వర్ణములో చేరగా 'తామరస నేత్రలిండ్లన్' అనియగును. బాలవ్యాకరణమున సాధ్యము కాని కొన్ని రూపముల కీ సూత్రము సాధకము.

60. చేత తోడ వలనల కిత్వంబు సమాసంబులం దగు.(బా - ౪౩)

నీచేతన్ + ప్రోపు = నీచేతి ప్రోపు

నా తోడన్ + చెలిమి = నాతోడి చెలిమి

నీ వలనన్ + భయము = నీవలని భయము

వ్యాఖ్య—సమాసములందు చేత, తోడ (తృతీయా విభక్తి)—వలన (పంచమీ విభక్తి) _ అను ప్రత్యయములకు ఇత్వము కలుగు నని సూత్రార్థము.

'సమాస విభక్తికి లోపం బగు' అను నియమమును బట్టి విభక్తికి లోపము రావలయును. కాని, ఆ విభక్తికే ఇత్వమును విధించుటచేత విభక్తిలోపమిట్టి సందర్భములందు కలుగరాదని యర్థము. ఇట్లు విభక్తికి లోపము రాని సమాసములను 'అలుక్సమాసము'లని యందురు.

వ్యాకరణ పరిభాషనుబట్టి షష్ఠి వాడిన యెడల ఆదేశమని యర్థము చేసికొనవలయును. 'చేత' మున్నగువానికి 'ఇ' ఆదేశముగా వచ్చునని యర్థమగును. 'అలోఽన్త్యస్య' యున్నది పాణినీయ పరిభాష.

ఒక వర్ణము నాదేశముగా తెల్పినెడల, అది అనేక వర్ణములుగల స్థాని యొక్క తుదివర్ణమునకే యగునని తాత్పర్యము. అందువలన 'చేత' మున్నగువాని తుది వర్ణమున కాదేశముగా ఇత్వము విధింపబడెనని గ్రహింపవలయును. 'నీచేతన్ + ప్రోపు' అని యున్నపుడు 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' అన్న (బా-౨౪) సూత్రమునుబట్టి 'నీచేత + ప్రోపు' అని యగును. ప్రస్తుత సూత్రము చేత అత్వమున కిత్వము కలిగి 'నీ చేతి ప్రోపు' అని యగును. తక్కిన లక్ష్యములు నిట్టివే.

[ఆంధ్ర శబ్దానుశాసనమందు సూరి 'చేత తోడ వలనల యత్వంబున కిత్వంబు సమాసంబునందగు' నని సూత్రించెను. ఇట్లు సూత్రించుటవలన పాణినీయ పరిభాషతోడి యావశ్యకము తొలగిపోవును. నిజమునకు తరువాతి సూత్రమునందు 'అలి' అనుదాని నాగమముగా పరిగణించినట్లే 'ఇ' వర్ణము నాగమముగా పరిగణింపవచ్చును. సూరి అట్లు చేయకుండుటకు కారణము కానరాదు. "చేత తోడ వలనల కిగాగమంబు సమాసంబులందగు" నని యున్నచో సూత్రమింతకంటెను సమర్థతరతముగా నుండెడిది. అప్పుడు 'నీ చేతన్+ప్రోపు' అనియుండి 'ఇ' ఆగమము కాగా 'నీచేతన్+ఇ+ప్రోపు' అని

యగును. "అంద్వవగాగమంబులు దప్ప" అని మొదలయిన (బా - ౧౧) సూత్రమునుబట్టి అపదాదిస్వగము పరమగుచుండుటచే సంధి యగును. సంధి యగునప్పుడు ద్రుతము దానికదే లోపించి 'నీచేతి ప్రోవు' అను రూపము సిద్ధించును. ఇట్లే తక్కిన యుదాహరణములందు సైతము జరుగును.]

"సమాసంబులందు" అన్న బహువచనము తృతీయా పంచమీ తత్పురుషము లకు బోధకము.

**61.** అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు. (బా-౪౪)

నా యందున్ + కరుణ = నాయందలి కరుణ

ఇందున్ + జనులు = ఇందలి జనులు

ఎందున్ + వారు = ఎందలివారు

ఎందు శబ్దమున కలిగాగమము కొందఱు లేదంద్రు.

వ్యాఖ్య - అందు + ఆదులు - అంద్వాదులు = అందు, ఇందు, ఎందు అనునవి. సమాసమునందు పూర్వమున్న 'అందు' మున్నగువానికి 'అలి' (అలిక్ + ఆగమము) అనునది పరమందు అదనముగా చేరును.

'నాయందున్ + కరుణ' అని యుండగా అలిగాగమము కలిగి 'నాయందున్ + అలి + కరుణ' అని యగును. పదమధ్యసంధి (బాల - ౧౧) చేత ద్రుతమునకు లోపము వచ్చి, సంధియై 'నాయందలి కరుణ' అని యగును. ఇందు, ఎందు - అను ప్రత్యయప్రతిరూపములమీదకూడ అలిగాగమము కలుగును. కొందరు మాత్రము 'ఎందు' అను శబ్దము మీద 'అలి' అను నాగమము కలుగదని యనుచున్నారు. అట్లయిన 'ఎందువారు' అను విధముగా రూప ముండును. చిన్నయసూరికి 'ఎందలివారు' అను అలిగాగమముతోడి రూపమే సమ్మతము.

అంద్వాదులతో ఒక్క సప్తమీ తత్పురుషముమాత్రమే యేర్పడును. కావుననే సూత్రమునందు "సమాసమునందు" అని యేకవచనము ప్రయోగింపబడినది.

**62.** అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళం బుగ నగు. (బా - ౪౫)

నా + అది = నాది; నాయది

నా + అవి = నావి; నాయవి

ఉదంతములగు తద్ధర్మవిశేషణంబులకు మీఁద లోపంబు లేద నియు నిదంతములగు తద్ధర్మవిశేషణంబులకు మీఁద నిత్యంబనియు బహుళగ్రహణముచే నెఱుంగునది.

వచ్చునది - వచ్చునవి - వచ్చెడిది - వచ్చెడివి.

వ్యాఖ్య - సమాసమునందు పూర్వపదముమీది అది, అవి - అను శబ్దముల యొక్క తొలివర్ణమైన అత్వము (అ) నకు లోపము బహుళముగా నగునని సూత్రార్థము.

'నా + అవి' అని యున్నపుడు 'అ' వర్ణమునకు లోపము వచ్చినయెడల 'నావి' అని యగును. లోపము రానియెడల దీర్ఘముమీద యడాగమము కలిగి 'నా + య + అది = నాయది' అని యగును. ఇట్టి యెడల సూత్రము విభాషను వర్తించును.

ఉత్ + అంతములు = ఉదంతములు = హ్రస్వమైన ఉకారముతో అంత మగు శబ్దములు; తద్ధర్మ విశేషణములు = వచ్చు, పోవు మున్నగు ధాతుజన్యవిశే షణములు. ఉదంతములయిన తద్ధర్మవిశేషణములకు పరమందున్న అత్వమునకు లోపము లేదు. 'వచ్చు + అది' అని యున్నపుడు "ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణ మున కచ్చు పరమగునపుడు నుగాగమంబగు" వను (బాల - ౩౩) సూత్రమువలన 'వచ్చు + ను + అది' అనియై 'వచ్చునది' అని యగును. 'వచ్చునవి' అన్నది కూడ ఇట్టిదే. ఇవి అప్రవృత్తికి ఉదాహరణములు.

ఇత్ + అంతము = ఇదంతము = హ్రస్వమగు ఇకారముతో అంతమగు శబ్దము. ఇదంతమైన తద్ధర్మవిశేషణము మీది అత్వమునకు లోపము నిత్యము. 'వచ్చెడి + అది' అని యున్నపుడు 'అ' వర్ణమునకు లోపము వచ్చి 'వచ్చెడి + ది = వచ్చెడిది' అని యగును. 'వచ్చెడివి' అనునది కూడ ఇట్టిదే. ఇవి ప్రవృత్తికి లక్ష్యములు.

63. పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణ బిందువులు విభాషనగు. (బా - ౪౬)

భయము + పడియె = { భయ పడియె / భయం పడియె / భయము పడియె }

సూత్రము + పట్టె = { సూత్ర పట్టె / సూత్రం పట్టె / సూత్రము పట్టె }

ఈ కార్యము కర్తృవాచి ముపర్ణకమునకుఁ గలుగదు॥ గజము పడియె - అశ్వము పడియె.

వ్యాఖ్య - ప్రథమావిభక్తి యేకవచన ప్రత్యయమైన 'ము' వర్ణమునకు పడు మొన్నగునవి పరమగునప్పుడు లోపము కాని, పూర్ణబిందువు గాని విభాషగా నగునని సూత్రార్థము.

పడు + ఆదులు = పడ్వాదులు = పడు, పట్టు, పెట్టు మొదలైనవి.

విభాష యని యనుటవలన వికల్పము, నిషేధము - రెండును వర్తించును. ప్రవృత్తి యున్నప్పుడు సైతము ము లోప మొకమారును, పూర్ణబిందు వొకమారు నగును; అనగా పర్యాయ ప్రవృత్తి యుండునని యర్థము. 'భయము + పడియె' అని యున్నప్పుడు 'ము' విభక్తికి లోపము వచ్చినయెడల 'భయపడియె' అని యగును; పూర్ణానుస్వారము వచ్చినయెడల 'భయంపడియె' అని యగును. ఈరెండును సూత్రము ప్రవర్తింపగా నేర్పడిన రూపములే. సూత్రపట్టె, సూత్రం పట్టె - అనునవి కూడ నిట్లే సూత్రవిధి జరుగగా నేర్పడిన రూపములే. వికల్పమునందు సూత్రము ప్రవర్తింపని రూపము కూడ నుండవచ్చును. కావున మువర్ణమునకు లోపము కాని, పూర్ణబిందువు కాని రాని పక్షమున 'భయము పడియె, సూత్రము పట్టె' అనియే రూపములు. ఇంతవరకు వికల్పమునకు ఉదాహరణములు. విభాషయందు ఇంకొక యంశము నిషేధము - ఈ కార్యము (మువర్ణక లోపము; పూర్ణబింద్వాదేశము) కర్తృవాచి మువర్ణమునకు కలుగదన్నది నిషేధవాక్యము.

కర్తృవాచి = కర్తను తెల్పు శబ్దము. వాక్యమున కర్తయగు శబ్దముమీద పడ్వాదులు వచ్చినప్పటికిని, కర్తయొక్క కడపటి మువర్ణమునకు లోపముకాని, పూర్ణబిందువు కాని రావు. 'గజము + పడియె' అని యున్నప్పుడు 'గజము' అను శబ్దము కర్త కావున సూత్రమునందలి విధి జరుగదు. కావున మువర్ణకము అట్లే నిలిచిపోయి 'గజము పడియె' అని యున్నదున్నట్లుగా ఉండిపోవును.

64 మధ్యమపురుష ము వర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు. (బా - ౪౭)

చూడుము + నన్ను = చూడు నన్ను; చూడుము నన్ను

ఇటు + చూడుము = ఇటు చూడు; ఇటు చూడుము

చూడుమనియె - వినుమనియె॥ ఇచ్చట నచ్చు పరంబయినది. కా. బట్టి లోపము లేదు.

వ్యాఖ్య - ఆశీస్సు, శాపము, సంప్రార్థనము, విధి - అను వానియందు మధ్యమ పురుషకు ఏకవచనమున మువర్ణకము వచ్చును. వ్రాయుము, చేయుము - మున్నగునవి ఉదాహరణములు.

హల్ + అవసానము = హలవసానములు (ద్వంద్వ సమాసము). యుష్మ దర్థకము (నీవు, మీరు) అయిన కర్తతో అన్వయించు క్రియ మధ్యమపురుష అవిపించుకొనును.

ఏకవచవమున మధ్యమపురుషకు అంతమందున్న 'ము' ప్రత్యయమునకు హల్లుకాని అవసానముకాని పరమైనపుడు లోపము విభాషగానగు నని సూత్రార్థము.

'చూడుము + నన్ను' అని యున్నప్పుడు 'చూడుము' అన్నది మధ్యమపురుష క్రియ. దీనికి పరమందు హల్లు (న) వచ్చినది. కావున మువర్ణమునకు విభాషగా లోపము వచ్చును. లోపము వచ్చినచో 'చూడు నన్ను' అని యగును. లోపము రాకున్న 'చూడుము నన్ను' అనియే యుండును. ఇట్లే అవసానము పరమైనప్పుడు కూడ నగును. అవసానమని యనగా వాక్యాంత మని యర్థము.

'ఇటు చూడుము' అను వాక్యమున మువర్ణకమునకు తరువాత నేమియు లేదు. అనగా వాక్యము అవసానము నొందినది. ఇట్టియెడల, లోపమువచ్చి 'ఇటు చూడు' అని యుండవచ్చును. లోపము చేయని పక్షమున 'ఇటుచూడుము' అనియే యుండును.

హల్లు గాని, అవసానముగాని కాక అచ్చు పరమైనయెడల లోపము రాదు. సూత్రమున నిర్దిష్టముగా నున్నను స్పష్టతకొఱకై సూరి దానిని వివరించెను. 'వినుము + అనియె' అని యున్నప్పుడు మధ్యమ పురుష మువర్ణకమునకు పర మందు అచ్చున్నది కావున లోపము రాదు. ఉత్వసంధి వచ్చి 'వినుమనియె' అని యగును. 'చూడుమనియె' అను రూపముకూడ ఇట్టిదే.

65. మధ్యమపురుష మువర్ణకంబున కచ్చు పరంబగు నపుడును గొన్నియెడల లోపంబు చూపట్టెడి. (ప్రౌ - ౧౭)

ఆడిదె నీదు పందెము॥ కళా. ౬ఆ॥ భవిచ్చిత్తేప్సితం బెద్ది చెప్పినినన్॥ మార్క. ౧ఆ॥

వ్యాఖ్య - అచ్చు పరమగునప్పుడుకూడ మధ్యమపురుష మువర్ణకమునకు కొన్నిచోట్ల లోపము కలుగుచున్నదని అర్థము.

దీనిని బాలవ్యాకరణసూత్రమునకు సవరణముగా ప్రౌఢవ్యాకర్త ప్రారంభించెను.

'ఆడుము + ఇదె' అని యున్నప్పుడు పరమందు 'ఇ' వర్ణము కలదు. మధ్యమపురుష మువర్ణకమునకు లోపమురాగా 'ఆడు + ఇదె' అనియై, ఉత్వసంధి యగుటచే 'ఆడిదె' అని యగును. కాని గ్రంథమునందున్న సరియైన పాఠము కాదిది. "ఆడితె నీదుపందెమని హస్తనఖ ప్రసరచ్ఛవిచ్ఛటా। మ్రేడిత పాండురద్యుతి సమృద్ధిఁ గరం బమరంగఁ బాచికల్। వేడుకతోడఁ బుచ్చుకొని వ్రేళ్లను నిట్టునటుల్ బొరల్చివి। బ్రాడకలంక కంకణవిరావము మీఱఁ గదల్చి వైచుచున్" అన్నది పూర్తి పద్యము. పద్య సందర్భమునుబట్టి 'ఆడుము' అను నర్థము కాక, 'ఆడితివా?' అను నర్థమే సంగత మగును. కావున 'ఆడిదె'అను పాఠము తప్పనియు, అచ్చట మువర్ణక లోప ప్రసంగము లేనే లేదనియు నిర్ణయము.

'చెప్పుము + అనినన్' అనునవి మువర్ణక లోపమురాగా, 'చెప్పు + అనినన్' అనియై, ఉత్వసంధి కలుగుటచే 'చెప్పనినన్' అని అయ్యెనని సీతారామాచార్యుల ఆశయము. కాని యిది కూడ సరియైన పాఠము కాదు. "భవచ్చిత్తేప్సితం బెద్దిచె। ప్పనినన్ సంతత సత్యపాలకుఁ గాఁ బుణ్యుండుకాఁ జూచితిన్" అనునది పద్యభాగము. ఉన్నది యున్నట్లుగా నైనచో యతి తప్పినది. ఆద్యక్షరము 'వ' వర్ణమునందలి అత్వముకాగా యతి స్థానమున 'పు' అని కలదు: కావున నిది కవి యుద్దేశించిన పాఠము కాదని స్పష్టముగా చెప్పవచ్చును. "భవచ్చిత్తేప్సితం బెద్ది చె। ప్పువినున్" పాదప్రారంభమున 'పు' వర్ణము నిల్వవలయును. అదియే సరియైన పాఠము. అప్పుడు యతియు సరిపడును. 'చెప్పువినున్' అన్నప్పుడు 'చెప్పుము' అను మధ్యమ మువర్ణకమునకు హల్లు పరమందుండుటచే లోపము బాలవ్యాకరణ నియమమునుబట్టియే కలుగుచున్నది.

ప్రౌఢవ్యాకర్త చూపిన రెండు లక్ష్యములును సూత్ర విధికి సహకారులు కావని తేలిపోయినది. ప్రయోగరహిత మగుటచే ఈసూత్రము అనావశ్యకము.

**66. వ్యతిరేక మధ్యమ ముువర్ణకంబున కెల్లయెడలలోపంబు విభాష నగు.** (బా - ౪౮)

నమ్మకుము + ఇట = నమ్మకిట; నమ్మకు మిట

వ్యాఖ్య - వ్యతిరేకమున వచ్చు మధ్యమపురుష ముువర్ణకమునకు అచ్చుకాని, హల్లుకాని, అవసానముకాని పరమైనప్పుడు లోపము విభాషగా నగునని సూత్రార్థము.

పూర్వ (బా. 47) సూత్రముచేతనే వ్యతిరేక ముువర్ణమునకు హలవసానములు పరమైనప్పుడు లోపము ప్రాప్తింప వచ్చును. అచ్చు పరమైనప్పుడుకూడ లోపించుట ఇచ్చటి విశేషము. 'అన్ని యెడల' అన్న దళము దానిని సాధించును.

'నమ్మకుము + ఇట' అని యున్నప్పుడు పూర్వశబ్దము మధ్యమపురుష వ్యతిరేకక్రియ. కావున దీని 'ము' ప్రత్యయమునకు లోపము రావచ్చును. అచ్చు పరమైనప్పుడు లోపము వచ్చి 'నమ్మకు + ఇట' అని యగును. లోపము రాని పక్షమున 'నమ్మకుము + ఇట' అని యుండును. పిమ్మట ఉత్వసంధియై 'నమ్మకిట' అని లోపముతోడి రూపము, 'నమ్మకుమిట' అని లోపము రాని రూపము నేర్పడును.

[ నమ్మకుము + దానిని - అని హల్లు పరమైనపుడు 'నమ్మకు దానిని, నమ్మకుము దానిని' అను రూపములు వచ్చును. అవసానము పరమైనపుడు 'దానిని నమ్మకు, దానిని నమ్మకుము' అను రూపములు వచ్చును. ]

**67. ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముు డు ఙ్డు లకు లోపంబు విభాష నగు.** (బా - ౪౯)

ఉండుము + ఉండుము = { ఉండుండుము / ఉండు ముండుము }

కొట్టుఁడు + కొట్టుఁడు = { కొట్టు కొట్టుఁడు / కొట్టుఁడు కొట్టుఁడు }

వ్యాఖ్య - మధ్యమ పురుషమున ఏకవచనప్రత్యయము 'ము'; బహువచన ప్రత్యయము 'డు'. (ప్రత్యయము డు వర్ణమే యైనను జకారమును చేర్చి డుఙ్డు అని

పలుకుట కొక ప్రయోజనము కలదు. 'జిత్తు బిందు పూర్వం బగు" అను నియమము ననుసరించి దుజ్జు అనునది బిందుపూర్వకమైన 'దు' వర్ణమునకు బోధక మగును.) ఈ రెండు ప్రత్యయములను కలిపి 'మధ్యమ ముదుజ్జులు' అని సూత్రమున వ్యవహరించుట జరిగెను.

ఆమ్రేడితము పరమగునప్పుడు మధ్యమ పురుషయందలి మువర్ణకమునకును, దువర్ణకమునకును విభాషగా లోప మగునని సూత్రార్థము.

'ఉండుము + ఉండుము' అని యున్నప్పుడు రెండవది ఆమ్రేడితము. దానికి పూర్వమున్న మధ్యమ 'ము' ప్రత్యయమునకు లోపము వచ్చినచో 'ఉండు + ఉండుము' అనియై ఉత్వసంధి కలిగి 'ఉండుండుము' అని యగును. లోపము రాని పక్షమున 'ఉండుముండుము' అని యగును. బహువచన 'దు' ప్రత్యయమునకు విశ్లేషలోపము రాగా 'కొట్టి కొట్టుఁడు' అని యగును. లోపము రాని పక్షమున 'కొట్టుఁడు కొట్టుఁడు' అనియే యుండును.

[ బహువచన ప్రత్యయమగు దువర్ణమునకు ఈ యొక్క చోటనే లోపించు నవకాశము కలదు. మరెక్కడను, అట్టి అవకాశము లేదు. ]

**68. ఆమ్రేడితంబు పరం బగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘం బగు.** (ప్రౌ - ౨౦)

**లేలెమ్ము - పోపొమ్ము॥ మొ.**

వ్యాఖ్య - సహజముగా దీర్ఘమైయుండి వ్యాకరణ కార్యమువలన హ్రస్వము గావింపబడిన దానిని కృతహ్రస్వమని యందురు. ఆమ్రేడితము పరమైనప్పుడు కృత హ్రస్వమునకు దీర్ఘమగు నని సూత్రార్థము.

"లేచునకు ముజ్జు పరంబగునపుడు చు లోపంబగు" అను నియమమునుబట్టి 'లేచు + ము' అనుచోటి 'చు' వర్ణమునకు లోపము వచ్చును. అప్పుడు 'లే + ము' అని యుండును. ఇప్పుడు "ముజ్జు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకు మామ్ముదియు నగు" అను (బాల - 61) సూత్రమునుబట్టి 'లెమ్ము' అని యగును. త్వరితార్థమున గాని, అనాదరార్థమున గాని ఇది పునరుక్తమగును. అప్పుడు 'లెమ్ము + లెమ్ము' అని యుండును. "ఆమ్రేడితంబు పరంబగునపుడు" అని మొదలయిన (బా - 41) సూత్రమునుబట్టి పూర్వశబ్దము తుదనున్న 'ము' వర్ణకము లోపించును. ము వర్ణకము లోపించుటచే దాని నాశ్రయించుకొనియున్న

మాముడియు లోపించును. అప్పుడు 'లె + లెమ్ము' అని యగును. కృతహ్రస్వ మగు 'లె' అనుదానికి దీర్ఘము కలిగి 'లేలెమ్ము' అని యగును. ఇట్లే 'పొమ్ము + పొమ్ము' అని యున్నప్పుడు మాముడి తోడి మువర్ణకమునకు లోపము కలిగి కృత హ్రస్వమునకు దీర్ఘము కలిగి 'పోపొమ్ము' అని యగును. ఇట్లే బహువచనమందు 'లెండు + లెండు' అని యుండగా ఆమ్రేడితమునకు పూర్వమందున్న డుజ్జు (బిందుపూర్వకమైన డు వర్ణము) నకు లోపము వచ్చి 'లె + లెండు' అని యగును. ప్రస్తుత సూత్రముచేత 'లె' అను పూర్వపదావశిష్టమునకు దీర్ఘము వచ్చి 'లేలెండు' అని యగును. అట్లే 'పొండు + పొండు' అని యుండి డుజ్జునకు లోపమును 'పొ' అను వర్ణమునకు దీర్ఘము కలుగగా 'పోపొండు' అని యగును.

కృత హ్రస్వమునకు ఆమ్రేడితము పరమగుట యనునది ముడుజ్జులు లోపించి నప్పుడే జరుగును. కావున అట్లు లోపము కలిగినప్పుడు మాత్రమే కృతహ్రస్వము నకు దీర్ఘము చేయవలయును. లోపము కలుగనియెడల ఆమ్రేడితము ముడుజ్జులకు పరమందుండును. కావున కృతహ్రస్వమునకు దీర్ఘము గావించు ప్రసక్తియే కలు గదు. అట్టియెడల 'లెమ్ము లెమ్ము, పొమ్ము పొమ్ము' అను విధముగా నుండవచ్చును.

నిజమున కీ సూత్ర మావశ్యకము కాదు. "సన్నియోగ శిష్టానాం సహవా ప్రవృత్తి స్సహవా నివృత్తిః" అను పాణినీయ పరిభాషనుబట్టి ముజ్జు పరమందున్న ప్పుడు మాత్రమే దీర్ఘమునకు హ్రస్వము కలుగును; ముజ్జు లోపించునపుడు హ్రస్వము కలుగు ప్రవృత్తియే యుండదు. అనగా దీర్ఘము దీర్ఘముగానే యుండి పోవును. స్పష్టత కీ సూత్రము తోడ్పడునా?

అట్లనుకొని మరల సూత్రము నొకసారి పరికింతము. "ఆమ్రేడితంబు పరం బగునపుడు" అని సూత్రము ప్రారంభమయ్యెను. 'నీవు లెమ్ము' మున్నగుచోట్ల "మధ్యమ పురుష మువర్ణకంబునకు" అని మొదలయిన (బాల-47) సూత్రమును బట్టి చివరి మువర్ణకమునకు లోపము కలుగ వచ్చును. అప్పుడు దానితోపాటుగా మాముడియు లోపించును. అప్పుడు కృత హ్రస్వము మాత్రమే మిగిలి పోవును. 'ఆమ్రేడితంబు పరంబగు నపుడు' అను నియమముచేత ప్రస్తుత సూత్రము అట్టి చోట్ల సహకరింపదు. ప్రయోగములనుబట్టి అట్టియెడల కూడ దీర్ఘము రావలయును గదా! ఇదే విషయమునకు చెందినవాని నిందు చేర్చుకొనకుండుటయు, వానిని సాధించుటకు వేరుమార్గము సూచింపకుండుటయు ఇచ్చట గోచరించును. కావున

బాలవ్యాకరణమునకు పూరకముగా మొదలిడిన ఈ సూత్రము సమర్థముగా లేదని యనవలసి వచ్చుచున్నది.

ఇటుకాక "మధ్యమముదుజ్జులకు లోపంబయ్యెనేనిఁ గృత హ్రస్వంబునకు దీర్ఘంబగు" అని చెప్పియుండినయెడల సర్వమును సంగతమై యుండెడిది. వేగముగ రమ్ము-వేగముగరా॥ రమ్మువేగముగ-రా వేగముగ॥ రమ్ము రమ్ము-రా రమ్ము॥ రండు రండు – రారండు॥ మున్నగు రూపములన్నియు సిద్ధించుటకు ఉపరిసూచిత సూత్రము సమర్థము కాగలదు.

**69 ధ్వన్యనుకరణ శబ్దముల కను ధాతువు పరంబగుచోఁ గొన్ని యెడల ముగాగమం బగు (ప్రౌ - ౧౯)**

కనకన మను॥ రామా. ౬ఆ॥ సలసల మను॥ పాండు.౫ఆ॥

వ్యాఖ్య - 'అను' అను ధాతువును చేర్చి పలికినయెడల కొన్నియెడల ధ్వన్యనుకరణ శబ్దములకు 'ము' వర్ణము (ముక్ + అగమము) ఆగమముగా చేరునని సూత్రార్థము.

ధ్వని + అనుకరణము = ధ్వన్యనుకరణము. ధ్వన్యనుకరణమునకు వాచకములయినవి ధ్వన్యనుకరణ శబ్దములు. కలకల, తళతళ, వడవడ, గడగడ మున్నగునవి యుదాహరణములు.

'కనకన + అను' నిప్పు మండుట యందగు ధ్వనికి అనుకరణము 'కనకన' అను శబ్దము. దానికి 'అను' పరమందుండుటచే 'ము' వర్ణమువచ్చి 'కనకన + ము + అను = కనకనమను' అని యగును. "కనలు చీఁకటి రక్కసి కన్నులందుఁ దొరఁగు కనకన మను నిప్పుఁదునుకలనఁగ" అని ప్రయోగము. 'సలసల మను' అనునదికూడ అట్టిదే. 'సలసల' నీళ్లు మరగుటయం దగు అనుకరణము.

మెఱయుటయం దగు అనుకరణము తళతళ. దీనికి ముగాగమము వచ్చిన 'తళతళమని' అని యగును. సూత్రమున 'కొన్నియెడల' అని యుండుటచే రానిరూపములు కూడ నుండవచ్చును. తళతళని, కలకలని మున్నగునవి యుదాహరణములు.

**70 ధ్వన్యనుకరణ శబ్దంబులు ద్విరుక్తంబుల యగు. (ప్రౌ-౨౦)**

గడగడ - వడవడ - తళతళ - పెళపెళ॥ మొ.

వ్యాఖ్య - ధ్వన్యనుకరణ శబ్దములు ఒక దానివెంట నొకటిగా రెండు మారు లుచ్చరింపబడి తీరునని సూత్రార్థము.

'గడ' అనునది పునరుక్తమై 'గడగడ' అనియైనప్పుడే ధ్వన్యనుకరణ శబ్దముగా నగును. వడవడ, తళతళ – మున్నగునవి కూడ అట్టివే.

'వడ' అనునది ధ్వన్యనుకరణ శబ్దము కాదు. 'వడవడ' అనునది మాత్రమే ధ్వన్యనుకరణ శబ్దము. అట్లే తళతళ, కనకన – అను వానిలో ఏకాంశమును ధ్వన్యనుకరణ శబ్దమనుట పొసగదు. కావున సూత్రమున "ధ్వన్యనుకరణ శబ్దంబులు ద్విరుక్తంబుల యగు" అనుట సరియైనపద్ధతి కాదు. ఇచ్చట ధ్వన్యనుకరణ శబ్దములు పునరుక్తము లగుటలేదు. పునరుక్తమైన పిమ్మటనే ధ్వన్యనుకరణ శబ్దములుగా నగుచున్నవి.

సూత్రమున "ద్విరుక్తంబుల యగు" అని ఏవార్థకమును దేర్చి పలుకుట కలదు. జిగేలు మని, దబ్బుమని, పెళిల్లని, బుస్సని, కసుక్కని - మున్నగు విధముగా అద్విరుక్తములై యున్నవి కూడ ఎన్నో ధ్వన్యనుకరణ శబ్దములు గలవు. కావున ఈ సూత్రరచనము కూడ సమర్థముగా లేదు.

71. ఇయ్యవి క్రియావ్యవహితంబులు నగు (ప్రౌ - ౨౧)

వడవడ జమదగ్నిసూతి వడఁకెన్॥ రామా. ౮ ఆ॥

వ్యాఖ్య - పైని చెప్పిన ధ్వన్యనుకరణ శబ్దములు క్రియలకు వ్యవహితముగా, అనగా క్రియాశబ్దములతో వేరుపడి యుండునట్లుగా కూడ ప్రయోగింపబడునని సూత్రార్థము.

ధ్వన్యనుకరణ శబ్దములు క్రియావిశేషణములు. కావున అవి సాధారణముగా క్రియలకు పూర్వమందు అనుసరించియే యుండును. మిలమిల మెరసెను- జలజల ప్రవహించెను – మున్నగుచోట్ల క్రియను వెంబడించి యుండుట స్పష్టమే. వల వల మని వేగెను: చిటపట మని కురిసెను - మున్నగుచోట్ల ధ్వన్యనుకరణశబ్దమునకును క్రియకును నడుమ 'అను' ధాతువు ప్రవేశించి వ్యవధానమును కలిగించుచున్నది. ఈ రెండు విధములైనవి యీ వరకు చూచినవే.

ఇట్లే కాక కొన్నియెడల కర్తృపదము మున్నగువానివలన కూడ ధ్వన్యనుకరణశబ్దమునకును క్రియకును ఎడబాటు కలుగవచ్చును 'వడవడ + వడఁకెన్' అను ధ్వన్యనుకరణ శబ్దమునకును క్రియకును నడుమ కర్త ప్రవేశింపగా "వడవడ జమదగ్ని సూతి వడఁకెన్" అనియు నుండును.

[ ధ్వన్యనుకరణశబ్దము తత్సంబంధిక్రియాపదము నుజ్జగించియుఁ బ్రయోగింపబడుట కానవచ్చును. కన్నులు మిలమిల మనె, నిప్పులు కనకన మనె, పులి గాండ్రు మనె - మున్నగుచోట్ల మెఱసెను, మండెను, అఱచెను - అని యుండవలసిన క్రియలు లేకుండ అనుధాతురూపమే ప్రధానక్రియయై వ్యవహరించుట కనిపించును. కొన్నిచోట్ల ధ్వన్యనుకరణ శబ్దములపై 'ఆడు' ధాతువు అనుప్రయుక్తమగును. అప్పుడు తత్సంబంధి క్రియాపదము ప్రయుక్తము కాదు. గుండె దడదడ లాడెను, కనులు మిలమిల లాడెను. ఇట్టి వింకను ప్రయోగములనుబట్టి గ్రహింపవలసి యుండును.]

**72. ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశం బగు. (ప్రా - ౨౨)**

కమ్మని లతాంతములకు మ్మొనసి॥ భార. ఆది. ౫ ఆ॥ వృష్టిఁ జేసె మ్మహానదీ దీర్ఘికాసరసీనదంబులు నిండఁగాన్॥ భార. అర. 3 ఆ॥

వ్యాఖ్య - ప్రాసస్థలములందు మకారము పరమైనప్పుడు ద్రుతమునకు బదులుగా మ కారము (మ్) వచ్చునని సూత్రార్థము.

'లతాంతములకున్' అను షష్ఠ్యంత రూపముపై 'మొనసి' అను క్త్వార్థక రూపము వచ్చెను. ఇచ్చట నకారమునకు పరమందు 'మొ' అని యున్నది. కావున మకారము ఆదేశముగా కలుగగా 'లతాంతములకుమ్ + మొనసి = లతాంతములకు మ్మొనసి' అని అయ్యెను. 'కమ్మని' అను శబ్దమునందలి 'మ్మ' ప్రాసస్థానమున నుండుటచే, దాని కనుగుణముగా 'కు మ్మొనసి' యని మకారద్విత్వము కలిగినది.

'చేసెన్ + మహానది' అని యున్నప్పుడుకూడ పూర్వపాద ప్రాసస్థానము మకారద్విత్వమై యుండుటచేత, నకారము మకారమై 'చేసెమ్మహానది' అని యయ్యెను.

సూత్రమునందు 'అగు' అని విధించుట కనిపించును. 'కానంబడు' మున్నగు విధముగా దీనిని చెప్పుకొనుట సమంజసముగా నుండును. అటు కాకున్న 'ద్రుతంబునకుఁ గొన్నియెడల' అని యైనను కలుపుకొనుట యవసరము. అట్లు కాకున్నయెడల ప్రాసస్థానము లన్నింటను నకారముతోడి మకారములు మకార ద్విత్వములుగా మారవలసి వచ్చును. అది ప్రాసములందైనను కొన్ని చోట్ల మాత్రమే జరుగును. కావున పై సవరణము అవసరము.

మరొక విషయము. దీనిని 'ప్రాసంబున' అని నియమింపవలసిన యవసరము లేదు. ఇతర స్థలములందు సైతమిట్లు ప్రయుక్తమై యుండవచ్చును. అయినను లేఖక పాఠక ముద్రాపకులలో ఎవ్వరైన వానిని దిద్దియుండవచ్చును. ప్రాసములందు ముందు వెనుకల పాదములవలని నిర్బంధము కలదు. కావున, అచ్చట అట్లే మిగిలిపోయి యుండును. ఎన్నయసూరి నీతిచంద్రిక యందు చేసిన ప్రయోగము పై యభిప్రాయమున కాధారము. 'ముక్కాలున్ + మువ్వీసము' అని యుండగా, తొలి పదముమీది 'న్' సముచ్చయార్థకమైన ద్రుతము. దానికి పరమందు 'ము' రాగా మకారాదేశము కలిగి 'ముక్కాలు మ్మువ్వీసము' అని యయ్యెను. ఇది వచన గ్రంథ మగుటచే ప్రాసప్రసంగము లేనేలేదు. కావున, ప్రాసములయందు వాడుటకు ఇష్టపడు కవులు ఇతరస్థలములయందును వాడియుందు రనుకొనుట సత్యము నంగీకరించుట. కావున 'ప్రాసంబున' అనునది సూత్రమునందు చేరవలసిన అగత్యము లేదని నిర్ధారణ చేయవచ్చును.

**72** విసర్గంబున కనుకరణంబున లోపంబగు. (బా - ౩౦)

వర్ధతాం శ్రీః + అనియె = వర్ధతాం శ్రీ యనియె.

వ్యాఖ్య – 'అను' అను ధాతువును చేర్చి చెప్పుటకు అనుకరణము అని పేరు. ఏదేని ఒక వాక్యమును అనుకరించు నప్పుడు, ఆవాక్యమునకు పిమ్మట 'అను' ధాతువును చేర్చి పలుకుదురు. సంస్కృత వాక్యములను అట్లు తెలుగులో అనుకరించు నప్పుడు కొన్ని నియమములను పాటింపవలయును.

సంస్కృత వాక్యమునకు చివర విసర్గ (ః) యున్నయెడల, 'అను' అని చేర్చి నప్పుడు విసర్గకు లోపము కలుగు నని సూత్రార్థము.

'వర్ధతాం శ్రీః' ఇది యింతవరకు సంస్కృతవాక్యము. చివర విసర్గయున్నది. అనుధాతువును చేర్చి తెలుగులో వాడుకొనునప్పుడు విసర్గకు లోపము వచ్చి 'వర్ధతాం శ్రీ + అనియె' అని యగును. దీర్ఘముమీద సంధి లేనందువలన యడాగమము కలిగి 'వర్ధతాం శ్రీ + య + అనియె = వర్ధతాం శ్రీయనియె' అని యగును.

**74.** అనుకృతిని నమశ్శబ్దము తుదియత్తున కొత్వము విభాష నగు. (బా - ౩౧)

తుభ్యం నమః + అనె = { తుభ్యం నమో యనె / తుభ్యం నమ యనె }

ఈ కార్యము లాఁతిచో సహితము గానంబడియెడి॥ గతాను గతికో లోకో యటంచున్॥

వ్యాఖ్య - 'నమః' అను శబ్దముయొక్క కడపటి అత్వమునకు విభాషగా ఓత్వము ఆదేశమగునని సూత్రార్థము.

పూర్వసూత్రమునుబట్టి 'తుభ్యం నమః + అనె' అని యున్నప్పుడు విసర్గకు లోపము వచ్చి 'తుభ్యం నమ + అనె' అని యగును. ప్రస్తుతసూత్రముచేత తుది అత్వమునకు ఆదేశముగా ఓత్వము వచ్చిన యెడల 'తుభ్యం నమో + అనె' అని యగును. దీర్ఘముమీద సంధి లేనందువలన యడాగమము కలిగి 'తుభ్యం నమో యనె' అని యగును.

ఓత్వవిధి విభాష. కావున ఓత్వము రాని పక్షమున 'తుభ్యం నమ + అనె' అని యుండును. అప్పుడు "స్త్రీవాచక తత్సమ సంబోధనాంతంబులకు సంధిలేదు" అను నియమము ప్రకారము అత్వసంధి రానందువలన యడాగమము కలిగి 'తుభ్యం నమయనె' అని యగును.

సూత్రమున నమశ్శబ్దము (నమః + శబ్దము)నకే ఓత్వము విధింపగా మరొకచోట (లాఁతిచో) కూడ ఓత్వము ప్రయోగమునందున్నది. 'గతానుగతికో లోకః' అను సంస్కృత వాక్యమునకు పిమ్మట, అనుధాతువును చేర్చినప్పుడు 'లోక' శబ్దము కడపటి అత్వమునకు ఓత్వము వచ్చినది. 'గతానుగతికో లోకో + అటం చున్' అని యైనప్పుడు యడాగమము కలిగి 'గతానుగతికో లోకో యటంచున్' అను రూప మేర్పడినది. ఇది విశేష ప్రయోగము.

75 అనుకరణంబునం దుడిహల్లునకు ద్విరచనం బగు (బా - ౫౦)

కింతత్ + అనియె = కింతత్తనియె

కస్త్వమ్ + అనియె = కస్త్వమ్మనియె

వ్యాఖ్య - సంస్కృతవాక్యము చివరి హల్లున్నయెడల, అనుకరించునప్పుడు ఆహల్లునకు ద్విత్వము వచ్చునని సూత్రార్థము.

'కింతత్' అనునది సంస్కృత వాక్యము: చివర హల్లు కలదు. 'అనియె' అను నది చేరినప్పుడు చివరి హల్లునకు ద్విత్వము వచ్చి 'కింతత్తనియె' అని యగును. అట్లే రెండవ యుదాహరణమున 'మ' కారమునకు ద్విత్వము వచ్చి 'కస్త్వమ్ + మ్ + అనియె = కస్త్వమ్మనియె' అని యగును.

**76. అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాష నగు.** (కా - ౨౧)

దాసోహమ్ + అనె = { దాసోహమ్మనె / దాసోహమనె }

తత్కర్తవ్యమ్+అనె= { తత్కర్తవ్యమ్మనె / తత్కర్తవ్యమనె }

వ్యాఖ్య - అనుకరణమునందు 'అహమ్' మున్నగు శబ్దముల తుది మకారమునకు విభాషగా ద్విత్వము వచ్చు నని సూత్రార్థము.

[ మకారమునకు - అని చెప్పుటచేత మకారాంతములకే యీ విధి విభాషగా వర్తించును. తక్కిన హలంతముల కన్నింటికి పూర్వ సూత్రము ప్రకారము నిత్యముగా ద్విత్వము వచ్చు నని తాత్పర్యము. ]

'దాసోహమ్ + అనె' అని యున్నప్పుడు ముందటి సంస్కృతవాక్యము హలంతము. పూర్వసూత్రముచేత ద్విర్వచనము వచ్చిన 'దాసోహమ్మనె' అని యగును. కాని ప్రస్తుత సూత్రమున ద్విత్వవిధిని కొంత సడలించుట జరిగినది. 'అహమ్' మున్నగువాని 'మ' కారమునకు ద్విత్వము విభాషగా వచ్చు ననుటచేత, రాని పక్షమున 'దాసోహమనె' అనియగును. ఇట్లే రెండవ యుదాహరణమునందును ద్విత్వము వచ్చి యొక రూపము, ద్విత్వము రాక యొక రూపము - రెండు రూపములు కలిగినవి.

**77. ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమంబగు** (కా - ౨౪)

ఇయంధేను + అనె = ఇయం ధేనువనె

అనుకృతిని నిడుదకుం గుఱుచ యగుననిన యొకండు బలికె నది నిరాకరంబు॥ దుర్బలస్య బలం రాజా యనన వినవే॥

వ్యాఖ్య - హ్రస్వమైన ఉకారముతో అంతమగు నామముపై 'అను' ధాతువును చేర్చునెడల "వు" వర్ణము ఆగమముగా నగునని సూత్రార్థము.

'ఇయం ధేనుః + అనె' అని యున్నప్పుడు పూర్వ భాగము సంస్కృత వాక్యము. "విసర్గంబున కనుకరణంబున లోపంబగు" అను నియమమునుబట్టి 'ఇయం ధేను + అనె' అని యగును. సంస్కృతవాక్యము చివర ఉదంత నామ

ముండుట చేత 'వు' ఆగమముగా వచ్చి చేరును. "ఇయందేను + వు + అనె" ఉత్వసంధి కలిగి 'ఇయందేనువనె' అని యగును.

అనుకరణమునందు దీర్ఘమునకు (విడుదకు) హ్రస్వము (కుఱుచ) వచ్చునని పూర్వవ్యాకర్త చెప్పినమాటను సూరి తిరస్కరించి, దీర్ఘము దీర్ఘముగనే యుండి పోవుననుటకు ప్రయోగము నుదాహరించుచున్నాడు. నిరాకరంబు = నిర్ + ఆకరంబు = ఆధారము లేనిది.

'దుర్బలస్య బలం రాజా + అన వినవే' అని యున్నప్పుడు పూర్వభాగము సంస్కృతవాక్యము, దీర్ఘాంతము. పరమందు 'అను' ధాతువున్నది. ఐనను దీర్ఘమునకు హ్రస్వము కలుగ లేదు.

78. ఒకానొకచో ననుకరణ విరహితంబుగ సంస్కృత వాక్యంబు గానంబడియెడి (ప్రౌ - సంజ్ఞ - ౧౨౫)

అంటితి నమశ్శివాయ పాపాత్మురాలి॥ శై. ౪ ఆ॥

వ్యాఖ్య - 'అను' శబ్దమును జేర్పకుండ తెలుగు వాక్యమధ్యమున సంస్కృత వాక్యము ఒకచోట ప్రయోగింపబడెనని సూత్రార్థము.

'అంటితి' అను క్రియా పదమునకును 'పాపాత్మురాలి' నను కర్మపదమునకును నడుమ 'నమశ్శివాయ' అను సంస్కృతవాక్యము ప్రయోగింపబడినది. 'నమశ్శివాయ' అని యనగా శివునకు నమస్కారమని యర్థము. కాని వాడుకలో ఇట్టి వాక్యములు వాక్యస్ఫూర్తిని గోల్పోయి, అవ్యయ సదృశములుగా నుపయోగింపబడుట కానిపించును. ఇక్కడ కూడ నట్లే 'అక్కటా, అయ్యో' అని యున్నట్లుగానే 'నమశ్శివాయ' అను వాక్యము ఉపయుక్తమయ్యెను. "వాఁడు రామః రామః యింతపని చేసెనా ?" అని యున్నప్పుడు నడుమనున్న 'రామ రామ' యనున దెట్టి ప్రయోగమో యిదియు నట్టిదే. కావుననే యిట్టియెడల 'అను' ధాతువు లేకుండుటయే యుచితమై యొప్పును.

[ ఈనాడు "నమస్తే" అను వాక్యమొకటి వాక్యస్ఫూర్తిని గోల్పోయి "నమస్కారము" అను నర్థమున ప్రయుక్తమగుచున్నది. 'నీకు నమస్తే' యని 'వానికి నానమస్తే చెప్పుము' అని వాడునటువంటి వాడుక వంటిదే "నమశ్శివాయ" అనునదికూడ. 'నమోనమః' అనికూడ అనుకరణవిరహితముగా వాడవచ్చును. "ఇంక నీపనికిని నీకును నమోనమః" అను నటువంటి ప్రయోగము లావిషయమునే సూచించును. ]

**79. జయ పదం బనుకరణ విరహితంబు దఱచుగ నగు.**

(హ - సంజ్ఞ - ౧౬)

జయపూతనాఘాత జయచైత్యదమన, జయనిమ్ము జీవిత దానమ్ము నాకు॥ హరి. పూ. 2 ఆ॥ జయ నారాయణ పుండరీకనయనా శార్ఙ్గ జగన్నాయకా॥ ఉ. హరి. ౬ ఆ॥ మొ. దఱచుగ ననుటచే ఒక్కొకచో ననుకరణసహితంబు నగునని యెఱుంగవలయు.

**వ్యాఖ్య** - 'జయ' యను సంస్కృతపదము 'అను' పదము లేకుండగనే తరుచుగా తెలుగున వాడుకనొందు చున్నదని సూత్రార్థము.

'జయ' అన్నది సంస్కృతమున మధ్యమ పురుష విధ్యర్థమున నగు ఏకవచన క్రియ. 'జయింపుము' అని కాని 'వర్ధిల్లుము' అని కాని యర్థము చెప్పవచ్చును. "భవచ్ఛత్రాదులకిందు ప్రయోగంబు లేదు" అను (బా - తత్సమ - 87) సూత్రము వలన 'భవత్, లసత్, హస్' మున్నగునవి తెలుగునందు వ్యస్తముగా ప్రయోగింప బడ రా దను నిషేధము కలుగుచున్నది. 'ఆది' శబ్దముచేత నామప్రత్యయాంత శబ్దములను (ద్వారా, క్రమేణా మున్నగునవి). క్రియా ప్రత్యయాంత శబ్దములను (జీవతి, విజయతే మున్నగునవి) కూడ తెలుగులో వాడరాదని గ్రహింపనగును. అట్టియెడల 'జయ' అను క్రియా పదమును వాడుట పూర్వనియమమునకు సవరణ మును చేయుటయే. 'జయ పూతనాఘాత' మున్నగుచోట్ల 'పూతనాఘాతా ! వర్ధిల్లుము' అను విధముగానే యర్థము చెప్పవలయును.

కాని యిదికూడ అవ్యయసదృశముగా తెలుగున నుపయుక్తమగుచున్నది. 'జయపెట్టు' మున్నగుచోట్ల ఈ శబ్దము పొందిన మార్పు కొంతవరకు కనిపించు చున్నది. "వీకు జయపెట్టుచున్నారు సిరిని జనులు" అని యున్నప్పుడు 'జయము + పెట్టు' అని విభాగించుట అర్థానుకూలము కాదు. కావున 'జయపెట్టుట' యని యున్నప్పుడు 'జయ జయ యని యనుట' అనియే యర్థము. కావున ఇక్కడ 'జయము' అను ముపర్ణాంత శబ్దము కాక సంస్కృతక్రియాపదమే పూర్వాంగ మయ్యెననుకొనుట యుచితము. కావుననే అది వ్యస్తముగా కూడ వాడుక నొందుట కనబడుచున్నది. అనగా సంస్కృతక్రియయే యైనను, తెలుగున ప్రవేశించిన పిదప, అసమాప్తిని విడనాడి అవ్యయసదృశముగా నయ్యెనని యనిపించును.

'తలుచుగా' నవి సూత్రమున ప్రయోగించుటచేత, అట్లు కానినాడు, అనుకరణ సహితమై 'జయ యని పల్కె' మున్నగు విధముగా ప్రయుక్తము కావచ్చును.

80 వాక్యావసానంబున సంధిలేమి దోషంబు గాదని యార్యులండ్రు.

(బా - ౨౨)

సత్యము సర్వశ్రేయము. అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు॥ ఇట్లు సంధి విరహంబు కావ్యంబులం బాదాంతమందు చూపట్టెడు.

వ్యాఖ్య - వాక్యముయొక్క చివర సంధిలేకున్న యెడల, దానిని దోషముగా పరిగణింపరాదు యర్థము. ఒక వాక్యము చివరగల వర్ణమునకును, రెండవ వాక్యము మొదటగల వర్ణమునకును సంధి చేయకుండ నుండవచ్చును.

పై యుదాహరణమునందు మొదటివాక్యము కడపట ఉత్వము గలదు. రెండవ వాక్యము మొదట అత్వము గలదు. కావున ఉత్వసంధి యగుట కవకాశము కలదు. అయినను వాక్యాంతమునందలి వర్ణమునకు వాక్యాంతరము (మరొక వాక్యము) నందలి వర్ణముతో సంధి చేయుట అవసరము కాదని సూత్రకర్త నిర్ణయము.

[భారతాది ప్రాచీన గ్రంథములయందు వాక్యావసానమున నైతము సంధిని పాటించిరి. చిన్నయసూరి ఆ నియమమునకు కొంత సడలింపును సూచించు చున్నారు.]

ఒకే వాక్యమున నైనచో: ఇట్టి యెడల తప్పని సరిగా సంధి జరుగవలయు నని సూరి యభిప్రాయము. పద్యకావ్యము నందయినచో పాదాంతమందు సంధి విరహము (సంధిలేకుండుట) కనిపించును.

"మిన్నంది వేగ కయికొని
కన్నుల నొత్తుకొని మ్రొక్కి గారవ మొసఁగన్
వెన్నుఁడు రుక్మిణి కొసఁగెను
అన్నెలఁతయుఁ గొప్పులోన నవ్విరిఁ దాల్చెన్"

పై పద్యమున మూడవపాదము చివర ఉత్వము గలదు: నాల్గవపాదము మొదట 'అ' వర్ణము కలదు. సంధియగుటకు తావేయైనను పాదాంతమందలి యచ్చునకు, పాదాది నున్న యచ్చుతో సంధి కాలేదు. ప్రస్తుతసూత్రము దాని కవకాశమును గల్పించుచున్నది.

# సంధి పరిచ్ఛేదము

**1. ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగు.** (బా - ౧)

పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు.

రాముడు + అతఁడు = రాముఁడతఁడు

సోముఁడు + ఇతఁడు = సోముఁ డితఁడు

మనము + ఉంటిమి = మన ముంటిమి

అతఁడు + ఎక్కడ = అతఁ డెక్కడ

ఇతఁడు + ఒకఁడు = ఇతఁ డొకఁడు

వ్యాఖ్య - హ్రస్వమైన ఉకారమునకు పిమ్మట అచ్చువచ్చినయెడల సంధి యగునని సూత్రార్థము. ఉత్తు = హ్రస్వమైన ఉకారము. ఉద్దేశించిన యక్షరము నకు పైని 'త' వర్ణమును జేర్చి పలుకుటకు "తపరకరణము" అని పేరు. తపర కరణమువలన ముందరియక్షరము దీర్ఘమో, హ్రస్వమో స్పష్టముగా తెలియును. అత్తు, ఇత్తు, ఉత్తు - అనునవి హ్రస్వములయిన అ, ఇ, ఉ లను తెల్పును; ఆత్తు ఈత్తు, ఊత్తు - అనునవి దీర్ఘములయిన ఆ, ఈ, ఊ లను తెల్పును. అటుకాక అకారము, ఇకారము, ఉకారము - అని వాడినచో హ్రస్వదీర్ఘములు రెండును బోధింపబడును.

సంధి యనగా పూర్వస్వరమునకును, పరస్వరమునకును బదులుగా పరస్వర మొక్కటియే వచ్చుట యని యర్థము. ఒక వర్ణమును తొలగించి ఒక వర్ణము గాని, ఒక వర్ణ సముదాయమును తొలగించి ఒక వర్ణసముదాయము గాని వచ్చుటకు "ఆదేశము" అని యందురు. పూర్వస్థానమునందలి వర్ణమునకును, పరస్థానము నందలి వర్ణమునకును - రెండు వర్ణములకును బదులుగా ఒకే వర్ణము వచ్చినయెడల 'ఏకాదేశము' అని యందురు.

రాముఁడు + అతఁడు - అని యున్నప్పుడు 'రాముఁడు' పూర్వశబ్దము. 'అతఁడు' పరశబ్దము. పూర్వశబ్దము చిట్టచివర 'డు' అను నక్షరము కలదు. డ్ + ఉ = డు అని యగును. కావున పూర్వశబ్దముచివరనున్న యచ్చు ఉత్తు. పరపదము నందలి మొదటి యచ్చు 'అ'. సూత్రనియమము ప్రకారము ఉత్తునకు అచ్చు పరమం

ఇతర వ్యాకరణములయందు చేతన్, చేన్, తోడన్, తోన్ - అనినాలుగింటిని తృతీయావిభక్తిప్రత్యయములుగా పరిగణించుట జరిగెను. 'చేతన్' అనుదానిలో ఏక దేశమే 'చేన్' అనునది. అట్లే 'తోడన్' అనుదానిలో ఒక యంశమే 'తోన్' అను నది. కావున చేతన్, తోడన్ - అని చెప్పిన పిమ్మట చేన్, తోన్ - అని వేరుగా పరిగణింపవలసిన యవసరము లేదు. కావుననే సూరి వీనిని మార్గాంతరమున నిరూ పించి, 'చేత, తోడ' అనువానిని మాత్రమే ప్రత్యయములుగా ప్రదర్శించెను.

4. కొఱకు కయి చతుర్థి. (బా - ౪)

వ్యాఖ్య - చతుర్థీ విభక్తియందు కొఱకు, కయి - అను ప్రత్యయములగు నని సూత్రార్థము.

కయి యనునది 'కై' యను రూపాంతరమును సైతము పొందనచ్చును.

౫. వలన కంటెె పట్టి పంచమి. (బా - ౫)

వ్యాఖ్య - పంచమీ విభక్తియందు వలన, కంటె, పట్టి - అను ప్రత్యయములు మూడు నగునని సూత్రార్థము.

ఇతర వ్యాకర్తలు 'నుండి' అనుదానిని గూడ పంచమీ విభక్తిగా పరిగణించిరి. కాని యిది 'ఉండు' అను ధాతువుయొక్క క్త్వార్థక రూపమే యనియు, పూర్వమున్న ద్రుతముతో కలిసి 'నుండి' యని యగు చున్నదనియు, కాబట్టి దీనిని వేరుగా ప్రత్య యముగా పరిగణింప వలసిన యవసరము లేదనియు సూరి నిశ్చయము.

6 కు యొక్క లోపల షష్ఠి. (బా - ౬)

వ్యాఖ్య - షష్ఠీ విభక్తియందు కు, యొక్క, లోపల అను ప్రత్యయము లగు నని సూత్రార్థము.

కిన్, కున్, యొక్క, లోన్, లోపలన్ - అని యితర వ్యాకర్తలు పంచమీవిభక్తి ప్రత్యయముల నైదింటిని పరిగణించిరి. 'కున్' అను దానియొక్క రూపాంతరమే 'కిన్' అనునది. కావున దానిని ప్రత్యయాంతరముగా గ్రహింపవలసిన యవసరము లేదు. అట్లే 'లోపలన్' అనుదాని యేకదేశమే 'లోన్' అనునది. కావున దీనినికూడ మరొక ప్రత్యయముగా పరిగణింపవలసిన యవసరము లేదు. కావుననే సూరి పై మూడింటిని మాత్రమే షష్ఠీవిభక్తి ప్రత్యయములుగా నిర్ణయము చేసెను.

7. అందు న సప్తమి. (బా - ౬)

వ్యాఖ్య - సప్తమీవిభక్తియందు అందు, న - అను రెండు ప్రత్యయములు నగునని సూత్రార్థము.

ఆంధ్రశబ్ద చింతామణియందు 'ఇందున్' అను దానినిగూడ సప్తమీ విభక్తి ప్రత్యయముగా గ్రహించుట జరిగెను. 'ఇందున్' అని యనగా 'ఈ ప్రదేశమునందు' అనియర్థము. దీనిని ఇతరశబ్దములపై ప్రత్యయముగా వాడుట ఎక్కడను కనబడదు. 'అందు' అని ప్రత్యయమువలెనే శబ్దముకూడ కలదు. ఇందు, ఎందు - అనునవి కూడ ఆపోలిక గలిగిన శబ్దములే. కావున వీనికి ప్రత్యయప్రతిరూపము లనుపేరు గలిగెను.

8. తృతీయాదులకు నుగాగమం బగు. (బా - ౭)

రాముని చేతను - రాముని తోడను - రాముని కొఱకును - రాముని వలనను - రాముని కంటెను - రామునకును - రాముని యందును.

వ్యాఖ్య - తృతీయావిభక్తి మొదలుకొని సప్తమీవిభక్తి వరకు గల ప్రత్యయముల కన్నింటికి చివర 'ను' అనునది ఆగమముగా చేరును. ఆగమము అని యనగా వర్ణాధిక్యము: అనగా అదనముగా వచ్చి చేరునవి యర్థము. చేత, తోడ - మున్నగు వానికి ను వర్ణము చేరగా చేతను, తోడను, - మున్నగువిధముగా నగును: అనగా ద్రుతాంతములగునవి తాత్పర్యము. ద్రుతము నంతమందు గలవి ద్రుతప్రకృతికములు. కావున తృతీయ మొదలుకొని సప్తమి వరకు గల విభక్తిప్రత్యయము లన్నియు ద్రుతప్రకృతికములు అని చెప్పినట్లయినది.

[అన్నింటికిని ద్రుతము చేరునని తెల్పి, అట్లు చేరని వానిని సూరి తరువాతి సూత్రమున నిరూపించుచున్నాడు.]

9. కయి పట్టి యొక్కలకు నుగాగమంబు లేదు. (బా - ౮)

రామునికయి - జ్ఞానముఁబట్టి - రామునియొక్క.

వ్యాఖ్య - కయి, పట్టి, యొక్క - అను మూడు ప్రత్యయములకును చివర ను వర్ణము చేరదని సూత్రార్థము. కయి అనునది చతుర్థీవిభక్తి ప్రత్యయము: పట్టి పంచమీవిభక్తి ప్రత్యయము; యొక్క షష్ఠీవిభక్తి ప్రత్యయము. ఈ మూడింటికిని చివర ద్రుతము చేరదు: కావున ఇవి కళలు.

[ప్రథమావిభక్తి ప్రత్యయములైన డు, ము, వు, లు - అనునవియు కయి, పట్టి, యొక్క - అనునవియు కళలు. తక్కిన విభక్తి ప్రత్యయము లన్నియు ద్రుతప్రకృతికములు. ఇది సారాంశము.]

**10 చేత తోడ లోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు. (బా - ౧౦)**

ప్రత్యయంబు వర్ణకం బని ప్రాచీనులు వ్యవహరింతురు. రాముని చే - రామునితో - వనములలో.

వ్యాఖ్య : చేత, తోడ, లోపల - అను ప్రత్యయముల యందలి మొదటి యక్షరములు మాత్రమే మిగిలి ప్రత్యయములుగా పరిగణింపబడునని సూత్రార్థము. ఇది వైకల్పికముగా జరుగును. సూత్రమువ విధించిన కార్యము జరుగుటకు, జరుగ కుండుటకు కూడ నవకాశమున్నయెడల వికల్పమని యందురు. అనగా మొదటి యక్షరములు శేషించుట వలన చే, తో, లో - అనియు శేషింపకుండుట వలన చేత, తోడ, లోపల - యనియు రెండువిధములుగా రూపము లుండునని యర్థము.

ఇవన్నియు ద్రుతప్రకృతికము లగుట వలన చేతన్, చేన్: తోడన్, తోన్: లోపలన్, లోన్ - అను రీతిగా రూపము లుండును.

ప్రత్యయము అని యనగా వేర్వేరర్థములందు, వేర్వేరు ప్రయోజనములకై విధింపబడునది యని యర్థము. దీనినే ప్రాచీనులైన తెలుగు వ్యాకర్తలు వర్ణకము అని కూడ పిలిచిరి. అనగా వర్ణకము అని యన్నను ప్రత్యయము అని యన్నను ఒక్కటే యర్థము.

[ప్రత్యయమును వర్ణకము అనుటతోపాటు వర్ణము అని కూడ అన వచ్చును. ను వర్ణము లు వర్ణము అని సూరియే వాడెను. కేవల వర్ణములను, అనగా అ, క, హ - మున్నగువానిని వర్ణకము లని యనరాదు. ఈవిషయమును గుర్తుంచుకొనుట యవసరము.]

**11. డు ము వు వ లేకవచనంబులు. (బా - ౧౧)**

ఏకత్వ సంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు, రాముఁడు- సోముఁడు - వనము - ధనము - ధేనువు - భానువు.

వ్యాఖ్య - పైని చెప్పిన ప్రత్యయములలో డు, ము, వు - అను ప్రథమా విభక్తి ప్రత్యయములు మూడును, న - అను సప్తమీ విభక్తి ప్రత్యయమును ఏక వచనమునం దగు నని సూత్రార్థము. ఒకటి యను సంఖ్యను బోధించు ప్రత్యయమునకు ఏక వచనము అని పేరు.

డువర్ణకమునకు రాముఁడు, సోముఁడు - అనునవి ఉదహరణములు. వనము, ధనము - అనునవి మువర్ణకమునకు ఉదాహరణములు. వు వర్ణకమునకు ధేనువు, భానువు - అనునవి ఉదాహరణములు.

'న' అను సప్తమీ విభక్తి ప్రత్యయమునకు సూరి ఉదాహరణమును చూప లేదు. అది యేకవచనమునందు ఉదంత అదమునకు వచ్చు ప్రత్యయము. ఆ విషయ మును నిరూపింపకయే యుదాహరించుట కిష్ట పడక దాని విచ్చట మానియుండును. ధనమున, వనమున - అనునవి నవర్ణకమునకు ఉదాహరణలు.

## 12. లు వర్ణంబు బహువచనంబు. (బా - ౧౨)

బహుత్వ సంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు. రాములు - సోములు - వనములు - ధనములు-ధేనువులు-భానువులు.

వ్యాఖ్య - ప్రథమావిభక్తి యందలి 'లు' అను ప్రత్యయము బహువచనము నందగునని సూత్రార్థము.

ఒకటి కంటె ఎక్కువ అయిన సంఖ్యను బోధించు ప్రత్యయమునకు బహు వచనము లనిపేరు.

రాములు, సోములు - మున్నగు ఉదాహరణము లన్నింటియందును చివర నున్న లు వర్ణము బహుత్వ సంఖ్యను బోధించును. కావున ఇది బహువచన బోధకము.

## 13. తక్కినవి యుభయంబులు. (బా - ౧౩)

మిగిలిన ప్రత్యయము లేకత్వ బహుత్వములకు బోధకములని యర్థము. వనమును - వనములను - వనము చేతను-వనములచేతను - వనము తోడను - వనముల తోడను.

వ్యాఖ్య - పైని చెప్పిన అయిదు ప్రత్యయములనుగాక, తక్కిన అన్ని ప్రత్య యములును ఏకత్వమునందును బహుత్వమునందును గూడ అగునవి యర్థము.

'వనమును' అని యున్నప్పుడు 'ను' అను ద్వితీయా విభక్తి ఏకవచనమును బోధించుచున్నది. 'వనములను' అని యున్నప్పుడు బహువచనమును బోధించుచున్నది. అట్లే చేత, తోడ మున్నగు మిగిలిన విభక్తి ప్రత్యయములు కూడ ఏకవచనమునందును బహువచనమునందును సమానముగనే వచ్చును.

**14. ఓ యామంత్రణంబునం దగు. (బా - ౧౪)**

ఓ యను శబ్దము సంబోధనంబునం దగునని యర్థము. ఇది సంబోధ్యవాచకంబునకు ముందే ప్రయోగింపఁబడును. ఓ శబ్దంబు తొలంగియు సంబోధ్యవాచకంబు ప్రయోగింపవచ్చును. ఓ రాముఁడ– ఓ రాములార – రాముఁడ – రాములార.

వ్యాఖ్య : ఆమంత్రణము అని యనగా 'పిలుపు' అని యర్థము. ఒకరిని పిలువవలసి వచ్చినప్పుడు 'ఓ' యను శబ్దమును సంబోధ్య వాచకమునకు ముందు ప్రయోగింతురు.

సంబోధింపబడు వ్యక్తికి వాచక మగునది సంబోధ్యవాచకము. 'రాముఁడ' అనునది సంబోధ్యవాచకము. సంబోధనమునందు దీనికి పూర్వమందు 'ఓ' శబ్దమును చేర్చినయెడల 'ఓ రాముఁడ' అని యగును. బహువచనమైనచో 'ఓ రాములారా' అని యగును.

"ఓ శబ్దంబు తొలంగియు సంబోధ్య వాచకంబు ప్రయోగింపవచ్చు" నని యనుటచేత 'ఓ' అను శబ్దమును విడిచిపెట్టవచ్చును. 'తొలంగియు' అని యనగా 'విడిచిపెట్టియు' నని యర్థము. కావున రాముఁడ, రాములార - అనికూడ ప్రయోగింపవచ్చును.

**15. ఓ శబ్దం బొక్కచో సంబోధ్యవాచకంబునకు ముందితరశబ్దవ్యవహితంబయి కానంబడియెడి. (ప్రౌ - ౧౫)**

ఒక్కచో ననఁగా సంబోధ్యవాచకము క్రియాజన్య విశేషణపూర్వకంబగునపుడనియు, ఇతర శబ్దంబనఁగా ఆక్రియాజన్యవిశేషణమునకు సంబంధించిన పద మనియు నర్థము. ఓ వినువీధి నున్న ఖచరోత్తములార॥ వీర. ౨ ఆ॥ ఓ తోయజనేత్రుఁ గాంచిన వధూమణి॥ విజ. 3 ఆ॥

వ్యాఖ్య – ఒకచోట ఓ శబ్దమునకును సంబోధ్యవాచకమునకును నడుమ ఇతర శబ్దములు చేరి వ్యవధానము (ఎడము)ను కలిగించుటయు ప్రయోగములందు కనిపించుచున్నదని సూత్రార్థము.

'ఒక్కచో' అనియనగా సంబోధ్యవాచకమునకుముందు క్రియాజన్యవిశేషణము వచ్చినప్పుడనియు. 'ఇతరశబ్దము' అని యనగా ఆ క్రియాజన్యవిశేణముతో సంబంధము కలిగియున్న శబ్దమనియు ప్రౌఢవ్యాకరణకారుడే వివరించెను.

బాలవ్యాకరణకారుడు 'ఓ' శబ్దమునుగూర్చి చెప్పుచు 'ఇది సంబోధ్యవాచకంబునకు ముందే ప్రయోగింపబడును' అని యనుటచేత 'అవ్యవహితముగా' అను నర్థము రావచ్చునని తలచి, ప్రౌఢవ్యాకరణకారుడు స్పష్టతకొరకై యీ సూత్రము నారంభించెను. వ్యవధానము కలిగినప్పటికిని 'ఓ' యను శబ్దమును సంబోధ్యవాచకమునకు ముందుగనే ప్రయోగించుట జరుగుచున్నది. అనంతరమందు దాని కెన్నడును ప్రయోగము లేదు. కాన బాలవ్యాకరణకారుని యభిప్రాయమున కేమియు వ్యత్యయము కలుగలేదు. అందువలన ప్రౌఢవ్యాకరణకారుడు బాలవ్యాకరణాభిప్రాయమును వివరించుటకే యీ సూత్రము నారంభించెనని నిర్ణయింపవచ్చును.

'ఖచరోత్తములార' అనునది సంబోధ్యవాచకము. 'ఉన్న' అనునది క్రియాజన్యవిశేషణము. దీనితో సంబంధము కలది 'వినువీధిని' అన్న శబ్దము. కావుననే 'ఓ' అనుశబ్దమునకును 'ఖచరోత్తములార' అను సంబోధ్యవాచకమునకును మధ్యగా 'వినువీధి నున్న' అను శబ్దములు ప్రవేశించి యెడము కలిగించుచున్నవి. ఇట్లు ప్రయోగింప వచ్చును.

ఇట్లే 'వధూమణీ' అను సంబోధ్యవాచకమునకు ముందు 'కాంచిన' అను ధాతుజవిశేషణమును, దానితో సంబంధముగల 'తోయజనేత్రున్' అను శబ్దమును వ్యవధానము కలిగించుచుండగా, ఆ పూర్వమందు 'ఓ' అను శబ్దమును వాడుట జరుగుచున్నది.

'ఉన్న' అను క్రియాజన్యవిశేషణము తరువాతి విశేష్యముతో కూడి సమాసమగును. కావున సమాసమునకు నడుమ 'ఓ' అను శబ్దము ప్రవేశించుటకు వీలుకాదు. ఇంక ఈ 'ఉన్న' అనుదానితో 'వినువీధి' యన్నది అధికరణ సంబంధమును కలిగియున్నది. కావున ఇదియు వేరుగా నుండుటకు వీలుకాదు. కావుననే 'ఓ' అను శబ్దమునకు పిమ్మట 'వినువీధినున్న ఖచరోత్తములార' అను సమాసమంతయు సంబోధ్యవాచక మగుచున్నది. అట్టిదే రెండవ యుదాహరణను కూడ. 'తోయజనేత్రున్'

అను ద్వితీయాంత శబ్దము 'కాంచిన' అను ధాతుజవిశేషణముతో అన్వయముకలిగి యున్నది. అది 'వధూమణి' అను విశేష్యముతో కలిసి సమాసమగుచున్నది. కావున ఇచ్చట 'ఓ' అనునది సమాసమునకు పూర్వమందున్నట్లే ఓ పుణ్యంపు టిల్లాల ఓ యద్భుతంపు బాలిక – మున్నగు తెలుగుసమాసములకు ముందుకూడ ఓ లలితేంద్ర పీలశకలోపము కైశిక, ఓచతురాస్యవంశ కలశోదధి పూర్ణశశాంక – మున్నగు సంస్కృతసమాసముల ముందు వచ్చినట్లుగనే 'ఓ' యను శబ్దము వచ్చునని తాత్పర్యము. కేవల ధాతుజవిశేషణములతోడ సమాసమైనప్పుడే కాక, ఏకార్థీ భావసామర్థ్యమున్న అన్నిచోట్ల నిట్లు 'ఓ' పూర్వమందు రావచ్చును. ఇట్టివే ఓ కైటభ దైత్య మర్దనుని గాదిలి కోడల, ఓ హాటకగర్భురాణి – మున్నగు ప్రయోగములు.

**16.** ఓ శబ్దంబునకుం బురుష నీచస్త్రీపురుషామంత్రణంబులందు యి–సి – రి వర్ణంబులు విభాషనంతాగమంబు లగు (బా - ౧౩).

ఓయి రాముఁడ – ఓ రాముడ – ఓసి దుష్టురాల – ఓ దుష్టురాల – ఓరి దుష్టుఁడ – ఓ దుష్టుఁడ.

వ్యాఖ్య – ఓ శబ్దమునకు పురుషుని పిలుచునప్పుడు 'యి' అనునదియు, నీచస్త్రీని పిలుచునప్పుడు 'సి' అనునదియు, నీచపురుషుని పిలుచునప్పుడు 'రి' అనునదియు విభాషగా అంతాగమముగా నగును. అంతాగమమగుట యనగా చివర అదనముగా చేరుట యని యర్థము.

పురుషుని పిలుచునప్పుడు సంబోధ్యవాచకమునకు ముందు 'ఓయి' అనునది విభాషగా నగునని తాత్పర్యము. 'యి' వర్ణము చేరినయెడల 'ఓయి రాముఁడ' అని యుండును. చేరకున్నయెడల 'ఓ రాముఁడ' అని యుండును. నీచస్త్రీని పిలుచునప్పుడు సంబోధ్యవాచకమునకు ముందు 'ఓసి' యనునది విభాషగా నగునని తాత్పర్యము. 'సి'వర్ణము చేరినయెడల 'ఓసి దుష్టురాల'అని, చేరకున్నయెడల 'ఓ దుష్టురాల' అని యుండును. నీచ పురుషుని పిలుచునప్పుడు సంబోధ్యవాచకమునకు ముందు 'ఓరి' యనునది విభాషగా నగునని తాత్పర్యము. 'రి' వర్ణము చేరినయెడల 'ఓరిదుష్టుఁడ' అని, చేరనియెడల 'ఓ దుష్టుఁడ' అని యుండును.

**17.** ఓరి యోసి మైత్రియందుం గలవు (బా - ౧౪)

ఓరి చిన్నికృష్ణ – ఓసి ముద్దుబాల. ఓయి మొదలయినవానికి స్వతంత్రప్రయోగముం గలదు. సంగతియె యోయి – ఓసి పోవే –

ఓరోరి యింకెందుఁ బోవవచ్చు॥ వీనికి దీర్ఘంబుం గలదు॥ ఓయీ విప్రకులావతంస - ఓరీ దుష్టనిశాటులార - ఓసీ ననుఁ జెనక రాకు.

వ్యాఖ్య - పురుషుని పిలుచునప్పుడు 'ఓరి' యనియు, స్త్రీని పిలుచునప్పుడు 'ఓసీ' యనియు మైత్రియందు సైతము ప్రయోగింపబడునని సూత్రార్థము. మైత్రి యనగా స్నేహమని యర్థము. ఇది వాత్సల్యము. ఆదరము మున్నగువానికి ఉపలక్షకము.

'చిన్ని' అను పదమునకు 'ముద్దుగా నున్న' అని యర్థము. 'చిన్నికృష్ణ' అనునది వాత్సల్యపూర్వకమైన సంబోధనము. కావుననే దీనికి ముందు 'ఓరి' యను శబ్దము వచ్చినది. అట్లే స్త్రీని సంబోధించినప్పుడు 'ఓసి ముద్దుబాల' అని సంబోధ్య వాచకమునకు ముందు 'ఓసి' యనునది వాత్సల్యసూచకమై చేరినది.

ఓయి, ఓరి. ఓసి - అనువానిని సంబోధ్యవాచకమును విడిచి స్వతంత్రముగా కూడ ప్రయోగింపవచ్చును. నంగతియె యోయి - ఇక్కడ సంబోధ్యవాచకను లేదు. అట్లే ఓసి, ఓరి - అన్నవికూడ ప్రయోగింపబడినవి. 'ఓరోరి' అని యన్నప్పుడు 'ఓరి' శబ్దము పునరుక్తమైనది. దీనిని బట్టి ఓయి, ఓసి యనునవికూడ పునరుక్తములు కావచ్చునని సూచించుట జరిగినది.

వీనికి దీర్ఘముగూడ వచ్చును. అట్లు వచ్చినయెడల 'ఓయీ విప్రకులావతంస' మున్నగువిధముగా ప్రయోగింపబడును. 'ఓరీ దుష్టనిశాటులార' అను ప్రయోగము చేత సంబోధ్యవాచకము బహువచనమైనప్పుడుకూడ వీనిని ప్రయోగింప వచ్చునని సూరి సూచించుచున్నాడు.

[ఇవి మధ్యమపురుష క్రియలపై ఆ ... ప సంప్రార్థనాదులందు చేరుటయు కలదు. వినవోయి మిన్నక పోవోయి మున్నగునవి 'ఓయి' శబ్దముతోడి ప్రయోగములు. 'సటలిట మానురోరి' అని 'ఓరి' శబ్దముతోడి ప్రయోగము.]

**18. స్త్రీ తిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు. (బా - ౧౭)**

తిర్యక్కు లనఁగాఁ బశుపక్ష్యాదులు. జడము లనఁగా నచేతనములు.

**వ్యాఖ్య** - స్త్రీలను, పశుపక్ష్యాదులను, అచేతనములను గాక తక్కిన వానిని - వాని విశేషణములను మహద్వాచకములని యందురని యర్థము. స్త్రీలను, స్త్రీలకు

చెందు విశేషణములను మహతీ వాచకములని యందురు. పశుపక్ష్యాదులను, జడములను అమహద్వాచకము లని యందురు. ఇంకొక విధముగా చెప్పుకొనవలయునన్న దేవ మనుష్య రాక్షస జాతులకు చెందిన పురుషవాచకములను, తద్విశేషణములను మహద్వాచకములని చెప్పుకొనవచ్చును. ఈపైని చెప్పిన మూడు జాతులకు చెందిన స్త్రీవాచకములను, తద్విశేషణములను మహతీ వాచకములని చెప్పుకొనవచ్చును. పశుపక్ష్యాదులయందును జడములందును స్త్రీపురుషభేదములేకుండ అన్నింటిని అమహత్తులనియే పరిగణింపవలయును.

[సంస్కృతమున సాధారణముగా అర్థమునుబట్టి కాక శబ్దమునుబట్టియే లింగనిర్ణయము జరుగును. ఉదాహరణమునకు ఒకే యర్థమున గల మూడుశబ్దములను చూతము. 'పెండ్లము' అను నర్థమున 'భార్యా' అని యొక శబ్దము కలదు. అది స్త్రీలింగము. 'కళత్రమ్' అని మరొకశబ్దము కలదు. అది నపుంసక లింగము. 'దారాః' అను నింకొకశబ్దము పుంలింగ బహువచనమున నున్నది. ఈ యుదాహరణమునుబట్టి యొకే యర్థమును బోధించు భిన్నశబ్దములు భిన్న లింగములందుండుట మనకు కనిపించును. కావున సంస్కృతము నందలి పుంలింగము మున్నగువానితో తెలుగునందలి మహద్వాచకము మున్నగునవి సమానము లని పొరపడకుండుట యవసరము]

**19.** **క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగ తుల్యంబు లగు. (బా - ౧౮)**

మిత్ర శరణ ప్రధాన పాత్రాదులు మిత్రాదులు.

వ్యాఖ్య – క్లీబము లనియనగా నపుంసకములని యర్థము. సంస్కృతమున నపుంసకములయిన మిత్ర, శరణ, ప్రధాన, పాత్రప్రభృతి శబ్దములు మహద్వాచకము లైనప్పుడు విభాషగా పుంలింగతుల్యత్వమును పొందు నని అర్థము.

పుంలింగతుల్యంబు లగుట యనగా ఉత్వడుజ్ఞులను పొందుటయని తాత్పర్యము.

మిత్ర శబ్దము 'నెయ్యుఁడు' అను నర్థమున సంస్కృతమునందు నపుంసక శబ్దము. అది తెలుగున పురుషవ్యక్తిని బోధించునది (మహద్వాచకము) అగుటచే దానికి విభాషగా పుంలింగ తుల్యత్వము కలుగునని అర్థము. మిత్రుఁడు – మిత్రము (నెయ్యుఁడని అర్థము).

'సూర్యుఁడు' అను నర్థముగల మిత్ర శబ్దము పుంలింగమే కావున దానికి ప్రస్తుతసూత్రము వర్తింపదు. అనగా ఉత్వదుజ్జులు దానికి నిత్యముగా వచ్చి 'మిత్రుఁడు' అని యొకే రూపమున నుండును.

[సూత్రమున క్లీ నపుంసకలింగ మని చెప్పుటచేత 'మిత్ర' శబ్దము సూర్య పరమైనపుడు మిత్ర మనియు, మహత్తని చెప్పుటచేత 'సింగంబు మిత్రమగు జంబుకంబు' అనునప్పుడు మిత్రుఁ డనియు నుపయోగింప రాదని తెలిసికో వలెను — అని బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశికాకారులు వ్రాసిరి. దాని నుద్దేశించి "ఇందు 'మహద్వాచకంబులు' అనువిశేషణము లేకున్నచో అమహత్తులకుఁ గూడఁ బుంలింగ తుల్యత కలిగి 'సింగంబు మిత్త్రుఁడగు జంబుకంబు' మున్నగు ననిష్ట రూపములు సిద్ధముగునని కొందఱు టీకాకర్తలు వక్కాణించిరి. అది సరి కాదు. మహత్త్వము లేని వానికి పుంలింగతుల్యత కలిగినంతమాత్రాన ఉత్వము గాని దుజ్జు గాని ప్రాప్తించు నవకాశమే కానరాదు. అసంభావనీయము లగు ప్రత్యుదాహరణములు కల్పించుకొనుటకంటె 'ఈ విశేషణము స్పష్టార్థ' మనుకొనుట సమంజసము. స్పష్టార్థ మనఁగా, ఇంచుమించు ప్రయోజనరహిత మనియే యర్థము" అని మున్నగు విధముగా రమణీయ సమీక్షాకారులు వ్రాసిరి. చిన్నయ సూరి సూత్రమునం దొక యక్షరముకూడ వ్యర్థముగా వ్రాయ డను నమ్మకముగల సమీక్షాకారుల ఒక విశేషణమునే ప్రయోజనరహితముగా వాడె ననుట వింతగా నున్నది. సూరి నిజముగా నిష్ప్రయోజనముగనే వాడెనా ? తెలుగున సూత్రరచనమున సూరి 'న భూతో న భవిష్యతి' యన్న ఖ్యాతిని గడించు కొనిన సమర్థుడు. అట్టివాని సూత్రమున ప్రయోజనవంతము కానిపద ముండు ననుట అంగీకార్యము కాదు. అయినను పరిశీలించి సత్యము నావిష్కరింపవలసి నదే కదా!

మిత్రాదులు సంస్కృతమున నపుంసకములు. కావున "అమహన్నపుంస కములకు" అని మొదలయిన (బాల — 89) సూత్రమునుబట్టి 'మిత్రము' మొదల యిన మువర్ణకముతోడి రూపములు మాత్రమే రావలసియున్నవి. అట్టియెడల అవి మహదర్థకము లైనప్పుడు 'మిత్రుఁడు' మున్నగువిధముగా విభాషగా నగునని చెప్పుట యావశ్యకమే. మహద్వాచకము లైనప్పుడు మాత్రమే పుంలింగతుల్యము లగుట కవకాశము కలదు. కానిచో పుంలింగతుల్యము లగుటకే యవకాశము లేదు. ఇట్టి ముఖ్యమైన విశేషణము ప్రయోజనరహిత మనుట సరికాదు. ఇంకొక విషయము. 'మహత్త్వము లేనివానికి పుంలింగతుల్యత కలిగినంతమాత్రాన ఉత్వ ముగాని దుజ్జుగాని ప్రాప్తించు నవకాశము లేదు' అని యున్నది కూడ సందర్భ సముచితము కాదు. మహత్త్వము లేనివానికి పుంలింగతుల్యత కలుగుట యను ప్రసంగమే లేనిచోట 'కలిగినంత మాత్రాన' అను నవకాశమెక్కడ ? మరొక విషయము. పుంలింగతుల్యము లగునన్నప్పుడు ఉత్వముగాని దుజ్జుగాని

ప్రాప్తించు నవకాశము లేదని యనుట కూడ సరికాదు. పుంలింగమునకు ఉత్వ డుజ్ఞులు కాక పోవచ్చును. 'పుంలింగము' అనునది సంస్కృత శబ్దమున కన్వయించు సంజ్ఞ. తెలుగునందు ఉపయోగించు పుంలింగతుల్యము అనుదానికిని, 'పుంలింగము' అను దానికిని మిగుల భేదము కలదు. పుంలింగతుల్యము అని అన్నప్పుడు ఉత్వడుజ్ఞులు వచ్చుననియే భావము. దీనిని వ్యాఖ్యాతలు చెప్ప వలసిన యవసరము లేకుండ చిన్నయసూరియే అచ్చికపరిచ్ఛేదమున "తఱచుగ ననుటచేఁ బుంలింగతుల్యంబులుం గొందొక కలవని తాత్పర్యము" అని చెప్పి కొమరుఁడు – చందురుఁడు–జముఁడు – కందుఁడు అని ఉత్వడుజ్ఞులతోడి రూపములనే ఉదాహరించెను. పుంలింగతుల్యము లగునని యన్నప్పుడే ఉత్వడుజ్ఞ లగునని చెప్పినట్లయినది, ఇంతకును మిత్రాదులు మహద్వాచకము లైనప్పుడు ఎట్లుండునో చెప్పుటయే యుద్దిష్టమైనప్పుడు, అట్టి "మహద్వాచకములు" అను విశేషణమునే నిష్ప్రయోజన మనుట యుక్తిసంగతము కాదనవలసి వచ్చు చున్నది.] .

'శరణ' శబ్దము నపుంసకము. ఇది మహద్వాచకమైనపుడు విభాషగా పుంలింగ తుల్య మగును. 'రక్షణదాత' అను నర్థమున 'శరణుఁడు' అని యగును: పుంలింగ తుల్యత్వము వైభాషికమగుటచేత 'శరణము' అని కూడ నుండవచ్చును. 'ఆశ్ర యము' అనికాని 'గృహము' అనికాని అర్థమైనప్పుడు 'శరణము' అను రూపము మాత్రమే యుండును. (శరణు – అన్నది దీనికి రూపాంతరము.)

'ప్రధాన' శబ్దము నపుంసకము. 'మంత్రి' అనికాని 'ముఖ్యుఁడు' అనికాని అర్థమైనపుడు మహద్వాచకమై పుంలింగతుల్యత్వమును విభాషగా పొందుటచేత 'ప్రధానుఁడు' అనియు 'ప్రధానము' అనియు రెండు రూపములను పొందును. 'ముఖ్య మైనది' అను నర్థమున 'ప్రధానము' అని ఒక్కరూపము మాత్రమే యుండును.

అట్లే 'పాత్ర' శబ్దముకూడ 'అర్హము' 'భూమిక' మున్నగు నర్థములను గలిగినప్పుడు 'పాత్రము' అని మువర్ణకముతో కూడినరూపమే యుండును. 'అర్హుఁడు' అను నర్థమున మహద్వాచకమగుటచే విభాషగా పుంలింగతుల్యత్వము నొంది పాత్రుఁడు, పాత్రము – అని రెండు రూపములతో నుండును.

'ఆదులు' అని యుండుటచేత ఇట్టి వింకను గలవని సూత్రకర్త సూచించు చున్నాడు. వానిని ప్రయోగములను బట్టి గ్రహించవలయును.

౧౨]

**20. జిత్తు బిందుపూర్వం బగు. (బా - ౧౯)**

జకార మిత్తుగాఁ గలదానికి ముందు బిందువు వచ్చు నని యర్థము. కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించు నపుడు మానంబడు వర్ణ మిత్తనాఁబడు. ఉదాహరణము మీఁద స్పష్టం బగు.

వ్యాఖ్య _ ఒక ప్రయోజనము నపేక్షించి ప్రత్యయాదులయందు కూర్పబడి, ప్రయోగించునపుడు మానబడునట్టి వర్ణమునకు ఇద్వర్ణ మని పేరు. 'జ' కారమును ఇద్వర్ణముగా కలదానిని జిత్తు అని యందురు. జిత్తును గలిగియున్న వర్ణము బిందు పూర్వమై యుండునని సూత్రార్థము. అనగా జకారము ఏ వర్ణమునకు చివర ఇత్సంజ్ఞగా ఉపయుక్తమైనదో ఆ వర్ణమునకు ముందు బిందువు వచ్చు నని యర్థము.

డుజ్ తజ్ ప్రభృతులు జిత్తులు. రాముఁడు, వ్రాఁత - అనునవి వరుసగా వానికి ఉదాహరణములు.

**21. డుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది డుమంతం బనంబడు. (బా - ౨౦)**

స్పష్టము.

వ్యాఖ్య _ డుజ్ను ప్రత్యయము దేనికి చేరునో అది 'డుమంతము' అని యన బడును. 'రాముఁడు' అనుశబ్దమునందు 'డు' ప్రత్యయము 'రాము' అనుదానికి చేరు చున్నది. కావున 'రాము' అనునది డుమంతము.

[ప్రకృతి యనగా యథాస్థితమైన రూపమని యర్థము. బాలవ్యాకరణము నందు "ప్రకృతిభావము" అనుచోట యీ పదము మరల నుపయోగింపబడినది. అచ్చటకూడ నిదే యర్థము. దీనిని "ప్రాతిపదికము" అనుపదమునకు పర్యాయ ముగా గ్రహించి, కొందరు వ్యాఖ్యాతలు డుమంతము రూపమును వేరుగా భావించుచున్నారు. అది సరికాదు. సూరి ప్రాతిపదికార్థమున దానిని వాడలేదు.]

**22 పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబున కుత్వం బగు. (బా - ౨౧)**

నామం బనఁగాఁ బ్రాతిపదికము. డిత్థ - రామ - భార్గవ - రాజపురుష! ఇట్టివి ప్రాతిపదికములు. డిత్థు - రాము - భార్గవు - రాజపురుషు.

వ్యాఖ్య — ధాతువులు కాని, ప్రత్యయములు కాని కాకుండ అర్థవంతమై యుండునది ప్రాతిపదికము. దానికే నామమని యిత్యాది సంజ్ఞ కలదు. అంతమున ప్రత్యయము చేరని కృద్రూపమును, తద్ధితరూపమును, సమాసములుగూడ ప్రాతిపదికముగనే పరిగణించుట సంప్రదాయము. అట్టి నామము పుంలింగమై, మహద్వాచకముకూడ నై యున్న యెడల దాని తుది అత్వమునకు ఉత్వమగునని సూత్రార్థము.

'డిద్ధ' అనునది అవ్యుత్పన్నమగు ప్రాతిపదికము. ఇది సంస్కృతమున పుంలింగమై, పురుషవ్యక్తిని బోధించుటచేత తెలుగున మహద్వాచకమగుచున్నది. కావుననే దీని తుది అత్తున కుత్వము కలిగి 'డిద్ధు' అని యగుచున్నది. (తరువాతి సూత్రముచేత డుజ్వర్ణకము కలుగును. కావున 'డిద్ధు' అన్నంతవరకు ఇది డుమంతము).

'రామ' అనునది కృదంతరూపమైన ప్రాతిపదికము. 'రమ' యను క్రియాధాతువువలన నేర్పడినది. దీనికిని ఉత్వము కలిగి 'రాము' అని యగును. 'భృగు' శబ్దమునకు అపత్యార్థమున ఆదివృద్ధి కలుగగా 'భార్గవ' అన్నది ఏర్పడినది. ఇది తద్ధితరూపమైన ప్రాతిపదికము. ఇదియు పుంలింగమై మహద్వాచక మగుటచేత 'భార్గవు' అని తుది అత్వము ఉత్వముగా నగుచున్నది.

'రాజపురుష' యన్నది షష్ఠీ తత్పురుష సమాసరూపమైన ప్రాతిపదికము. దీనికిని ప్రస్తుతసూత్రముచేత ఉత్వము కలిగి 'రాజపురుషు' అని యగుచున్నది.

23. పుంలింగ మగు మహద్వాచకమునకు డుజగు. (బా - ౨౨)

ఇచ్చట డుజ్జను దానియందు జకార మిత్తుగావున జిత్తు బిందుపూర్వం బగు నను సూత్రముచేత డువర్ణమునకు ముందు సున్న వచ్చును. పిమ్మట జకారము లోపించును. ఉదా: డిద్ధుఁడు - డిద్ధుండు - భార్గవుఁడు - భార్గవుండు.

వ్యాఖ్య - పుంలింగమై మహద్వాచకమైన నామమునకు డుజ్ చేరు నని యర్థము. పూర్వసూత్రమున చెప్పఁబడిన డిద్ధాదులు సంస్కృతమునందు పుంలింగములు. తెలుగున పురుషవ్యక్తి బోధకములగుటచే మహద్వాచకములు. కావుననే వాని తుదియత్వమునకు ఉత్వము కలిగినది. అట్లేర్పడిన 'డిద్ధు' మున్నగు రూపములకు ప్రస్తుతసూత్రముచేత డుజ్వర్ణకము కలుగును.

"జిత్తు బిందుపూర్వంబగు" నను సూత్రమువలన 'డు' వర్ణమునకు బిందువు వచ్చును. అప్పుడు తుదినున్న జ వర్ణము లోపించిపోవును. డిద్ధుఁడు, రాముఁడు,

భార్గవుఁడు, రాజపురుషుఁడు - మున్నగువిధముగా రూపము లుండును. వీని యన్నింటి యందును డువర్ణమునకు పూర్వమందు అర్ధానుస్వారము గలదు. 'బిందువు' అని యనుటచే పూర్ణానుస్వారము కూడ రావచ్చును. అప్పుడు దిద్దుండు, రాముండు, భార్గవుండు; రాజపు[ru]షుండు మున్నగువిధముగా రూపము లుండును.

[అదంతమైన నామము పుంలింగమై మహద్వాచక మైనపుడు ప్రథమా విభక్తి యేకవచనమున నుండు రూపము చూపబడినది. ఇదంతములను, ఉదంతములను కొంత గ్రంథము నడచిన తరువాత చూపు నుద్దేశములో ఆపుచేసి, వైవిధ్యమంతగా లేని ద్వితీయాదిరూపములను ముందుగా చూపుచున్నాడు.]

**24. డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగు నపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు.** (బా - ౨౪)

రామునిని - రాముని - రామునిచేతను - రాముచేతను - రామునికిని - రామునకును. సర్వత్ర యనుట నగాగమ బాధనార్థము.

వ్యాఖ్య - ద్వితీయ మున్నగువిభక్తులయొక్క యేకవచన ప్రత్యయము పరమైనప్పుడు డుమంతమునకు సర్వత్ర నిగాగమము విభాషగా నగునని యర్థము. 'సర్వత్ర' అనియనగా 'ఎల్లయెడల' నని యర్థము. నిక్ + అగమము = నిగాగమము. దేనికి విధించిరో దానికి చివర వచ్చి చేరెడు 'ని' వర్ణమని యర్థము.

'రాము' అన్నది డుమంతము. దీనికి ఏకవచనమునందు ద్వితీయావిభక్తి ప్రత్యయమైన 'ను' అన్నది పరమైనది. అప్పుడు ప్రస్తుతసూత్రముచేత డుమంతమునకు చివర 'ని' వర్ణము చేరి 'రాము + ని + ను' అని యగును. ముందు రాబోవు "ఇకారంబుమీఁది కునువు క్రియా విభక్తుల యుత్వంబున కిత్వం బగు" అను (బాల - 28) సూత్రమునుబట్టి ద్వితీయా విభక్తియైన 'ను' వర్ణము 'ని' వర్ణముగా మారి 'రామునిని' అని యగును.

నిగాగమము విభాషగా నగును. కావున 'రాము + ను' అని యున్నప్పుడు నిగాగమము కలుగనియెడల, "డుమంతము మీఁది" అను (బాల - 29) సూత్రమునుబట్టి ద్వితీయావిభక్తి ప్రత్యయమైన 'ను' వర్ణము 'ని' వర్ణముగా మారి 'రాముని' అని యగును.

తృతీయావిభక్తి ప్రత్యయమైన 'చేత' పరనుండున్నప్పుడు 'రాము + చేత' అనియుండి 'ని' గాగమమై 'రామునిచేత' అని యగును. నిగాగమము కానియెడల

'రాముచేత' అనియే యుండును. తక్కిన ప్రత్యయములతోడి రూపములు విశ్లేషించి దేసి విధములుగా నుండును. రాముని కొఱకును, రాము కొఱకును: రామునికై, రాముకై; రామునికంటె, రాముకంటె; రామునివలనను, రామువలనను॥ పట్టి యను విభక్తి ద్వితీయాంత రూపముపైని చేరును. అప్పుడు రామునినిబట్టి, రామునిఁబట్టి, రాముఁబట్టి యను రూపములు కలుగును.

షష్ఠీవిభక్తి ప్రత్యయమైన 'కు' వర్ణకము పరమైనప్పుడు నిగాగమము కలిగినచో 'రాము + ని + కు' అనియై "ఇకారము మీది" అను సూత్రమువలన 'రామునికి' అని యగును. నిగాగమము రానియెడల, రాబోవు (బాల - 28) సూత్రమునుబట్టి 'న' వర్ణము ఆగమముగానై 'రాము + న + కు = రామునకు' అని యగును.

"కువర్ణకంబు పరంబగు నపు"డని మొదలు పెట్టిన సూత్రము "నగాగమం బగు" అని విధించుచున్నది. అది దాదాపుగా నిత్యప్రవృత్తిని కల్పించుచున్నది. ప్రస్తుతసూత్రము వైభాషికము. సాధారణముగా 'విభాష' యని యన్నప్పటికంటె 'అగు' అని చెప్పినప్పుడు ఆ విధికి బల మెక్కువ. అందువలన తరువాత విధింపబోవు 'న' వర్ణమునకు బల మెక్కువ యగుటచే 'ని' వర్ణమునకు వీలు కలుగదు. వీలుకలిగించుటకై సూరి 'సర్వత్ర' అను పదమును వాడెను. దీనివలన 'ని' వర్ణమును వాడని పక్షముననే 'న' వర్ణమునకు తావు లభించును. అది అప్పుడు తప్పక వచ్చును. దీనినే సూత్రకర్త "సర్వత్రయనుట నగాగమబాధనార్థము" అని వివరణమునందు సూచించుచున్నాడు. 'యొక్క' యన్న విభక్తి ప్రత్యయము కలిగినప్పుడు రామునియొక్క, రాముయొక్క అని యగును.

[సప్తమీవిభక్తికి ఇచ్చట ఉదాహరణము చూపలేదు. నిగాగమము కలిగినపుడు 'రామునియందు' అని యగును. కలుగనియెడల రాబోవు (బాల-28) సూత్రమునుబట్టి 'ను' వర్ణము కలిగి 'రామునందు' అని యగును.]

**25. అనుదంత మగు తెనుఁగు దుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును. (బా - ౨౪)**

మగనిని - మగనిచేతను - మగనికిని॥ అనుదంతం బను పర్యుదాసముచేతను॥ తమ్మునిని - తమ్ముని - తమ్మునిచేతను - తమ్ముచేతను, అల్లునిని - అల్లుని - అల్లునిచేతను - అల్లుచేతను, బల్లి

దునిని - బల్లి దుని - బల్లి దునిచేతను - బల్లి దుచేతను॥ ఇత్యాదులందును నిగాగమంబు పాక్షికంబని యెఱుంగునది.

వ్యాఖ్య - ఉదంతము కానిది అనుదంతము. అనుదంతమైన తెనుగు దుమంతమునకు నిత్యముగా నిగాగమము కలుగునని సూత్రార్థము.

నిషేధార్థమును రెండు విధములుగా చెప్పవచ్చును. 1. ప్రసజ్యప్రతిషేధము, 2. పర్యుదాసము. నిషేధార్థము క్రియతో అన్వయించినచో దానిని ప్రసజ్యప్రతిషేధమని యందురు. 'రాముఁడు బ్రాహ్మణుఁడు కాఁడు' అన్న వాక్యములో నిషేధము 'కాఁడు' అను క్రియతో అన్వయించి యున్నది. ఇది ప్రసజ్యప్రతిషేధమున కుదాహరణము. రాముడు బ్రాహ్మణ వర్ణమునకు చెందక మరి యే యితర వర్ణమునకో చెందినవాడని యర్థము. ఇట్లు కాక 'రాముఁడు అబ్రాహ్మణుఁడు' అని చెప్పినచో నిషేధము సమాసగతమై యున్నది. క్రియతో అన్వయింపక సమాసముతో సంబంధము కలిగి నిషేధార్థక మున్నయెడల దానిని పర్యుదాసమని యందురు. పై వాక్యమునకు రాముడు బ్రాహ్మణ సాదృశ్యము కలిగియు బ్రాహ్మణ భిన్నుడని యర్థము.

ఇచ్చట అనుదంత మనుచో సమాసగత మగునిషేధము కలదు. కావున అనుదంత మనుట పర్యుదాసము. ఈ పర్యుదానమువలన అనుదంతమునకు వలెనే ఉదంతమునకును నిగాగమము అగును; ఇంతవరకు సాదృశ్యము. ఉదంతమునకు నిగాగమము వైకల్పికము; ఇది భేదము. అనుదంతమగు తెనుగు దుమంతమునకు నిత్యముగాను, ఉదంత మగు తెనుగు దుమంతమునకు వికల్పముగాను నిగాగమ మగునని పిండితార్థము. 'మగఁడు' అను తెనుగుశబ్దమున 'మగ' యనునది దుమంతము. ఇది అనుదంతము. కావున నివర్ణము నిత్యముగా వచ్చును॥ మగనిని - మగనిచే - మున్నగు విధముగా రూపము లుండును.

తమ్ముఁ, అల్లు, బల్లిదు - అనునవి ఉదంతములైన తెలుగు దుమంతములు. కావున వీనికి ద్వితీయాదివిభక్త్యేకవచనము పరమగునప్పుడు నిగాగమము వికల్పముగా నగును. అప్పుడు తమ్ముని, తమ్మునిని, తమ్ముచేత, తమ్మునిచేత - అను విధముగా రెండేసి రూపము లేర్పడును.

[ పై సూత్రమున 'దుమంతము' అనుదానికి ముందు 'తెనుగు' అను విశేషణము చాల ముఖ్యమైనది. అది లేదనుకొన్నచో దాతృ ధాతృ విధాతృ పవితృ నేతృ శబ్దములకు కూడ నిగాగమము నిత్యముగా కావలసి వచ్చును. దానిని

వారించుటకుగాను 'తెనుగు' అను విశేషణము వాడుట యవసరమయ్యెను. "డుమంతంబునకు" అని మొదలయిన పూర్వ సూత్రమునుబట్టి వానికి నిగాగమము విభాషగా నగును.]

**26. డుమంతంబుమీఁది నువర్ణకంబు నుత్వంబున కిత్వంబగు.**

**(బా - ౨౫)**

నువర్ణంబు ద్వితీయ యను సూత్రముచేత 'రామును' అని ప్రాప్తింపగా నీ సూత్రముచేత నువర్ణకోత్వమున కిత్వంబు సిద్ధించె॥ రాముని - భార్గవుని.

వ్యాఖ్య - డుమంతమునకు పరమందున్న ద్వితీయా విభక్తి ప్రత్యయమైన 'ను' వర్ణముయొక్క ఉత్వమునకు ఇత్వము కలుగు నని సూత్రార్థము.

పూర్వసూత్రములచేత ద్వితీయావిభక్తి పరమైనప్పుడు నిగాగమము రాకున్న యెడల, అప్పుడు విభక్తి 'ను' వర్ణము ప్రస్తుతసూత్రముచేత 'ని' వర్ణముగా మారును.

'రాము' అను డుమంతమునకు ద్వితీయావిభక్తి పరమైనయెడల 'రాము + ను' అని యగును. పూర్వసూత్రముచేత 'ని' వర్ణము ఆగమముగా అయినయెడల 'రాము + ని + ను' అని యగును. అప్పుడు "ఇకారంబుమీఁది" అను సూత్రము ప్రకారము 'రామునిని' అని యగును. నిగాగమము రాని సమయమున నేమగు నను దానికి సమాధానముగా ప్రస్తుతసూత్రము ప్రవర్తించుచున్నది. నిగాగమము రాక పోవుటచే 'రాము + ను' అని యున్నచో నువర్ణకము యొక్క ఉత్వమునకు ఇత్వము కలిగి 'రాము + ని = రాముని' అని యగును.

[ నిత్యముగా నిగాగమము కలుగుచోట ఈ సూత్రమున కెంతమాత్రము నవకాశము లేదు.]

**27. ఇకారంబుమీఁది కు - ను - వు - క్రియా విభక్తుల యుత్వంబున కిత్వం బగు. (బా - ౨౬)**

హరిని - హరికిని - శ్రీని - శ్రీకిని - వారిని - వారికిని.

వ్యాఖ్య - ఇకారమునకు పరమందున్న కునువు అను వానియొక్క, క్రియా విభక్తులయొక్క ఉత్వమునకు ఇత్వము కలుగు నని సూత్రార్థము.

**ఇకారము అని యనుటచే ఇ, ఈ – అను హ్రస్వదీర్ఘములను రెండింటిని గ్రహింపవలయును. 'కు' అనునది షష్ఠీ ప్రత్యయము. 'హరి + కు' అనియున్నప్పుడు ప్రస్తుతసూత్రముచేత ఇత్వము కలుగగా 'హరికి' అని అగును. 'కు' వర్ణకము ద్రుతప్రకృతికము గావున 'హరి + కును' అనియుండిన హరి + కిను' అనియై, ఇత్వముమీది దగుటచేత 'ను' వర్ణము 'ని' వర్ణముగా మారి 'హరికిని' అని యగును.**

[షష్ఠీప్రత్యయము మాత్రమే కాక మధ్యను వ్యతిరేక క్రియయందు కూడ 'కు' గలదు. దీని విషయము తరువాతి సూత్రమున ప్రసక్తమగును.]

**'ను' అనునది ద్వితీయావిభక్తిగను, తృతీయాది విభక్తులమీది ద్రుతముగను కూడ నున్నది. ఇంతేకాక అస్మద్విశేషణమున కేకత్వమున నంతాగమముకూడ నగుచున్నది. ఇది ఇకారముమీద నున్నచో 'ని' వర్ణముగా మారును. శ్రీని – శ్రీకిని – సుకృతిని॥ అనునవి వరుసగా నుదాహరణములు.**

**'వు' అనునది యుష్మద్విశేషణమున కేకత్వమున కలిగెడు అంతాగమము. ఇదియు ఇకారముమీద 'వి' అని మారును. సుకృతి + వు = సుకృతివి.**

[యుష్మదర్థకమునకు ప్రథమైకవచన ప్రత్యయముగా 'వు' వ్యవహరించును. దాని విషయము తరువాతి సూత్రమునందు ప్రసక్తమగును.

**డు, రు, వు, రు, ను ము – అనునవి క్రియావిభక్తులు.**

**(డు వర్ణము విషయము తరువాతి సూత్రమున ప్రసక్తమగును.) వచ్చి + రు = వచ్చిరి. ఇట్లే వచ్చితివి, వచ్చితిరి, వచ్చితిని, వచ్చితిమి మున్నగునవి.**

[సూరి పైని చూపిన యుదాహరణములలో మూడును తత్సమశబ్దములే. 'హరి' పుంలింగశబ్దము. 'శ్రీ' స్త్రీలింగ శబ్దము. 'వారి' నపుంసక లింగ శబ్దము. కొందఱు చివరివైన వారిని, వారికిని – అనువాని నాచ్ఛికరూపములుగా గ్రహింపవలయునని యిష్టపడుదురు. అట్లైనచో 'వారు' అను తచ్ఛబ్దమునకు ద్వితీయాది విభక్తులు పరమైనపుడు 'రి' అన్నది యాగమముగా నైనదనవలయును. ప్రథమా బహువచనము నందగు 'రు' తొలగి పోవును. అపుడు 'వారి + ను' అనియుండగా ప్రస్తుతసూత్రముచేత ఇత్వము కలిగి 'వారి + ని = వారిని' అని యగును. తరువాతి లక్ష్యముకూడ ఇట్టిదే.]

**28. ఈధాతు యుష్మదర్థంబులమీఁది వాని యుత్వంబున కిత్వంబు రాదు. (బా – ౨౮)**

**ఈరు – ఈవు – ఈను – ఈము – ఈకు – నీకు – మీకు**

వ్యాఖ్య – 'ఇచ్చు' అను క్రియాధాతువు 'ఈ' అను పరిణతిని పొందును. అట్లు పరిణతిని పొందిన 'ఈ' ధాతువు మీదను, యుష్మదర్థకములైన ఈ, నీ, మీ– అనువాని మీదను వచ్చిన కు ను వు క్రియావిభక్తుల ఉత్వమునకు ఇత్వము రాదని యర్థము.

పూర్వ సూత్రమునుబట్టి యిక్కడ కూడ ఇత్వము రావలసి యున్నది. అట్లు రాకుండ వారించుటకై యీ సూత్రమావశ్యక మైనది.

'ఇచ్చు' అను ధాతువునకు ప్రథమపురుష బహువచన ప్రత్యయము వ్యతిరేకార్థమునందు కలిగి 'ఇచ్చు + రు' అని యగును. 'ఇచ్చు' అనుదాని కంతటికి ఆదేశముగా 'ఈ' రాగా 'ఈ + రు = ఈరు' అని యగును. ఏకవచనము పరము కాగా 'ఈవు' అని యగును. ఇకారము మీదనే వచ్చుచున్నను ప్రస్తుతసూత్రముచేత 'రు, వు' అను క్రియావిభక్తులకు ఇత్వము వారింప బడెను. 'వు' యుష్మదర్థకము లగు ఈ, నీ - అనువానికి ప్రథమావిభక్తియందగు ప్రత్యయము. కు ను వు అను వానిలో 'వు' వర్ణము కలదు. 'ఈ + వు' అని యున్నప్పుడు ఉత్వమునకు ఇత్వము కలుగ వలసియున్నను యుష్మదర్థకము మీది దగుటవలన ప్రస్తుతసూత్రము దానిని వారించుచున్నది. బహుత్వమునందు 'ఈరు' అను విధముగా నుండును.

ఈను, ఈము - అనునవి 'ఈ' ధాతువుయొక్క ఉత్తమ పురుష వ్యతిరేక రూపములు.

'ఈకు' అనునది మధ్యమపురుష వ్యతిరేక క్రియ 'ఈకుము' అని యుండగా 'ము' వర్ణమునకు లోపమువచ్చిన రూపము. ఇక్కడి 'కు' వర్ణము 'ఈ' ధాతువు మీది దగుటవలన ఇత్వమును పొందదు.

[ కొందరు 'ఈకు' అన్నది యుష్మదర్థక షష్ఠీ రూపము కూడ నగు నను చున్నారు అట్లే యైనయెడల బాలప్రౌఢ వ్యాకరణకారులలో నెవ్వరును ఆరూపమును ప్రదర్శింప కుండుట జరుగదు. కావున అది వారికి సమ్మతము కాదనియే నిశ్చయము. ]

పై యుదాహరణములందు మొదటి రెండు, చివరిరెండు యుష్మదర్థకములు. మొదటివి ప్రథమాంతములు; చివరివి షష్ఠ్యంతములు. మరల మొదటినుండి ఐదు రూపములు క్రియలు. అనగా మొదటిరెండును సర్వనామములు క్రియలు నగుచున్నవి. తరువాత మూడును క్రియలు; తరువాతి రెండును సర్వనామములు. లక్ష్యప్రదర్శనమునందు పైతము చక్కని క్రమము పాటింప బడినది.

29 కు ప్రత్యయంబు పరంబగునపు డుకార ఋకారంబులకు నగాగమం బగు. (బాల - ౨౮)

రామునకును - విష్ణునకును - సవితృనకును - విధాతృనకును.

వ్యాఖ్య - షష్ఠీవిభక్తిప్రత్యయమైన 'కు' పరమందున్నప్పుడు పూర్వమున్న ఉకార ఋకారములకు మీద 'న' అనువర్ణము అదనముగా వచ్చి చేరునని యర్థము.

'రాము' అను డుమంతమునకు 'కును' వర్ణకము పరమైనది. అప్పుడు "డుమంతంబునకు" అని ప్రారంభమైన (బాల - 23) సూత్రమునుబట్టి 'రామునికిని' అని కావచ్చును. అట్లు కాకున్నయెడల ప్రస్తుతసూత్రముచేత 'న' అను వర్ణము కలుగగా 'రామునకును' అని యగును. 'విష్ణు + కును' అని యుండగా 'న' గాగమము కలిగి 'విష్ణునకును' అని అయిన రూపము కూడ ఇట్టిదే. ఈ రెండును ఉదంతములకు లక్ష్యములుగా చూపబడినవి. మొదటిది కృతోత్కము: రెండవది సహజోత్కము.

'సవితృ + కును' అని యున్నప్పుడు పూర్వసూత్రము చేత నిగాగమము కలిగిన 'సవితృనికిని' అని యగును. అట్లు కాని పక్షమున 'న' వర్ణము కలిగి 'సవితృనకును' అని యగును. 'విధాతృనకును' అన్నదికూడ ఇట్టిదైన రూపమే. ఈ రెండును, ఋ వర్ణాంతములకు లక్ష్యములుగా చూపబడినవి. దాతృ ధాతృ విధాతృ సవితృ నేతృ శబ్దములను మాత్రమే యిక్కడ గ్రహింప నగునన్న విషయము గుర్తుంచుకొనుట యావశ్యకము.

సూరి లక్ష్యములందు డుమంతములను మాత్రమే చూపెను. ఉగంతములు మొదలయిన వానిని చెప్పకపోవుట వలన వానిని ముందుగా ఉదాహరించుట భావ్యము కాదని తలచెనేమో: అచ్చిక శబ్దముల నైన నుదాహరింప వచ్చును. అట్లును చేయ లేదు. మరుత్తు - మరుత్తునకు; సరసు - సరసునకు; కొలను - కొలనునకు; జలము - జలమునకు; వధువు - వధువునకు॥ మున్నగువిధముగా ఉదాహరణము లుండును.

[ఇప్పుడింక ఒక ప్రశ్న యుదయించును. సూత్రమునందు దెచ్చుటను ఏకవచన మన్న ప్రసంగములేదు కదా? బహువచనమున కూడ నగాగమము రావలదా? యనిపించును. తరువాత వచ్చు (బాల–31) సూత్రముచేత లగాగమము కావలయును. కావున ఇక్కడ బహువచన విషయము లేదు. అంతేకాక "డుమంతంబునకు" అని మొదలయిన సూత్రము (బాల–28) వివరణమునందు నగాగమ

ప్రసంగము కలదు. అక్కడి సందర్భమునుబట్టి యేకవచనమునే గ్రహింపవలయు నని వ్యాకర్త యభిప్రాయము.]

30. కువర్ణకంబు పరంబగునపుడు కవిత్రయంబువారి ప్రయోగంబులం దక్కం దక్కిన మహాకవి ప్రయోగములందునుం గొన్ని యెడల నగాగమంబు చూపట్టదు. (ప్రౌ - ౧౫)

సంగరమునకు నుత్సవముకేఁగెదు క్రియ సోలవక చనియెదు శూరులార॥ ఉ. హరి. ౬ ఆ॥ లాలనఁ గ్రొత్త బెబ్బులి కళాసము వెట్టిరి యాసనంబుగా। గోలయు సాధువైన యొకగోమటికిన్ నిషధేంద్రు బచ్చుకున్॥ నై. ౬ ఆ॥ వెలఁది సోయగంబు వీక్షింప వినుతింప। వేయి కన్ను లమరవిభుని కిచ్చి। రెండువేల జిహ్వ లండజాధీశ్వరు। కొసఁగఁ బోలుఁ బంకజోద్భవుండు॥ విక్రి. ౪ ఆ॥ బలవంతపుఁ జాపము దెచ్చుకొంటి వే। లా నగుఁబాటు కోర్చి॥ భోజ. ౫ ఆ॥ (ఇట్టి ప్రయోగములంబట్టి యాగమశాస్త్ర మనిత్యమగుటవలనఁ దక్కినచోట్ల నకారాగమము రాకుండినను దోషంబు లేదనియు, కుత్సార్థదోషవిస్ఫురణంబు గలుగక పువర్ణాంతశబ్దములమీద నకారాగమము వచ్చుటకే తత్సూత్రారంభ ప్రవృత్తియై యుండును గాన నచ్చో మాత్రమయ్యది యత్యావశ్యక మనియుఁ దోఁచుచున్నయది.)

వ్యాఖ్య – బాలవ్యాకరణమునందలి నగాగమవిధిని సవరింపనెంచి ప్రౌఢవ్యాకర్త యీ సూత్రమును రచించుచున్నాడు.

కవిత్రయమువారి ప్రయోగములందు తప్ప, తక్కిన మహాకవుల ప్రయోగములయందు సైతము 'కు' వర్ణము పరమైనప్పుడు ఉత్వముమీద 'న' కారము కనిపించుట లేదని సూత్రార్థము. అనగా కవిత్రయమువారియందు నగాగమము నిత్యముగా అగుచున్నదనియు, తక్కినవారియందు కాకుండ నుండుటకూడ కలదనియు ప్రౌఢవ్యాకర్త యభిప్రాయము.

'ఉత్సవము + కు' అని యున్నప్పుడు నగాగమము కలిగినయెడల 'ఉత్సవమునకు' అని కావలయును. కలుగక పోవుటచేత 'ఉత్సవముకు' అని నాచనసోమన ప్రయోగించెను. 'బచ్చు + కున్' అని యున్నప్పుడు 'న' వర్ణము లేకుండగనే

శ్రీనాథుడు 'బచ్చుకున్' అని ప్రయోగించెను. ఇట్టివే అండజాధీశ్వరు కొనఁగఁబోలు: నగుఁబాటుకోర్చి – అను ప్రయోగములు.

కుత్సార్థమ = అశ్లీలార్థము. అశ్లీలార్థము అను దోషము స్ఫురింప కుందుటకై పు వర్ణాంత శబ్దములమీద 'న' వర్ణము వచ్చి తీరవలయుననియు, అందుకొరకే బాలవ్యాకర్త నగాగమవిధికి సంబంధించిన సూత్రము వ్రాసియుండుననియు, అందువలన ఇతరస్థలములయందు 'న'వర్ణము రాకున్నను దోషము లేదు కాని పు వర్ణాంత శబ్దముల మీద తప్పక రావలయు ననియు బహుజనపల్లి వారి అభిప్రాయము.

కవిత్రయప్రయోగములందు 'న'వర్ణము కలదు. కావున దానిని చూపుట వ్యాకర్తకు తప్పదుకదా ! అందు వలన సూరి నవర్ణ విధిని చెప్పుట సమంజసమే. ఆ చెప్పుటలో 'అగు' అని చెప్పెనే కాని 'నిత్యము' అని చెప్పలేదు. కావున, తానే యితరకవుల నగాగమ విరహిత ప్రయోగములకును అవకాశము కల్పించెను. "ఆగమ శాస్త్ర మనిత్య"మ్మని తెల్పు సంస్కృతవ్యాకరణసంప్రదాయమునుబట్టికూడ ఆ యవకాశము కలుగుచు న్నది.

ప్రౌఢవ్యాకర్త కుత్సార్థస్ఫురణము లేకుండుటకై పువర్ణాంతశబ్దములమీద నగాగమము నిత్యముగా చేయవలయునని, అందులకే సూరికూడ సూత్రమును వ్రాసెనని యనుచున్నాడు. సూరికి ఈ యభిప్రాయ ముండెననుటకు తార్కాణము లేదు. పైగా కొందరు కవులు పు వర్ణముమీద నగాగమము చేయకయే 'కు' వర్ణకము చేర్చుట కలదు. వంకుసాల నృసింహకవి 'పితృష్ కోర్వక' యని వాడెను. భైరవకవి 'సొంపుకు' అని వాడెను.

పై వివరణమునుబట్టి 'కు' వర్ణకము పరమైనప్పుడు ఉత్వముపై నగాగమము లేకుండ అనంతరకవులు వాడిరన్న విషయమును అంగీకరించి తీరవలయును. 'అగు' అని యనుట వలన సూరియే ఆ యవకాశమును సూచించుచున్నాడు. ఇంక, ప్రౌఢవ్యాకర్త కుండలీకరణముల నడుమ వ్రాసిన విషయము వ్యాకరణోచితముగాని, ప్రయోజనవంతముగాని కాదు.

**31. కంటె వర్ణకంబు పరంబగునపుడు గొన్నియెడల నగాగమంబు చూపట్టెడి. (ప్రౌ - ౨౦)**

తత్కృతుశతంబునకంటె సుతుండు మేలు॥ భార. ఆది. ౪౫॥ మనయింటి చేటు చూచితె। మనకులసత్తముఁడు లోఁబడఁగె మైథిలినిన్

భూ। జనవాదంబు మహాత్ముల! యనఘచరిత్రమునకంటె నధికం బగు
టన్॥ నిర్వ. ౬ ఆ॥

వ్యాఖ్య - ఉకారాంతములును, ఋకారాంతములునైన శబ్దములకు పరమందు 'కంటె' అను ప్రత్యయము వచ్చినపుడు కొన్నిచోట్ల 'న' వర్ణము ఆగమముగా వచ్చుచున్నదని సూత్రార్థము.

ఇది బాలవ్యాకరణమునకు పూరకము. బాలవ్యాకరణము 'కు' వర్ణకము పరమైనప్పుడు మాత్రమే నగాగమమును విధింపగా, 'కంటె' వర్ణకము పరమైనప్పుడు కూడ నగాగమము కలదని ప్రౌఢవ్యాకరణము పూరణముచేయుచున్నది.

'శతంబు + కంటె' అని యున్నప్పుడు ప్రస్తుతసూత్రము చేత నగాగమము కలిగి 'శతంబు + న + కంటె = శతంబున కంటె' అని యగుచున్నది. కొన్నియెడల మాత్రమే కనిపించు చున్నదని యనుటచేత, నగాగమము కానియెడల "శతంబు కంటె" అనియే యుండిపోవును. 'చరిత్రము + కంటె' అని యున్నప్పుడు 'న' వర్ణము కలిగినప్పుడు 'చరిత్రమునకంటె' అని యగును. కలుగని యప్పుడు 'చరిత్రముకంటె' అనియుండును.

**32.** ఉకార ఋకారంబుల కందు వర్ణకంబు పరం బగునపుడు నుగాగమంబగు. (బా - ౨౯)

రామునందును - విష్ణునందును - విధాతృనందును.

వ్యాఖ్య - ఉకారాంతములు ఋకారాంతములునైన డుమంతములకు ఏకత్వమున 'అందు' అను సప్తమీవిభక్తి ప్రత్యయము పరమైనప్పుడు 'ను' గాగమము కలుగునని సూత్రార్థము,

'రాము + అందు' అని యున్నప్పుడు మొదటిశబ్దము ఉదంతము. అందు అను ప్రత్యయము పరమందున్నది. కావున సూత్రములో విధించినట్లు 'ను' వర్ణము ఆగమముగా కలిగినయెడల 'రాము + ను + అందు' అనియై సంధికార్యముచేత 'రామునందు' అని యగును.

'విష్ణు + అందు' అని యున్నప్పుడు పూర్వశబ్దము ఉదంతము. ఇక్కడి ఉకారము శబ్దసిద్ధమైనది. అనగా ఈ శబ్దము సహజోత్కము. దీనికిని 'అందు' వర్ణకము పరము కాగా 'ను' అనునది ఆగమముగా నగును. అప్పుడు 'విష్ణు + ను + అందు = విష్ణునందు' అని యగును.

'విధాతృ + అందు' అని యున్నప్పుడు ఋవర్ణాంతము పూర్వశబ్దము. దీని కివి 'అందు' వర్ణకము పరమైనప్పుడు 'ను' వర్ణముకలిగి 'విధాతృ + ను + అందు= విధాతృనందు' అని యగును.

ఇదంతయు "డుమంతంబునకు" అని మొదలయిన (బా - 23) సూత్రము ప్రవర్తింపనిచోట్ల మాత్రమే జరుగును. ఆసూత్రము ప్రవర్తించినయెడల రామునియందు, విష్ణునియందు, విధాతృనియందు అని - నిగాగమముతోడి రూపములేర్పడును. "సర్వత్రయనుట నగాగమబాధనార్థము" అని చెప్పిన వివరణలోనివాక్యము నుగాగమమునుకూడ బాధించుచున్నది. కావున 'నగాగమ' శబ్దమును ఉపలక్షణముగా గ్రహించి దానిచే నుగాగమమునుగూడ చేర్చుకొనవలయును. విభాషగా నగునటువంటి 'ని' వర్ణము రానిచోట్ల మాత్రమే 'ను' వర్ణము వచ్చుట కవకాశము కలదు. అందువల్ల రామునియందు, రామునందు - విష్ణునియందు, విష్ణునందు - విధాతృనియందు, విధాతృనందు॥ అను విధముగా రెండు విధములైన రూపములును వచ్చును.

**33. ఆగమ ము వు వర్ణంబుల కందు వర్ణకము పరంబగునపుడు నుగాగమము విభాష నగు. (బా - ౩౦)**

వనమునందును - వనమందును - ధేనువునందును-ధేనువందును.

వ్యాఖ్య _ ఆగమములైన మువర్ణమునకును, వు వర్ణమునకును పరమందు అందు అను ప్రత్యయము వచ్చినయెడల విభాషగా 'ను' వర్ణము వచ్చునని సూత్రార్థము.

'వనము' అని యున్నప్పుడు 'ము' వర్ణకము ప్రథమావిభక్తిప్రత్యయము. "అమహన్నపుంసకములకు" అని మొదలయిన (బాల - 39) సూత్రమునుబట్టి యిది యగును: ద్వితీయాదివిభక్తులు పరమైనప్పుడు అదేస్థానమున 'ము' ఆగమముగా నగును. 'వు' వర్ణముకూడ ఇట్లే ప్రథమావిభక్త్యంతమై యున్నప్పుడు ప్రత్యయమై, ఇతరవిభక్తులున్నప్పుడు ఆగమమై నిల్చును. ప్రస్తుతోదాహరణములయందు సప్తమీవిభక్తి పరమగుచున్నది. కావున 'ము, వు' వర్ణములు ఆగమములనియే గ్రహింపవలయును.

'వనము + అందును' అని యుండగా ప్రస్తుతసూత్రము చేత 'ను' ఆగమముగా వచ్చి 'వనము + ను + అందును' అనియై సంధినొంది 'వనము

నందును.' అని యగును. విభాషయని యనుటచేత సూత్రమున చెప్పినట్లు 'ను' వర్ణము రాని పక్షమున 'వనము + అందును = వనమందును' అని మాత్రమే యగును.

'ధేనువు + అందును' అని అన్నప్పుడు పూర్వశబ్దము వుగాగమాంతము. ఇప్పుడుకూడ 'ను' వర్ణము కలిగి 'ధేనువు + ను + అందును' అనియుండి 'ధేనువునందును' అనియగును. నుగాగమము రానిపక్షమున 'ధేనువు + అందును = ధేనువందును' అని యుండును.

ఇంతవరకును వికల్పమునకు ఉదాహరణములను చూచితిమి. 'విభాష' అని యన్నప్పుడు వికల్పమును, నిషేధమును కలిసియుండును. కాని ప్రస్తుతోదాహరణములందు నిషేధము కలుగు తావులేదు. అన్యత్వమునకు అవకాశము కలదు. బాలవ్యాకర్త వికల్పము, అన్యత్వము - అను రెండింటిని నిర్వహింప దలచియే యిచ్చట 'విభాష' యను శబ్దమును వాడి యుండెనని యనిపించుచున్నది.

మువర్ణమునకు మూముడి కలిగినప్పుడు 'ను' గాగమము రావచ్చును. వృక్షమ్ము + అందు = వృక్షమ్మునందు॥ రానియెడల 'వృక్షమ్మందు' అని యుండును. మువర్ణకమునకు పూర్ణబిందు పూర్వక బు వర్ణము కలిగినప్పుడు నీ కార్యము జరుగును. వృక్షంబు + అందు = వృక్షంబునందు; వృక్షంబందు.

"ఆగమ ము వు వర్ణములు" అని యనుటచేత శబ్దసిద్ధములైన (అచ్చిక శబ్దములందలి) ము వు ల కు 'అందు' పరమగునపుడు 'ను' గాగమము నిత్యముగా నగుచున్నది. బియ్యము + అందు = బియ్యము నందు; చెఱువు + అందు = చెఱువునందు॥ మొదలయినవి యుదాహరణములు. సూత్రము నందున్నవానికి కాక, అవ్యయములకు నుగాగమము వచ్చుటచేత ఇవి అన్యత్వమునకు లక్ష్యము లగుచున్నవి.

బాతు, పుట్టు - మొదయిన కొన్ని ఉదంతములైన అచ్చిక శబ్దములకు 'వు' గాగమము కలుగును. అప్పు డది ఆగమమే యగుటచేత 'ను' వర్ణము వికల్పముగా నగుచున్నది. బాతువునందు, బాతువందు, బాతునందు - పుట్టువునందు, పుట్టువందు, పుట్టునందు॥ అనునవి యుదాహరణములు.

**34. ఉదంతములగు సమహత్తుల కందు వర్ణకము పరంబగునపుడును నగాగమంబు కొన్నియెడలఁ గానంబడియెడి. (పౌ్రి - ౨౦)**

జీవ ! నీ। వనిమిమనాయకత్వమునయుం దభిషిక్తుఁడవై ముదంబులో। వనుఁ బఱిగొమ్ము॥ భార. అర. ౫౦॥ విను పిండదానసమయుం।

బునయందును భక్తిపూర్వముగ దీనిఁ బఠించిన నయ్యన్నంబమృతము। నెనయుఁ దురగమేధఫలము నిచ్చుఁ గృతాత్మా॥ హరి. పూ. ౨ఆ॥ సంతరించితి నిందు జవ్వనంబునయందు। హర్ష నైషధకావ్య మాంధ్ర భాష॥ కాశీ. ౧ఆ॥ జననాథ! నన్ను నడుగఁగఁ। జనుదెంచిన కార్య మేను సర్వంబు మనంబునయందు మున్న యెఱుఁగుదు। విను చెప్పెద నీకుఁ దగునె విడువఁగ భార్యన్॥ మార్క. ౫ఆ॥ డక్కఁగ వ్రాసితిన్ మును పటమ్మునయందు సుశర్మపాపముల్॥ పాండు. ౫ఆ॥ మొ.

వ్యాఖ్య - ఉదంతములయిన అమహద్వాచకములకు సప్తమీవిభక్తి ప్రత్యయ మైన 'అందు' అనునది పరమగునప్పుడు సైతము 'న' వర్ణము ఆగమముగానగును. (సైతము అని యనుట వెనుక 'కంటె' పరమైనప్పుడు 'న' వచ్చిన సంగతిని గుర్తు చేయుటకు)

'అనిమిషనాయకత్వము + అందు' అని యున్నప్పుడు 'న' వర్ణము కలిగి 'అనిమిషనాయకత్వమునయందు' అని యగును. నవర్ణము కలుగనియెడల వెనుక చెప్పినట్లు 'ను'గాగమము విభాషగా కలిగి అనిమిషనాయకత్వమందు, అనిమిషనాయ కత్వమునందు – అను రూపములు కలుగును.

'సమయంబు + అందు' – ఇక్కడి పూర్వశబ్దము ముువర్ణమునకు బదు లుగా వచ్చిన పూర్ణబిందువుతోడి శబ్దము. దీనికి 'న'గాగమము కలుగగా 'సమయం బునయందు' అని అగును. ఇదికాక 'ను' వర్ణమే విభాషగా వచ్చినయెడల 'సమ యంబందు, సమయంబునందు' అను విధముగా రూపము లుండును.

జవ్వనంబునయందు, మనంబునయందు – అనునవికూడ ముువర్ణమునకు బదులుగా వచ్చిన పూర్ణబిందువుతోడి 'బు' వర్ణముపై నగాగమము రాగా నేర్పడిన రూపములే.

'పటమ్ము + అందు' అని యున్నప్పుడు పూర్వశబ్దము మూఁడు మూముడి వచ్చిన రూపము. ఇప్పుడుకూడ న వర్ణము కలిగి 'పటమ్మునయందు' అని యగును. అట్లు 'న' వర్ణము రానిపక్షమున 'ను' వర్ణము విభాషగా వచ్చి 'పటమ్మునందు, పట మ్మందు' అను రూపములు వచ్చును.

ఉదంతము అని యున్నప్పుడు 'ము, వు,' అను రెండు వర్ణములును చివర నున్న రూపములను గ్రహింపవచ్చును. ప్రౌఢవ్యాకర్త ము వర్ణము, తద్వికారములు

చివరనున్నప్పటి రూపములనే చూపెను. 'తనవునయందు' అనునది వు వర్ణముతో డి రూపమునకు ఉదాహరణము. ఒడలు, బ్రతుకు - మున్నగు నాచ్ఛికశబ్దములకు మీద 'అందు' వచ్చినప్పుడుకూడ 'న'గాగమము కలిగి 'ఒడలునయందు' అని 'బ్రతుకున యందు' అని రూపములు కలుగవచ్చును.

బాలవ్యాకర్త సంధి పరిచ్ఛేదము 24 వ సూత్రమున "సమానంబున యందు" అని తానే వాడెను. కావున ఇట్లు నగాగమము వచ్చుట సూరికి సమ్మతమే యని పించును. "ఆగమ ము వు వర్ణంబులకు" అను సూత్రమునందలి 'విభాష' యను శబ్దమే దీనికిని నిర్వాహకము కావచ్చును, "ఆగమ ము వు వర్ణంబులకు" అన్న సూత్ర ములో చెప్పినట్లు నుగాగమము కాక, తదన్యమైన నగాగమము వచ్చినయెడల నది యన్యత్వ మనిపించుకొనును. కావున 'విభాష' యన్నప్పుడు వికల్పముతో పాటు, అన్యత్వమునుకూడ బాలవ్యాకర్త భావించెనని యంగీకరించినచో 'న' వర్ణమునకు ఆవకాశము అచ్చటనే కలిగెనని యనవచ్చును. అయినను అన్యమగు ఆ యాగమ మేదియో చెప్పుటయు, వివరించుటయు అవసరములు కాకపోవు. అందువలన ప్రస్తుత సూత్రము బాలవ్యాకరణమునం దున్నదానికి వివరణాత్మకమైన పూరణ మని అంగీక రింపవచ్చును.

[ పైచర్చ యంతయు బాలవ్యాకరణమునందలి నుగాగము నంగీకరించి, దానికి పూరణముగా ప్రౌఢవ్యాకరణమునందలి నగాగమమును కూడ నంగీక రించిన యెడల అవసరమగునట్టిది. అటుకాక బాలవ్యాకరణమునందు చెప్పిన 'ను' గాగమమును 'న' గాగమముగా సవరించినయెడల, ఒకే స్థానమున రెండు విధములైన ఆగమములను చెప్పికొను నవసరము తప్పును. "ఉకార ము కా రంబులకందు వర్ణకంబు పరంబగునపుడు నగాగమంబు విభాషనగు" అని సవ రించినట్లయిన 'రాము + న + అందు' మున్నగు విధముగానై నిత్యసంధియు వనమునందు, వనమునయందు మున్నగుచోట్ల వైకల్పికసంధియు - బియ్యమునం నందు మున్నగు తెలుగు శబ్దములపై నిత్యసంధియు నగును. వనమందు మున్నగుచోట్ల 'న' గాగమ ప్రాప్తి లేకుంత నుండును. "అంద్వవగాగమంబులు దప్ప" అను సూత్రముచేత "అందు" పరమగునప్పుడు సంధి పెక్కువిధము లుగా నుండుట యంగీకరించినదే కావున అన్నివిధములగు రూపములును సుల భముగా సిద్ధింపగలవు. ]

35 బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమంబగు. (బా-...)

రాములను – రాములచేతను – విధాతృలను – విధాతృలచేతను.

వ్యాఖ్య - బహుత్వమునందు ద్వితీయ మొదలుకొని సప్తమి వరకు గల యే విభక్తిప్రత్యయమునకైనను ముందు 'ల'వర్ణము అదనముగా వచ్చి చేరునని యర్థము.

[ లట్ + ఆగమము = లడాగమము. టకార మిత్తుగా గల వర్ణము దేనికి విధింపబడునో దానికి పూర్వమందు చేరును. కావున ఇక్కడ 'ల' అను నది విభక్తికి పూర్వమందు చేరునని గమనింపవలయును. ]

'రాము' అను డుమంతముపై 'ను' అను ద్వితీయావిభక్తి ప్రత్యయము బహువచనమునందు చేరినచో 'రాము + ను' అని యుండును. అప్పుడు 'ల' అను నది అదనముగా వచ్చి విభక్తికి ముందు చేరగా 'రాము + లను = రాములను' అని యగును. తక్కినవికూడ అట్టి రూపములే.

సూత్రమునందు విభక్తి దేనికి పరమగునో ఆ శబ్దమును గురించి యేమియు ననలేదు. ఉదాహరణములం దన్నియు డుమంతములే చూపబడినవి. అయినను, పూర్వమునందు తత్సమములుగాని తెలుగులు గావి యేమైన నుండవచ్చును. జలము లను - పొలములతోడ - గోవులకొఱకు - గొంతులవలన - మరుత్తులలోపల - మధువులయందు॥ మున్నగువాని నుదాహరణములుగా గ్రహింపవచ్చును.

36. సంబోధనంబునం దేకార్థంబయిన పదంబు తుది యుకారంబున కకారం బగు. (బా - ౩౨)

ఓ రాముఁడ - ఓ వృక్షమ - ఓ శంభువ - ఓ కొడుక.

వ్యాఖ్య - అభిముఖ్యమును సంపాదించుటకై పిలుచుటకు సంబోధనమని యందురు. ఆమంత్రణమని యన్నను ఇదియే అర్థము.

ఏకత్వమును దెలుపు పదము (ఏకవచనాంతమైన పదము) యొక్క చివరి ఉత్వమునకు సంబోధనమునందు అత్వము వచ్చునని సూత్రార్థము.

'రాముఁడు' అనునది ప్రథమావిభక్త్యంతమయిన పదము. సంబోధనమునందు ఉత్వమునకు అత్వము కలిగి 'రాముఁడ' అని యగును. "ఓ యామంత్రణంబునం బగు" అను (బాల-14) సూత్రమునుబట్టి సంబోధ్యవాచకమునకు ముందు 'ఓ' యను నది వచ్చి 'ఓరాముఁడ' అని యగును. 'డు, ము, వు' అను మూడును ఏకత్వమును బోధించు ప్రథమావిభక్తి ప్రత్యయములు. కావున వ్యాకర్త ఒక్కొక్కదాని కొక్కొక్క యుదాహరణము చూపెను.

అచ్చికములకు నైతమిట్లే యగునని తెల్పుటకై 'ఓకొడుక' అను లక్ష్యమును చూపెను. 'కొడుకు' ఉదంతదేశ్య శబ్దము. ఏకార్థక మగుటచే సంబోధనమునందు చివరి ఉత్వమునకు అత్వము కలిగినది.

**37 సంబోధనంబునందుఁ ఉదంబు తుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు.** (బా - ౪౩)

ఓ రాముఁడా - ఓరాముఁడ; ఓ చెలియా - ఓ చెలియ; ఓ హరీ - ఓ హరి; ఓ తండ్రీ - ఓ తండ్రి.

వ్యాఖ్య - సంబోధనమునందు సంబోధ్యవాచకమైన పదమునకు చివరనున్న అత్వమునకును ఇత్వమునకును దీర్ఘము విభాషగా నగునని యర్థము.

పూర్వసూత్రముచేత ఉత్వమునకు అత్వము రాగా 'రాముఁడు' అనునది 'రాముఁడ' అని అయ్యెను ప్రస్తుత సూత్రమువలన దీర్ఘము వచ్చినచో 'రాముఁడా' అని యగును. విభాష యని యనుటచే రానిపక్షమున 'రాముఁడ' అని హ్రస్వాంతము గనే యుండిపోవును. చెలియలు అను ఉదంత శబ్దమునకు పూర్వసూత్రముచేత దీర్ఘము రాగా 'చెలియలా' అనియగును. దీర్ఘము రాని పక్షమున 'చెలియల' అని యుండును.

'చెలియ' అను శబ్దమున చివరి అత్వము శబ్దసిద్ధము. దీనికిని దీర్ఘమురాగా 'చెలియా' అని యగును. దీర్ఘమురాని పక్షమున 'చెలియ' అని యుండిపోవును.

అట్లే హరి, తండ్రి - అను ఇదంత శబ్దములకును దీర్ఘము వికల్పముగా కలుగగా 'హరీ' యనియు - 'తండ్రీ' యనియు 'తండ్రి' యనియు రెండేసి రూపములు.

[ఇంతవరకు వికల్పవిధికి మాత్రమే లక్ష్యములు చూపబడినవి. విభాష యని యనుటచేత ఇచ్చట 'అన్యత్వము' కూడ కలదు. దీని తరువాతి సూత్రము చేత డుజ్ఞానకు లోపము రాగా మిగిలిన నామముయొక్క అత్వమునకు దీర్ఘము వచ్చుచున్నది. విభక్తి విరహితమైనది పదము కాదు. పదమునకు రావలసిన కార్యము పదేతరమునకు వచ్చుట అన్యత్వము.]

**38. కృతోత్కంబగు సంస్కృతనామంబు నం బుద్ధి డుజ్ఞానకు లోపంబు విభాషనగు** (బా - ౪౪)

ఓ రామ-ఓ కృష్ణ, పూర్వసూత్రముచేత దీర్ఘంబు॥ ఓరామా -

ఓ కృష్ణా. సంస్కృతనామం బనుటఁ జేసి ఓతమ్ముఁడ - ఓబల్లిదుఁడ॥ ఇత్యాదులందు లోపంబు లేదు.

వ్యాఖ్య - కృత + ఉత్కము = కృతోత్కము = చేయబడిన ఉత్వము గలది యని యర్థము. "పుంలింగంబయి మహద్వాచకంబయిన" అని మొదలైన (బాల - 21) సూత్రమునుబట్టి ఉత్వము నొందినది కృతోత్కము. అట్టి కృతోత్కమయిన సంస్కృతనామము యొక్క సంబుద్ధి (సంబోధము నందలి) డుఙ్జునకు విభాషగా లోపము గలుగునని సూత్రార్థము.

'ఓరాముఁడు' అని యున్నప్పుడు కృతోత్కమగుటచేత బిందుపూర్వక డువర్ణమునకు ప్రస్తుతసూత్రమునుబట్టి లోపము వచ్చి 'ఓ రాము' అని యగును. ఇప్పుడు చివరి ఉత్వమునకు అత్వము కలుగవలయును. దీనికి పలువురు వ్యాఖ్యాతలు "సంబోధనంబునం దేకార్థంబయిన పదంబు" అని మొదలయిన (బాల - 32) సూత్రము నుపయోగించి సాధించినట్లు తలచిరి. సూత్రమున 'పదము' అని యున్నది. అనగా విభక్తితో కూడి యున్నదని యర్థము. లక్ష్యములు కూడ అట్టివే చూపబడినవి. చివరిది ప్రాతి సమము. కావున పదముచివరి ఉత్వమునకు అత్వమును విధించెడి ఆ సూత్రమిక్కడ ప్రవర్తించుటకు వీలులేదు. ప్రస్తుతసూత్రమునందు "సంబుద్ధి డుఙ్జునకు లోపంబు విభాష నగు" అని యున్నది. 'విభాష' అను శబ్దమువలన సంబుద్ధిడుఙ్జునకు లోపము కలుగుటతోపాటు కృతోత్కము యొక్క ఉత్వమునకును లోపము కలుగవలయును. వికల్ప మనికాక, విభాష యని సూత్రమున వాడుట యీ అత్యత్వమును సూచించుటకే యని యర్థము చేసికొనుట యవసరము.

కావున డుఙ్వర్ణకముతోపాటుగా వెనుకటి ఉత్వమునకు లోపము కలిగి 'ఓ రామ' అని యగును. 'ఓకృష్ణ' యన్నది కూడ ఇట్లే యేర్పడును. ఇట్లేర్పడిన నామముయొక్క తుది అకారమునకు పూర్వ(33)సూత్రముచేత దీర్ఘము కలుగగా ఓరామా, ఓకృష్ణా - అను రీతిగా రూపము లేర్పడును.

సూత్రమునందు 'సంస్కృతనామము' అని యనుటచేత కొన్ని యనిష్టరూపములు కలుగకుండ వారింపుట జరిగినది. బల్లిదుఁడు - అన్నది తెలుగు శబ్దమే. అయినను సంస్కృత తుల్యముగా పరిగణింపబడి కృతోత్కమైనది. కావున 'కృతోత్కము' అను విశేషణమునకు సరిపడినప్పటికిని సంస్కృత నామము కానందువలన దీని డుఙ్జునకు లోపము కలుగదు. కావున 'ఓబల్లిదుఁడ' అని యుండును. పూర్వ

సూత్రముచేత దీర్ఘమునొందినయెడల 'ఓ బల్లిదుఁడా' అని యగును. 'తమ్ముఁడు' అనునది తెలుగు శబ్దము. పైగా ఇందలి ఉకారము సహజము. కావున దీనికిని డుజ్లోపము కలుగదు. ఓతమ్ముఁడ, ఓతమ్ముఁడా - అవియే రూపములుండును.

[డుజ్వారక లోపమును మాత్రమే చెప్పుటచేత ము, వు వర్ణకములకు లోప ప్రసక్తి లేనేలేదని యర్థము. వృక్షమ-వృక్షమా-ధనువ-ధనువా ॥ మున్నగునవి యుదాహరణములు. అమహత్తులకును మహత్త్వాపాదనము చేసినపుడు సంబోధనమున ఉత్వడుజ్జులకు లోపము కలిగి 'సహకార, వున్నాగ, తిలక' మున్నగు విధముగా ప్రయుక్తములగుటకు అభ్యంతరము లేదు.]

సంస్కృతనామ మని యనుటచేత మతుబాద్యంతములయిన శబ్దములమీది డుజ్జునకు లోపము కలుగదు. తెలుగునందు ప్రాతిపదికములయిన బలవంత, మతి మంత, విద్వాంస - మున్నగునవి సంస్కృత సమములే కాని సంస్కృత నామ ములు కావు. అందువలన వానిమీది డుజ్జునకు లోపము కలుగక బలవంతుఁడ, మతి మంతుఁడ, విద్వాంసుఁడ - మున్నగువిధముగా నుండును. చివరి అత్వమునకు దీర్ఘము కలుగవచ్చును.

"కృతోత్కము" అని అనుటచేత సహజోత్కములైన విష్ణు, శంభు-మున్నగు సంస్కృతనామములమీది డుజ్జునకు లోపము కలుగదు. అందువలన విష్ణుఁడ, శంభుఁడ - అవియే యుండును. చివరి అత్వమునకు దీర్ఘము వచ్చిన విష్ణుఁడా, శంభుఁడా - అని యగును.

39. ఉదంత సంస్కృతనామంబుమీఁది సంబుద్ధిడుజ్జునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాష నగు. (బా - ౬౨)

ఓ విష్ణూ౩ - ఓ శంభూ౩. పక్షంబునందు విష్ణుఁడ - శంభుఁడ॥ ఇత్యాది.

వ్యాఖ్య - సంబోధనమునందు ఉదంత సంస్కృత ప్రాతిపదికమీద డుజ్వర్ణ మున కంతటికిని ప్లుతమైన ఊకారము విభాషగా ఆదేశమగునని యర్థము.

ప్లుతమని యనగా మూడు మాత్రల కాలములో నుచ్చరింప బడునదని యర్థము. కావుననే ఉచ్చారణప్రమాణమును చూపుటకై ఆ వర్ణముక్రింద మూడంకె వేయుట సంప్రదాయము.

'విష్ణు' అనునది సంస్కృతనామము; సహజముగనే దీని చివర ఉత్వము గలదు. కావున దీని మీదనున్న డుజ్జునకు బదులుగా సంబోధనమునందు ప్లుతమైన ఊకారము వచ్చిన యెడల 'విష్ణూ౩' అని యగును. ఇది విభాషగా నగుటచే ఊకారము రాని పక్షమున డు వర్ణకమునకు అత్వము కలిగి 'విష్ణుఁడ' అనియు, దానికి దీర్ఘము రాగా 'విష్ణుఁడా' అనియు నగును. అట్లే 'శంభు' అను ఉదంత సంస్కృత నామముకూడ డుమంతమైనపుడు 'శంభూ౩' అని ఊకారప్లుతము నొందిన రూపము నగు, అట్లు కాని పక్షమున శంభుఁడ, శంభుఁడా - యను రూపములును వచ్చును.

[ వర్ణములయందు పరిగణింపని ఊకారప్లుతము నిక్కడ చెప్పుట యవసరము కాదని యొక విమర్శ కలదు. అది సహేతుకమే. పైగా గాన రోదన దూరాహ్వానాదులయందు అకారమునకును, ఇకారమునకును ప్లుతత్వము గలుగుచుండగా, అక్కడ బాలవ్యాకర్తయేమియు చెప్పలేదు. అక్కడ లేని యవసరము ఇక్కడ కూడ లేదు. కావున దీనిని దీర్ఘమాత్రముగా గ్రహించినను నష్టములేదు.]

విభాష యని యనుటచేత డుజ్జునకు మాత్రమేకాక 'వధువు' మున్నగు సంస్కృతనామముల మీది 'వు' వర్ణమునకును ఊకారము ఆదేశముగా రావచ్చును. అప్పుడు 'వధూ' మున్నగువిధముగా రూపము కల్గును. రానియెడల వధువ, వధువా - అని అకారమును, దీర్ఘమును కలిగిన రూపములు వచ్చును. 'బాబు' మున్నగు కొన్ని తెనుగు శబ్దములకుకూడ ఊకారము సంబోధనమునందు కలిగి 'బాబూ' మున్నగు విధముగా నుండవచ్చును. ఏకత్వమునందే 'లు' వర్ణాంతములయిన పంతులు, సోమయాజులు మొదలయిన శబ్దములకును సంబోధనమునందు ఊకారము కలిగి పంతులూ, సోమయాజులూ - అనువిధముగా నగును. ఇట్లు కేవలము సంస్కృత నామములకే కాక తెలుగుపదములకును ఊకారము కలుగుచున్నది. సంస్కృతనామములందుకూడ డుమంతములకే కాక, తదన్యములకును ఊకారము కలుగుచున్నది. ఈ అన్యత్వమును సూచించు నిమిత్తమే సూత్రమున 'విభాష' యను శబ్దము ప్రయుక్తమయ్యెను

**40. రోశబ్దం బొండు సంబోధనంబున స్త్రీవాచకంబునకుఁ బరంబుగ నగు ; అయ్యది హ్రస్వాంతంబును నయ్యెడి (ప్రౌ - ౧౪)**

కమలదళాక్షిరో వినవుగా గల యొక్కటి గంటి వేసువన్ ॥

ప్రభా. ౧౮॥ రమణిరో భృత్యులందు నపరాధము గల్గిన నాయకుల్

స్వపక్షము దలపోసి యుగ్రతరశాసనముం దెగి చేయరు॥ భాగ. ఠస్కం॥ మొ. (ఒకానొక ఆధునికగ్రంథమునందు 'అన్నరో, ఏనుంగురో' అని ప్రయోగములు కానంబడుచున్నవి. వానికిఁ బ్రామాణిక ప్రయోగములు కానంబడవు.)

వ్యాఖ్య - సంబోధనమునందు స్త్రీవాచకమునకు మీద 'రో' అను శబ్దము వచ్చి చేరునని, అది హ్రస్వమునుగూడ బొంది యుండవచ్చునని సూత్రార్థము.

'కమలదళాక్షి' అనునది స్త్రీవాచకము. కావున దీనికి 'రో' అను శబ్దము ప్రస్తుతసూత్రముచేత పరమందు చేరగా 'కమలదళాక్షిరో' అని యగును. అట్లే 'రమణి' యను స్త్రీవాచకమునకు మీద హ్రస్వాంతమైన 'రొ' చేరగా 'రమణిరొ' యని యగును. ఇది బాలవ్యాకరణమునకు పూరణము.

కుండలీకరణములయందు అన్నరొ, ఏనుంగురొ - అను ప్రయోగము లొక యాధునికగ్రంథమునందు కనిపించుచున్న వనియు, వానికి ప్రామాణికప్రయోగములు కనిపించుటలేదనియు వ్యాకర్త వివరించెను. 'అన్న' యనునది మహద్వాచకము. 'ఏనుంగు' అనునది అమహద్వాచకము. ఈ రెండును స్త్రీవాచకములు కానందువలన, 'రో' శబ్దము కలుగరాదు. తిమ్మకవి అచ్చతెనుగు రామాయణమునందు ఈ ప్రయోగములను చేసెను. ప్రౌఢవ్యాకర్త యెన్నోప్రయోగములను ప్రామాణికములవి యాగ్రంథమునుండి గ్రహించియే యున్నాడు. వీని విషయమున మాత్రము ఇతర గ్రంథముల ప్రయోగము లేనందువలన వెనుకాడుచున్నాడు. ఏదోయొక గ్రంథమున నున్నంత మాత్రమున లక్షణమును కల్పించుటకు పూనుకొనక ప్రయోగాంతరముల కొరకు నిరీక్షించుట అవసరమే. కావుననే వీనికి తన సూత్రమున గతి కల్పింపలేదు. ఇది సముచిత నిర్ణయము.

సూత్రమునందు 'ఏకత్వంబున' అనియు, 'వికల్పంబుగ' అనియు చేర్చుట యవసరము. కానినాడు బహుత్వంబుననున్న 'కమలదళాక్షులు' మున్నగు శబ్దమునకు మీద 'రో' శబ్దమును చేర్చవచ్చునను భ్రాంతి కలుగుట కవకాశము కలదు. అట్లే 'పరంబుగ నగు' అని మాత్రమే చెప్పుటచేత 'రో' శబ్దవిరహితములయిన కమలదళాక్షి, కమలదళాక్షీ; రమణి, రమణీ - మున్నగు విధముగా నుండరాదేమో అను భ్రాంతి కలుగుట కవకాశము గలదు. ఇట్టి భ్రాంతి కలుగకుండ నుండుటకై సూత్రమున సవరణ మవసరము.

41. సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు (బా - 36)

ఓ రాములార - ఓ కృష్ణులార. దీనికిఁ బాక్షికంబుగ దీర్ఘం బగు॥ ఓ రాములారా - ఓ కృష్ణులారా.

వ్యాఖ్య - సంబోధనమునందు సంబోధ్య వాచకమునకు తుదినున్న బహు వచనప్రత్యయమునకు మీద 'అర' యనునది అదనముగా చేరునని సూత్రార్థము.

"లు వర్ణంబు బహువచనంబు" అనియు "బహుత్వ సంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు" అనియు పూర్వము చెప్పుటచేత 'లు' వర్ణమును బహు వచన శబ్దముచే గ్రహింప నగును.

రాములు - అనునది బహుత్వబోధకము. కావున చివర 'లు' ప్రత్యయమును గలిగి యున్నది. దీనికి 'అర' అనునది అదనముగా వచ్చి చేరగా 'రాములార' అని అయ్యెను. 'కృష్ణులార' అనునదికూడ ఇట్టిదే. "పదంబు తుది యకారేకారంబులకు" వలెనే అరగాగమము తుది అత్వమునకును పాక్షికముగ దీర్ఘము కలుగగా రాము లారా, కృష్ణులారా - అను విధముగా అగును.

42. మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాషనగు. (బా - 33)

వినుఁడు బాలకులు - వినుఁడు బాలకులార ; వచ్చితిరి కాంతలు - వచ్చితిరి కాంతలార॥ అన్నలార మిమ్ము నడిగెద నొకమాట - ఇచ్చట మధ్యమపురుషయోగంబు లేమింజేసి యారగాగమంబు నిత్యంబు.

వ్యాఖ్య - యుష్మదర్థకముతో నన్వయించు క్రియను మధ్యమపురుషక్రియయని యందురు. అట్టిక్రియతో అన్వయమును కలిగియున్న సంబోధ్యవాచకముయొక్క బహువచన ప్రత్యయమునకుమీద 'అర' అనునది విభాషగా వచ్చి చేరునని సూత్రార్థము.

'వినుఁడు' అనునది మధ్యమ పురుషము, దానికి కర్తయైనది 'బాలకులు' అను సంబోధ్యవాచకము, బహువచన ప్రత్యయాంతము. కావున 'అర' యనునది వచ్చి చేరినమెరల 'బాలకులార' అనియగును. సంబోధ్యవాచకమైన 'బాలకులు' అనునది మధ్యమపురుషయోగమును కలిగియుండుటచేత 'అర' యనునది [illegible]

వచ్చును. అప్పుడు 'ఏమఁడు బాలికలు' అని యుండును. మధ్యమ పురుషయోగము కలదగుటచే తరువాతి యుదాహరణమునందును అరగాగమము వికల్పముగానై 'వచ్చితిరి కాంతలార' అనియు 'వచ్చితిరి కాంతలు' అని రెండు విధములుగా నుండ వచ్చును.

'అన్నలారా మిమ్ము నడిగెద నొకమాట' అను లక్ష్యమునందు 'అడిగెదను' అనునది ఉత్తమపురుషము, ఇది అస్మదర్థకముతో నన్వయించును. ఈవాక్యమున 'నేను' అను అస్మదర్థకము అధ్యాహృతము. సంబోధ్యవాచకమైన 'అన్నలు' అనునది మధ్యమపురుషముతో అన్వయమును కలిగియుండనందువలన (వాక్యమున మధ్యమ పురుష క్రియ లేదు) 'ఆర' యనునది బహువచనముపై నిత్యముగా వచ్చి చేరును. అప్పుడు 'అన్నలార' అని యొకటే రూపము వచ్చును.

చిన్నది, చిన్నవాఁడు మున్నగు విధముగా తచ్ఛబ్దము నొంది వ్యవహృతము లగు పదములకు చిన్నదాన, చిన్నదానా; చిన్నవాఁడ, చిన్నవాఁడా - మున్నగు విధముగా సంబోధనమునందు రూపము లుండును. బహుత్వమున మహతియు, మహత్తునుగూడ ఏకవిధముగనే 'చిన్నవారు' అని యగును అప్పుడు అరగాగమము వచ్చినయెడల 'తచ్ఛబ్దమునకు లోపము కలిగి 'లు' ప్రత్యయము కలుగును. చిన్న + లు + అర=చిన్నలార అని యగును. సర్వనామములకు సంబోధనము సాధారణముగా నుండదు. పైనిచెప్పినట్లు కొన్నిచోట్ల మాత్రము ఉండును. అప్పుడు బహుత్వమున అరగాగమము కలుగుచో 'తచ్ఛబ్దలోపము' అను అన్యక్రియ కూడ జరుగుచున్నది. సూత్రమున నున్న 'విభాష' యను శబ్దము దీనికి సమర్థకము.

మంచివారు, కలవారు - మున్నగువానికి తచ్ఛబ్దమును వీడినచో సంబోధనాంతత్వమే యుండుటకు వీలులేదు. ఇట్టి యెడల 'అర' అనునది విభాషగా వచ్చును. కాని అంతకు ముందు 'లు' వర్ణమును చేర్చుకొనును. మంచివారు + లు + అర = మంచివారలార అను రూపము కలుగును. అట్లే 'కలవారలార' యను రూపము కూడ.

[ పై ప్రయోగముల నన్నింటిని బట్టి చూడగా 'అర' అనునది లువర్ణము మీద మాత్రమే వచ్చుచున్నట్లు తోచుచున్నది. బహుత్వమునందు లు వర్ణము స్థానమున వచ్చిన 'రు' వర్ణముమీద కూడ వచ్చుట ప్రయోగములందు కాన వచ్చుట లేదు. అట్లు 'రు' వర్ణము వచ్చినచోట్ల మరల 'లు' వచ్చుట కూడ జరుగుచున్నది. కావున బాలురు, నృపాలురు - మున్నగుచోట్ల కూడ అరగా

గమము కలిగినచో వెనుకటి 'రు' వర్ణము 'లు' వర్ణముగా మారవలయు ననియే యనిపించుచున్నది. అప్పుడు బాలులార, నృపాలులార - యనురీతిగా నుండు నేమో॥ ఏతన్నిర్వాహకములగు ప్రయోగములు లభించుట కష్టసాధ్యమే కావచ్చును. కాని, సూరి "లువర్ణంబు బహువచనంబు" అని చెప్పుటచే 'బహువచనము' అని యెక్కడనెని సూత్రమునందన్నచో లు వర్ణమని మాత్రమే తాత్పర్యము. అంతేకాక "ము వర్ణకంబునకు విధించు కార్యము నుగాగమంబునకునగు" అని చెప్పినట్లు ఇక్కడేమియు చెప్పలేదు. కావున బహువచనమని యనుటచేత 'లు' వర్ణము మాత్రమే గ్రాహ్యమనియు, తదన్యమునకు అరగాగమము కలుగకుండుటయో, కలిగినయెడల తత్పూర్వమందు 'లు' వర్ణమును పొందుటయో జరుగునని యూహింప వీలగుచున్నది. సూరి యింత భావించియు, సూత్రాకారుడుగా 'విభాష' యను శబ్దముచేతనే సూచనముచేసి విడిచెను. వృత్తియందు 'బాలకులారా' అని 'క' ప్రత్యయముతోడి రూపము వాడి యున్నాడు. తరువాతి సూత్రమునందు వాడిన 'బాలురు' అనుదానిని ఇక్కడ చూపకుండుటకు కారణము తరువాత జరుగు మార్పును సూచించుట అచ్చట తన కిష్టము లేకుండుటయే. 'రు'త్వమును విధించుటయే జరుగునప్పుడు దానిని వారించుటకు పూనుకొనుట మర్యాద కాదు. ఆ మర్యాదను పాటించియే సూరి దానిని స్పష్టము చేయలేదు. వలసినచోట దానిని వారింపవచ్చునను నిశ్చయముతో సూరి 'విభాష' యను వ్యవస్థను కల్పించెను. ]

**43. అదంతంబగు దీర్ఘపూర్వలోపధంబయిన మహత్తుమీఁది విభక్తిలకారంబునకు రేఫంబగు. (బా - ౩౮)**

బాలురు - బాలురను - బాలురచేతను; నృపాలురు - నృపాలురను - నృపాలురచేతను॥ దయాళు శబ్దంబున కిట్లు రేఫంబు గానం బడియెడి. దయాళురు - దయాళురను - దయాళురచేతను.

వ్యాఖ్య - హ్రస్వమైన అకారము నంతమందు గలిగి, లకారము నుపధగా కలిగి, తత్పూర్వమందు దీర్ఘమును గలిగియున్న నామము మహదర్థకమైనప్పుడు - దాని మీఁది విభక్తి'ల' కారమునకు ఆదేశముగా 'ర' వర్ణము వచ్చునని సూత్రార్థము

విభక్తి లకార మని యనుటచే బహువచనమైన లు వర్ణకమును, బహుత్వమున ద్వితీయాదులకు విధింపబడిన లడాగమమును కూడ గ్రహింపవలయును.

'నృపాల' అనునది అదంతము: లోపధము = ల + ఉపధము; ల వర్ణకము నకు ముందు దీర్ఘమున్నది. పురుషవ్యక్తిని బోధించునదగుటచే మహద్వాచకము. కావున దీనిపైని వచ్చు విభక్తి లకారమునకు రేఫము రావలయును. నృపాల + లు - అనియుండగా "పుంలింగంబయి మహద్వాచకం బయిన" అన్న (బాల - 21) సూత్రమును బట్టి నృపాలు + లు అనియై ప్రస్తుతసూత్రముచేత విభక్తి లకారమునకు రేఫము రాగా 'నృపాలురు' అని యగును. ద్వితీయాదివిభక్తులకు బహుత్వమున లడాగమము కలుగును. అప్పుడు 'నృపాలు + లను' మున్నగు విధముగా నుండగా విభక్తితోడి ల వర్ణమునకు రేఫమువచ్చి 'నృపాలు + రను = నృపాలురను' అని యగును. నృపాలురచేత, బాలురచేత - మున్నగురూపము లన్నియు అట్లేర్పడినవే.

సూత్రమునందు 'అదంతము' అని యనుటచేత 'గుణశాలి' మున్నగువాని యొక్క విభక్తి లకారమునకు రేఫము వారింపబడినది. గుణశాలులు - గుణశాలు లను॥ దీర్ఘపూర్వము అను విశేషణమువలన 'అమితబలుఁడు' మున్నగు శబ్దమ లకును రవర్ణము వారింపబడినది. అమితబలులు - అమితబలులను॥ లోపధం బని యనుటచేత 'రామ' మున్నగు నామములకును వారింపబడినది. రాములు - రాము లను॥ మహత్తు అని చెప్పుటచేత ఇతర విశేషములన్నియు నున్నప్పటికిని 'బాల' మున్నగు స్త్రీవాచకములకును వారింపబడినది బాలలు - బాలలను॥

సూత్రమునందు 'దీర్ఘపూర్వము' అని చెప్పుటచేత ఏ దీర్ఘమునైనను గ్రహింపవచ్చును. ఉదాహరణములందు అకారదీర్ఘము మాత్రమే చూపబడినది. 'సుగుణశీల' అను ప్రాతిపదిక బహుత్వమునందు సుగుణశీలురు, సుగుణశీలురను - మున్నగు విధముగా నగును. అట్లే 'అనుకూల' అను ప్రాతిపదిక అనుకూలుర అనుకూలురను - మున్నగువిధముగా నగును.

'దయాళు' అను ప్రాతిపదిక పైనికూడ విభక్తిలకారమునకు రేఫము వచ్చు చున్నది. ఇది ఉదంత శబ్దము. ళకారము ఉపధగా కలది. పూర్వమందు దీర్ఘ మున్నది. 'లళయోరభేదః' అను నియమమునుబట్టి ళకారమును, లకార స్థానమున గ్రహించినయెడల 'దీర్ఘపూర్వలోపధము' అను విశేషణము సరిపడును. అయినను 'అదంతము' కాకపోవుటచేత దీని విభక్తి లకారమునకు రేఫమువచ్చు నవకాశము లేదు, అయినను ప్రయోగములందు వచ్చియుండుటచే దానిని విశేషప్రయోగముగ గ్రహింపవలయును.

44. ద్విత్వయుక్త లాంతంబు మీఁది లు ల లకును రు ర లాదేశంబు లగు. (ప్రౌ - ౨౩)

అనరే! యల్లియరామరాజు పెదతిమ్మాధీశు బాహాభయం
కర కౌక్షేయకధారఁ బోరునఁ గడంకం ద్రెళ్లిపేరాజి మ
ల్లురకున్ మట్టియగుం దదీయబలధూళుల్ సంగడాలై వియ
చ్చరకాంతా స్తనపాళి నిన్గరిడి నాశ్చర్యంబు చర్చింపఁగన్॥

రామా. ౧౪॥ మొ.

వ్యాఖ్య - లకారముతో కూడుకొన్న లకారము (ల్ల) అంతమందున్నప్పుడు కూడ పరమందు వచ్చు విభక్తి లకారము లయిన లు, ల - అనువానికి క్రమముగా రు ర - అనునవి ఆదేశములుగా నగునని సూత్రార్థము.

దీనిని బాలవ్యాకరణవిధికి వివరణముగా ప్రౌఢవ్యాకర్త యారంభించెను.

"మల్ల" యనునది ద్విత్వలకారము నంతమందు గల శబ్దము. దీనికి బహువచనము పరమైనపుడు "మల్ల + లు" అని యగును. పుంలింగమై మహద్వాచక మగుటచేత అత్వమునకు ఉత్వము వచ్చి. ప్రస్తుతసూత్రముచేత లు వర్ణకమునకు రు వర్ణకము కలిగి "మల్లురు" అని యగును అట్లే ద్వితీయాది విభక్తుల కగు 'ల' వర్ణమునకు 'ర' వర్ణమురాగా మల్లురను, మల్లురకును - మున్నగు విధముగానగును.

రామాభ్యుదయమున "మల్లురకున్" అని 'ర' ప్రాసముతో కలదు. దీనిని కదలించుటకు వీలులేదు. అంత మాత్రమున, ఈయొక్క ప్రయోగమునే యాధారము చేసికొని 'ఆదేశంబులగు' అని చెప్పుట సరియైన పద్ధతి కాదు. ప్రాసస్థానముననే "మల్లులు" అని లకారముతో తిక్కన భారతప్రయోగములు గలవు. కావున "మల్లులు" అను రూపమును ప్రమాణముగా గ్రహింపక తప్పదు. రామభద్రుని "మల్లురు" అను రూపమును కూడ గ్రహింపవచ్చును. అప్పుడు ఉభయసాధకమగునట్లు "వికల్పంబుగ నాదేశంబులగు" అని చెప్పుట యోగ్యతరమై యుండెడిది. సర్వలక్షణసంగ్రహమునందు "మల్లలను శబ్దమునకున్ । మల్లులు మల్లురని కృతుల నామగఁ బలుకం । జెల్లును" అని యున్నది. కావున రెండు రూపములను స్వీకార్యము లగుచున్నవి. ప్రస్తుతసూత్రముచేత "మల్లులు" అను ప్రయోగమునకే అవకాశము లేకుండ పోవుచున్నది.

ఇంతకంటె దోషము మరొకటి యున్నది ప్రస్తుతసూత్ర విధిచేత ద్విత్వ యుక్త లాంతము లన్నింటికి ఈ కార్యము జరుగవలసివచ్చుచున్నది. భిల్ల, పుల్ల గల్ల - మున్నగు నామములమీది విభక్తి లకారమునకు రేఫము కలుగుటయు సంభవించును. అట్టి ప్రయోగములు దృష్టపూర్వములు కావు. కావున సూత్రవిధి "అతివ్యాప్తిదోషము" పాలయిన దనక తప్పదు. కావున 'పూ పూవు' అని అన్నట్లుగానే తన పద్ధతి ననుసరించి 'మల్లులు మల్లురు' అన్నట్లు చెప్పియుండిన సవరణము సంగతమై యుండెడిది. ఇంతకును "అదంతంబయి" అని మొదలయిన బాలవ్యాకరణ సూత్రము వివరణమున 'ఎయాళురు' మున్నిగుదానిని విశిష్టప్రయోగముగా సూరి సూచనమబట్టి గ్రహించితిమి. అట్లే 'మల్లులు' అనుదానికిని పాక్షికముగా 'మల్లురు' అను విశిష్టరూపము గలదని గ్రహించుట యుక్తము.

**45.** ఇహ మన్న పుంనపుంసకముల కదంతములకు ము వర్ణకంబగు.

(బా - 38)

వృక్షము - ఋక్షము - దైవము - కళత్రము - అపత్యము ॥ క్లీబంబులు మిత్రాదు లను సూత్రంబునం బాక్షికంబుగం పుంలింగత్వం బతిదేశించుటంజేసి మిత్రాది శబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది. ఉ॥ మిత్రుఁడు, మిత్రము; శరణుఁడు, శరణము.

వ్యాఖ్య - హ్రస్వమైన అకారమును చివరగల అమహత్తులకును నపుంసకములకును మువర్ణకము కలుగునని సూత్రార్థము. "డు, ము, వు, వ లేక వచనంబులు" అని యనుటచేత ఏకత్వ బోధకమైనప్పుడనియు, "డుము వులు ప్రథమ" యని యనుటచే ప్రథమావిభక్తియం దనియు ఊహించుకొనవలయును. అనగా ప్రథమా విభక్తి యేకవచనమునందు అదంతములైన అమహత్తులకును, నపుంసకములకును మువర్ణకము కలుగునని సూత్రార్థము.

'వృక్షము' అనునది అచేతనము. అందువలన అమహత్తు. కాబట్టియే 'వృక్ష' యను పుంలింగనామముపై 'ము' వర్ణకము చేరగా నేర్పడినది.

'ఋక్ష' అనునది పుంలింగశబ్దము. మృగవాచకమగుటచే అమహత్తు. అదంతము. కావున ప్రస్తుతసూత్రముచేత మువర్ణకము కలిగి 'ఋక్షము' అని యగును. ఋక్షము అని యనగా భల్లూక' మనియర్థము. 'ఋక్ష' అను నపుంసకశబ్దము కూడ కలదు. దీనికి 'నక్షత్ర' మని యర్థము. ఇది అదంత నపుంసక మగుటచే 'ము' వర్ణకము నొంది 'ఋక్షము' అనియే యగును.

దైవము, కళత్రము - అను వీరెండును అమహద్వాచకములు కావు. సూత్రమునందు నపుంసకములను కూడ మువర్ణకమును చెప్పుటచే, సంస్కృతము నందు అదంతనపుంసకములైన వీనికికూడ ము వర్ణకము కలుగుచున్నది.

'అపత్యము' అనునది నపుంసకమై యుండుటచేతనే తెలుగులో 'ము' వర్ణకమును బొందుట జరిగినది.

ఇచ్చిన ఐదు ఉదాహరణములందును మొదటి రెండును అదంతము లయిన అమహత్తులగుటచే మువర్ణకమునుబొందినవి. తరువాతి రెండును అదంతములయిన నపుంసకము లగుటచే ము వర్ణకమును బొందినవి. రెండవయుదాహరణము రెండింటికి సంబంధించి యున్నది. చివరి యుదాహరణముకూడ నపుంసకమే. అందువలన 'ము' వర్ణకము వచ్చినది. అది మిత్రాదులలోనిది కూడ. అందువలననే సూరి ఆ లక్ష్యమును జూపి పిమ్మట మిత్రాదుల విషయమును జ్ఞాపనము చేయుచున్నాడు. మిత్రము-మిత్రుఁడు; శరణము - శరణుఁడు; ప్రధానము - ప్రధానుఁడు; పాత్రము - పాత్రుఁడు; అపత్యము - అపత్యుఁడు॥ ఇంకను భూషణము, ఆభరణము, తిలకము మున్నగునవికూడ మహద్వాచకములైనపుడు పుంలింగతుల్యత్వము నొంది భూషణుఁడు, ఆభరణుఁడు, తిలకుఁడు అని యగును.

'మ' వర్ణాంతములయిన అవ్యయములును, అవ్యయీభావ సమాసములును తెలుగులోనికి మువర్ణాంతములై వచ్చును. చిరము - పరము పరస్పరము - అన్యోన్యము - ప్రత్యక్షము - ఆబాలగోపాలము - దైనందినము॥ మున్నగునవి యిట్టివి.

సూత్రమునందు 'అదంతములకు' అని నిల్పకుండిన బాగుండెడిదని బియ్యము, నెయ్యము మున్నగువానిని మాత్రమే దృష్టియందుంచుకొని సూరి అట్లు చెప్పెననియు వజ్ఝలవారి యభిప్రాయము. ఓరెము, పెన్నెము, అన్నెము, గీము - మున్నగువాని తుదకూడ 'ము' వర్ణకము కలుగు చున్నది. గావున 'అదంతములకు' అని యనుట సరియైనది కాదని వారి నిశ్చయము. 'ఓగిరము' అనుదానిలో అత్వము మీదనే 'ము' ఉన్నది. 'ఓగిరము' అను పూర్తిపదమే 'ఓరెము' అని మారినది. పుణ్యము 'పున్నెము' అనియు అన్యము 'అన్నెము' అనియు గృహము 'గీము' అనియు వగము 'సాము' అనియు మొగము 'మోము' అనియు మారినవి. చివరి రూపమున 'ముఖమ్' అనునది 'ముఖము' అను తత్సమ రూపము నొందగా దానినుండి 'మొగము' ఉద్భవమైనది. అదియే 'మోము' అని యైనది. కావున తద్భవములందును, దేశ్యములందును క్లీబసమత్వము గలచోట మువర్ణాంతత్వము గలదని గుర్తించుకొన

వలసినదే కాని మువర్ణకమును తత్సమము లందువలె విధించుట కనబడదు. కావున ప్రస్తుత సూత్రమునందలి 'అదంతములకు' అన్నది వానికి అవిరుద్ధమై నిలువదు. తద్భవములు సిద్ధరూపములనుండియే యుద్భవించును. దేశ్యములు యథాప్రయోగముగా గ్రహింపబడును. కావున నిచ్చట ప్రకృతి ప్రత్యయ విభాగము సహజము కాదు. అయినను 'ము' వర్ణకముగా భావించుట ఇతరకార్యముల కనుకూలమై యుండును గనుక అట్లు చేయుట వ్యాకరణమున కవసరము. ఇంతకును 'అన్నె' మున్నగువిధముగా ప్రకృతిని విల్పుటయు, దానిమీద 'ము' వర్ణము చేర్చుటయు జరుగుట లేదు. కాన విధి తద్రూప సాధనమున కభ్యంతరకర మనుట పొసగదు.

అభ్యంతరకరము కాక పోవచ్చును గాని అవసరమా ? అని ప్రశ్నించుచో పైపై చూపుల కవసరమని తోచును. "ఇదంతములు, ఉదంతములునైన నపుంసక శబ్దములకు 'ము' వర్ణకమును రాకుండ వారింపవలయును. లేకున్న వారి, మధు - మున్నగు వానికి కూడ మువర్ణకము వచ్చును" అని యనిపించును. ఇది భ్రమోత్పన్నము. ఇది యిట్లే యైనచో "పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్జగు" అని యనుటచే 'హరి' మున్నగువానికి కూడ 'డు' వర్ణకము రావలసి యుండును. తరువాతి సూత్రములయిన "ఇగ్లో" మున్నగువిధిచేత "ఉకారాంత" మున్నగు విధిచేత వానికి డుజ్వర్ణకమును వారించినట్లే యిక్కడను వారించుట జరిగినది కదా! "ఇగ్లో" అను సూత్రమువలన 'వారి' మున్నగువానికి ప్రథమైకవచనము లోపించును. అట్లే "ఉకారాంత" అను సూత్రమువల్లనే 'మధుపు' మున్నగురూపము లేర్పడును. కావున 'అదంతములకు' అను విశేషణము ప్రయోజనము నేమియు సాధించుట లేదని చెప్పవచ్చును.

**46** వానికి మువర్ణకేతరం బయిన విభక్తి పరంబగునపుడు ముగాగమం బగు, (బా - ౨౦)

వృక్షములు - వృక్షమును - బురుసములు - బురుసమును.

వ్యాఖ్య - పూర్వసూత్రమునందు చెప్పిన అదంతములైన యమహత్తులకును, అదంతములైన నపుంసకములకును మువర్ణకముకాక, యితరప్రత్యయములు వచ్చిన యెడల ఆగమముగా మువర్ణము వచ్చునని సూత్రార్థము.

ముక్ + ఆగమము = ముగాగమము. ఇచ్చట క కారము ఇత్సంజ్ఞ. దేనికి విధింపబడునో దానికి చివర చేరునని కిత్తు (క + ఇత్తు) సూచనచేయును. ఇచ్చట 'ము' నాగము చివర చేరునని తెలియవలయును.

ఏకత్వబోధకమై ప్రథమావిభక్త్యంతమైన శబ్దము చివరనున్న 'ము' వర్ణమును మాత్రమే విభక్తి ప్రత్యయముగా గ్రహింపవలయును. ప్రథమావిభక్త్యంతమే యైనను బహుత్వ బోధకమైనప్పుడు కలుగు 'ము' వర్ణమును ఆగమముగానే గ్రహింపవలయును. అట్లె ద్వితీయాది విభక్తులు పరమైనప్పుడువచ్చు 'ము' వర్ణముకూడ ఆగమమే యగును.

వృక్షము - ప్రథమావిభక్తి: ఏక వచనాంతము. దీని తుదినున్న మువర్ణము ప్రత్యయము. బహుత్వమును చెప్పవలసివచ్చినపుడు 'లు' ప్రత్యయము వచ్చును. ఒక విభక్తి ప్రత్యయమున్నప్పుడు మరొక విభక్తి ప్రత్యయము వచ్చుట వీలు లేదు. కావున పూర్వమున్న మువర్ణకము లోపింపగా 'వృక్ష + లు' అని యగును. ఇప్పుడు ప్రస్తుతసూత్రముచేత ముగాగమము కలిగి 'వృక్షములు' అని యగును. ఇట్లే ద్వితీయావిభక్తి ప్రత్యయము పరమైనప్పుడుకూడ 'వృక్ష + ను' అవియుండి ముగాగమము కలుగుటచేత 'వృక్ష + ము + ను = వృక్షమును' అని యగును. ఇట్లే వృక్షముతోడ, వృక్షమునకు - మున్నగు రూపములందును ముగాగమము కలుగును.

'ఋషిము' అను ప్రథమావిభక్త్యంతము తుది నున్న 'ము' వర్ణకము ఇతర విభక్తులు పరమగునప్పుడు లోపించును. అప్పుడు ముగాగమము కలిగి ఋషిములు, ఋషిమును, ఋషిముతోడ, ఋషిమునకు - మున్నగురూపము లేర్పడును.

అన్నెము, పున్నెము, సాము, గీము మొదలయిన వాని విషయమున కూడ దీని నిట్లే గ్రహింపవలయును. ఇతరవిభక్తులు పరమైనపుడు మువర్ణకము లోపించినట్లును, ఆగమ 'ము' వర్ణము వచ్చినట్లును తలచుట వ్యాకరణ సంప్రదాయము. అందువల్ల అన్నెములు - అన్నెమును: పున్నెముచేత - పున్నెమునకు: సాముకంటె - సామువలన: గీమునుండి - గీమున॥ మున్నగురూపములందలి మువర్ణము ఆగమముగా పరిగణింపవలయును.

**47 మువర్ణకంబునకు విధించు కార్యము ముగాగమంబునకు నగు.**

**(బా - ౪౧)**

మువర్ణకంబునకు విధించు లోపాదేశాది కార్యములు ముగాగమమునకు సహితము వచ్చు నని యర్థము.

వ్యాఖ్య - ప్రత్యయమైన 'ము' వర్ణమునకు ఇంకముందు లోపము, ఆదేశము మున్నగు నేయే కార్యములు చెప్పబడునో అవి ముగాగమమునకు కూడ నగునని సూత్రార్థము.

ఇది తరువాతి సూత్రముల ప్రవృత్తికి సహకరించునదే కాని తనకు తానుగా వ్యవహరించి దేనిని గాని విధించునది కాదు. అందువలన తరువాతి సూత్రముల యందు, అవసరమైనప్పుడు దీని నుపయోగించుకొనుటకై వ్యాకర్త ముందుగనే సూచించుచున్నాడు.

**48. మువర్ణకంబునకు మామిడియేనిం బూర్ణబిందు పూర్వక బు వర్ణంబేని విభాష నగు.** (బా - ౩౨)

వృక్షమ్ము - వృక్షంబు ; ఋక్షమ్ము - ఋక్షంబు. పూర్వసూత్రముచేత ముగాగమమున కీకార్యం బగు. వృక్షమ్ములు - వృక్షంబులు; ఋక్షమ్ములు - ఋక్షంబులు.

వ్యాఖ్య - ప్రథమావిభక్తి ప్రత్యయమైన ము వర్ణమునకు అదనముగా మామిడి కాని, ఆదేశముగా పూర్ణబిందు పూర్వక బు వర్ణముకాని విభాషగా వచ్చునని సూత్రార్థము.

'వృక్షము' అను పదము చివర నున్న 'ము' ప్రత్యయమునకు మామిడి (మావత్తు-మ్మ) అదనముగా వచ్చి చేరగా 'వృక్షమ్ము' అని యగును. పూర్ణబిందు పూర్వక బు వర్ణము (ంబు) ము వర్ణమును తొలగించి (ఆదేశముగా) తత్స్థానమున రాగా 'వృక్షంబు' అని యగును 'ఋక్షము' అను పదము తుది ము వర్ణమునకు నీ కార్యములు జరుగగా 'ఋక్షమ్ము' అనియు, 'ఋక్షంబు' అనియు రూపములు వచ్చును. ఇది విభాష యగునని యనుటచేత వృక్షము, ఋక్షము - అను రూపములు కూడ యథాస్థితములై యుండవచ్చును.

[ ఆగమమును, ఆదేశమును గలిపి "విభాషనగు" అని తెల్పుట సరియైన పద్ధతి కాదనియు, దేనికి దానిని స్పష్టముచేసి "ఆగమముగను" అని ఒకమారు "ఆదేశముగను" అని మరియొక మారును చెప్పియుండిన బాగుండెడి దని యొక విమర్శ కలదు. పరికించి చూడకున్నచో అట్లే అనిపించును. సూత్రమునందు "ఏని" అని రెండుసార్లు వాడుట విధించువాని భిన్నరూపమును సూచించుటకే యని గ్రహించునెడల సూరి జాగరూకతను అర్థము చేసికొనవచ్చును. "ఏని" అన్నది కేవల పర్యాయవిధిని తెలియజేయుట కన్నమాట కాదు. "బిందు సంశ్లేషంబులు విభాషనగు" మున్నగుచోట్ల పర్యాయప్రవృత్తి యున్నప్పటికిని "ఏని" శబ్దమును వాడలేదు. కావున ఇక్కడి యీ వాడుక మామిడి వచ్చురీతిని వేరుగను, పూర్ణబిందు పూర్వక బు వర్ణము వచ్చురీతిని వేరుగను పరిగణింప

వలయునని సూచించుచున్న దనవలయును. ఇట్లయినప్పుడు ఇంక విమర్శకు తావు లేదు. ]

మువర్ణకమునకు విధించిన యీ కార్యములు పూర్వసూత్రముచేత, ముగాగమమునకు కూడ కలుగును. అప్పుడు 'వృక్షములు' అనునది మాముడి వచ్చుటచేత 'వృక్షమ్ములు' అనియు, పూర్ణబిందుపూర్వక బు వర్ణము వచ్చుటచేత 'వృక్షంబులు' అనియు కూడ కావచ్చును. ఇట్లే యితర విభక్తుల యందును వృక్షములచేత - వృక్షమ్ములచేత - వృక్షంబులచేత॥ అను విధముగా రూపనిష్పత్తి యుండును. ఇంత వరకు వైకల్పిక కార్యమును చూచితిమి.

విభాషయందు మరొక యంశమగు విశేషమును చూడవలయును. మోము, పాము, గీము, పేము - మున్నగుచోటి దీర్ఘపూర్వకమైన ము వర్ణకమునకు ఈకార్యములు జరుగవు. ఇచ్చట మువర్ణకమునకే జరుగనప్పుడు ముగాగమమునకు జరుగు ప్రసంగమే లేదు.

మిగిలిన యాచ్ఛికములకు బియ్యము, బియ్యమ్ము: బియ్యంబు మున్నగు విధముగా మూడువిధములయిన రూపములు గలుగును.

**49. బు లు నలు పరంబులగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాష నగు.**

**(బా - ౮౩)**

వజ్రాలు - వజ్రాలను - వజ్రాన ; పగడాలు - పగడాలను - పగడాన॥ ఒకానొకచో ననుటచే నీ కార్యంబునకుం బ్రయోగవైరళ్యంబు సూచింపంబడియె.

వ్యాఖ్య - బహుత్వమునందగు ప్రథమావిభక్తి ప్రత్యయము 'లు'. బహుత్వమునందు ద్వితీయాది విభక్తులకగు ఆగమము 'ల'. సప్తమీవిభక్తి ప్రత్యయము 'న', ఇది కొన్నిచోటల తృతీయాస్థానమున సైతము వ్యవహరించును. ఇదే కాక కువర్ణకము పరమైనప్పుడు కలుగు 'న' వర్ణము ఆగమము. కావున 'న' వర్ణము ప్రత్యయమును, ఆగమమునుగూడ నై యున్నది.

పైని చెప్పిన లు ల న - అనునవి పరమందున్నపుడు ఆగమ ము వర్ణమునకు లోపము కలిగి, తత్పూర్వస్వరమునకు దీర్ఘము విభాషగా వచ్చునని సూత్రార్థము. 'లోపంబును' అని 'దీర్ఘంబును' అని సముచ్చయార్థకములతో విడివిడిగా వ్రాసి

నను, ఇవి కలిసియే ప్రవర్తించును. విభాష యనుటచేత ప్రవర్తింపక మానినయెడల రెండును గలిసియే మానవలయును. అనగా, ఒకటి ప్రవర్తించుటయు మరొకటి ప్రవర్తింప కుండుటయు ననెడి పర్యాయప్రవృత్తికి ఇచ్చట అవకాశము లేదు. ఇవి సన్నియోగశిష్టము లైనందువలన సహప్రవృత్తిని కలిగి యుండును. అట్లు కాకున్న ప్రవర్తింపక నిలిచి పోవును.

'వజ్రములు' అని యున్నప్పుడు 'ము' వర్ణమునకు పరమందు 'లు' ప్రత్యయము కలదు. కావున సూత్రవిధినిబట్టి 'ము' వర్ణమునకు లోపమువచ్చి, తత్పూర్వమున్న 'జ్ర' లోని అకారమునకు దీర్ఘము రాగా 'వజ్రాలు' అని యగును. వైకల్పికవిధిచేత ఈ కార్యములు జరుగనియెడల 'వజ్రములు' అనియే యుండిపోవును. ఇది తత్సమశబ్దమునకు ఉదాహరణము.

అచ్చికశబ్దము 'పగడము'. బహుత్వమున ఇది 'పగడములు' అని యగును. ప్రస్తుతసూత్రముచేత 'ము' వర్ణమునకు లోపము వచ్చి, పూర్వస్వరమునకు దీర్ఘము వచ్చినట్లయిన 'పగడాలు' అని యగును.

'పగడము + లను' అనునది 'పగడాలను' అని కాని 'పగడములను' అని కాని కావచ్చును. వజ్రములను, వజ్రాలను - అను రూపములుకూడ అట్టివే.

వజ్రము + న - అని యున్నప్పుడు ప్రస్తుతసూత్రము ప్రవర్తింపగా 'వజ్రాన' అను రూపము వచ్చును. ప్రవర్తింపని యెడల 'వజ్రమున' అనియే యుండును. నగాగమము పర మందున్నప్పుడు కూడ 'ధర్మము + నకున్' అని యుండి 'ధర్మానకున్' అని యగును. ప్రవృత్తి లేనియెడల 'ధర్మమునకున్' అని యుండిపోవును.

సూత్రమునందు 'ఒకానొకచో' అని యనుటచేత ఈకార్యమునకు ప్రయోగ వైరళ్యము కలదని వ్యాకర్తయే తెలుపుచున్నాడు. వైరళ్యము అనియనగా తక్కువదనము అని యర్థము. అనగా 'వజ్రాలు' మున్నగు ప్రయోగములు భాషయందు తక్కువగా కలవని సూచించుటయే ఆయన యభిప్రాయము. ఈ సూచనయందే, యికముందు చేయువారుకూడ తక్కువగా చేయవలయు నన్న హెచ్చరిక కూడ ఇమిడి యున్నది.

ఇంతవరకు విభాషయందలి వికల్పమును మాత్రమే చూచితిమి. ఇక నిషేధ మును గుర్తింతము. 'ను' గాగమమునకు పూర్వమందు అభిన్నమైన స్వరమున్నచో

ఈకార్యము జరుగదు. పున్నెములు - గీములు - పాములు॥ మున్నగుచోట్ల 'ము' వర్ణమునకు లోపమును, తత్పూర్వస్వరమునకు దీర్ఘమును రావు. కావున వీనిని విశేషమునకు లక్ష్యములుగా గ్రహింప వచ్చును.

**50. ఇద్గ్లా రాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు.**

(బా - ౪౪)

ఇకారాంతములకు గ్లా రై శబ్దంబులకు మఱి యుగాగమాంతంబులకుం బ్రథమైకవచనలోపం బగు॥ హరి - గిరి - శ్రీ - ధీ.

వ్యాఖ్య - రై + యుగంతములు = రాయుగంతములు. ఇకారాంతములైన వానికిని, గ్లా శబ్దమునకును, రై శబ్దమునకును, యుగాగమము నంతమందు గలిగిన శబ్దములకును ప్రథమావిభక్తియందు ఏకవచన ప్రత్యయము లోపించు నని యర్థము.

సూత్రమునందు "ప్రథమైకవచనంబు రాదు" అని చెప్పక "ప్రథమైకవచనంబునకు లోపంబగు" అని చెప్పుట గమనింపదగిన యంశము. వ్యాకరణ పరిపాటి ననుసరించి ప్రకృతి ప్రత్యయముల కలయికవలన ఏర్పడినదే పద మగును. కేవలము ప్రకృతినిగాని, ప్రత్యయమునుగాని 'పదము' అని యనరాదు. కావున నామధాతువుపైని విభక్తిప్రత్యయము, తద్ధితప్రత్యయము మొదలయినవియు - క్రియాధాతువుపైని పురుష ప్రత్యయము, కృత్ప్రత్యయము మొదలయినవియు చేరుట అవసరము. అప్పుడు మాత్రమే వానికి 'పదము' అను స్థితి కలుగును. "సుప్తిఙన్తం పద"మ్మని సంస్కృతవ్యాకర్తల నిర్ణయము.

కావున ఏ శబ్దమునైనను పదము అని చెప్పుటకు పైని చెప్పిన ప్రత్యయములలో నేదియైనను చేరవలయును. కావున సూత్రమునందు "రాదు" అని చెప్పిన యెడల సంప్రదాయమునకు విరుద్ధముగా పోవుట యగును. కావున ముందుగా వచ్చినట్లు అంగీకరింపవలయును. ఇప్పుడు మరల నింకొక సమస్య తలయెత్తును. ప్రథమైకవచనము అని యన్నప్పుడు డు, ము, వు - అను వానిలో ఏది రావలయును? ఏది రావలయునో తెలియనియెడల ప్రథమైకవచనమునకు సంకేతమైన 'సు' అను దానిని చేర్పవలయును. ప్రస్తుతసూత్రముచేత దానికి లోపము చేయవలయును.

'ఇకారాంతములు' అని యనగా ఇకారముయొక్క హ్రస్వముకాని దీర్ఘము కాని అంతమందు గల శబ్దములని యర్థము. "హరి" ఇది ఇదంతమైన ప్రాతిపదికము. దీనికి ప్రథమైకవచనము పరముకాగా "హరి + సు" అని యగును. ఇకా

రాంతముల ప్రథమైకవచనము ప్రస్తుతసూత్రముచేత లోపింపవలయును గాన 'సు' అన్న సంకేతము లోపించి 'హరి' అని యగును. ఇది పదము. ప్రథమైకవచన ప్రత్యయము లోపించినప్పటికిని ప్రథమైకవచనమున నున్నట్లే దీనిని పరిగణింప వలయును.

అట్లే 'గిరి' అను ప్రాతిపదికముపై 'సు' అను సంకేతము కలిగి 'గిరి + సు' అనియై 'ప్రథమైకవచనమునకు లోపంబగు' నన్న ప్రస్తుత విధిచేత 'గిరి' అని యగును.

శ్రీ, ధీ - అనునవి రెండును ఈదంతములు. వీనికిని 'సు' అనునది పరమై ప్రస్తుతసూత్రముచేత లోపించును.

[ 'శ్రీ' యనునదియు, 'ధీ' యనునదియు సంస్కృతమున స్త్రీలింగశబ్దములే. కావున వానికి "స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబు నగు" అను (బాల - 57) సూత్రమును బట్టియే ప్రథమైకవచనలోపము జరుగగలదు. కావున స్త్రీలింగశబ్దములుగాక, యితరములయిన ఈదంతశబ్దములను లక్ష్యములుగా చూపిన బాగుండెడిది. 'చంద్రశ్రీ' అని యన్నప్పు డది పురుషునకు విశేషణమైనప్పుడు పుంలింగముగనే పరిగణింపబడును. ముద్రారాక్షసమున చంద్రగుప్తుడనుటకు పర్యాయముగా "చంద్రశ్రీ' యని కలదు. అట్టియెడల సైతము ప్రథమా విభక్తిప్రత్యయము లోపము నొందును. అట్లే 'సుధీ' అని యన్నప్పుడు పండితుఁడని యర్థము. ఇట్టియెడల సైతము ప్రథమైకవచనమునకు లోపము జరుగును. కావున చంద్రశ్రీ - సుధీ॥ అనువానిని ఈదంతములకు ఉదాహరణములుగా గ్రహింపవచ్చును. ]

'గ్లౌ' అని యనగా 'చంద్రుఁడు' అని యర్థము. దీనికిని ప్రథమైకవచనలోపము కలుగును. 'రై' అని యనగా ధనము అని యర్థము. దీనికిని ప్రథమైకవచన లోపము కలుగును. ఇవి తత్సమపదములుగా 'గ్లౌ' అనియు 'రై' అనియు నుండును.

ఉక్ + అంతములు = ఉగంతములు = ఉకారము కడపట విధింపబడిన శబ్దములు. మరుత్, జలముక్ - మున్నగు హలంత ప్రాతిపదికములకు ఉత్వము కాని, ఉత్వద్విత్వములు గాని వచ్చును. అట్లు రాగా ఏర్పడినవి ఉగంతములు. మరుత్తు, జలముక్కు, రుక్కు, వాక్కు - మున్నగునవి యుదాహరణములు.

[ వీనినిగూర్చి యింకను ప్రస్తావింపక పోవుటచేత వ్యాకర్త యుదాహరింప లేదు. ఈ ఉగంతములనుగూర్చి విశదవివేచనము (బాల - ౮౪) "ఉగాగమంబును" అని మొదలయిన సూత్ర... కడ చేయబడును. ]

**51. ఇత్తునకు బహువచనంబు పర బగునపు డుత్వంబగు.**

(బాల - ౮౫)

హరులు - గిరులు - కవులు - రవులు - యామినులు - భామినులు। తపరకరణంబుచే దీర్ఘంబున కుత్వంబు లేదు. శ్రీలు - స్త్రీలు-లక్ష్మోరీలు.

వ్యాఖ్య - నామము తుదనున్న హ్రస్వమైన 'ఇ' కారమునకు బహువచనము పరమైనప్పుడు ఉత్వము ఆదేశముగా నగునవి సూత్రార్థము.

బహువచనము అని యనుటచేత 'లు' వర్ణమును, ద్వితీయాదివిభక్తులకు ముందు చేరెడి 'ల' వర్ణమునుకూడ గ్రహింపవలయును.

'హరి' యనునది ఇదంత మహద్వాచకము. దీనికి పైని బహువచనము చేరగా 'హరి + లు' అని యగును. ప్రస్తుత సూత్రముచేత ఇత్వమునకు బదులు ఉత్వము రాగా 'హరు + లు = హరులు' అని యగును.

'గిరి' యనునది ఇదంతమైన అమహద్వాచకము. బహువచనము పరమగుచుండగా ప్రస్తుతసూత్రముచేత తుది ఇత్వమునకు ఉత్వము కలిగి 'గిరులు' అని యగును.

కవులు, రవులు - అను రెండును ఇట్లేర్పడినవే,

'యామిని' అనునది సంస్కృతమున దీర్ఘాంతశబ్దమై 'యామినీ' అను రూపమున నుండును. తత్సమపదముగా గావించుటకు దానినే గ్రహించి "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను సూత్రమునుబట్టి 'యామిని' అని చేసికొనవలయును. ప్రస్తుతసూత్రముచేత 'యామిని + లు' అని యుండగా ఉత్వము కలిగి 'యామినులు' అని యగును. ఇది అమహద్వాచకము. 'భామినులు' అనునదికూడ ఇట్లే యేర్పడును. ఇది మహతీవాచకము.

'శ్రీ' అనునది ఈదంతము సూత్రమునందు 'ఇత్తు' అని 'ఇ' వర్ణమునకు పరమందే త కారమును చేర్చి తెలుపుటచేత హ్రస్వమైన ఇ వర్ణమును మాత్రమే గ్రహింపవలయును. కావున దీర్ఘాంతమైన 'శ్రీ' అను శబ్దము ఈమార్పును పొందదు.

కావున 'శ్రీ + లు' అని యున్నప్పుడు 'శ్రీలు' అనియే యగును. 'స్త్రీలు' అను నదికూడ ఇట్టి రూపమే.

[ ఏకాక్షరంబులకు హ్రస్వంబులేదు - అని రాబోవు (బాల - 55) సూత్రమునుబట్టి శ్రీ, స్త్రీ మున్నగు శబ్దముల ఈకారమునకు హ్రస్వము కలుగరాదు. యామినీ, భామినీ - అనునవి దీర్ఘాంతములే యయ్యును, వాని తుదిదీర్ఘమునకు హ్రస్వము కలుగుటచేత ప్రస్తుతవిధి ననుసరించినవి. ]

'లకోరీ'యనునది దీర్ఘాంతమైన తెలుగుపదము. "నామంబుల తుదిదీర్ఘంబునకు" అని మొదలయిన (బాల - 54) సూత్రము తత్సమరూప సాధనముననే ప్రవర్తించును. తెలుగునామముల విషయమున దానికి ప్రవృత్తిలేదు. కావున దీర్ఘాంతమైన 'లకోరీ' శబ్దముపై బహువచనము కలిగినప్పుడు 'లకోరీలు' అనియే యుండును. మార్పు నొందదు.

'హరి' మొదలు 'భామిని' వరకు గల లక్ష్యము లన్నింటికి బహుత్వంబున లదాగమము కలిగినపుడుకూడ ఉత్వము కలిగి హరులను - గిరులను - కవులచే - రవులచే - యామినులకొఱకు - భామినుల కొఱకు॥ మున్నగువిధముగా నగును.

ఈవిధి తత్సమములకును, తెలుగులకునుకూడ సమానముగనే వర్తించును. అట్లే మహదమహన్మహతీ వాచకములు మూడింటియందును గూడ వర్తించును.

52. వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపు డుత్వం బగు (బా - ౪౬)

ఇచ్చట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు. కలికి - కలుకులు ; ములికి - ములుకులు ; చెలిమి - చెలుములు ; బలిమి - బలుములు॥ ఉపోత్తమేత్వంబున కనుడంజేసి జిగి, నిసి - ఇత్యాదులం దుత్వంబు లేదు, జిగులు - నిసులు.

వ్యాఖ్య - అచ్చికములయిన ఇకారాంతశబ్దములయొక్క ఉపోత్తమేత్వమునకు బహువచనమువందు ప్రత్యయమైన 'లు' వర్ణముగాని ఆగమమైన 'ల' వర్ణముగాని పరమైనయెడల ఉత్వమగు నని సూత్రార్థము.

ఉపోత్తమేత్వము అని యనగా చివరి ఇత్వమునకు ముందు ఇత్వమని యర్థము.

'కలికి' అనునది ఇకారాంత శబ్దము. 'లి' అను నక్షరము నందలి ఇత్వము ఉపోత్తమేత్వము. బహుత్వము కలుగునపుడు 'లు' వర్ణము పరమై పూర్వసూత్రము చేత చివరి ఇత్వమునకు ఉత్వము కలుగును. ఆ తరువాతనే వెనుకటి ఇత్వమునకు ప్రస్తుత సూత్రముచేత ఉత్వము కలిగి 'కలుకులు' అని యగును.

అట్లే ములికి, చెలిమి, బలిమి - అను అచ్ఛికశబ్దముల కన్నింటికి బహువచనము పరమైనపుడు చివరి ఇత్వమునకు ఉత్వము కలిగి, ఆ తరువాతనే ప్రస్తుత సూత్రముచేత వెనుకటి ఇత్వమునకు ఉత్వము ఆదేశముగా నగును. అప్పుడు ములుకులు, చెలుములు, బలుములు - అను రూపము లేర్పడును.

లడాగమముతోడి ద్వితీయాది విభక్తులు పరము కాగా కలుకులను, ములుకులచే, చెలుములకొఱకు, బలుముల వలన - మున్నగువిధముగా ఉత్వముతోడి రూపము లేర్పడును.

'జిగి' అను శబ్దమునందు రెండే యక్షరములు గలవు. చివరి యిత్వమునకు ముందరి యిత్వము అవి యన్నచో మొదటి యక్షరము మీదిదే యగుచున్నది కావున దానిని ఉపోత్తమేత్వమని పరిగణింపరాదు. కావున ఈ కార్యము జరుగుటకు పదమునందు మూడక్షరములకంటె తక్కువ యుండరాదు. 'కాంతి' యను నర్థముగల 'జిగి' శబ్దమునందు రెండక్షరములే యుండుటచే, ప్రస్తుతసూత్రము ప్రవర్తింపదు. పూర్వసూత్రముచేత పదముతుది ఇత్వమునకు ఉత్వముకలిగి 'జిగులు' అని యగును. 'రాత్రి' యను నర్థము గల 'నిసి' యున్నది కూడ ఇట్లే 'నిసులు' అని యగును.

ఇది వికృతియందే జరుగునని యనుటచేత సంస్కృత సమముల విషయమున నీ కార్యము ప్రవర్తింపదు. 'ఫణితి' అనునది తత్సమము. దీనికి పూర్వసూత్రముచే తుది ఇత్వమునకు మాత్రమే ఉత్వము కలిగి 'ఫణితులు' అని యగును. 'సమితి' యనునది కూడ ఇట్లే 'సమితులు' అని యగును.

తలిరు, ఉలివు - మున్నగునవి ఇకారాంతములు కాక పోవుటచే ఇచ్చటి ఇత్వమునకు ఉత్వము కలుగక తలిరులు, ఉలివులు - అనియే రూపములు గలుగును.

బాలవ్యాకరణము అన్యదేశ్యములను వేరుగా పరిగణింపలేదు. కావున అవియు వికృతి శబ్దములలోనే అంతర్భవింపవలసి యున్నది. జిగిసీ, తనికీ మున్నగునవి అట్టివి. ఇవి ఈదంతము లగుటచే పూర్వసూత్రము ప్రవర్తింపదు. కావున చివరి ఇకారమునకు ఉత్వము కలుగదు. కావున ఉపోత్తమేత్వమునకు కూడ ఉత్వమువచ్చుట కవకాశము కలుగుటలేదు. కావుననే జిగిసీలు, జిగిసీలకు; తనికీలు, తనికీలకు - అను విధముగనే బహువచన రూపము లుండును.

**౫౩. ర ల డోపధ నవార్థాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు. (బా - ౪౭)**

పందిరి - పందిరులు; పిడికిలి - పిడికిళులు; రాపిడి - రాపిడులు; తొమ్మిది - తొమ్మిదులు.

వ్యాఖ్య - పూర్వసూత్రమునందు చెప్పినట్లు ఇదంతమే అయినప్పటికిని ఉపధాస్థానమున ర ల డ అనువర్ణములలో దేనిని కలిగియుండినను, ఆ శబ్దము యొక్క ఉపోత్తమేత్వమునకు ఉత్వము కలుగదు. అట్లే తొమ్మిది మున్నగుపదముల ఉపోత్తమేత్వమునకును ఉత్వము కలుగదు.

'పందిరి' అనునది వికృతిపదము; ఇదంతము. ఇచ్చట రకారము ఉపధ. కావున బహువచనము పరమైనపుడు చివరి ఇత్వమునకు ఉత్వము కలిగి 'పందిరులు' అని మాత్రమే యగును. ఇది రోపధమగుటచే ప్రస్తుతసూత్రముచేత దీని ఉపోత్తమేత్వమునకు ఉత్వప్రాప్తి వారింపబడినది.

'పిడికిలి' అనునది వికృతిపదము; ఇదంతము. ఇచ్చట లకారము ఉపధ. కావున ఉపోత్తమేత్వమునకు ఉత్వము రాకుండుటచే 'పిడికిళులు' అని తుది ఇత్వము మాత్రమే ఉత్వమును పొందును.

["బహువచనము పరంబగునపుడు" అని ప్రారంభమైన బాలవ్యాకరణము (అచ్చిక - 14) సూత్రమువలన 'ల' కారము ళకారముగా మారును. 'పిడికిలులు' అనునది వికల్పముగా 'పిడికిళులు' అని మారును.]

'రాపిడి' అనునదికూడ అచ్చికశబ్దమే. దీనికిని బహువచనము పరమగునప్పుడు తుదిఇత్వమునకు ఉత్వమువచ్చి 'రాపిడులు' అని యగును. ఇది డోపధమగుటచే ఉపోత్తమేత్వమునకు ఉత్వము కలుగదు.

['రాపిడులు' అనురూపముతోపాటు 'రాపుడులు' అను రూపము కూడ కలదు. 'రాచు' అను ధాతువునకు కృదంతరూపము 'రాపుడు' అనునది. దానికి బహువచనము పరమైనయెడల, ఏ మార్పును లేకుండగనే 'రాపుడు + లు = రాపుడులు' అని యగును. 'రాపిడి' యనునది 'రాపిడులు' అని మాత్రమే యగుననియు, 'రాపుడులు' అని యున్నచో 'రాపుడు' అనుదానికి బహువచన రూపముగా గ్రహింపవలయు ననియు సూచించుటకే సూరి యీ లక్ష్యమును చూపియుండును. అట్లు కాకున్న, ఇదే యర్థమువనున్న 'రాయిడి' అను శబ్దము

ముదాహరించిన సరిపోయెడిది. ఇక్కడ కూడ 'త' వర్ణమె ఉపధ. ఔపోత్తమేత్వ మునకు ఉత్వము రాకుండ 'రాయుటకు' అని సూత్రమె వచ్చును.

నవార్థము = నవ యను దానియర్థము = తొమ్మిది. తొమ్మిది అను పదము కూడ బహువచనము పరమగునప్పుడు తుదిఇత్వము మాత్రమే ఉత్వము నొంది 'తొమ్మిదులు' అని యగును. 'ఎనిమిది' అనునదికూడ ఇట్లే 'ఎనిమిదులు' అనియే యగును. ఉపోత్తమేత్వమునకు ఉత్వము కలుగదు.

[సర్వస్వపేటికాకారులు నవార్థములలో మగండ్రి - పెదళ్ళ - పొండికి - పోలికి - కోరికి॥ మున్నగువానిని ... పరిగణించిరి. వారి యభిప్రాయమును బట్టి యీ శబ్దముల యుపోత్తమేత్వమునకు ఉత్వము కలుగరాదు. అట్లు కలుగుట లేదనునంతటి ప్రయోగములు లభించవు. పైగా పొండుకులు, పోలుకులు, కోరుకులు - మున్నగు విధమైన ప్రయోగములుకూడ కానిపించుచున్నవి]

౫౧. ఉకారాంత గోశబ్దంబుల కంతటఁ వు వర్ణకం బగు. (బా. ౪౮)

తనువు – ధేనువు – మధువు – గోవు॥ అంతట ననుట స్త్రీలింగ ప్రథమైకవచనలోప బాధనార్థము.

వ్యాఖ్య - ఉకారాంత శబ్దములకును, గోశబ్దమునకును ప్రథమైకవచనమునందు 'వు' వర్ణకము కలుగునని సూత్రార్థము.

సూత్రమునందు 'అంతట' అను శబ్దము ఒక ప్రయోజనము కొరకు ప్రయోగింపబడినది. "స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" అని రాబోవు (బాల - 67) సూత్రముచేత ప్రథమైకవచనమునకు లోపము రావలసివచ్చును. స్త్రీలింగములైన ఉకారాంతములకు ప్రథమైకవచనలోపము జరుగరాదు. కావుననే 'అంతట' అనునది అవశ్యకమైనది.

'తరు' అన్నది ఉదంత పుంలింగనామము : అమహద్వాచకము. ప్రస్తుత సూత్రముచేత 'వు' వర్ణకము కలుగగా 'తరువు' అని యగును.

'ధేను' అన్నది ఉదంతము; స్త్రీలింగము; అమహద్వాచకము. "స్త్రీలింగంబుల" అని మొదలయిన సూత్రములచేత ప్రథమైకవచనమునకు లోపము రావలసి యున్నప్పటికిని, ప్రస్తుతసూత్రమునందున్న 'అంతట' అను శబ్దముయొక్క బలము చేత 'వు' వర్ణము కలిగి 'ధేనువు' అని యగుచున్నది.

[మధూ - శబ్దము ఊకారాంతశబ్దము "సంస్కృతంబుల ఉదంత దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను (బాల - 54) సూత్రముచేత 'మధు' అని యగును. ప్రస్తుత

సూత్రముచేత వు వర్ణముకలిగి 'వధువు' అని యగును. ఇది స్త్రీలింగశబ్దమే లైనను ప్రథమైకవచనమునకు లోపము రాలేదు. ఇది మహతీవాచకము.]

'మధు' అన్నది ఉదంత నపుంసక శబ్దము; అమహద్వాచకము. దీనికిని వు వర్ణకము కలిగి 'మధువు' అని యగును. 'గో' అను సంస్కృతనామమునకును 'వు' ప్రత్యయము కలిగి 'గోవు' అని యగును.

[పుంలింగ స్త్రీలింగ నపుంసకలింగములకు చెంది, మహతీవాచకము లైనను అమహద్వాచకములైనను కూడ, ఆశబ్దములు ఉదంతములైనయెడల ప్రస్తుతసూత్రము ప్రవర్తించుచున్నదని గమనించుట అవసరము.]

**౫౫. అర్ఘాదుల కడయచ్చున కుత్వంబును, మీఁద వు వర్ణకంబును వైకల్పికంబుగా నగు.** (ప్రౌ - ౧౨)

అర్ఘువు - అర్ఘము; ధర్మువు - ధర్మము; వర్గువు - వర్గము॥ అవని యరాజకం బయినయప్పుడు భూప్రజలందు సర్వధర్మువులు దొలంగు దేవమునిముఖ్యులు వాయుదు రోలి వృష్టిలే! దవు మఱి యర్ఘువుల్ దఱుఁగునందుకు కావునఁ గాలయాపనం! బవితథవాక్య! చేయక రయంబున రాజ్యము నిల్పుమి త్తఱిన్॥ భార. ఆది. ౮ ఆ॥ వర్గువుసందలి వువర్ణకం బొండె లోపించు - వర్గు.

వ్యాఖ్య - 'అర్ఘ' మున్నగు సంస్కృత ప్రాతిపదికలకు ప్రథమైకవచనము నందు. వికల్పముగా చివరి అత్వమునకు ఉత్వము కలిగి, మీద 'వు' ప్రత్యయము కలుగు నని సూత్రార్థము.

'అర్ఘ' అనునది అమహద్వాచకము; అదంతము. కావున "అమహన్నపుంసకములకు" అని మొదలయిన (బాల - ౧౧) సూత్రమునుబట్టి 'అర్ఘము' అన్నరూప మేర్పడును. ప్రస్తుత ప్రౌఢవ్యాకరణసూత్రమువలన చివరి అత్వమునకు ఉత్వమును, వు వర్ణకమును కలుగగా 'అర్ఘువు' అను రూపమేర్పడును.

'ధర్మ' అను అమహద్వాచకమునకు బాలవ్యాకరణ విధివిబట్టి "ధర్మము' అను రూప మొక్కటియే యేర్పడ వలసి యుండగా ప్రస్తుత ప్రౌఢవ్యాకరణవిధిబట్టి వికల్పముగా 'ధర్మువు' అను రూపముకూడ ఏర్పడుచున్నది.

'వర్గ' అనునది 'వర్గము' అను రూపముతో పాటు, ప్రస్తుతసూత్రమువలన ఉత్వమును పొంది వు వర్ణకము నొందుటచేత 'వర్గువు' అని యగును. 'వర్గువు'

అనునది యొక్కటియు 'వు' వర్ణకము లోపింపగా 'వర్గ' అను విధముగా కూడ నగును.

ప్రౌఢవ్యాకర్త యిత్యాదు లనికాని, మొదలగునవి అనికాని యేమియు సూచన చేయనందువలన అర్థాదు లనగా ఈ మూడు శబ్దములే యని యనిపించును. కాని 'కర్మ' శబ్దమునకు 'కర్మము' అను రూపముతోపాటుగా 'కర్మువు' అను రూపము కూడ ప్రథమైకవచనమునందు కలదు. 'వర్మము' అనునది 'వర్మువు' అనికూడ నగును. ఇట్టి వింకను ఉండవచ్చును.

'అర్ఘువు' అనుచోటి 'ఘ' వర్ణమును, 'ధర్మువు' అనుచోటి 'ధ' వర్ణమును - ఆ పదముల సంస్కృత సమత్వమును నిరూపింపగలవు. దేవవర్గు, మనుష్యవర్గు - మున్నగు విధముగా సమాసమున నుత్తరపదమై ప్రయుక్తమగుటచే 'వర్గువు' అన్నదియు సంస్కృతసమముగా పరిగణింపదగియున్నది. 'కర్మువు' అన్నది 'ధర్మకర్ములో' మున్నగువిధముగా నున్న సమాసయోగ్యతనుబట్టి సంస్కృతసమ మని నిర్ణయింప వీలున్నది.

[ 'నాగ' శబ్దమునకు 'ము' వర్ణకము కలిగి 'నాగము' అన్న రూపము బాలవ్యాకరణమునుబట్టి యేర్పడును. దానికి 'నాగువు' అను రూపముకూడ కనిపించుచున్నది. దానిని వైకృతముగా నిఘంటువులు గుర్తించినవి. పదమునందు తత్సమముగా నిర్వహించు వర్ణము కాని, సమాసమునందు తత్సమముతో ప్రయుక్తమై యుండుటకాని కనిపింపనందున, దానిని తత్సమమనుటకు వీలు కాకున్నది.]

ఇది బాలవ్యాకరణమునకు పూరణము.

**56.** రాహు బాహు శబ్దముల కంతట వు వర్ణకలోపంబు వైకల్పికంబు. (ప్రౌ - ౨౬)

రాహువు - రాహు: రాహువులు - రాహులు॥ బాహువు - బాహు; బాహువులు - బాహులు॥ ఇత్యాదులు. అపమేఘమైయున్న యంబరమున। విద్యుల్లసహస్రముల్ విలసిల్లె మఱి రాహు। పర్వంబు గాకయు భానుఁగప్పె॥ భార. సభా. ౨ ఆ॥ అగ్గలించి నా యెదుర బాహప్పళించి। కడవఁజాలిన మల్లురఁ గాననెందు॥ భార. విరా. ౨ ఆ॥ మొ.

వ్యాఖ్య - 'రాహు' అను శబ్దమునకును 'బాహు' అను శబ్దమునకును అన్ని విభక్తులయందును 'వు' వర్ణకమునకు లోపము వైకల్పికముగా నగునని సూత్రార్థము.

[ వర్ణకము అని యనగా ప్రత్యయమనియర్థము. ప్రథమైకవచనమునందు వచ్చు 'వు' వర్ణమునకు మాత్రమే ప్రత్యయసంజ్ఞ కలదు ఇతర విభక్తుల యందును, ప్రథమాబహువచనమందును వచ్చు 'వు' వర్ణమునకు ఆగమమని సంజ్ఞ. కావున "అంతట వు వర్ణకలోపము" అని యనుట పరస్పరవిరుద్ధతను సంతరించుకొనును. 'అంతట' అని యనగా 'అన్ని విభక్తులయందును' అని అర్థమైనప్పుడు ప్రథమైకవచనమైన 'వు' వర్ణకము, తదితర విభక్తులందు రానే రాదు. రానిదానికి లోపము విధించుట యగును కావున సూత్రమునందు "వువర్ణ లోపము" అని కవర్ణవిరహితముగా నుండుట అపేక్షణీయము. ]

'రాహూ' అన్నది ఉదంతనామము. కావున "ఉకారాంత గోశబ్దంబుల కంతట వు వర్ణకం బగు" అను బాలవ్యాకరణ విధినిబట్టి 'రాహూవు' అను రూపము కలుగును. ప్రస్తుతసూత్రముచేత వు వర్ణకమునకు లోపము కలిగి 'రాహూ' అని కూడ కావచ్చును. ఇది వికల్పవిధి యగుటచేత 'రాహూ' అనియు 'రాహూవు' అనియు - రెండు రూపములు నుండవచ్చును. "రాహూ పర్వంబు గాకయు భానుఁ గప్పె" అను భారతప్రయోగమునందు కర్తృవాచకము 'రాహూ' అనునది. వు వర్ణకవిరహిత ప్రథమైకవచనరూపమునకు ఇది లక్ష్యము.

'రాహూవు' అనుదానికి 'లు' వర్ణకము పరముకాగా 'వు' లోపించి 'రాహూలు' అని యగును. "వువర్ణకేతర విభక్తిపరమగుచో" అని రాబోవు (బాల - 48) సూత్రమును బట్టి 'రాహూవులు' అనియు రావచ్చును. కావున రాహూలు, రాహూవులు - అను రెండు రూపములును బాలవ్యాకరణమును బట్టియే సిద్ధించుచున్నవి. బహువచన విషయమున ప్రౌఢవ్యాకరణవిధికి ఆవశ్యకత లేదు.

'బాహూ' శబ్దముకూడ ఉదంతమగుటచేత ప్రథమైకవచనమున, 'వు' వర్ణకమును పొంది 'బాహూవు' అని యగును. ప్రస్తుత విధిచేత 'బాహూ' అని వువర్ణవిరహితముగా కూడ నుండును. 'బాహప్పళించి' అని యన్నప్పుడు 'బాహూ + అప్పళించి' అనియే విభాగము, కావున ఈ భారతప్రయోగము 'బాహూ' అని వు వర్ణము లేని రూపమును నిరూపించుచున్నది.

[ఇచ్చటిది 'బాహ' యని అనంతశబ్దమనియు, 'బాహో' యను శబ్దము తుదిదీర్ఘమునకు హ్రస్వము కలుగగా ఏర్పడెననియు వజ్ఝలవారి యభిప్రాయము. బాహ + అప్పళించి - అనియుండగా తత్సమమునందలి అత్వమునకు సంధి కావలసివచ్చును. ఇట్టి ప్రయోగము మరొకటి యింతవరకును కనిపింపలేదు. 'బాహ' అని యుండవలయునో 'బాహూ' అని యుండవలయునో స్థిరీకరింను

టకు వీలులేదు. 'బాహు' యని యనుకొన్నచో సంధి సుగమముగా నుండును. 'బాహ' యని యనుకొన్నచో అత్వసంధిరౌడసైతము నియమాతిక్రమణము చేయ వలసివచ్చును. కావుట్టి ప్రౌఢవ్యాకర్త 'బాహు'అని వ్వవర్ణ నిరహితరూపమునే గ్రహించుట సొంతము. ]

'బాహు + లు' అని యున్నప్పుడు ఒక విభక్తిప్రత్యయము పరమగుచుం డగా, పూర్వమున్న విభక్తిప్రత్యయము సహజముగనే లోపించిపోవును. అప్పుడు 'బాహులు' అను రూపమే యేర్పడును. "పువర్ణ కేతరవిభక్తి పరమగుచో" అని మొదలయిన (బాల - 49) సూత్రమునుబట్టి 'వు' గాగమము కలిగినయెడల 'బాహు వులు' అని యగును.

ఇంతకును పై యుదాహరణము లందు ప్రథమైకవచనమగు వు వర్ణకము లోపించుటయే విశేషము. వుగాగమ విషయము పూర్వసిద్ధమే. కావున "రాహు బాహుశబ్దముల పువర్ణకంబు వికల్పంబుగా లోపించు" అని చెప్పిన సరిపోయెడిది. 'అంతట' అనునది అంత యవసరము కాదు.

57. వువరకేతరవిభక్తి పరమగుచో నుకారాంతంబులకు బహుళం బుగ గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమంబగు. (బా - ౪౯)

తరువులు – తరులు ; ధేనువులు – ధేనులు ; గోవులు.

వ్యాఖ్య - ఉకారాంతములకు వు వర్ణకముకాక యితర విభక్తిప్రత్యయము పరమైనప్పుడు బహుళముగా వు గాగమమగునని, అట్లే గో శబ్దమునకు వుగాగమము నిత్యముగా నగునని సూత్రార్థము. అనగా ప్రథమావిభక్తిబహువచనము పరమగు నప్పుడును, ద్వితీయాదివిభక్తులు పరమగునప్పుడును వుగాగమము ఉకారాంతములకు బహుళముగను, గోశబ్దమునకు నిత్యముగను కలుగునని తాత్పర్యము.

'తరువు' అనునది 'తరు' అను ప్రాతిపదికపై ప్రథమైక వచనమగు 'వు' వర్ణము కలుగగా ఏర్పడినరూపము బహువచనము పరముకాగా 'తరు + లు' అః యగును. ఒకవిభక్తి వచ్చుచుండగా మరొకవిభక్తి నిలువరాదను నియమమునుబట్టి ప్రథమైకవచనమగు 'వు' ప్రత్యయము లోపించిపోయి 'తరులు' అను రూపమేర్ప డును. లు వర్ణము పరమందుండుటచే 'తరు' అను నామమునకు ప్రస్తుతసూత్రముచే వుగాగమము కలిగిన యెడల 'తరు + వు + లు = తరువులు' అని యగును. అట్లే 'ధేను' అను శబ్దముకూడ ప్రథమైకవచనము నొంది 'ధేనువు' అనియు తదితరవిభక్తు

నొందినప్పుడు ధేనువులు, ధేనువులను, ధేనువుతో - మున్నగువిధముగా వుగాగమము తోడి రూపములను ; ధేనులు, ధేనులను, ధేనుతో - మున్నగువిధముగా వుగ్విరహిత రూపములను పొందును. ఇవి వికల్పమునకు లక్ష్యములు. 'గో' అను శబ్దము ప్రథమైకవచనమున 'గోవు' అని యుండును. ఇతరప్రత్యయములు పరమగునపుడు వుగాగమము నిత్యమగుటచేత గోవులు, గోవును, గోవులను మున్నగువిధముగా రూపము లుండును.

సూత్రమునందు "ఉకారాంతంబులకు" అని చెప్పుటచేత 'భ్రూ' మున్నగువానికి కూడ ఈ విధి అన్వయించును. అప్పుడు భ్రూవులు, భ్రూలు, భ్రూవును, భ్రూను - మున్నగు విధముగా రెండేసి రూపములు కలుగును.

సూత్రమునందు బహుళమని యుండుటచేత ఉదంతములయందును మహతీవాచకములకు వుగాగమము నిత్యముగా నగును. 'వధు' అను మహతీవాచకము ప్రథమైకవచనమునొంది 'వధువు' అని యగును. ద్వితీయాదివిభక్తులయందును, బహువచనమందును వుగాగమము నిత్యముగానై వధువును, వధువుతో, వధువులు - మున్నగువిధముగా రూపములుండును. ఇవి ప్రవృత్తికి లక్ష్యములు.

బహుళగ్రహణముచేత ఉగంతములైనవానికి ఈ వుగాగమము కలుగదు. మరుత్తు - మరుత్తులు - మరుత్తుచేత॥ జలముక్కు - జలముక్కులు - జలముక్కుచేత॥ మున్నగువిధముగనే యుండును. ఇవి అప్రవృత్తికి లక్ష్యములు.

58. ఉకారాంతంబగు మహత్తునకు వు వర్ణకము బహుళముగానగు.
(బా - ౩౦)

విష్ణువు - విష్ణుఁడు; శంభువు - శంభుఁడు ; వసువు - వసుఁడు.

వ్యాఖ్య - మహద్వాచకమై ఉకారాంతమైన నామమునకు ప్రథమైకవచనమగు 'వు' వర్ణము వచ్చునని సూత్రార్థము.

ఇది "ఉకారాంత గో శబ్దంబుల కంతట వు వర్ణకంబగు" అని ఉన్న పూర్వసూత్రమునందలి సాధారణవిధిని సవరించెడి విశేషవిధిని నిర్దేశించుచున్నది. పూర్వసూత్రముచేత 'విష్ణు' మున్నగు ఉదంతనామములకు 'విష్ణువు' మున్నగురూపములు మాత్రమే రావలసియుండగా ప్రస్తుతసూత్రముచేత 'విష్ణుఁడు' మున్నగురూపములకు కూడ అవకాశము లభించుచున్నది.

'విష్ణు' అన్నది ఉదంతము; మహద్వాచకము. కావున ప్రస్తుతసూత్రముచేత 'వు' వర్ణకము కలుగగా 'విష్ణువు' అని యగును. సూత్రమునందు 'బహుళము' అని యుండుటచేత, వు వర్ణకము కలుగకుండ నుండవచ్చును. అట్టియెడల "పుంలింగ మగు మహద్వాచకమునకు డుజ్జగు" అను (బాల - 2) నియమమునుబట్టి బిందు పూర్వక డువర్ణకము కలుగగా 'విష్ణుఁడు' అని యగును. ఇట్లే శంభుఁడు, వసుఁడు- అను రూపములుకూడ నేర్పడును. ఇవి వికల్పవిధికి లక్ష్యములు.

'స్వయంభూ' మన్నగు ఊదంతనామమునుకూడ ఇందు గ్రహింపవగును. ఇట్టి యెడల టువిదీర్ఘమునకు హ్రస్వముకలిగి 'స్వయంభు' అని యగును. ప్రస్తుత సూత్రముచేత వు వర్ణక డు జ్వర్ణకములు కలుగగా 'స్వయంభువు' అనియు 'స్వయం భుఁడు' అనియు రూపములుండును.

మను, పటు, కటు, దను-మన్నగు ఉదంతమహద్వాచకములకు 'వు' వర్ణకమే నిత్యముగా కలిగి మనువు, పటువు, కటువు, దనువు మన్నగువిధముగా రూపము లుండును. ఇట్టి యెడల డుజ్వర్ణకము ప్రవర్తించుటకు అవకాశము లేదు. ఇవి నిత్యవిధికి లక్ష్యములు.

[కంతుఁడు, శంతనుఁడు - మన్నగువానికి వు వర్ణకాంతరూపములు కన బడవు. అనగా ఈ శబ్దముల విషయమున 'వు' వర్ణకవిధి అప్రవృత్తి ననుస రించుచున్నదని యర్థము. ఇట్టివానికి స్పష్టముగు నిర్ణయము జరుగలేదు. కావున ప్రయోగములను బట్టి 'వు' వర్ణకమునకు ప్రవృత్తియు, అప్రవృత్తియు, వికల్పము,అన త్యత్వము-ఎక్కడెక్కడ జరుగుచుండునో గుర్తించుకొనవలయును.]

**59. కద్రువ నాగమాత.** (బా - ౩౧

కద్రువ - కద్రువలు - కద్రువను - కద్రువలను.

వ్యాఖ్య - కద్రువ అను పదమునకు సర్పములకు తల్లియని అర్థమని సూత్రార్థము.

సంస్కృతమున 'కద్రు' అని ఒకశబ్దమును 'కద్రూ' అని ఒక శబ్దమును గలవు. మొదటిది పుంలింగశబ్దము. దానికి గోరోచనవర్ణమని యర్థము. రెండవది ఊకారాంత స్త్రీలింగశబ్దము. దానికి నాగమాతయని యర్థము. పైనిచెప్పిన రెండుశబ్దములను తెలుగునందు 'కద్రువు' అని వువర్ణాంతముగనే కావలయును. గోరోచనవర్ణ మనికాని పింగళవర్ణము అనికాని అర్థమైనప్పుడు 'కద్రువు' అనియే

రూపముండును. అక్కడ ఏ యిబ్బందియు లేదు. స్త్రీవాచకమైనప్పుడుకూడ 'కద్రూ' అను శబ్దము తుదిఊకారమునకు హ్రస్వమై, పైని పువర్ణకము కలిగి 'కద్రువు' అని కావలసి వచ్చుచుండగా, ప్రయోగములందు 'కద్రువ'అను రూపము కనిపించుచున్నది. ఇంతవరకు చెప్పికొన్న సూత్రవిధులనుబట్టి యీ రూపమేర్పడుట కవకాశము లేదు. ఇట్లు క్వాచిత్కముగ కనిపించు పదములను సాధించుటకై వేర్వేరు సూత్రములను వ్రాసి ప్రక్రియాగౌరవము కూర్చుట వ్యాకర్తలకు సమ్మతము కాదు. అందువలన ప్రయోగమందలి సిద్ధరూపమును ప్రదర్శించి దానినే గ్రహింపవలసినట్లు సూచించుట వ్యాకర్తలకు పరిపాటి. ఈ పరిపాటిని 'నిపాతము' అని యందురు. "అన్యదా ప్రయోగేప్రాప్తే అన్యధా ప్రయోగకరణంనిపాతః" అని నిర్వచనము. వ్యాకరణ విధినిబట్టి ఒకవిధముగా కావలసియుండగా, మరొకవిధముగా ప్రయోగించుటకు నిపాతము అని పేరు. 'కద్రూ' అనునది 'కద్రువు' అని కావలసియుండగా, అటుకాక ప్రయోగముల యాధారమువలన 'కద్రువ' అని నిరూపించుట జరిగినది. దీనిని 'నిపతించుట' యని వ్యాకరణ పరిభాషలో వాడుచుందురు.

ఇంతకును 'నాగమాత' యను నర్థమున 'కద్రువ' యను దానిని తత్సమ రూపముగా గ్రహింపవలయునని దీని కంతటికిని సారాంశము. దీని కింక ప్రథమైక వచనాంతమగు రూపము వేఱుగా లేదు. ఇతరవిభక్తులు పరమైనప్పుడు కద్రువను, కద్రువతో, కద్రువలను, కద్రువలతో – మున్నగువిధముగా రూపము లుండును.

60 ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు

(బా – ౩౨)

భ్రాత – జామాత – కర్త – భర్త – హర్త – గంత – హంత.

వ్యాఖ్య – ఋకారముతో అంతమగు శబ్దముయొక్క తుది ఋకారమునకు బదులుగా అత్వము కలిగి, స్త్రీతుల్యత్వము కలుగునని సూత్రార్థము. స్త్రీవద్భావము అని యనగా స్త్రీతుల్యత్వమని యర్థము. అనగా ఈ శబ్దముల ప్రథమైకవచనమునకు లోపము కలుగునని తాత్పర్యము.

'భ్రాతృ' అన్నది ఋకారాంతనామము. ప్రస్తుత సూత్రముచేత 'భ్రా + త్ + ఋ' అనుచోటి ఋత్వమునకు బదులుగా అత్వము కలుగగా 'భ్రా + త్ + అ' అనియై 'భ్రాత' అని యగును. స్త్రీవద్భావము కలుగునని యనుటచేత 'భ్రాత + సు' అని యుండి, ప్రథమైకవచనస్థానికమగు 'సు' లోపింపగా 'భ్రాత' అని యగును.

'జామాతృ' మున్నగునవి కూడ ఇట్లే ఋవర్ణస్థానమున హ్రస్వమైన అకారమును, పిమ్మట ప్రథమైకవచనలోపమును కలుగగా 'జామాత' మున్నగు విధముగా నేర్పడును.

ఉదాహరణములందు పుంలింగశబ్దములు మాత్రమే చూపబడినవి. మాతృ, దుహితృ — మున్నగు స్త్రీలింగశబ్దములు మాత, దుహిత — మున్నగు విధముగా నగును. అమహత్తులైనప్పుడు కూడ ఋకారాంత శబ్దములు 'ము' వర్ణకము నొందవు. 'అది ప్రాణహంత" మున్నగు విధముగనే యుండును.

ఇది సాధారణ సూత్రము.

**61.** విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వస్త్రీవద్భావంబులు విభాష నగు. (బా - ౫౩)

విధాత – విధాతృఁడు; ధాత – ధాతృఁడు; దాత – దాతృఁడు; సవిత – సవితృఁడు; నేత – నేతృఁడు.

వ్యాఖ్య — మహద్వాచకము లయినప్పుడు విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దములకైదింటికి అత్వ స్త్రీ వద్భావములు విభాషగా నగునని సూత్రార్థము.

'విధాతృ' అనునది ఋ వర్ణాంత పుంలింగశబ్దము. దీని చివరి ఋత్వమునకు అత్వము కలిగి, ప్రథమైకవచనలోపము కలుగగా 'విధాత'యవి యగును. ఇది పూర్వ సూత్రముచేతనే సిద్ధింపగలదు. ప్రస్తుతసూత్రము దానిని నడలించుటకై ప్రవర్తించును. కావున ఇది విశేషసూత్రము.

అత్వ స్త్రీవద్భావములు రాని పక్షమున "పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్ఞగు" అను (బాల—౨౭) సూత్రమును బట్టి డుజ్ఞు కలుగగా 'విధాతృఁడు' అని యగును. ద్వితీయాది విభక్తులు పరమైనప్పుడు నిగాగమము కలుగగా విధాతృనిని, విధాతృనిచేత, విధాతృనికొఱకు — మున్నగువిధముగా రూపము లుండును. 'ధాతృ' మున్నగువానికికూడ 'ధాత' మున్నగు విధముగా అత్వస్త్రీవద్భావములతోపాటు, 'ధాతృడు' మున్నగువిధముగా డుజ్ఞుతోడి రూపములుకూడ కలుగును.

[మాంధాతృఁడు — అను రూపమును భారతమున నన్నయ ఒక్కచో ప్రయోగించియుండుటచే దానినికూడ ఈ యైదింటితో పాటుగా చేర్చుకొనుట యుచితముగా నుండును.]

**62.** నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు (బా - ౫౪)

రమా – రమ ; వనితా – వనిత ; విద్యా – విద్య ; లక్ష్మీ – లక్ష్మి; సేనానీ – సేనాని॥ ఇట్లు కృత్‌హ్రస్వములకు హ్రస్వాంతము లగుటకాలెం గార్యంబగు. లక్ష్ములు – సేనానులు – సిగులు.

వ్యాఖ్య – దీర్ఘాంతములయిన ప్రాతిపదికలయొక్క కడపటి దీర్ఘమునకు హ్రస్వమగునని సూత్రార్థము.

'రమా' అనునది ఆకారాంత స్త్రీలింగశబ్దము; మహతీ వాచకము. ప్రస్తుత సూత్రముచేత తుదిదీర్ఘము హ్రస్వమై 'రమ' యని యగును "స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" అను నియమముచే "రమ + సు" అనియై 'సు' లోపింపగా 'రమ' యనియే మిగులును. అదియే తెలుగున పదము. 'వనితా' అనునది కూడ ఇట్టిదే. 'వనిత' యని యగును. 'విద్యా' అనునది ఆకారాంత స్త్రీలింగ శబ్దము. అమహద్వాచకము. దీనికికూడ దీర్ఘము హ్రస్వమై 'విద్య' యను రూప మేర్పడును. 'లక్ష్మీ' అనునది ఈకారాంత స్త్రీలింగశబ్దము. మహతీవాచకము. దీని కిని దీర్ఘము హ్రస్వము కాగా 'లక్ష్మి' యని యగును. స్త్రీలింగమగుటచేత ప్రథమైక వచనమునకు లోపము కలుగును.

'సేనానీ' అనునది ఈకారాంత పుంలింగ శబ్దము. ప్రస్తుతసూత్రముచేత దీని తుదనున్న దీర్ఘమునకు హ్రస్వము రాగా 'సేనాని' అని యగును. ఇది యిప్పుడు ఇదంతమైనది. దీనిపైని ప్రథమైకవచనము చేరినప్పుడుకాని పదము కాజాలదు. అందువలన 'సేనాని + సు' అని యనుకొనవలయును. "ఇగ్లౌరా యుగంతంబుల" అను నియమము ప్రకారము ప్రథమైకవచనమునకు లోపము కలుగగా 'సేనాని' అను రూప మేర్పడును.

కృతహ్రస్వములు అని యనగా చేయఁబడినహ్రస్వముగలవి యని యర్థము. "ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వం బగు" అను (బాల – 46) సూత్రమునుబట్టి 'లక్ష్మి' అను పదము బహువచనము నొంది నపుడు 'లక్ష్మి + లు' అని యుండి, ఇత్వము ఉత్వము కాగా 'లక్ష్ములు' అని యగును. అట్లే 'సేనానీ' అనునది కూడ హ్రస్వము నొంది 'సేనాని' అని అయినపిమ్మట 'లు' వర్ణకముకాని లడాగమముగాని కలిగినప్పుడు ఉత్వము నొందును. సేనానులు, సేనానులను–మున్నగునవి రూపములు. "తపరకరణంబుచే దీర్ఘంబున కుత్వంబు లేదు" అను వివరణ వాక్యమునుబట్టి 'సేనానీ' మున్నగువానికి కూడ ఉత్వమురాదను భ్రమను వారించుటకై "కృతహ్రస్వములకు హ్రస్వాంతములకుఁబోలెఁ గార్యం బగు" అని చెప్పవలసి వచ్చినది.

'శ్రీ' యను సంస్కృతశబ్దము ప్రాకృతమునందు 'సిరీ' యని యగును. తెలుగుభాషయందలి తత్సమములు సంస్కృత ప్రాకృతతుల్యములు. కావున సంస్కృ

తమునుండి తెచ్చుకొన్నట్లే ప్రాకృతమునుండియు కొన్ని పదములను తెచ్చికొను పరి పాటి కలదు. 'సిరీ' అను ప్రాకృతశబ్దమును తత్సమముగా తెచ్చుకొనునప్పుడు ప్రస్తుత సూత్రముచేత దీర్ఘము హ్రస్వమై 'సిరి' అని యగును. ప్రథమైకవచనలోపము వలన అది యట్లే యుండును. బహువచనము పరమైనప్పుడు 'సిరి + లు' అని యుండగా, తుది ఇత్వమునకు ఉత్వము కలిగి 'సిరులు' అని యగును. అట్లే ద్వితీయావిభక్తులకు లడాగమము కలిగినప్పుడు సిరులను, సిరులతో, సిరులకొఱకు — మున్నగు విధముగా నగును.

ఉదాహరణములయందు తుదిదీర్ఘము హ్రస్వమైనపిమ్మట ప్రథమైకవచనము లోపించు రూపములు మాత్రమే చూపబడినవి. వధూ, స్వయంభూ — మున్నగు వానికి హ్రస్వము కలిగినపిమ్మట, "ఉకారాంతగోశబ్దంబులకు" అన్న నియమమును బట్టి వు వర్ణకము కలుగగా వధువు, స్వయంభువు — మున్నగు రూపములు గలుగును. అట్లే కంధరా, విధా, భిక్షా—మున్నగువానికి ప్రస్తుతసూత్రముచేత హ్రస్వము కలిగి, ఆ పిమ్మట 'ము' వర్ణకము కలుగగా కంధరము, విధము భిక్షము—మున్నగు రూపము లేర్పడును.

**63. ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు (బా - ౨౨౨)**

**క్ష్మా - మా - భా - శ్రీ - స్త్రీ - హ్రీ - ధీ - భీ - భ్రూవు.**

వ్యాఖ్య — పూర్వసూత్రముచేత దీర్ఘమునకు హ్రస్వము కలుగుచుండగా, దానిని పరిమితము చేయుటకు ప్రస్తుతసూత్రము ప్రారంభింపబడినది. ఏకాక్షరము లయిన నామముల దీర్ఘమునకు హ్రస్వము కలుగదని సూత్రార్థము.

'క్ష్మా' అనునది దీర్ఘాంతము. ఒకే యక్షరము. కావున దీనికి హ్రస్వము కలుగరాదు. స్త్రీలింగశబ్దమగుటచేత ప్రథమైకవచన లోపముకలుగును' 'క్ష్మా' అనియే పదమగును. దీనికి 'భూమి' యని యర్థము.

[క్ష్మా—అనునది ఏకాక్షరము. ఇందు క్, ష్, మ్, ఆ — అను నాలుగు వర్ణములు గలవు. కావున వర్ణములను బట్టి చూచినప్పుడు నాలుగు వర్ణములున్నను దీని నొకే యక్షరముగా గ్రహింపవలయును. బాలవ్యాకరణము అక్షరమునకు, వర్ణమునకు గల యీ భేదమును సూక్ష్మముగా పాటించును. కావున గుర్తుపెట్టుకొనుట యవసరము.]

'మా' అనునది ఆకారాంత స్త్రీలింగశబ్దము. దీనికిని హ్రస్వప్రాప్తిలేదు. కావున 'మా' అనియే యుండును. దీనికి 'లక్ష్మి' అని యర్థము. 'కాంతి' యను నర్థముగల 'భా' కూడ ఇట్టిదే.

'శ్రీ' అనునది ఈకారాంత స్త్రీలింగశబ్దము. దీనికిని ఉత్వప్రాప్తిలేదు. స్త్రీలింగమగుటచేత ప్రథమైకవచనమునకు లోపము కలుగును. కావున 'శ్రీ' యను రూపమే యుండును. దీనికి 'లక్ష్మి' అని యర్థము. స్త్రీయను శబ్దమును, సిగ్గు అను నర్థముగల 'హ్రీ' యను శబ్దమును, బుద్ధి యను నర్థముగల 'ధీ' యను శబ్దమును, భయము అను నర్థముగల 'భీ' అను శబ్దమును గూడ నిట్టివే.

'భ్రూ' అనునది ఊకారాంతశబ్దము: ఏకాక్షరము. దీనికిని ప్రస్తుతసూత్రము చేత హ్రస్వము వారింపబడినది. ఊకారాంత మగుటవలన "ఊకారాంతగోశబ్దంబుల కంతట వు వర్ణకంబగు" అన్న నియమమునుబట్టి 'భ్రూవు' అని యగును. దీనికి 'కనుబొమ' యని యర్థము.

[భ్రూశబ్దము సమాసాంతమున నున్నప్పుడు హ్రస్వము నొందును. అప్పుడు వు వర్ణకము కలుగును. 'సుభ్రువు' అన్నది యుదాహరణము.]

**64. వృద్ధాదుల డుజ్ఞానకు లోపంబు విభాషనగు. (బా. ౩౬)**

వృద్ధు - వృద్ధుఁడు; మూర్ఖు - మూర్ఖుఁడు; నీచు - నీచుఁడు; గృహస్థు - గృహస్థుఁడు; చార్వాకు - చార్వాకుఁడు.

వ్యాఖ్య - 'వృద్ధ' మున్నగుశబ్దముల డుజ్వర్ణకమునకు లోపము విభాషగా కలుగు నని సూత్రార్థము.

'వృద్ధ' అనునది అదంత పుంలింగ శబ్దము. దీనికి "పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబున కుత్వంబగు" అను (బాల - 21) సూత్రమునుబట్టి ఉత్వము కలుగగా 'వృద్ధు' అని యగును. ఆ తరువాతిదైన "పుంలింగ మగు మహద్వాచకమునకు డుజ్ఞగు" అను సూత్రముచేత 'వృద్ధుఁడు' అని యగును. ప్రస్తుతసూత్రమువలన వికల్పముగా 'డు' వర్ణకమునకు లోపము కలుగగా 'వృద్ధు' అని మిగులును. తక్కినవికూడ ఇట్లే రెండువిధములుగను ప్రయుక్తములు కావచ్చును.

'ధూర్త' శబ్దముకూడ వృద్ధాదులలో చేరుటకు తగినదే. దీనికిని ధూర్తు అనియు, ధూర్తుఁడు అనియు - రెండువిధములగు ప్రయోగములు కలవు. 'దాస' శబ్దముకూడ ఇట్టిదే. ఉత్వడుజ్ఞులు కలిగి 'దాసుఁడు' అని యగును. ఆ పిమ్మట

దుత్వార్థకమునకు వికల్పముగా లోపము కలిగి 'దాస' అనియు కావచ్చును. కాళి దాస - కాళిదాసుఁడు; హరిదాస - హరిదాసుఁడు మున్నగునవి యుదాహరణములు.

ఇంతవరకు పైని చెప్పికొన్న శబ్దములకు వికల్పముగా మాత్రమే డుత్వార్థము లోపించుట జరిగినది. 'భట్ట' శబ్దమునందు ఈ లోపము నిత్యముగా జరుగును. 'నన్నయభట్ట' అనునది ఉత్వమును, డుజ్ఞను పొంది తత్సమము కావలయును. డుజ్ఞనకు నిత్యముగా లోపము వచ్చుటచేత ఉత్వముతోడి రూపముమాత్రమే గ్రహింప బడుచున్నది. నన్నయభట్టు - నారాయణభట్టు - మహిమభట్టు మున్నగునవి యుదాహరణములు.

ఇట్లు వికల్పవిధితోపాటు, నిత్యవిధినిగూడ సూచించుటకే సూరి సూత్రము నందు 'విభాష' యను పదము నుపయోగించెను.

65. స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు (బా-౨౮)

రమ - క్షమ - వనిత - ఘనత - విద్య - దేవత - మీననేత్ర.

వ్యాఖ్య - స్త్రీలింగశబ్దములయొక్క ప్రథమైకవచనమునకు లోపము కలుగునని సూత్రార్థము.

'రమా' అనునది ఆకారాంత స్త్రీలింగశబ్దము. "నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు" అన్న నియమమునుబట్టి హ్రస్వముకలిగి 'రమ' అని యగును. దీనికి 'సు' అను ప్రథమైకవచనము పరమగును. ప్రస్తుతసూత్రముచేత దానికి లోపము కలుగగా 'రమ' యనునదియే తత్సమమై నిల్చును. ఇది మహతీ వాచకము. 'లక్ష్మి' యని యర్థము.

'క్షమా' యనునది కూడ ఇట్లే 'క్షమ' యని యగును. తెలుగున 'భూమి' యను నర్థమునను 'సహనము' అనునర్థమునను గూడ ఇది అమహద్వాచకమే. 'వనిత' మహతీవాచకము. 'ఘనత' అమహద్వాచకము. 'విద్య' అమహద్వాచకము. 'దేవత' మహతీవాచకము. 'మీననేత్రా' అన్నది సమాసము. ఇదియును ప్రాతిపదికములయందే పరిగణింపబడును. కావున, దీని తుది దీర్ఘమునకు హ్రస్వమును, ప్రస్తుతసూత్రముచేత ప్రథమైకవచనలోపమును గలుగగా 'మీననేత్ర' అని యగును.

ఈకారాంతములయిన స్త్రీలింగములకు శ్రీ, గౌరీ, నదీ, విదుషీ - మున్నగు నవి యుదాహరణములు. తుది దీర్ఘమునకు హ్రస్వము కలిగి ప్రస్తుతసూత్రముచేత ప్రథమైకవచనలోపముకాగా గౌరి, నది, విదుషి - మున్నగు విధముగా నుండును.

ఉకారాంతములయిన అన్ని శబ్దములకును 'వు' వర్ణకము కలుగుచుండుటచేత ప్రస్తుతసూత్రము వానియెడల ప్రవర్తింపదు. అవి వధువు, ధేనువు - మున్నగువిధముగా ప్రథమైకవచనముతోనే యుండును.

66. చరిత్రాదుల ముపర్ణకంబునకు లోపంబు బహుళంబుగానగు. (బా - ౫౧)

చరిత్ర - చరిత్రము; చరిత - చరితము॥ అలక, అభిలాష, అక్షత, ఘోష, తరంగ, భ్రమ, విజృంభణ, వధ, వేగ, స్ఫురణ, హంస- ఇత్యాదులు చరిత్రాదులు. బాహుళకమువలన దర్భాదులకు ము లోపంబు నిత్యంబు - దర్భ పనస॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - చరిత్ర మున్నగువానికి ప్రథమైక వచనమునందగు 'ము' వర్ణకము బహుళముగా లోపించు నని సూత్రార్థము.

చరిత్ర, చరిత - అనునవి అదంతములయిన నపుంసక నామములు. కావున "అమహన్నపుంసకములం కదంతములకు ముపర్ణకంబగు" అనుసూత్రమునుబట్టి ము వర్ణకము కలుగగా చరిత్రము, చరితము - అను రూపములు వచ్చును. ద్వితీయాది విభక్తులు పరమగునప్పుడు ముగాగమముగా చరిత్రములు, చరిత్రమును; చరితములు, చరితమును - మున్నగు విధముగా రూపము లేర్పడును. ప్రస్తుతసూత్రము చేత ముపర్ణకమునకు లోపము కలిగినయెడల 'చరిత్ర' అనియు 'చరిత' అనియు రూపములేర్పడును. ద్వితీయాదివిభక్తులు పరమైనపుడు చరిత్రలు,చరిత్రను; చరితలు; చరితను - మున్నగు విధముగా రూపము లేర్పడును.

అలక, అభిలాష, అక్షత, ఘోష, తరంగ, భ్రమ, వధ, వేగ, హంస - అనునవి అదంత పుంలింగ శబ్దములు. ఇవి అమహద్వాచకము లగుటచే "అమహన్నపుంసకములు" అను విధినిబట్టి ము వర్ణకము కలిగి అలకము, అభిలాషము, అక్షతము, ఘోషము, తరంగము, భ్రమము, వధము, వేగము, హంసము - అను రూపములు కలుగును. ద్వితీయాదివిభక్తులు పరమైనప్పుడు ముగాగమము కలిగి అలకములు, అలకమును, అలకములను; అభిలాషములు, అభిలాషమును, అభిలాషములను - మున్నగు విధముగా రూపము లేర్పడును. ప్రస్తుతసూత్రముచేత ముపర్ణకము వైకల్పికముగా లోపింపగా అలక; అభిలాష - మున్నగు విధముగనే రూపము లుండును. ద్వితీయాది విభక్తులు పరమైనప్పుడు అలకలు, అలకను, అలకలను; అభిలాషలు, అభిలాషలను - మున్నగువిధముగా రూపము లేర్పడును.

'ఇత్యాదులు చరిత్రాదులు' అని చెప్పుట వలన ఇట్టి వింకను కొన్ని కల వని తాత్పర్యము. పులక, కాండ, సర్గ - మున్నగువానిని కూడ ఇందు చేర్చుకొనవల యును. పులక, పులకలు, పులకను, పులకలను: కాండ, కాండలు, కాండను, కాండలను: సర్గ, సర్గలు, సర్గను, సర్గలను - మున్నగు విధముగా మువర్ణవిరహితములైన రూప ములు ప్రస్తుతసూత్రముచేత ఏర్పడును. ఈ విధి వైకల్పికము కావున ప్రవర్తింపని యెడల పులకము, పులకములు, పులకమును, పులకములను: కాండము, కాండములు, కాండమును, కాండములను: సర్గము, సర్గములు, సర్గమును, సర్గములను - మున్నగు విధముగా మువర్ణముతోడి రూపములు నేర్పడును. ప్రయాగ, విసర్గ, సంసర్గ, ప్రాతి పదిక - మున్నగునవికూడ ఇట్టివే.

జన్మ, కర్మ - అను రెండు శబ్దములును నకారాంతములు. తెలుగున నదంత ములుగనే పరిగణింపబడి జన్మము, కర్మము - అను రూపములను పొందుచున్నవి. జన్మములు, జన్మమును, జన్మములను: కర్మములు, కర్మమును, కర్మములను - మున్నగు విధముగా ముగాగముతోడి రూపములు కలవు. ప్రస్తుతసూత్రముచేత మువర్ణకమునకు లోపము కలుగగా జన్మ, కర్మ - అని యగును. ముగాగమునకు లోపము కలుగగా జన్మలు, జన్మను, జన్మలను: కర్మలు, కర్మను, కర్మలను - మున్నగు రూపములు కలుగును.

ఇంతవరకును వైకల్పికవిధిని చూచితిమి. ఇట్లు వైకల్పికవిధికి లక్ష్యములుగా సూరి చూపిన రెండు లక్ష్యములను, పైవాని క్రమములో పరామర్శింపక విడుచుట జరిగినది. వాని నిప్పుడు పరిశీలింతము.

విజృంభణ, స్ఫురణ-అనునవి అరెండు శబ్దములు వీనికివి విజృంభణ, విజృం భణలు, విజృంభణను, విజృంభణలను: స్ఫురణ, స్ఫురణలు, స్ఫురణను, స్ఫురణలను- మున్నగు మువర్ణ విరహిత రూపములతోపాటుగా విజృంభణము, విజృంభణములు, విజృంభణమును, విజృంభణములను: స్ఫురణము, స్ఫురణములు, స్ఫురణమును, స్ఫురణములను - అనువిధముగా మువర్ణముతోడి రూపములు కూడ కలవు. వీనిని బట్టి ఈరెండింటివి కూడ చరిత్రాదులలో చేర్చుట జరిగెను. కాని చరిత్రాదులకును, విజృంభణాదులకును రూపనిష్పత్తియందు భేదము కలదు. చరిత్రము, చరిత్ర - అను రెండు రూపములును ఒకే ప్రాతిపదిక వలన ఏర్పడుచున్నవి. విజృంభణ, విజృంభ ణము - అను రెండు రూపములకును ప్రాతిపదికలు భిన్నములు. 'విజృంభణా' అను అకారాంత స్త్రీలింగరూపము మొదటిదానికి మూలము. "నామంబుల తుది దీర్ఘమునకు

హ్రస్వాంతగను" నను సూత్రమువలన హ్రస్వమునొంది స్త్రీలింగ శబ్దమగుటచే ప్రథమైకవచనలోపము నొందగా 'విజృంభణ' అను రూపమేర్పడెను. 'విజృంభణ' అను అదంత నపుంసకశబ్దముపై ప్రథమైకవచనమగు ముప్రత్యయము చేరగా ఏర్పడినది 'విజృంభణము.' అట్లే 'స్ఫురణా' అను ఆకారాంత స్త్రీలింగ శబ్దమువలన 'స్ఫురణ' యను రూపమును, 'స్ఫురణ' యను అదంత నపుంసక శబ్దమువలన 'స్ఫురణము' అను రూపమును గలిగెను. జృంభణ, విస్ఫురణ, సంస్ఫురణ, పరిస్ఫురణ మున్నగునవి యీద్వైవిధ్యమునకు పాత్రములే.

ఇట్టి వింకను భాషయందు అనేకములు గలవు. రచన, విరమణ, వర్తన, ప్రవర్తన, వేదన, నివేదన, ఆవేదన, సంవేదన, జ్ఞాపన, విజ్ఞాపన, ఆజ్ఞాపన, భావన, సంభావన, పరిభావన, ఘట్టన, విఘట్టన, సంఘట్టన, కల్పన, పరికల్పన, కీర్తన, సంకీర్తన, సేవన, సంసేవన, వర్ణన, ప్రేరణ, ప్రేరేపణ, నివారణ, నిరూపణ, ప్రార్థన, సమర్థన, అభ్యర్థన, ఉపాసన, ధారణ, నిర్ధారణ - మున్నగు నెన్నియో నామములు గలవు. ఆకారాంత స్త్రీలింగరూపమువలన పైని చూపిన రూపములును, అదంతనపుంసకముల వలన రచనము, విరమణము - మున్నగువిధము లయిన రూపములును గల్గును.

లాజలు, లాజములు అను రూపములతో కన్పించు లాజశబ్దము కూడ ఇట్టిదే. అదంతపుంలింగశబ్దమైనప్పుడు లాజములు, లాజములను - మున్నగువిధముగా రూపములను పొందును. ఆకారాంత స్త్రీలింగశబ్దమైనప్పుడు లాజలు, లాజలను - మున్నగు విధముగా రూపములను పొందును. 'చామర' అను అదంతనపుంసకశబ్దము ప్రాతిపదికగా చామరము, చామరములు, చామరమును - మున్నగు రూపములు గల్గుచుండగా 'చామర' అను ఆకారాంతస్త్రీలింగశబ్దము ప్రాతిపదికగా చామర, చామరలు, చామరను-మున్నగురూపములు గలుగుచున్నవి. ఇందుకును భిన్నప్రాతిపదికము లగుటచేత వీనిని చరిత్రాదులలో చేర్పకుండుటయే సమంజసము. విజృంభణ, స్ఫురణ - అను వానికి వలెనే రచనాదులకు కూడ పూర్వవిధుల వలననే రెండు విధము లయిన రూపములను కలుగగలవు,

సూత్రమున బహుళమని యనుటచేత దర్పు మున్నగువానికి ము లోపము నిత్యముగా నగును.

'దర్భ' అదంతపుంలింగశబ్దము. అమహద్వాచకము, మువర్ణకము. కావలసి యున్నను బాహుళకముచేత నిత్యముగా లోపము గలిగి 'దర్భ' యనియే యుండును. 'పనస' యనునదికూడ ఇట్లే మువర్ణ విరహితముగనే యుండును.

[బహుజనపల్లివారు దీని విషయమై వ్యాకరణమున నాక్షేపించుట తెలుప లేదు. కాని శబ్దార్థరత్నాకరమునందు "దీనిఁ దెనుఁగు కవులు వైకృతముగా వాడి యున్నారు కనుక సంస్కృతమున పణస అనియే పాఠము ఉండెనని తోఁచెడి" అని వ్రాసియున్నారు. ఆయన అభిప్రాయమును బట్టి 'పనస' యనునది తత్సమము కాక తద్భవము కావలయును. సూరి తత్సమమని వచనమునే నిశ్చయించుకొని, ప్రస్తుతవిధిని నిరూపించుచున్నారు. 'పనస' యనునది అకారాంతపుంలింగ శబ్దముగా దంత్యనకారముతోడనే సంస్కృతనిఘంటువులయందు పఠింపబడి నది. సంస్కృత సమాసమధ్యమున వాడబడి యున్నది. కావున దానిని తత్సమముగా గ్రహించుటలో సందేహింపవలసిన యవసరము లేదు.]

సూరి దర్భ, పనస యని చెప్పి యిత్యాదులు అని యనుటచేత దర్భాదులలో చేరదగిన వింకను గలవని సూచించు చున్నాడు. 'దర్భ' యన్న యర్థమున 'కుశ' శబ్దము కలదు. ఇదియు దర్భాదుల లోనిదే. మువర్ణలోపము కలిగి కుశ, కుశలు, కుశము, కుశలము - మున్నగువిధముగా వ్యవహృతమగును. 'కుండ' అను అదంత నపుంసక శబ్దము దర్భాదులలో చేరుటకు వీలుగ నున్నది. దీని కితరార్థములతో పాటుగా 'మృత్పాత్రము' అనునర్థము కలదు. తెలుగునందున్న 'కుండ' యను శబ్దము సంస్కృతమునందున్న 'కుండ' కు తత్సమమే. ఇదియు దర్భాదులలోనిది యగుట వలన మువర్ణలోపము నిత్యముగా కలిగి 'కుండ' యనియే యుండును.

[ప్రౌఢవ్యాకర్త కోటశబ్దమునుగూర్చి (ప్రౌఢ-సంజ్ఞ 11) ప్రసంగించుచు "కోట శబ్దపర్యాయంబుగా సంస్కృతంబునఁ గోట శబ్దం బొక్కండు గానంబడియెడి. దానివలనఁ గలిగిన దందురేని యపుడది కుండ లోనగువానివంటి దని యెఱుంగ వలయును." అని వ్రాసెను. దీనినిబట్టి ఆయన యభిప్రాయము 'కుండ' యను నది తత్సమ మనియే. శబ్దరత్నాకరమునందు 'కుండ' యని యిచ్చినచోట వైకృతముగానే గుర్తించిరి. పైగా "సంస్కృతమునందు చెప్పబడని యర్థము లనేకములు తెనుఁగుగ్రంథములయందుఁ జెప్పబడియుండుటఁజేసి దీనిని వైకృ తముగానే గ్రహింపవలయును." అని కుండలీకరణముల నడుమ వ్రాసిరి. ఇది వ్యాకరణమునందు వ్రాసిన వ్రాతకు విరుద్ధముగా నున్నది.]

'కుండము' అని మువర్ణకముతో నున్నప్పుడు 'గొయ్యి' యనియు 'దేవాలయ మునకు చెందిన కొలను' అనియు, 'నీరు నిలుపజేసికొను గుంట' యనియు అర్థములు

కలుగును. 'కుంభో' యని ముపర్ణ రహితమై యున్నపుడు 'మృత్పాత్రా' యనియే యర్థము. ఇది తత్సమరూపమే

**67. స్వర్గివాచి దేవ సురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపంబడు (బా - ౩౯)**

దేవుఁడు - సకలసురులు॥ స్వర్గివాచి యనుటచే భూదేవులు, భూసురుఁ డను బ్రయోగంబు లబాధితంబులయ్యె.

వ్యాఖ్య - స్వర్గమునకు సంబంధించినవారినిగురించి చెప్పునది స్వర్గివాచి. అట్టి స్వర్గివాచియైన దేవశబ్దమును ఏకత్వమునందు మాత్రమే ప్రయోగింపవలయు ననియు, సురశబ్దమును బహుత్వమునందు మాత్రమే ప్రయోగింపవలయుననియు సూత్రార్థము.

దేవుఁడు అను పదమునకు భగవంతుడు, ప్రభువు - మున్నగు నర్థములు గలవు. 'భగవంతుఁడు' అను నర్థమున వాడునపుడు ఏకవచనమునందే యుపయోగింపవలయును. 'దేవ' అనునది అదంతపుంలింగశబ్దము; మహద్వాచకము. కావున ఉత్వడుజ్జులు కలిగి 'దేవుఁడు' అని యగును. దీనికింక బహువచనము లేదని తాత్పర్యము. ప్రభువులు అను నర్థమున బహుత్వమునందు వాడవచ్చును; గాని అప్పుడుకూడ ఉపపదయుతముగనే ప్రయోగములందు కనిపించుచున్నది. ప్రతాపరుద్రదేవులు - రామకృష్ణదేవులు॥ మున్నగునవి యుదాహరణములు.

సురశబ్దమునకు దేవత, మద్యము, మద్యపాత్ర - అను నర్థములు గలవు. 'స్వర్గివాచి' యని యనుటచే 'దేవత' యను నర్థమున సురశబ్దమును బహువచనాంతముగనే వాడవలయును. 'సకలసురులు' అన్నది ఉదాహరణము. (తరువాతి సూత్రమున దీని వివేచనము చూడవచ్చును.) మద్యము అని కాని మద్యపాత్ర అని కాని అర్థమైనపుడు 'సుర' యని ఏకత్వమునందు వాడుట కాక్షేపము లేదు.

బ్రాహ్మణుడను నర్థమున సహితము దేవసుర శబ్దములు ప్రయుక్తములు కావచ్చును. బ్రాహ్మణుఁడు భూసంబంధి యగుటవలన పై విధిని పాటింపవలసిన యవసరము లేదు. అనగా రెండు శబ్దములను రెండు వచనములందును నిరాక్షేపముగా వాడవచ్చును. భూదేవుఁడు, మహీదేవుఁడు; భూదేవులు, మహీదేవులు; భూసురుఁడు, అవనీసురుఁడు; పృథ్వీసురులు, ధరణీసురులు॥ మున్నగునవి ఉదాహరణములు.

'అబాధితములయ్యేను' అని యనగా ప్రయోగమునకు అవకాశమును గలిగి యున్నవని యర్థము. 'స్వర్గి వాచి' యను విశేషణముండుటచే పై విధి యంతవరకే పరిమితమయ్యెను. లేనియెడల 'భూదేవులు' అని బహువచనముతో 'భూసురుఁడు' అని ఏకవచనముతో ఉపయోగించుటకు వీలులేకుండ బాధ కలిగెడిది. ఆ బాధ 'స్వర్గి వాచి' యని యనుటవలన లేకుండ తొలగిపోయినది.

**68. సురశబ్దంబు నిత్యంబుగ నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యము లగు; సంస్కృతసమాసంబునఁ గావు.**

(బా - ౬౦)

సురులు ; అసుర, అసురుఁడు ; నిఖిలసురులు, రావణాసురుఁడు; ఎల్ల సురలు, ఎల్ల యసురులు

వ్యాఖ్య - 'సుర' యను శబ్దము నిత్యముగా స్త్రీతుల్యమగునవియు, 'అసుర' యను శబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యత్వమునొందుననియు, ఈ రెండు శబ్దములను గూడ సంస్కృత సమాసమునందు స్త్రీతుల్యత్వము నొందవనియు సూత్రార్థము.

'సుర' శబ్దము సంస్కృతమున అకారాంతము నిత్యబహువచనాంతమునైన పుంలింగశబ్దము. 'సురాః' అనునది దానిరూపము. తెనుగున 'సుర' అను అదంత రూపము ప్రాతిపదికము. పూర్వసూత్రమునుబట్టి దీనికి బహుత్వమునందు మాత్రమే ప్రయోగము కలదు. అందువలన 'సుర + లు' అని యుండును. ప్రస్తుతసూత్రము వలన 'సుర' శబ్దమునకు నిత్యముగా స్త్రీతుల్యత్వము కలుగుట వలన ఉత్వము కలుగుటకు అవకాశములేదు. కావున 'సురలు' అని మాత్రమే యగును.

[ సురశబ్దమునకు 'దేవత' యను నర్థమును చెప్పుకొంటిమి. 'దేవత' యనునది స్త్రీలింగ శబ్దము. అర్థమునుబట్టియైనచో మహద్వాచకము. ఇంద్రాది దేవతలు - కృష్ణుఁడు నా యిష్టదేవత - సీత పతిదేవత॥ మున్నగు ప్రయోగములనుబట్టి పురుషవ్యక్తిని బోధించుట స్పష్టముగా గోచరించుచున్నది. మహతీ వాచకముగా 'దేవతాస్త్రీ' మున్నగు విధముగా వాడుటకూడ దానిని బలపరచుచున్నది. కావున సుర శబ్దము మహద్వాచకము. మహద్వాచకము, పుంలింగము నైనప్పుడు ఉత్వము రావలయును. ప్రస్తుతసూత్రము స్త్రీతుల్యత్వమును ఆదేశించుటచేత ఉత్వము వారింపబడినది. ]

'అసుర' శబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యత్వము నొందును. అందువలన స్త్రీతుల్యమైనప్పుడు ఉత్వదుత్తులు కలుగవు గనుక అసుర, అసురలు - అను వి

ముగా నుండును. స్త్రీతుల్యత్వము కలుగనప్పుడు మహద్వాచకమును పుంలింగమునై యుండుటచేత అసురుఁడు, అసురులు - అను విధముగా నుండును.

సంస్కృతసమాసమునందు 'సుర' శబ్దముగాని 'అసుర' శబ్దముగాని ఉత్తర పదములై యున్నప్పుడు స్త్రీతుల్యత్వము కలుగదు. అందువలన 'నిఖిలసురులు' అని ఉత్వయుతమైన రూపమే నిల్చును. 'రావణాసురుఁడు' అనునప్పుడు 'అసుర' యను నది ఉత్తరశబ్దము. ఉత్వదుజ్జులు కలిగినవి. సురాసురులు మున్నగు సమాసము లందును స్త్రీతుల్యత్వములేని రూపమే కలదు.

[ భూసురుఁడు అనునప్పుడుకూడ ఏకత్వమునందు ప్రయోగించుటకు 'స్వర్గివాచి' యను విశేషణము అవకాశము కలిగించినప్పటికి, ఉత్వదుజ్జులు వచ్చుటకు "సంస్కృతసమాసంబునఁ గావు" అను భాగమే సహకరించుచున్నది. అట్లుకానియెడల ఏకత్వమునందు ప్రయోగము గలిగియు నిత్య స్త్రీతుల్యత్వము వలన 'భూసుర' వంటి అనిష్ట రూపము రావలసి వచ్చును. ]

"సంస్కృతసమాసంబునఁ గావు" అని యనుటచేత మిశ్రసమాసమునందు సుర శబ్దమునకు నిత్యముగను అసుర శబ్దమునకు వైకల్పికముగను స్త్రీతుల్యత్వము కలుగునని తాత్పర్యము. ఎల్లన్ + సురలు - అని యున్నప్పుడు పూర్వశబ్దము తెను గగుటచే 'ఎల్లసురలు' అని స్త్రీతుల్యత్వము నొందిన రూపమే యుండును. 'అసుర' శబ్దము 'ఎల్లయసురలు' అని స్త్రీతుల్యత్వము నొందియు 'ఎల్లయసురులు' అని స్త్రీ తుల్యత్వము నొందకయు కూడ ఉండవచ్చును.

[ సూ॰ 'సమానము' అను నర్థమునందు 'తుల్యము' అను పదమును సాధారణముగను, 'సమము' అను పదమును 'సంజ్ఞ' గను వాడుచుండును. తత్సమము, సంస్కృతసమము - మున్నగునవి సంకేతములు. సంస్కృతతుల్యము అనునది సంస్కృతముతో సమానమైనదను సాధారణార్థమున ఉపయుక్తము. 'సంస్కృతతుల్యము' అయినది క్వాచిత్కముగా సంస్కృతసమముగా వ్యవహరించును. అన్నియెడల నట్లుకాదు. అట్లే స్త్రీ తుల్యము, స్త్రీ సమము; క్లీబతుల్యము, క్లీబసమము - అను చోట్ల కూడ 'తుల్యము' అనునది సామాన్యార్థమున తత్సమములకు నుపయోగించి, 'సమము' అనునది సంకేతముగా ఆచ్ఛికములకు మాత్రమే వాడుకొనెను. పుంలింగసమము అను సంకేతమును తాను కల్పింపనే లేదు. కనుకనే పుంలింగతుల్యము అని సాధారణార్థమున తత్సమాచ్ఛికములకు రెండింటికిని ఉపయోగించెను. పుంలింగతుల్యత్వమువలన ఉత్వదుజ్జులను, స్త్రీ లింగతుల్యత్వము [illegible] న ప్రథమైకవచన లోపమును, నపుంసక (క్లీబ) తుల్యత్వము వలన ముపర్ణక [illegible] ను కలుగునని యర్థము స్త్రీసమాదులకు పెక్కుకార్యములు

విధింపబడును. అవి స్త్రీతుల్యాదులకు కలుగవు. కావున ఈ పదములను జాగ రూకతతో ఉపయోగించుట అవసరము.]

69. దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగ నగు. (బా - ౬౧)

దూత - దూతుఁడు; యోధ-యోధుఁడు; కుంత-కుంతుఁడు॥ బహుళ గ్రహణముచే నమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు - సింగంబు దూతయగు జంబుకంబు.

వ్యాఖ్య - దూత, యోధ, కుంతశబ్దములకు బహుళముగా స్త్రీత్వము కలుగు నని యర్థము.

'దూత' అనునది అకారాంతపుంలింగశబ్దము. అది మహద్వాచకమైనప్పుడు ఉత్వడుజ్జులు కలిగి 'దూతుఁడు' అని యగును. ప్రస్తుతసూత్రముచేత స్త్రీత్వంబు వికల్పముగా కలుగగా ప్రథమైకవచనము లోపించును; అత్వమునకు కలుగు ఉత్వముకూడ కలుగదు. అప్పుడు 'దూత' అను రూపమేర్పడును. రామునికి హనుమంతుఁడు దూతుఁడు - రామునికి హనుమంతుఁడు దూత॥ అను విధముగా ప్రయోగింపవచ్చును.

ఇట్లే లక్ష్మణుఁడు యోధుఁడు - లక్ష్మణుఁడు యోధ॥ అను విధముగా 'యోధ' శబ్దము వికల్పముగా స్త్రీతుల్యత్వము నొందును. రావణుఁడు కుంతుఁడు - కుంత॥ అనువిధముగా 'కుంత' శబ్దము స్త్రీతుల్యత్వమును వికల్పముగా పొందును. రామదూత - మహాయోధ - మహాకుంత మున్నగు విధముగా సమాసమునందును స్త్రీత్వము కలుగుచుండుట ప్రయోగములందు కానవచ్చుచున్నది.

దూతాదులకు అమహత్త్వమునందు స్త్రీత్వము నిత్యముగా నగును. 'సింగంబు దూతయగు జంబుకంబు' అనునది వ్యాకర్త చూపిన యుదాహరణము. 'జంబుకంబు' అనునది అమహద్వాచకము గావున దాని విశేషణముకూడ అమహత్తు కావలయును. అందువలన "అమహన్నపుంసకములకు" అను సూత్రవిధివలన 'దూతము' అను రూపము కావలసివచ్చును. దానిని వ్యాకర్త యిచ్చట వారించుచున్నాడు. 'దూత' యనియే అమహద్వాచకమైనప్పుడు కూడ నుండును. కావున దూతాదులకు మహత్తులై నపుడు రెండు రూపములును, అమహత్తులైనప్పుడు స్త్రీతుల్యమైన యొకేరూపము ఉండునని తాత్పర్యము. మహతీవాచకమైనపుడు ఎట్లును స్త్రీతుల్యమైనరూప

మొక్కచే యగును. కావున దానిని ప్రత్యేకముగా పేర్కొనవలసిన యవసరము లేదు.

[ ఇంక నిక్కడ వ్యాఖ్యాతలు పడిన తబ్బిబ్బులు కొన్ని కలవు. వానిని కొంచెము గుర్తుంచుకొనుట యవసరము. "అమహత్తులకు స్త్రీత్వము నిత్యము గాక పాక్షికమయినచో 'సింగంబు దూతుఁడగు జంబుకంబు' అను ననిష్టరూప మేర్పడు నని పీటికాటీకలో ప్రత్యుదాహరణము చూపఁబడినది. అది కుదురు పడునట్లు కానరాదు" అని తెల్పి రమణీయవ్యాఖ్యాకారులు ఎందులకు కుదురు పడదో వివరించిరి. కాని పైని చూపిన ప్రత్యుదాహరణమును చూపినవారు పీటికాకారులు కాదు - గుప్తార్థ ప్రకాశికాకారులు. పీఠికాకారులు ప్రత్యుదాహరణము నేమియు ప్రదర్శింపకయే వ్యాకర్త లక్ష్యమునే గ్రహించి, దానికే లక్షణమును వక్రమముగా సమన్వయించిరి. ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వకారులు "సింగంబు దూతుఁడగు జంబుకంబు - అనువాక్యము సాధు వనుటలో బాధ యేమో తెలియకున్నది. దూత్యము తిర్యగ్గత కర్తృకము కాఁజాలమింజేసి జంబుకంబునందు మహద్వివక్షచే దూతశబ్దమును దద్విశేషణమును మహత్తులు కానోవును. అవి పుంలింగములె కాన స్త్రీత్వాభావపక్షమున దూతుఁడను ప్రయోగము నిర్బాధ మగును" అని యున్నగు విధముగా వ్రాసిరి. పై ఉదాహృతవాక్యమునందు 'జంబుకంబు' అనునది అమహత్తుగనే ప్రయుక్తమయ్యెను. దానికి విశేషణమైన దూతశబ్దమును పుంలింగతుల్యముగా వాడుటకు అవకాశము లేదు. కావున 'జంబుకంబు' అను శబ్దమునకు మహద్వివక్ష చేత 'జంబుకుండు' అను రూపమును సాధించుకొనవలయును. అప్పుడు 'సింగంబు దూతుఁడగు జంబుకుండు' అని యనుట కాక్షేపము లేదు. అటుకాక విశేష్యము అమహద్వాచకరమైనపుడు ప్రస్తుతవిధినిబట్టి దూతాదులు స్త్రీతుల్యములుగా మాత్రమే ప్రయుక్తములు కావలయును. ఇదే విషయమును తెలుపుచు 'గుప్తార్థప్రకాశికాకర్త పైని చూపిన ప్రత్యుదాహరణమును ప్రదర్శించుట జరిగినది. ఆయన వాక్యము లివి- "సింగంబు దూతుఁడగు జంబుకంబు - అని మహత్తుగాఁ బ్రయోగింపఁ గూడదు. మహద్వివక్ష చేయునపుడు డు వర్ణకంబుతోఁ బ్రయోగింపవచ్చును. ఉ॥ మేఘుఁడు దూతుఁడు" పై వాక్యములనుబట్టి దూతకృత్యము మహత్కర్తృకము కావున 'దూతుఁడు అని ప్రయోగించుట కుదురదనియు, దాని విశేష్యము కూడ మహత్తయినప్పుడే, ఋజ్వీశిష్ట మైనప్పుడే అట్లు ప్రయోగింపవచ్చు ననియు స్పష్టముగానే తెలియుచున్నది. మేఘుఁడు దూతుఁడు - అను ఉదాహరణము కూడ ఆవిషయమునే స్పష్టము చేయుచున్నది. 'మేఘము' అను అమహద్రూపమునే గ్రహించినయెడల 'దూత' యను స్త్రీతుల్యమునే గ్రహింపవలయును, కావున, ఇచ్చట ఆక్షేపణీయము ఎంతమాత్రము లేదని చెప్పవచ్చును. ]

ఇట్లే యోధ, కుంత శబ్దములకు అమహత్త్వమునందు నిత్యముగా స్త్రీత్వము కలుగగా కుంజరము యోధయై వీఁరెను - సర్పము కుంతయై సమసెను॥ మున్నగు విధముగా ప్రయోగములుండును. మహత్త్వవివక్షయందు శేషుఁడు యోధుఁడు - శేషుఁడుయోధ ; తక్షకుఁడు కుంతుఁడు - తక్షకుఁడు కుంత॥ మున్నగువిధముగా ప్రయోగము లుండును.

70. పృథ్వీవాచి భూశబ్దంబునకు భువియగు. (శా - ౬౨)

భువి - భువులు - భువిని - భువులను.

వ్యాఖ్య - 'భూ' అనుశబ్దము పృథ్వి అను అర్థమును బోధించునప్పుడు 'భువి' యను తత్సమరూపము నొందునని సూత్రార్థము. 'భూ' అను శబ్దమునకు 'భూమి' యను నర్థము గలదు. సమాసమున నుత్తరపదముగా స్వయంభూ, చిత్తభూ, ఆత్మభూ - మున్నగు విధముగా నున్నప్పుడు 'పుట్టినవాడు' అను నర్థముకలుగును. 'స్వయంభూ' మున్నగుచోట్ల "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను నియమముప్రకారము 'స్వయంభు' అనియై వువర్ణకమును పొంది 'స్వయంభువు' అని యగును. ఇచ్చట నున్నది పృథ్వీవాచి భూ శబ్దము కానందువలన, ప్రస్తుతసూత్రము ప్రవర్తింపదు.

'భూమి' యనునర్థము కలిగినప్పుడు మాత్రము పైప్రక్రియజోలికి పోకుండ 'భువి' అనుదానిని తత్సమముగా గ్రహింపవలయు నని వ్యాకర్త విపతించుచున్నాడు. ప్రథమైకవచనమునందు 'భువి' అని యుండును. బహువచనము పరమైనపుడు ఇత్వమునకు ఉత్వము కలిగి 'భువులు' అని యగును. ద్వితీయావిభక్తి యగు 'ను' వర్ణకము "ఇత్వము మీది కునువు" అని మొదలయిన సూత్రముప్రకారము 'ని' యని మారగ 'భువిని' అని యగును. భువిచే, భువికొఱకు, భువులను, భువులచే - మున్నగువిధముగా తక్కినరూపములుండును. ఈ భూశబ్దము సమాసమున నుత్తర పదముగా నెన్నడును కానరాదు

71 నౌశబ్దంబునకు నావ యగు. (శా - ౬౩)

నావ - నావలు - మహానావ॥ కొందఱు నావి యనియు నాదేశం బగు నంద్రు.

వ్యాఖ్య - నౌ అను శబ్దమునకు తత్సమరూపము 'నావ' యని యగు నని సూత్రార్థము.

ఔకారాంతమగు స్త్రీలింగశబ్దము 'నౌ' అనునది. "స్త్రీలింగంబుల ప్రథమైక వచనమునకు లోపంబగు" అను నియమమునుబట్టి 'నౌ' అనియే యుండవలయును. "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను విధినిబట్టి హ్రస్వము చేయ వలయును. ఔకారము దీర్ఘమైన మాట వాస్తవమే, కాని దానికి హ్రస్వము లేనందు వలన ఇక్కడ అప్రసక్తిలేదు. అందువలన 'నౌ' అనునదియే పదము కావలయును. ఇట్లు కావలసి యుండగా వ్యాకర్త ఆ రూపమును కాదని, మఱొక రూపమును ప్రదర్శించుచున్నాడు. 'నౌ' అను శబ్దమునకు 'నావ' అను పదమును నిపతించు చున్నాడు. బహువచనము పరమగునప్పుడు 'నావలు' అని యుండును. సమాసము నందు కూడ 'మహానావ' యన్నరీతిగా 'నావ' అనియే యుండును.

[ 'నౌ' శబ్దమునకు ప్రాకృతమున 'నావా' యను రూపమేర్పడి ప్రాకృత సమముగా తెలుగున నేర్పడియుండెననియు కొందఱ యభిప్రాయమైయుండును. ఆంధ్ర భాషార్ణవము ఓడతోపాటు 'నావ'ను కూడ అచ్ఛికశబ్దముగా పరిగణించెను. సూర్యరాయాంధ్రనిఘంటువుకూడ అచ్చికముగ గుర్తించెను. సూరి యీ భ్రమకు అవకాశము ఉన్నదన్న సంగతిని గుర్తించియే 'మహానావ' యను సమాసమును గూడ ఉదాహరించెను. సంస్కృతసమాసస్థితమైన యీ 'నావ'ను అచ్ఛిక మను టకు వీలులేదు. కావున 'మహానావ' యను సమాసమునుకూడ నుదాహరించి 'నావ' యనునది తత్సమ మను తన నిశ్చయమును సూరి నిరూపించుకొను చున్నాడు. ]

'నౌ' శబ్దమునకు 'నావి' యను తత్సమరూపముకూడ కలదని కొందరు వ్యాకర్తల యభిప్రాయమైనట్లు సూరి చెప్పెను. ఆ యభిప్రాయమును దానెరిగి యున్నను, దానిని సమ్మతించుట యిష్టము కానప్పుడు మాత్రమే "కొందఱు.... అంద్రు" అనితెల్పుట సూరి యలవాటు. కావున 'నావి' యన్నది బాలవ్యాకర్తకు సమ్మతమగు రూపము కాదు.

**72. రైగ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాష నగు. (బా - ౭౪)**

ఇగ్లౌ సూత్రముచేతం బ్రథమైకవచనమునకు లోపంబు॥ రో - రై ; గ్లో - గ్లౌ

వ్యాఖ్య - రై అను శబ్దముయొక్క గ్లౌ అను శబ్దము యొక్క చివరి అచ్చు లకు బదులుగా ఓత్వము విభాషగా నగునని యర్థము.

'రై' అను శబ్దము ఓత్వము నొందిన 'రో' అని యగును. 'గ్లౌ' శబ్దము ఓత్వమునొందిన 'గ్లో' అని యగును. "ఇగ్లౌ" అని మొదలయిన సూత్రముచేత ప్రథమైకవచనలోపము రో: గ్లో అనువానికికూడ కలుగును. వీనికి బహువచనము పరమగునపుడు రోలు - రైలు - రోలకు - రైలకు - గ్లోలు - గ్లౌలు - గ్లోలకు - గ్లౌలకు॥ మున్నగువిధముగా రూపము లుండును.

## 73 ఐకారం బీతుల్యంబు (బా - ఉ౫)

రైని - రైకి - కైని - కైకి - పైని - పైకి.

వ్యాఖ్య - వ్యాకరణకార్యముల విషయమున ఐకారము దీర్ఘమైన ఇవర్ణముతో సమాన మని యర్థము. అనగా దీర్ఘమైన ఇవర్ణముమీద ఏయేకార్యములు విధింప బడునో. ఆయాకార్యములు ఐత్వముమీద సైతము జరుగునని తాత్పర్యము.

'రై' - ఇందలి ఐత్వము ఈతుల్యము. "ఇకారంబు మీఁది కు ను వు క్రియా విభక్తుల యుత్వంబున కిత్వంబగు" అను విధిచేత 'రై' శబ్దముమీది 'ను' వర్ణకము 'ని' యని మారును 'రైని' అన్నది అట్లేర్పడిన రూపము. 'రై + కు' అని యున్నప్పుడు ఇత్వము కలుగుటచేత 'రైకి' అని యగును. యుష్మద్విశేషణ మునకు ఏకత్వమున 'వు' వర్ణము కలిగి ప్రస్తుతసూత్రమువలన ఇత్వమునొందగా 'నీవు రైవి' అని యగును.

కై, పై - అనునవి అచ్చికశబ్దములు. వీనియందలి ఐత్వము కూడ ఈతుల్యమే. కావున 'చేతిని' అను వర్థమున 'కైని' అనియు 'మీదను' అను వర్థమున 'పైని' అనియు నగును. 'కు' వర్ణకమున కిత్వము కలుగగా 'కైకి' అనియు 'పైకి' అనియు నగును.

'ఈ' యని దీర్ఘముతో తుల్యత్వము చెప్పుటచేత బహువచనమున 'రైలు' మున్నగురూపములే యేర్పడును. ఇటుకాక ఇకారతుల్యంబనియో, ఇత్వతుల్యంబనియో చెప్పినయెడల బహువచనము పరమగునప్పుడు ఉత్వముప్రాప్తించి 'రులు' మున్నగు అనిష్టరూపములు వచ్చియుండెడివి. వానిని వారించుటకే సూరి యింతటి జాగరూకతతో ఈకారగ్రహణము చేసెను.

[ అవి కయి, పయి అను రూపములతోనున్నను బహువచనమున వీని కితుల్యతయే యగుననియు దాన కయులు - పయులు మున్నగు ననిష్టరూపములు కలుగుననియు సంభావించునది - అని సర్వస్వ పీఠికాకారులు వ్రాసిరి. "కలుగునని యు" అన్నచోట "కలుగదనియు" అని యుండుట వ్యాఖ్యాతల యభి

మతమై యుండునని సందర్భమును బట్టి యనిపించుచున్నది. (1965 ముద్రణ పాఠము). ఇంతకును 'కై' అనునది 'కయి' అనియు, 'పై' అనునది 'పయి' అనియు ఉండుట కన్నివిధముల నవకాశము గలదు. ప్రస్తుతసూత్రముతో పని లేకుండగనే కయిని, పయిని, కయికి, పయికి - అనురూపములు "ఇకారంబుమీది" అను సూత్రమువల్లనేలభించును. బహువచనము వచ్చునప్పుడు 'కయి + లు = కయులు అనియే యగును. ఇది యనిష్టరూపమైనచో ఇష్టరూపమెట్లుండును? ఉత్పాదింపరాని రూపమా? అది దుష్టము. కావున 'కయి' శబ్దమునకు బహువచనము పరమగుటయను ప్రసక్తియేలేదు. కావున బహుత్వమునందగు రూపము గూర్చి చింతింపవలసిన యవసరము కానరాదు.]

ప్రస్తుత సూత్రముచేత 'రై' శబ్దము ఈకారాంతతుల్యమగుచున్నది. కావున "ఇగ్లౌ" అని మొదలయిన సూత్రమునందలి తొలిఇవర్ణముచేతనే 'రై' శబ్దమునకు ప్రథమైకవచన లోపము కలుగుటకు వీలుండగా, 'రై' శబ్దమును గూడ అందు చేర్చవలసిన యవసరమేమి ? అని ఒక సందేహము కలుగవచ్చును. అది సరియైన సందేహమే. ఆసూత్రమునందున్న 'రై' శబ్దమునకు ప్రథమైకవచనలోపము అట్లే కలుగవచ్చును. కాని 'రో' శబ్దమునకు కలుగదు. అప్పుడు మరల ప్రథమైకవచన లోపమును వేరుగా విధించుకొనవలసివచ్చును. ఆ శ్రమలేకుండుటకై 'గ్లౌ, రై' శబ్దములను అందు చేర్చి 'గ్లో, రో' అను వానికిగూడ దాని ననువర్తింపజేయుటవలన ప్రక్రియా లాఘవము కలుగుచున్నది. కావుననే బాలవ్యాకర్త తన లాఘవము తెలియునట్లు 'రై' శబ్దమునుగూడ గ్లౌ శబ్దమునకు ప్రక్కగా చేర్చెను.

**74. కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు.**

(బా - ౭౭)

కంధరము - కంధర॥ విధా శబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు - విధము॥ కంధరా నాసికా భిక్షా దంష్ట్రా) గ్రీవా పాదు కోల్కా-ప్రభృతులు కంధరాదులు.

వ్యాఖ్య - 'కంధర' మున్నగునవి బహుళముగా నపుంసక తుల్యము లగునని యర్థము. నపుంసకతుల్యములని యతిదేశించుటచేత 'ము' వర్ణకము కలుగునని భావము.

'కంధరా' అనునది ఆకారాంతమైన స్త్రీలింగశబ్దము. "నామంబుల తుదిదీర్ఘంబునకు" అని మొదలయిన సూత్రమునుబట్టి హ్రస్వమై "స్త్రీలింగంబుల" అని మొదలయిన సూత్రమునుబట్టి ప్రథమైకవచనలోపము కలుగగా 'కంధర' అను రూపమేర్పడును. ప్రస్తుతసూత్రమువలన నపుంసకతుల్యత్వము కలిగినయెడల "అమహన్నపుంసకములకు" అను విధినిబట్టి మువర్ణకము కలిగి 'కంధరము' అని యగును.

ఇందు చెప్పినవన్నియు ఆకారాంతస్త్రీలింగశబ్దములే. కావున ప్రక్రియ యన్నింటికి నొక్కమాదిరిగనే యుండును. నాసిక - నాసికము, భిక్ష - భిక్షము, దంష్ట్రి - దంష్ట్రిము. గ్రీవ - గ్రీవము, పాదుక - పాదుకము, ఉల్క - ఉల్కము॥ మున్నగు విధముగా రూపము లుండును.

ఇంతవరకు చూచినవి వికల్పవిధి ననుసరించి యేర్పడినవి. బహుళము అని చెప్పుటచేత 'విధా' శబ్దమునకు నిత్యముగా క్లీబతుల్యత్వము కలిగి 'విధము' అను రూప మొక్కటియే కలుగును.

**75. విధాశబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబు నగు.**

(ప్రౌ - ౨౪)

'విధో విధానే హస్త్యన్నే ప్రకారే వేతసేఽపి చ' అని పుంలింగంబునందు అజయుండు. దీనికిం దత్సమంబునం బుంలింగరూపంబుతోనే ప్రయోగముగాని స్త్రీలింగరూపముతో లేదు. దంష్ట్రాశబ్దంబును బుంలింగముగాను గానంబడియెడి.

వ్యాఖ్య - 'విధా' అను శబ్దము సంస్కృతమునందు పుంలింగరూపముగా కూడ కలదని సూత్రార్థము.

అజయుడు తన నిఘంటువునందు 'విధో విధానే' మున్నగు విధముగా వ్రాసెను. 'విధః' అనునది 'విధానము' అను నర్థమున కల దన్నది ప్రస్తుతాంశము. రూపమును బట్టియే పుంలింగ మను విషయముకూడ తెలియుచున్నది. ప్రౌఢవ్యాకర్త పుంలింగ రూపము కలదని చూపుటకే అజయుని వాక్యము నుద్ధరించి చూపెను.

[ సూత్రమునందు 'విధాశబ్దంబు 'పుంలింగంబు' అనునవి రెండును పరస్పర విరుద్ధములు - ఆకారాంతమైనప్పుడు స్త్రీలింగమే. అదంతమైనప్పుడు పుంలింగము. అందువలన 'విధ' యని హ్రస్వాంతమై యుండిన నంతయు సమర్థముగా నుండెడిది. ]

'విధ' అను ప్రాతిపదికనే గ్రహించి తత్సమరూపమును సాధింపవలయు ననియు, దీర్ఘాంతమైన స్త్రీలింగరూపమువలన తత్సమరూపము కలుగదనియు ప్రౌఢ వ్యాకర్త వివరించుచున్నాడు. ఇందువలన 'విధ' యను శబ్దము అమహద్వాచక మగుటవలన "అమహన్నపుంసకములకు" అను విధినిబట్టి 'ము' వర్ణకమును పొంది 'విధము' అని యగును.

'దంష్ట్రి' అను పుంలింగశబ్దమునకును అమహద్వాచకమై యిందువలన మువర్ణకము చేరగా 'దంష్ట్రిము' అని యగును 'దంష్ట్రా' అను స్త్రీలింగశబ్దము ప్రాతిపదిక యైనపుడు తుది దీర్ఘమునకు హ్రస్వము కలిగి, సులోపము కలిగి 'దంష్ట్రి' యను రూపమేర్పడును.

[ప్రౌఢవ్యాకర్త యభిప్రాయమునుబట్టియు, బాలవ్యాకర్త యభిప్రాయమునుబట్టియు కూడ 'విధము' అను రూప మొక్కటియే తత్సమమునందు కలదు. ప్రౌఢవ్యాకర్త దానిని పుంలింగశబ్దమునుండి సాధించుకొని, స్త్రీలింగశబ్దమును తత్సమరూపనిష్పత్తి విషయమున నిషేధించుచుండగా, బాలవ్యాకర్త స్త్రీలింగశబ్దమునే గ్రహించి నిత్యముగా క్లీబతుల్యత్వమును విధించుకొనెను. ఇచ్చట దేనిని గాని నిషేధింపవలసిన యవసరము లేదు. సూరి తీసికొన్న స్త్రీలింగశబ్దము ప్రసిద్ధము, ప్రౌఢవ్యాకర్త చెప్పిన పుంలింగశబ్దము అప్రసిద్ధము. అప్రసిద్ధమునుండి తత్సమ తద్భవము లేర్పడుననుట వాస్తవమునకు దూరము: పైగా ప్రక్రియా లాఘవముకూడ లేదు. అప్రసిద్ధమును గ్రహించుటకై, ప్రసిద్ధమును నిరసించుట జరుగుచున్నది. అది సమంజసము కాదు. దంష్ట్రా శబ్దవిషయముకూడ ఇట్టిదే. పైగా ఒక రూపము నొక ప్రాతిపదికనుండియు, మరొకరూపమును మరొక ప్రాతిపదిక నుండియు సాధింపవలసి వచ్చుటచేత సీతారామాచార్యులవారి విధానము గ్రహణ యోగ్యము కాదు.]

## హలంత ప్రకరణము

**76. హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామంబగు.**

(బా - ౭౭)

రుక్ - రాట్ - మరుత్ - వీరుత్ - కర్మ - వర్మ॥ శ్వాశబ్దంబు దప్ప నకారాంతంబులెల్లం బ్రథమైకవచనతుల్యంబులై యగునని యెఱుంగునది.

వ్యాఖ్య - హల్లుతో అంతము లగు సంస్కృతశబ్దముల ప్రథమైకవచనాంత తుల్యమే తత్సమరూపమునకు ప్రాతిపదికగా గ్రహింపబడు నని యర్థము.

సంస్కృతమునందు ప్రథమైకవచనాంతముగా: రుక్, రుగ్ మున్నగువిధముగా ప్రథమాంతము (క్) తృతీయాంతము (గ్) కూడ నై యుండును. తెలుగున శ్వాసాక్షరముతోడి ప్రథమరూపమునే ప్రాతిపదికముగా గ్రహింపవలయును.

శ్వన్ శబ్దము నకారాంతము. ఇది ప్రథమైకవచనమున 'శ్వాః' అని యుండును. దీనిని తత్సమరూపమునకు ప్రాతిపదికముగా గ్రహింపరాదు. ఇంక మిగిలిన కర్మన్, వర్మన్ - అను నకారాంతశబ్దము లన్నియు సంస్కృత ప్రథమైకవచనాంతతుల్యములే ప్రాతిపదికములుగా నగును. 'కర్మన్' శబ్దము ప్రథమైకవచనమునందు 'కర్మ' అని యుండును. 'వర్మన్' శబ్దము 'వర్మ' అని యుండును.

[ 'ప్రథమైకవచనతుల్యం బిందు నామం బగు' అని సూరి వివరణము నందు తెలిపెను. ప్రథమైక వచనము అని యనగా కేవల విభక్తియనియే అర్థము కావలయును. అందువలననే సూత్రమునందు ప్రథమైక వచనాంత తుల్యము = ప్రథమైకవచనము నంతమందుగల శబ్దముతో తుల్యము అని యుపయోగించుట జరిగెను. సూత్రమునం దట్లు చెప్పియు వివరణమునందిట్లు చెప్పుట కావలయునని చెప్పుటయే, పొరపాటు కాదు. సూత్రము విషయమున కట్టుబాటు వేరు; విష్కృతియందలి యలవాటువేరు. సూత్రమునందు శాస్త్రీయముగా 'ప్రథమైకవచనము' అన్నప్పుడు ప్రత్యయమును మాత్రమే గ్రహింపవలయును. వివరణమునందు స్పష్టత కొరకై ప్రథమైకవచనము' అని యనగా ప్రథమైకవచనము నొంది యున్న పదమని యర్థము. వ్యవహారమునందు రాముడు ఏకవచనము - రాములు బహువచనము॥ మున్నగువిధముగా వాడుట కలదు గదా! సంధి యను శబ్దము విషయమున కూడ ఈ సడలింపు చూడవచ్చును. సూత్రమునందు 'సంధి' యను పదమును తన నిర్వచనమున కనుకూలముగా "పూర్వపరస్వరములకుఁ బరస్వరమేకాదేశ" మయినప్పుడు మాత్రమే యుపయోగించెను; వివరణమునందు సంధి జరుగని తావుల విషయమున ప్రసంగించుచు "హరియతఁడు - నిద్రవోయె నిట్టిచోట్ల సంధివశంబున వచ్చిన యకారవకారంబులు" అని 'సంధి' శబ్దమును వాడియున్నాడు. ఇట్లు వాడుక ననుసరించిన యెడల వివరణము సుబోధముగా నుండును. సూత్రవిషయమున మాత్రము శాస్త్రమే శరణ్యము; పరమప్రామాణ్యము. ]

77. ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లున కగు.

(బా - ఉగా)

ఉగాగమాంతంబుల కిగ్లాసూత్రముచేతఁ బ్రథమైకవచనలోపం బగు. రుక్కు - రాట్టు - మరుత్తు - వీరుత్తు॥ ఉగాగమంబు లేమింజేసి యిచట నాంతంబుల కస్త్రీలింగంబులకుం బ్రథమైకవచనలోపంబు లేదు. కర్మము - వర్మము - చర్మము - సుధన్వుఁడు - సుత్రాముఁడు.

వ్యాఖ్య - హలంతనామముయొక్క తుదిహల్లునకు అదనముగా ఉత్వమును ద్విత్వమును అగునవి సూత్రార్థము.

పూర్వసూత్రముచేత రుక్, రాట్, మరుత్, వీరుత్ - మున్నగునవి ప్రాతి పదికలుగా గ్రహింపబడినవి. ప్రస్తుతసూత్రము చేత వాని కడపటిహల్లునకు ఉక్కును ద్విత్వమును కలుగగా రుక్కు, రాట్టు, మరుత్తు, వీరుత్తు - మున్నగువిధముగా నగును. ఇప్పుడింక ప్రథమైకవచనము చేరవలయును. అప్పుడు కాని 'పదము' అని అనిపించు కొనవు. 'రుక్కు + సు' అని యుండగా "ఇగ్లౌరాయుగంతంబుల" అనిమొద లయిన సూత్రముచేత ప్రథమైకవచనమునకు లోపమై 'రుక్కు' అనునదియే మిగులును.

[ రుక్కు అనునప్పుడు స్త్రీలింగశబ్దమే కావున "స్త్రీలింగంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు" అను సూత్రమువల్లనే సులోపము జరుగుచుండగా "ఇగ్లా" సూత్రముతో లోపము చేయవలసిన యవసరమేమి? అని కొందఱ సందే హము. "ఇగ్లా" సూత్రమును వాడకున్నయెడల "ఉకారాంత గోశబ్దంబులకంతట వు వర్ణకంబగు" అను సూత్రమునందలి 'అంతట' శబ్దసామర్థ్యమువలన స్త్రీలిం గములగు ధేను, మధు శబ్దములకు వచ్చినట్లే 'వు' వర్ణకము కలుగవలసి వచ్చును. కావున ఉకారాంతములైనప్పుడు స్త్రీలింగములకు కూడ 'వు' వర్ణకము కలుగు చుండుటచేత, ప్రస్తుతసూత్రమువలన ఉగంతములైన వానికి అట్లు కలుగకుండు టకై "ఇగ్లా" సూత్ర మావశ్యకమైనది. అందున్న 'ఉగంత' పదమువలన సర్వ లింగములకు సులోపము కలుగుచున్నది. ]

'రాట్' అన్నది ఉత్వద్విత్వములను పొంది 'రాట్టు' అని యగును. 'మరుత్' అన్నది 'మరుత్తు' అనియు 'వీరుత్' అన్నది 'వీరుత్తు' అనియు నగును.

కర్మ, వర్మ, చర్మ - అనునవి నకారాంత శబ్దములే యైనను ప్రథమైకవచ నాంతతుల్యమే తెలుగునందు ప్రాతిపదిక యగుటచేత అదంతశబ్దముగానే వ్యవహ రించును. కావున "అమహన్నపుంసకములకు" అను సూత్రమునుబట్టి 'ము' వర్ణ కము కలిగి కర్మము, వర్మము, చర్మము - అని యగును. ఇవి మూడును నపుంసక శబ్దములు. అమహద్వాచకములు.

సుధన్వన్, సుత్రామన్ అనునవి పుంలింగ నకారాంత శబ్దములు. ఇవి ప్రథమైకవచనమునందు సుధన్వా, సుత్రామా - అని యుండును. "నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు" అను నియమమునుబట్టి సుధన్వ, సుత్రామ - అను రూపము లేర్పడును. ఇవి పుంలింగములై మహద్వాచకము లగుటచేత ఉత్వ డుజ్జులను పొంది సుధన్వుఁడు, సుత్రాముఁడు - అను విధముగా నగును.

ఉగాగమాంతంబులకు 'ఇగ్లో' సూత్రమువలన ప్రథమైక వచనము లోపించును. అనుదంతములైన స్త్రీలింగములకు "స్త్రీలింగంబుల' అని మొదలయిన సూత్రము వలన ప్రథమైకవచనము లోపించును. కావుననే ఆ రెండు వర్గములకును చెందని కర్మాదులకు ప్రథమైకవచనమునందు 'ము, డు' అను ప్రత్యయములు కలిగినవి. వివరణమునందు బాలవ్యాకర్త 'అస్త్రీలింగంబులకు' అని యుపయోగించెను. కావున స్త్రీలింగములు కాని వాని విషయము ముందుగా నిరూపించుకొంటిమి. ఇంక స్త్రీ లింగముల విషయముకూడ చూడవలయును.

విట్, దిక్, రుక్, త్వక్ - మున్నగువానికి ప్రథమైకవచనమునందు సంస్కృత మున పైరూపములతో పాటుగా విశా, దిశా, రుజా, త్వచా . అను ఆకారాంత రూపములుకూడ కలవు. మొదటనున్న హలంతరూపములు ప్రస్తుతసూత్రమువలన ఉత్వ ద్విత్వములను పొంది విట్టు, దిక్కు, రుక్కు, త్వక్కు - అని యగును. దీర్ఘాంత రూపములు హ్రస్వమును పొంది "స్త్రీలింగంబుల" అను సూత్రమునుబట్టి ప్రథమైక వచన లోపము నొంది విశ, దిశ, రుజ, త్వచ - అని యగును.

తృష - రుష - త్విష మున్నగునవి ఆకారాంత స్త్రీలింగశబ్దము ప్రాతిపదికగా ఏర్పడిన రూపములే. హలంతములకు ప్రథమైకవచనరూపము ప్రాతిపదికగా ఉత్వ దిత్వములు కలిగి తృట్టు, రుట్టు, త్విట్టు - అను రూపము లేర్పడును. ఆపత్, సంపత్- మున్నగువానికి ఉత్వద్విత్వములచే ఆపత్తు, సంపత్తు - అనువిధముగా రూపము లేర్పడును. ఆకారాంత స్త్రీలింగ శబ్దములపై ఆపద, సంపద - అని యగును. ఇదంత శబ్దములు ప్రాతిపదికలుగా ఆపత్తి, సంపత్తి - అని యగును.

**78. దీర్ఘంబుమీఁది హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు.**

(బా - ఉశా)

వాక్కు - వాకు ; స్వరాట్టు - స్వరాటు.

వ్యాఖ్య - హలంతములయిన నామములు దీర్ఘపూర్వములైన యెడల ద్విత్వము బహుళముగా నగు నని సూత్రార్థము.

పూర్వసూత్రమునందు ఉత్వద్విత్వములు విధింపబడినవి. ఉత్వము పూర్వము చెప్పిన విధముగా దీర్ఘముమీది హల్లునకు కలుగ వలసినదే. ప్రస్తుతసూత్రముచేత ద్విత్వము మాత్రము బహుళ ప్రవృత్తి ననుసరించును.

'వాక్' అను ప్రాతిపదికయొక్క తుది హల్లునకు ఉత్వద్విత్వములురాగా 'వాక్కు'అని యగును. ప్రస్తుత సూత్రము వలన, దీర్ఘముమీది దగుటచే కకారమునకు ద్విత్వము రానియెడల 'వాకు' అని ఉత్వముతోడి రూపము మాత్రమే యగును. 'స్వరాట్' అను ప్రాతిపదిక కూడ ఉత్వమును మాత్రమే పొంది 'స్వరాటు' అనియు ద్విత్వముకూడ కలిగినయెడల 'స్వరాట్టు' అనియు నగును.

ద్విత్వమును బహుళముగా విధించుటచేత దీర్ఘముమీది హల్లునకు కొన్ని యెడల నిత్యముగా నగుటయు కలదు. 'పరివ్రాట్' అను శబ్దము ఉత్వద్విత్వములను పొంది 'పరివ్రాట్టు' అని యగును. ఇట్టిదే 'పుణ్యభాక్' అను శబ్దము 'పుణ్యభాక్కు' అని యగుట కూడ. దీర్ఘముమీదివే యైనప్పటికి ఇచ్చటి హల్లులు నిత్యముగా ద్విత్వమును పొందుచున్నవి. ఇట్టివానిని ప్రయోగములనుబట్టి గ్రహింపవలయును.

**79.** మతుబాదికంబు ద్వితీయైకవచనాంత తుల్యంబు నామంబగు.

(బా - ౭౦)

శ్రీమంతమ్ - గుణవంతమ్ - విద్వాంసమ్ - అనడ్వాహమ్ - శ్వానమ్ - ఉపానహమ్ - అప్సరసమ్॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - మతుప్ + ఆదికంబు = మతుబాదికంబు = మతుబంతములు మొదలైన వని యర్థము. మతుబంతములు మున్నగుశబ్దముల ద్వితీయైకవచన రూపములతో సమానములైనవి తెలుగునందు ప్రాతిపదికములుగా వ్యవహరించునని సూత్రార్థము. మతుప్ ప్రత్యయమును అంతమందు గలవి మతుబంతములు. సంస్కృతమున 'కలదు' అను నర్థమున ఈ 'మత్' అను ప్రత్యయము వచ్చును. అకారాంతములపై ఈ ప్రత్యయములోని మకారము వకారముగా మారును. జ్ఞానవత్ - ధనవత్॥ మున్నగునవి ఉదాహరణములు. తదితరమైన అచ్చుపై వచ్చునపుడు మకారందిగనే యుండును. శ్రీమత్ - గురుమత్ - పితృమత్॥ మున్నగునవి యుదాహరణములు. 'ఆదికంబు' అని యనుటవలన మతుబంతములు కాని 'విద్వస్' మున్నగు కృదంతములనుకూడ గ్రహింపవలయునని సూత్రకర్త భావము.

[ 'శ్రీమత్' మున్నగునవి మూడులింగములందు నుండును. నపుంసక లింగమున 'శ్రీమత్' అనియు, స్త్రీలింగమున 'శ్రీమతీమ్' అనియు. పుంలింగమున 'శ్రీమంతమ్' అనియు ద్వితీయైకవచనాంతరూపము లుండును. పుంలింగ ద్వితీయైకవచనాంతముతో సమాన మగు రూపమే తెలుగున ప్రాతిపదికగా ప్రవర్తించును. ]

'శ్రీమత్' అన్నది సంస్కృతప్రాతిపదిక. ద్వితీయైకవచనాంతమైనపుడు 'శ్రీమంతమ్' అని యుండును. 'గుణవత్' అన్నది 'గుణవంతమ్' అని యగును. 'విద్వస్' అనునది 'విద్వాంసమ్' అనియు, 'అడువత్' అనునది 'అనడ్వాహమ్' (ఎద్దు - అనియర్థము) అనియు, 'శ్వన్' శబ్దము 'శ్వానమ్' అనియు, 'ఉపానత్' అనునది 'ఉపానహమ్' (పాదుక) అనియు, 'అప్సరస్' అనునది 'అప్సరసమ్' అనియు ద్వితీయైకవచనాంతమున నగును. వీనికి తుల్యములగు రూపములనే చిన్న మార్పుతో తత్సమరూపములకు ప్రాతిపదికలుగ గ్రహింపవలయును. ఇత్యాదులు అనియనుటచే ఇట్టివాని వింకను ప్రయోగములనుబట్టి గ్రహింపవలయు నని తాత్పర్యము.

**80.** దాని యంతిమ మకారంబునకు లోపం బగు. (బా - ౭౧)

శ్రీమంత - గుణవంత - విద్వాంస - అనడ్వాహ॥ ఇత్యాది. వీని కజంతంబులకుంబోలె డుజాదులు యథాయోగ్యంబుగా నగు. అతఁడు శ్రీమంతుఁడు - ఇతఁడు గుణవంతుఁడు ; వాని వంశము శ్రీమంతము - వీని వంశము గుణవంతము ; విద్వాంసుడు - విద్వాంసము; అనడ్వాహము - శ్వానము - ఉపానహము - అప్సరస॥ వక్ష్యమాణలక్షణంబుచే స్త్రీత్వంబున మతుబాదికంబులు ఙ్యంతంబులై యిందు గ్రహింపంబడు. శ్రీమతి - గుణవతి - విదుషి - శుని॥ మహతి వ్యాచం బగునపుడు శ్రీమంతురాలు - గుణవంతురాలు - విద్వాంసురాలనియుఁ బ్రయోగింపఁ దగు.

వ్యాఖ్య - పూర్వసూత్రముచే నేర్పడిన ప్రాతిపదికముల తుది మకారమునకు లోప మగు నని సూత్రార్థము.

అట్లు లోపము కాగా శ్రీమంత - గుణవంత , విద్వాంస - అనడ్వాహ - శ్వాన - ఉపానహ - అప్సరస అను రూపములు మిగులును. ఇప్పుడు వీనికి పదస్థితి

కలుగుటకై ప్రథమైకవచనమును చేర్పవలయును. కావున అదంతములుగానే వీనిని పరిగణించి, అదంతములకు వచ్చు డు, ము, మున్నగు ప్రత్యయములను చేర్పవలయును.

'శ్రీమంత' అనునది పుంలింగము: మహద్వాచకము. కావున ఉత్వ డుజ్జులు కలిగి 'శ్రీమంతుఁడు' అని యగును. ఇట్లే గుణవంత, విద్వాంస అనునవి మహద్వాచకము లైనపుడు గుణవంతుఁడు, విద్వాంసుఁడు అని ఉత్వ డుజ్జులను పొందును.

అమహద్విశేషణము లైనపుడు శ్రీమంతము, గుణవంతము, విద్వాంసము - మున్నగు విధముగా మువర్ణకముతోడి రూపము లేర్పడును.

అనడ్వాహ, శ్వాన - అను రెండును జంతువాచకములగుటచే "అమహన్నపుంసకములకు" అను నియమమునుబట్టి ము వర్ణకమునొంది అనడ్వాహము, శ్వానము - అని యగును. 'ఉపానహ' శబ్దము జడవాచక మగుటచే ము వర్ణకమును పొంది 'ఉపానహము' అని యగును.

'అప్సరస' యన్నది స్త్రీలింగ శబ్దము. కావున "స్త్రీలింగంబుల" అని మొదలయినసూత్రము ప్రకారము ప్రథమైకవచనమునకు లోపము కలిగి 'అప్సరస' యను రూపముతోనే యుండును.

'శ్రీమంత' మున్నగునవి మహతీవాచకములైనపుడు 'ఆలు' శబ్దముతో సమసించును. "కర్మధారయంబునఁ దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబునగు." అను నియమమునుబట్టి శ్రీమంతురాలు, గుణవంతురాలు, విద్వాంసురాలు - అని యగును.

ఇటుకాక స్త్రీత్వంబున మతుబాదికములను చెప్పవలసి వచ్చినపుడు 'శ్రీమంత' మున్నగు ప్రాతిపదికములను గాక సంస్కృతమున స్త్రీప్రత్యయమైన 'ఙీ'తో కూడుకొన్న రూపములనే గ్రహింపవలయును. ఇదే విషయము వక్ష్యమాణ (ఇకముందు చెప్పబోయెడు) లక్షణమునందు కలదు. దానినిబట్టి 'శ్రీమత్' అన్నదానికి ఙీ ప్రత్యయము కలుగగా ఏర్పడిన 'శ్రీమతీ' అను దీర్ఘాంతము నామ మగును. "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వం బగు" అను నియమమునుబట్టి 'శ్రీమతి' అని యగును. స్త్రీలింగమగుటచే ప్రథమైకవచన లోపము కలుగును. గుణవతి, విదుషి - అనునవి కూడ ఇట్లేర్పడిన రూపములే.

**81. ముదాదులకుఁ బ్రథమైకవచనలోపంబు లేదు (బా - ౬౨)**

ముదము - ఉపానహము - స్రజము.

వ్యాఖ్య - స్త్రీలింగశబ్దములయిన 'ముద' మున్నగు శబ్దముల ప్రథమైకవచనము నకు లోపము కలుగ దని సూత్రార్థము.

'ముత్' అనుస్త్రీలింగశబ్దము ద్వితీయావిభక్తి యేకవచనమందు 'ముదమ్' అని యగును. దానిని గ్రహించి అంతిమ మకారమునకు లోపముచేయగా 'ముద' అన్నది యేర్పడును. "స్త్రీలింగంబుల" అని మొదలయిన సూత్రమునుబట్టి ప్రథమైకవచన లోపము కలుగవలసి యున్నది. ప్రస్తుత సూత్రము దానిని వారించుచున్నది. అందు వలన "అమహన్నపుంసకములకు" అని మొదలయిన సూత్రమునుబట్టి ము వర్ణ కమును పొంది 'ముదము' అని యగును.

అట్లే 'ఉపానహ' అనునది స్త్రీలింగశబ్దమైనను, ప్రస్తుత సూత్రమువలన ప్రథ మైకవచనమును పొందును. అమహత్తు అగుటచే ము ప్రత్యయము కలిగి 'ఉపాన హము' అని యగును. అట్లే 'స్రక్' అను స్త్రీలింగశబ్దముయొక్క ద్వితీయాంతరూప తుల్యమైన 'స్రజమ్' అనునది అంతిమ మకారమును గోల్పోయి, పిదప 'ము' వర్ణ కమును పొంది 'స్రజము' అనియైనది

ముదమును, ముదముతో, ఉపానహముకొఱకు, ఉపానహమువలన, స్రజము యొక్క, స్రజములయందు - మున్నగు విధముగా ఇతరవిభక్తులతోఁడి రూపము లుండును.

['స్రక్' శబ్దమునకు ప్రథమైకవచనాంతతుల్యము ప్రాతిపదికగా 'స్రక్కు' అను రూపమును రమణీయ సమీక్షాకారులు చూపిరి. అది మృగ్యము.]

82. ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు (బా - ౬౩)

ఋత్విజుఁడు - ఋత్విక్కు ; నీవృతము - నీవృత్తు॥ ఋత్వి గాదికం బాకృతి గణంబు.

వ్యాఖ్య - 'ఋత్విక్' మున్నగు సంస్కృతనామముల ద్వితీయైకవచనాంత తుల్య రూపములు విభాషగా తెలుగున ప్రాతిపదికము లగునని సూత్రార్థము. అనగా ప్రథమైకవచనాంతతుల్యము ప్రాతిపదికగా ఒకరూపమును, ద్వితీయైక వచనాంత తుల్యము ప్రాతిపదికగా మఱొకరూపము నేర్పడును. రెండును గ్రాహ్యములే.

'ఋత్విక్' అను ప్రథమైకవచనాంతతుల్యమునకు ఉత్వద్విత్వములు కలుగుట వలన 'ఋత్విక్కు' అని యగును. ద్వితీయైకవచనాంతతుల్యము 'ఋత్విజమ్' అను

నది. దీని అంతిమ మకారమునకు లోపము కలిగి ఉత్వదుజ్జులు రాగా 'ఋత్విజుఁడు' అని యగును.

[కొందరు వ్యాఖ్యాతలు 'ఋత్వి...' అను శబ్దమును ప్రయోగసిద్ధము కాదని తలచిరి. శబ్దరత్నాకరకారుఁడుకూడ 'ఋత్విక్కు' అను రూపమును చూపలేదు. సూర్యరాయాంధ్రనిఘంటువు "ఋత్విక్కు = ఋత్విజుఁడు" అని చూపెను. గాని ప్రయోగమును ప్రదర్శింపలేదు. వరాహపురాణమునందు "స్రుక్కుల విఱిచి ఋత్విక్కుల బాధించి" అని ప్రాసఘటితమై 'ఋత్విక్కు' అను శబ్దము గలదు. రామాభ్యుదయమునందు "అలఘు శ్రీనిధి విశ్వభూతల వరుండా ఋష్యశృంగర్షి ము। ఖ్యుల ఋత్విక్కుల నవ్వ దేర్పఱిచి" యని కలదు. "ఆ ఋత్విక్కులు నంత నిష్టికలచే" నని రఘునాథరామాయణమునందలి ప్రయోగము, 'ఋత్విజుఁడు' అను రూపము సర్వప్రసిద్ధము. కావున ప్రయోగములను చూపుట లేదు.]

'సీవ్యత్' అను దానికి ఉత్వద్విత్వములు కలిగినయెడల 'సీవృత్తు' అని యగును. ద్వితీయైకవచనాంతతుల్యమైనపుడు 'సీవృతమ్' అని యగును. దీని అంతిమ మకారమునకు లోపము కలుగగా 'సీవృత' అని యగును. దీనికి 'దేశము' అనియు 'గ్రామము' అనియు నర్థములు. కావున ఇది అమహద్వాచకము. "అమహన్నపుంసకములకు" అను నియమమునుబట్టి ము వర్ణకము కలిగి 'సీవృతము' అని యగును.

ఆకృతిగణము అని యనుటచే ఇట్టివానిని పోలికను బట్టి గ్రహింపవలయునని తాత్పర్యము, మరుత్తు - మరుతుఁడు; ఇంద్రజిత్తు - ఇంద్రజితుఁడు; వేదవిత్తు - వేదవిదుఁడు; వణిక్కు - వణిజుఁడు॥ జలముక్కు - జలముచము; మధులిట్టు - మధులిహము॥ మున్నగునవి యుదాహరణములు.

83. ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్తకారంబున కానా దేశంబు విభాష నగు. (బా - ౭౪)

హనుమానుఁడు - హనుమంతుఁడు; భగవానుఁడు - భగవంతుఁడు॥ ఇత్యాది.

వ్యాఖ్య - కొన్నియెడల మహద్వాచకమైన మతుబంతముయొక్క మతుప్తకారమునకు విభాషగా 'ఆన' యను నాదేశము కలుగునని సూత్రార్థము. మతుప్తకారము అని యనగా మతుప్ప్రత్యయము యొక్క తకార మని యర్థము.

'మతుబాదికం'బవి మొదలైన (బాల - 0) సూత్రమునుబట్టి ద్వితీయైకవచ నాంత తుల్యమును ప్రాతిపదికగా గ్రహింపవలసియుండును. 'హనుమత్' అను శబ్దముయొక్క ద్వితీయైకవచనాంత రూపము 'హనుమంతమ్' అనునది. దీని కడపటి మకారమునకు లోపము చేయగా 'హనుమంత' అని యగును. మహద్వాచకము, పుంలింగము నైనందువలన ఉత్వ డుజ్ఞులు కలుగగా 'హనుమంతుఁడు' అని యగును. 'భగవత్' అను మతుబంతముకూడ నిట్లే 'భగవంతుఁడు' అని యగును. ప్రస్తుత సూత్రము వలన హనుమంత, భగవంత - అను ప్రాతిపదికముల కడపటి తకార మునకు బదులుగా 'ఆన' అనునది రాగా 'హనుమం + ఆన' అనియు 'భగవం + ఆన' అనియు నగును. అచ్చునకు తర్వాతనే కాని పూర్వమందు 'సున్న' యుండదు. కావున తొలగిపోగా 'హనుమ + ఆన = హనుమాన' అనియు 'భగవ + ఆన= భగవాన' అనియు నగును. ఈ హనుమాన, భగవాన - అనునవి మహద్వాచకము లగుటచే ఉత్వ డుజ్ఞులను పొంది హనుమానుఁడు, భగవానుఁడు - అని యగును.

[ ఇచ్చట 'హనుమత్' మున్నగు ప్రాతిపదికనే గ్రహించి చివరి తవర్ణము నకు ఆనాదేశము చేయుట కొందర భిలషింతురు. సకారాంతములు తక్క, మిగి లిన యేహలంతములును సంస్కృత ప్రాతిపదికలు యథాతథముగా తత్సమ ప్రాతి పదికలు కావు. అట్లగుట సూరి యభిమతము కాదు. ]

'ఇత్యాదులు' అని యనుటచే ఈ రెండు శబ్దములకే కాక ఆనాదేశము కలుగు మతుబంతములు కలవని సూచించుట.

విభాష యని యనుటచే ఇచ్చట అన్యప్రవృత్తికి కూడ అవకాశము కలదు. 'మఘవత్' శబ్దము మతుబంతము కావున ద్వితీయైకవచనాంతతుల్యమే యిందు నామమై పై రూపములు కలుగవలయును. కాని యీశబ్దము యొక్క ప్రథమైకవచ నాంత తుల్యరూపమగు 'మఘవా' అనునది ప్రాతిపదికగా వ్యవహరించుట కలదు. అప్పుడు తుదిదీర్ఘమునకు హ్రస్వము కలిగి, ఉత్వడుజ్ఞులు కలుగగా 'మఘవుఁడు' అని యగును.

**84 విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు. (బా - ౬౫)**

స్త్రీలింగత్వాతిదేశంబుచేత నుత్వడుజ్ఞులు లేవని యెఱుంగునది. విశ్వకర్మ - కృష్ణవర్త్మ - అశ్వత్థామ - యువ - యజ్వా॥ ఇత్యా దులు.

వ్యాఖ్య - విశ్వకర్మ మున్నగువవి నకారాంతములయిన పుంలింగశబ్దములు. అన్నియును పురుషవాచకములే. అందువలన తత్సమరూపములైనప్పుడు ఉత్వడుజ్జులను పొందవలయును. ప్రస్తుతసూత్రము స్త్రీ తుల్యత్వమును అతిదేశించుటచేత ఉత్వడుజ్జులు వారింపబడుచున్నవి.

విశ్వకర్మాదులు నకారాంతము లగుటచేత "శ్వశబ్దంబు దప్ప నకారాంతంబు లెల్లం బ్రథమైకవచనతుల్యంబులె యగు నవి యెఱుంగువది" అను విధివిబట్టి విశ్వకర్మా - కృష్ణవర్త్మా - అశ్వత్థామా - యువా - యజ్వా॥ అను దీర్ఘాంతములైన ప్రథమైకవచన తుల్యములనే ప్రాతిపదికలుగా గ్రహింపవలయును. ఆ పిమ్మట "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను నియమమునుబట్టి 'విశ్వకర్మ' మున్నగు రూపములు వచ్చును. ప్రస్తుతసూత్రమువలన స్త్రీతుల్యత్వము కలుగగా ప్రథమైకవచన లోపమై యున్నవి యున్నట్లుగా పదస్థితిని పొందును. అశ్వత్థామ - అశ్వత్థామను; యువలు - యువతో; యజ్వచేత - యజ్వలవలన॥ మున్నగువిధముగా రూపములుండి, యితర విభక్తులతో వ్యవహరించును.

85. విశ్వకర్ముఁ డనియు రూపంబు. (ప్రౌ - ౨౭)

విశ్వకర్మునికూఁతు విశదలావణ్యసముజ్జ్వలఁ జేకొని మూరిఁబోయి॥ ఉ. హరి ౪౮॥

వ్యాఖ్య - 'విశ్వకర్మ' అను శబ్దమునకు ప్రథమైకవచనమునందు 'విశ్వకర్ముఁడు' అను రూపముకూడ కలదని సూత్ర తాత్పర్యము.

బాలవ్యాకరణమున 'విశ్వకర్మ'కు స్త్రీత్వము నిత్యముగా విధింపబడినది. దానిని నవరించుటకై ప్రస్తుతసూత్రము ప్రారంభింప బడినది. 'విశ్వకర్మునికూఁతు' అను చోట నిగాగమముతోడి రూపము చూపబడినది. డుమంతములకు మాత్రమే నిగాగమము కలుగును కాబట్టి యిచ్చటిది, 'విశ్వకర్ముఁడు' అను రూపము యొక్క పరిణామమే యని యనవలయును. దీనినిబట్టి బాలవ్యాకరణవిధి బాధిత మగుచున్నది.

దీనితోపాటు ప్రౌఢవ్యాకర్త 'కృష్ణవర్త్మ' యను రూపమునుగూడ చేర్చి యుండిన బాగుండెడిది. దీనికికూడ స్త్రీత్వము నిత్యమని నిర్వహింపదగిన ప్రయోగములు లేవు. 'కృష్ణవర్త్మ' అని యుండుటతోపాటు 'అగ్ని' యను నర్థమునందు అమహద్వాచకముగా 'కృష్ణవర్త్మము' అనియు అగ్నిదేవుఁడు అను వర్థమాన మహద్వాచకమై 'కృష్ణవర్త్ముఁడు' అనియు కావచ్చును.

అహోబలపతి స్త్రీలింగతుల్యములైన కృష్ణవర్త్మ, విశ్వకర్మ - అను వానిని అసాధువులుగా పరిగణించెను. 'విశ్వకర్మ' యని యనుటకు నన్నయభట్టారకుని ప్రయోగము కలదు. కావున ప్రౌఢవ్యాకర్త 'విశ్వకర్మ' శబ్దమునకు ద్వైరూప్యము నంగీకరించినట్లే 'కృష్ణవర్త్మ' శబ్దమునకును అంగీకరించుట సముచితముగా నుండును.

86 మహద్వాచకంబయి పుంలింగం బగు బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వం బగు. (బా – ౬౬)

బ్రహ్మ - ఈ శబ్దము చతుర్ముఖ ఋత్విగ్విప్రులకు వాచకంబు. తత్త్వతపోవేదయోగ వాచకంబగునేని బ్రహ్మంబు నాఁబడు.

వ్యాఖ్య - బ్రహ్మశబ్దము పుంలింగమై మహద్వాచకమైనప్పుడు స్త్రీతుల్యత్వము నొందు నని యర్థము.

స్త్రీత్వమగుట యని యనగా ప్రథమైకవచనము లోపించుట యని యర్థము.

సంస్కృతమున పుంలింగమైన బ్రహ్మశబ్దము ప్రథమైకవచనాంతమైనపుడు 'బ్రహ్మా' యని యుండును. దీనికి నలువ, ఋత్విజుడు, బ్రాహ్మణుడు అను నర్థములు గలవు. కావున నిది మహద్వాచకముకూడ నైయున్నది. అందుచే దీర్ఘమునకు హ్రస్వమైన పిమ్మట, ఉత్వదుజ్ఞులు రాకపోయియుండగా ప్రస్తుతసూత్రమువలన స్త్రీత్వము కలిగి 'బ్రహ్మ' యని మాత్రమే యగుచున్నది.

నపుంసకమగు బ్రహ్మశబ్దము ప్రథమైకవచనము నందు 'బ్రహ్మ' యని అదంతముగనేయుండును. ఇది నపుంసకమగుటచేత "అమహన్నపుంసకములకు" అని మొదలయిన సూత్రమునుబట్టి మువర్ణకము కలిగి 'బ్రహ్మము' అని యగును. దీనికి తత్త్వము (పరమాత్మ), తపస్సు, వేదము - అను నర్థములు గలవు.

గ్రహముల కూటమిని దెల్పు ఒక యోగము 'బ్రహ్మ' అను పుంలింగశబ్దము చేతనే బోధింపబడును. అయినను అది మహద్వాచకము కానందువలన స్త్రీత్వమును పొందదు. "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను నియమము ప్రకారము 'బ్రహ్మ' అనియై ఆ పిమ్మట "అమహన్నపుంసకములకు" అను సూత్రము ప్రకారము ము ప్రత్యయము కలుగగా 'బ్రహ్మము' అని యగును. సూత్రమున 'మహద్వాచకంబయి' అని యనుటవల్ల ఈ అమహదర్థకమునకు స్త్రీత్వము వారింపబడినది.

87. ఆత్మేమనిజంతంబులకు, నాంతంబులగు మనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు. (బా - ౭౭)

ఆత్మ - ఆత్మము - ఆత్ముఁడు; మహిమ - మహిమము; అణిమ - అణిమము; గరిమ - గరిమము; లఘిమ - లఘిమము; దేవశర్మ - దేవశర్ముఁడు.

వ్యాఖ్య - ఆత్మశబ్దమునకును, ఇమనిచ్ ప్రత్యయాంతములైన శబ్దములకును, మనుజసంజ్ఞలయిన నకారాంతశబ్దములకును స్త్రీత్వము బహుళముగా నగు నని సూత్రార్థము.

'ఆత్మ' శబ్దము నకారాంతమే. ఇది తెలుగునందు జీవుఁడు, బ్రహ్మము, మనస్సు - మున్నగు వర్థములయందు ప్రయోగింపబడును. అట్టియెడల వైకల్పికముగా స్త్రీత్వము నొంది 'ఆత్మ' యను రూపముతో ప్రవర్తించును. స్త్రీత్వము కాని పక్షమున అర్థమునుబట్టి మహదమహద్వివక్షనుబట్టి 'ఆత్ముఁడు' అనియు 'ఆత్మము' అనియుకూడ రూపముల నొందును. జీవాత్మ - జీవాత్ముఁడు ; పరమాత్మ - పరమాత్ముఁడు ; మహాత్మ - మహాత్ముఁడు॥ మున్నగువిధముగా నుండును.

ఇమనిచ్ + అంతము = ఇమనిజంతము. మహిమ, లఘిమ - మున్నగునవి. ఇవియు నకారాంతములే. వీనికికూడ వైకల్పికముగా స్త్రీత్వము కలుగగా మహిమ, లఘిమ, గరిమ, ప్రదిమ, ప్రౌఢిమ, అణిమ - మున్నగు విధముగా నుండును. స్త్రీత్వము రానిపక్షమున, అమహద్వాచకము లగుటచేత మువర్ణకమును పొంది మహిమము, లఘిమము, గరిమము, ప్రదిమము, ప్రౌఢిమము, అణిమము - మున్నగు విధముగా నగును.

'దేవశర్మ' అనునది మనుజసంజ్ఞ (నామధేయము) అయిన నకారాంతశబ్దము. పుంలింగము మహద్వాచకము నగుటచేత ఉత్వడుజ్ఞాలు వచ్చినయెడల 'దేవశర్ముఁడు' అని యగును. ప్రస్తుతసూత్రముచేత స్త్రీత్వము కలిగినయెడల ప్రథమైకవచనము లోపించి 'దేవశర్మ' అనియే యుండును.

నిగమశర్మ - నిగమశర్ముఁడు ; కృతవర్మ - కృతవర్ముఁడు॥ మున్నగునవి యిట్టివి.

అశ్వత్థామ, సుధన్వ, సుత్రామ - మున్నగు నకారాంత మనుజసంజ్ఞలకు రూపము లింతకుముందే చూపబడినవి. 'అశ్వత్థామ' స్త్రీతుల్యమగురూపముతో

మాత్రమే యుండును. తక్కినరెండును సుధన్వుఁడు, సుత్రాముఁడు - అని ఉత్వ దుజ్జులను కలిగియుండును. బహుళము అని యనుటచే ఆత్మాదులకు వికల్పముగను, అశ్వత్థామాదులకు నిత్యముగను ప్రీత్వము కలుగుచున్నది. సుత్రామాదులకు కలుగుటలేదు.

88 మహత్త్వంబున స్వార్థపరం బగు రాజశబ్దము రాజు నాఁ బడు. (బా - ౭౮)

రాజు - ఖగరాజు॥ అమహత్త్వంబునందు రాజము - వృక్షరాజము॥ ఉపసర్జనత్వంబునందు హతరాజుఁడు పగశురాముఁడు.

వ్యాఖ్య - రాజ శబ్దము స్వార్థపరమై మహత్త్వ బోధకమైనయెడల 'రాజు' అను నిపాతము నొందు నని సూత్రార్థము.

స్వార్థపరమగుట యనగా ఆత్మార్థమునకు ప్రాధాన్యము గలిగియుండుట యని యర్థము. ప్రాధాన్యము అనగా వాక్యమునందలి క్రియతో అన్వయమును గలిగి యుండుట.

సంస్కృతమున రాజ శబ్దము ప్రథమైకవచనము 'రాజా' అని యుండును. దీర్ఘమునకు హ్రస్వము వచ్చి ఉత్వదుజ్జులు రాగా 'రాజుఁడు' అను అనిష్టరూపము వచ్చును. దానిని పరిహరించుటకై యీ సూత్రము ప్రారంభింపబడెను.

రాజశబ్దము మహద్వాచకమై స్వార్థప్రాధాన్యము గలిగి యున్నప్పుడు 'రాజు' అను నిపాతము నొందును. అనగా ఇది ప్రథమైకవచనాంత సదృశమైన తత్సమ రూపము. కావున ప్రథమైకవచనమునందు 'రాజు' అనియు, ఇతరవిభక్తులయందు రాజులు, రాజును, రాజుచే, రాజులచే - మున్నగు విధముగా నుండును. రాజు కప్పము గొనెను - రాజుచే రక్షింపబడెను॥ స్వార్థపరమగు రాజశబ్దమునకు లక్ష్యములు సమాసమునందును మునిరాజు, మహారాజు మున్నగు విధముగా నగును.

గరుత్మంతుఁడు అను నర్థమున మహద్వివక్ష చేయుటంబట్టి ఖగరాజు, పక్షిరాజు - మున్నగురూపములగును. కేవల శ్రేష్ఠత్వమును చూపవలసి వచ్చినప్పుడును. సచేతనములయిన వానికి ఉత్వదుజ్జులు కలుగుచుండుట కలదు. అశ్వోత్తముఁడు - కపివరుఁడు॥ మున్నగునవి. ఇట్టి శ్రేష్ఠత్వముగల (సచేతనములైన అమహత్తులకు) శబ్దములకు ఉత్తరపదమై సమసించియున్న రాజ శబ్దమునకును ఈ నిపాతము వచ్చి అశ్వరాజు - కపిరాజు - మృగరాజు మున్నగువిధముగా నగును.

స్వార్థపరమైనప్పటికి అమహత్త్వపరమై యున్నప్పుడు 'రాజ' శబ్దముపై ము వర్ణకము చేరినరూపమే వచ్చును. వృక్షరాజము, పర్వతరాజము, నగరరాజము - మున్నగునవి యుదాహరణములు.

'ఉపసర్జనత్వము' అని యనగా అప్రధానత్వము అని యర్థము. ఇట్టి అప్రధానత్వము సాధారణముగా బహువ్రీహిసమాసాంతర్గతమైన రాజ శబ్దమునకు కలుగుచుండును. హతరాజుఁడు పరశురాముఁడు వచ్చెను॥ అను వాక్యమునందు హతరాజుడు అనునది 'పరశురాముడు' అను శబ్దమునకు విశేషణము. దానికి క్రియతో అన్వయములేదు. కావున అది విశేష్యమువలెనే లింగవిభక్తి వచనముల నొంది యుండును. కావుననే 'హతరాజ' యనునది ఉత్వడుబ్బులను పొంది 'హతరాజుఁడు' అయినది. చంపబడినరాజులను కలవాడయిన పరశురాముడు వచ్చెను అని యనుట చేత 'రాజ' శబ్దము ఇచ్చట అప్రధానము. ఉపసర్జనత్వమునందు మూడువాచకములందును రాజ శబ్దము కనిపించుచున్నది. భారతధాత్రి సురాజ్ఞి (మంచిరాజులను గలది). ఈ విశ్వము బహురాజము. (అనేక రాజులను గలది).

[నకారాంతములు సాధారణముగఁ బ్రథమైకవచనాంతతుల్యములే గాఁదగుటచే విశ్వకర్మేత్యాదులవలె 'రాజ' అనురూపమే గలిగెడి. కాన నిపతింపుట యావశ్యకమయ్యె; నిపతించుట ప్రయోజనశూన్యమగుం గాన దీనిపై వుడుబ్వర్ణములు కలుగవని గ్రహించునది — అని సర్వస్వ పేటికా కారులు వ్యాఖ్యానించిరి. విశ్వకర్మాదులలో 'రాజ' శబ్దము చేరలేదు. కావున దానికి 'రాజ' యను రూపము వచ్చునను శంకయే యనవసరము. సుత్రామాదులలో చేరుటచేత 'రాజుఁడు' అనునది కాకుండ నుండవలయును. కావున నిపతించుట యవసరమే. అంతేకాక, తెనుగున ప్రాతిపదిక యేది ? అను ప్రశ్నకలదు. 'రాజా' అనునది కొన్నియెడల ఉండగా టచ్ ప్రత్యయాంతమైన 'రాజః' అను దానిలోని 'రాజ' కొన్ని యెడల నుండును. ఇన్ని రూపముల జోలికి పోకుండ నిపతించుటవలన ప్రక్రియాభారము తొలగిపోయెను. ఇంక దీనికి "వుడుబ్వర్ణములు కలుగవని గ్రహించునది" అని యనవలసిన యవసర మేమో! నిపాతము అనునది ప్రథమైక వచనాంతతుల్యమునకే జరుగును. 'రాజు' అన్నది ప్రథమైకవచనాంతమే. ఇదే విషయమును వ్యాఖ్యానించుచు రమణీయ సమీక్షాకారులు "రూపసిద్ధికి మార్గమేది యయినఁ గానిండు. 'రాజు' అని యీ సూత్రమున నిపతింపబడినది ప్రథమాంతమా? ప్రాతిపదికమా? ప్రథమాంతమయినచో దీని పయిని దక్కిన విభక్తులు చేరుటెట్లు ? ప్రాతిపదిక మయినచో దీనికి ప్రథమైకవచనలోప మెట్లు ? అను ప్రశ్నలు తొలఁగ లేదు. ప్రథమైకవచనాంతమునుమీఁద నితర విభక్తులు చేరుట భాషోత్పత్తి మార్గములనుబట్టి కొన్నియెడల వాస్తవికమే యయినను

వ్యాకరణప్రక్రియారీతులకు మాత్ర మది కేవల విరుద్ధము. కావున నిపాతముల నెల్ల ప్రాతిపదికములుగనే గ్రహింపవలయును" అని వ్రాసిరి. నిపాతస్థలముల కడ నెక్కడను ప్రథమైకవచన ప్రత్యయము కలుగుటలేదు. కలుగదను నిషేధ మును సూరి జ్ఞాపనము చేయలేదు. తక్కినయెడల ప్రసక్తమైన విధినే అపవర మనుకొనుచో జ్ఞాపనము చేయుట సూరి పరిపాటి: బాలవ్యాకరణ సంప్రదాయము. "ఉగాగమంబును" అని మొదలయిన సూత్రముకడ "ఉగాగమాంతంబుల కిగ్గా సూత్రముచే" అని మున్నగువిధముగను, "ఉగాగమంబులేమింజేసి" అని మొదలు గను జ్ఞాపనము చేయుట కలదు "రై గ్గా శబ్దంబుల కోత్వంబు విభాష నగు" అను చోట "ఇగ్గా" సూత్రము జ్ఞాపనము చేయబడినది. "అమహన్నపుంసకములకు" అను సూత్రముకడ "క్షిబంబులు మిత్రాదులు" అని మొదలయిన సూత్రము జ్ఞాప నము చేయబడినది. ఇట్టివి పెక్కు తావులు గలవు. కావున ఒక్క నిపాతము కడనైనను, అట్లు జ్ఞాపనము చేసియుండక పోవుటచేత, ప్రథమైకవచనాంతతుల్య ముగనే నిపాతమును నిర్దేశించె ననవలసి వచ్చుచున్నది. ప్రథమైకవచన మున్న యెడల ఇతరవిభక్తులు వచ్చినప్పుడది తొలగిపోవును. అట్లు కానప్పుడితరవిభ క్తులు చేరుట కభ్యంతరము లేదు. 'గోడ' యనునది ప్రథమైకవచవాంతమే కదా। దానిపై నితరవిభక్తులు వచ్చుచున్నవికదా. అట్లే యిచ్చటను వచ్చును. వు, ము, డు - అను ప్రత్యయములుండగా ఇతరప్రత్యయములు రాకుండును గాని ప్రత్య యము లేనప్పుడు రాకుండ నుండవలసిన నియమము కనిపింపదు. కావున నిపాతములు ప్రథమైకవచనాంతములని గ్రహించుట సూరి మతమునకు సమ్మత మగు మార్గము; సర్వసాధకము. ]

89. జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాషనగు.

(బా - ఆ)

జగము - జగత్తు; ఇంద్రజి - ఇంద్రజిత్తు। ఋత్విగాది యనుటం జేసి ద్రుయిందజితుండనియు వాడంబడు.

వ్యాఖ్య - జగత్, ఇంద్రజిత్ - అను శబ్దముల తుది తకారమునకు విభాషగా లోపమగునని సూత్రార్థము.

'జగత్' అనునది హలంతమగుటచేత "ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లున కగు" అను నియమమునుబట్టి ఉత్వద్విత్వములు కలుగగా 'జగత్తు' అని యగును. ప్రస్తుతసూత్రముచేత 'జగత్' అను శబ్దముయొక్క తకారమునకు లోపము కలుగగా 'జగ' అని యుండును. అమహద్వాచక మగుటచేత "అమహన్నపుంసక

ముల కదంతములకు ము వర్ణకంబగు" అను నియమమునుబట్టి 'ము' వర్ణకము కలిగి 'జగము' అని యగును.

[జగతి యను మరొకరూపము కలదు; అది 'జగతీ' యను ఈకారాంత శబ్దమైన ప్రాతిపదిక. "నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను నియమమునుబట్టి 'జగతి' అనియై ప్రథమైకవచనలోపము నొందిన రూపము.]

'ఇంద్రజిత్' అను శబ్దము ఉత్వద్విత్వములను బొంది 'ఇంద్రజిత్తు' అని యగును. "ఇగ్లా" సూత్రముచే ప్రథమైక వచనలోపము నొందును. ప్రస్తుతసూత్రముచే 'ఇంద్రజిత్' అనునది తకారము లోపింపగా 'ఇంద్రజి' అని యగును. "ఇగ్లా" సూత్రముచేత ఇదంతమైనదీనికి ప్రథమైకవచనము లోపించును. 'ఇంద్రజి + సు' అని యున్నప్పుడు సులోపము జరిగి 'ఇంద్రజి' అనియే యగును.

'ఇంద్రజిత్' అను శబ్దము ఋత్విగాదులలోని దగుటవలన విభాషగా ద్వితీయాంతతుల్యము నామముగా వ్యవహరించును. 'ఇంద్రజితమ్' అనునది ద్వితీయైక వచనాంతరూపము. దీని అంతిమ మకారమునకు లోపము వచ్చి 'ఇంద్రజిత' అని యగును. మహద్వాచకమును, పుంలింగమును, అగుటచేత అత్వమునకు ఉత్వము వచ్చి డుజ్ఞారాగా 'ఇంద్రజితుఁడు' అని యగును.

విభాష యని యనుటచే వికల్పముతోపాటు, పైని చూపిన అన్యత్వమునకు అవకాశము కలుగుచున్నది.

**90. సాంతంబుల తుది సకారంబునకు లోపంబు బహుళంబుగా నగు.**

**(బా - ౭౦)**

ఉరము - ఉరస్సు ; వక్షము - వక్షస్సు ; అర్చి - అర్చిస్సు ; ధనువు - ధనుస్సు; ఆయువు - ఆయుస్సు॥ బహుళ గ్రహణమునంజేసి పయః ప్రభృతుల సకారంబునకు లోపంబులేదు. పయస్సు - వయస్సు- సరస్సు.

వ్యాఖ్య - సకారముతో అంతమగు శబ్దములయొక్క తుది సకారమునకు బహుళముగా లోపము కలుగు నని సూత్రార్థము.

"హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామంబగు" అను (బాల - 67) నియమమునుబట్టి సాధారణముగా ప్రథమైకవచనములనే ఇక్కడ నామముగా

గ్రహించుట జరుగును. సాంతము లని పేర్కొనబడినవి కూడ హలంతములలోనివే. వీనికిని స్థూలముగా చూచినప్పుడు ప్రథమైకవచనమే నామము కావలయు నని యని పించును. కాని సకారాంతముల ప్రథమైకవచనరూపములు శ్రేయాన్ - వేధాః - ఉశనాః - ఆశీః - మనః॥ మున్నగు భిన్నరూపములలో నుండును. నిజమునకు పై రూపములలో నెచ్చటను 'స్' అనునది లేదు. లేనిదానికి లోపము విధించుట జరుగదు గనుక ఉన్నరూపములనే గ్రహింపవలయును. అనగా సకారాంతములవిషయమున సంస్కృతప్రాతిపదికమునే తెలుగునసైతము ప్రాతిపదికముగా గ్రహింపవలయును. "సాంతంబుల తుది సకారము" అని సూత్రమునందు చెప్పుటచేత సకారము తుదినున్న రూపమునే ప్రాతిపదికము గ్రహింపవలయునని వ్యాకర్త సూచించుచున్నాడు.

'ఉరస్' అనుశబ్దము ఉగాగమంబును ద్విత్వంబును తుదిహల్లునకు కలుగగా 'ఉరస్సు' అని యగును. ఇగ్లో సూత్రముచేత ప్రథమైకవచనమునకు లోపము కలుగును. ప్రస్తుతసూత్రము వలన వికల్పముగా సకారమునకు లోపము కలుగగా 'ఉర' అని యగును. అమహద్వాచకమగుటచేత 'ము' వర్ణకము కలిగి 'ఉరము' అని యగును. ఇట్లే 'వక్షస్' అను శబ్దము వక్షస్సు, వక్షము - అని రెండు రూపములను పొందును.

'అర్చిస్' అనునదికూడ ఉత్వద్విత్వములను పొంది, ప్రథమైకవచనము లోపింపగా 'అర్చిస్సు' అని యగును. ప్రస్తుతసూత్రముచేత 'స్' లోపింపగా 'అర్చి' అని యగును. ఇది ఇదంతము. ఇగ్లోసూత్రముచేత ప్రథమైకవచనలోపము నొందును. అనగా 'అర్చి' అను రూపముతోనే యుండునని భావము.

'ధనుస్' అనునది ఉత్వద్విత్వములను పొంది 'ధనుస్సు' అని యగును. సకారము లోపింపగా 'ధను' అని యగును. ఇది ఉకారాంతము. కాబట్టి "ఉకారాంతగోశబ్దంబుల కంతట వు వర్ణకంబగు" అను విధినిబట్టి 'ధనువు' అని యగును. ఆయుశ్శబ్దము కూడ ఇట్లే ఆయుస్సు, ఆయువు - అని రెండు రూపములను పొందును. శ్రేయము - శ్రేయస్సు ; రోచి - రోచిస్సు ; చక్షువు - చక్షుస్సు॥ మున్నగునవి యిట్టివే.

బహుళగ్రహణము అని యనుటచేత పయస్, వయస్, సరస్ - అను మూడు శబ్దముల తుది సకారమునకును లోపము కలుగదు. లోపము కలుగనియెడల ఉక్కున్ను

ద్విత్వమును కలిగి పయస్సు, వయస్సు, సరస్సు - అనురూపములను పొందును 'అయస్సు' అనునది యొక్క సకారలోపము జరుగని రూపము కనబడుచున్నది. బహుళ మని యనుటచేత, ఈ తరువాత రాబోవు రూపములన్నియు గ్రాహ్యము. లగుచున్నవి.

**91. మహద్వాచకంబు లగు సాంతంబుల కంత లోపంబేని ద్వితీయైకవచనాంత తుల్యత్వంబే నగు. (బా - ౧౧)**

అంగిరుఁడు - అంగిరసుఁడు ; ఉగ్రశ్రవుఁడు - ఉగ్రశ్రవసుఁడు ; ప్రచేతుఁడు - ప్రచేతసుఁడు ; ఊర్ధ్వరేతుఁడు - ఊర్ధ్వరేతసుఁడు.

వ్యాఖ్య - సకారాంతపదములు మహద్బోధకములైనపుడు తుది సకారమునకు లోపము కాని, ద్వితీయైకవచనాంత తుల్యత్వముకాని కలిగి ప్రాతిపదికము ఏర్పడును.

'అంగిరస్' అను శబ్దము పుంలింగము ; మహద్వాచకము. అంతలోపము కలుగగా 'అంగిర' అని యగును. ఉత్వదుజ్జులు కలుగగా 'అంగిరుఁడు' అని యగును. పక్షాంతరమున ద్వితీయైకవచనాంతతుల్యము నామము కావచ్చును. 'అంగిరసమ్' అనునది ద్వితీయావిభక్తి యేకవచనరూపము. దీని అంతిమ మకారమునకు లోపము రాగా 'అంగిరస' అని యగును. దీనికి ఉత్వదుజ్జులు కలుగగా 'అంగిరసుఁడు' అను రూపమేర్పడును. ఉగ్రశ్రవుఁడు - ఉగ్రశ్రవసుఁడు; ప్రచేతుఁడు, ప్రచేతసుఁడు॥ అనునవికూడ ఇట్టివే. ఇవి యన్నియు మనుజసంజ్ఞలే.

'ఊర్ధ్వరేతస్' అను శబ్దమునందు సకారము లోపించి, 'ఊర్ధ్వరేత' అని యగును. ఇది పుంలింగమును మహద్వాచకము నగుటచేత ఉత్వదుజ్జులు కలిగి 'ఊర్ధ్వరేతుఁడు' అని యగును. పక్షాంతరమున ద్వితీయైకవచనాంతమైన 'ఊర్ధ్వరేతసమ్' అను దాని అంతిమ మకారమునకు లోపము వచ్చి, ఆ పిమ్మట ఉత్వదుజ్జులు చేరగా 'ఊర్ధ్వరేతసుఁడు' అని యగును.

**92. వేధ పురోధ పురోధసుఁడు. (బా - ౧౨)**

వేధశ్శబ్దమునకు నిత్యంబుగాఁ బురోధశ్శబ్దమునకు వైకల్పికముగా సలోప స్త్రీవద్భావంబులు దీనిచే నిపతింపంబడియె.

వ్యాఖ్య - వేధ యనియు, పురోధ యనియు, పురోధసుఁడు అనియు ప్రథమైకవచనాంత తుల్యరూపములను యథాతథముగా గ్రహింపవలయునని సూత్ర తాత్పర్యము.

'వేధస్' అను శబ్దమునకు సకారలోపముచేసి, అపిమ్మట ప్రథమైకవచనమును లోపింపజేయవలయును. అప్పుడుకాని 'వేధ' యను రూపము సిద్ధింపదు. ఇంతకును 'వేధ' యనగా 'చతుర్ముఖుఁడు' అనియర్థమగుటచే మహద్వాచకమగును. పుంలింగము మహద్వాచకమునైన 'వేధ'యను దానికి ఉత్వదుజ్ఞులు వచ్చునుగాన వారించుటకై క్లీత్వమును విధింపవలయును. ఒక్కరూపమును సిద్ధింపజేయుటకై యింతటిప్రక్రియను చూపుట వృథాప్రయాసమని తలచి సూరి 'వేధస్' అను శబ్దమునకు 'వేధ' అనుదానిని ప్రథమైకవచనాంతతుల్యముగా నిపతించుచున్నాడు. దీనికి మరొకరూపము లేదు.

పురోహితుఁడు అను నర్థము గల 'పురోధస్' అను శబ్దము 'పురోధ' యని యొకరూపముతోను, 'పురోధసుఁడు' అని యొకరూపముతోను తెలుగున వ్యవహరింపబడును. సిద్ధరూపములనే చూపుటచేత ఇంక ప్రక్రియాప్రదర్శన మావశ్యకము కాదు. అయినను, ఇట్లు నిపతించుటవలన ఎంత శ్రమతొలగెనో వివరణమునందు చెప్పెను. 'పురోధస్' అనుదానికి వైకల్పికముగా సలోపము జరిగి క్లీవద్భావము కలిగెను. 'పురోధ' యను రూపము సిద్ధించినది. వైకల్పికమనుటచేత ద్వితీయాంత తుల్యమగు 'పురోధసమ్' అనుదాని 'మ' కారము లోపించి ఉత్వదుజ్ఞులు కలిగిన రూపము 'పురోధసుఁడు'. అయినను, ఇంత శ్రమ లేకుండుటకై పురోధ - పురోధసుఁడు॥ అని నిపతించుట యోగ్యమై యున్నది.

93. మనః ప్రభృతుల సకారంబునకు ద్విత్వంబు విభాషనగు.

(బా - రా॥)

మనసు - మనస్సు; శిరసు - శిరస్సు; సదసు - సదస్సు॥ సలోపంబయ్యేనేని మనము - శిరము - సదము,

వ్యాఖ్య - 'మనస్' మున్నగు సకారాంతముల తుది సకారమునకు ద్విత్వము విభాషగా నగునని యర్థము.

"ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు" అను సూత్రమునకు ఇది మరొక సవరణము. ఇంతకు ముందు "దీర్ఘంబు మీఁది హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు" అను సవరణము జరిగినది.

'మనస్' అను శబ్దమునకు ఉత్వద్విత్వములు కలుగగా 'మనస్సు' అని యగును. ప్రస్తుత సూత్రమువలన ద్విత్వము వికల్పముగా నగును. కావున ద్విత్వము

కలుగని పక్షమున ఉత్వము మాత్రమే వచ్చి 'మనసు' అని యగును. "సాంతంబుల తుదిసకారంబునకు" అని మొదలయిన సూత్రముచేత సకారమునకు లోపము (సలోపము) కలిగినయెడల 'ము' వర్ణకము వచ్చి 'మనము' అని యగును.

ఇట్లే 'శిరస్' అను శబ్దము శిరస్సు - శిరసు - శిరము అను మూడు రూపములను పొందును. 'సదస్' అను శబ్దము సదస్సు - సదసు - సదము అను మూడు రూపములను పొందును.

ఈ వరకు చెప్పుకొన్న 'వయస్' మున్నగు వానికి కూడ ద్విత్వము వైకల్పికము కాగా వయసు — వయస్సు, సరసు — సరస్సు అను విధముగా రూపములుండును.

**94.** ద్యుహృచ్ఛబ్దంబులకు దివి హృది యగు. (బా - ౨౪)

దివి - దివులు; హృది - హృదులు.

వ్యాఖ్య — 'దివ్' అను శబ్దమునకు ప్రథమైకవచనాంత తుల్యమగు తత్సమరూపముగా 'దివి' అని యగును. అట్లే 'హృద్' అను శబ్దమునకు 'హృది' అని యగును. ప్రక్రియా భారమగు నని సిద్ధరూపములనే వ్యాకర్త వివరించుచున్నాడు.

ఇతరవిభక్తులు పరమగునపుడు దివులు — దివిని — దివికి, హృదులు — హృదిని — హృదికి మున్నగువిధముగా రూపములుండును.

**95.** స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీప్రత్యయంబులం గూడి యుండుం బ్రవర్తిల్లు. (బా - ౨౫)

| నామము | స్త్రీ ప్రత్యయాంతము | తత్సమరూపము |
|---|---|---|
| కర్తృ | కర్త్రీ | కర్త్రి |
| జనయితృ | జనయిత్రీ | జనయిత్రి |
| భాగ్యశాలిన్ | భాగ్యశాలినీ | భాగ్యశాలిని |
| మతిమత్ | మతిమతీ | మతిమతి |
| గుణవత్ | గుణవతీ | గుణవతి |
| విద్వస్ | విదుషీ | విదుషి |

| నామము | స్త్రీ ప్రత్యయాంతము | తత్సమరూపము |
|---|---|---|
| వనజ ముఖ | వనజముఖీ | వనజముఖి |
| | వనజముఖా | వనజముఖ |
| మీనస్నేత్ర | మీనస్నేత్రా | మీనస్నేత్ర |

అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు జీప్రత్యయంబు లేమిం జేసి మీనస్నేత్రి, పద్మస్నేత్రి - ఇత్యాదు లసాధువులు.

వ్యాఖ్య - సంస్కృతమున విధింపబడు స్త్రీ ప్రత్యయములతో కూడియే స్త్రీలింగశబ్దములు తెలుగున తత్సమనామములుగా వ్యవహరించును.

'కర్తృ' మున్నగు ఋదంతములకు 'భాగ్యశాలిన్' మున్నగు నకారాంతములకు 'జీప్' వచ్చును. కర్త్రీ, జనయిత్రీ, భాగ్యశాలినీ - అనునవి జీప్రత్యయము కలుగగా ఏర్పడిన రూపములు. ఇవి తెనుగునందు "నామంబుల తుది దీర్ఘమునకు హ్రస్వంబగు" అను నియమము ప్రకారము హ్రస్వము కలిగి కర్త్రి, జనయిత్రి, భాగ్యశాలిని - అని యయినవి. ఇవి స్త్రీలింగమగుటచే సులోపము కలుగును.

మతిమత్, గుణవత్, విద్వస్ - అను వానికి కూడ జీ ప్రత్యయము కలుగగా మతిమతీ, గుణవతీ, విదుషీ - అను రూపము లేర్పడును. అవియే తెనుగున ప్రాతిపదిక లగును. తుదిదీర్ఘమునకు హ్రస్వము వచ్చి మతిమతి, గుణవతి, విదుషి - అని యగును. స్త్రీలింగములగుటచే సులోపము కలుగును.

శతృర్ ప్రత్యయాంతములకును జీప్ కలుగుటచేత స్రవన్తీ, దీవ్యన్తీ, గచ్ఛన్తీ - మున్నగు స్త్రీలింగరూపములు కలుగును. వానికివి హ్రస్వము కలిగి స్రవంతి, దీవ్యంతి, గచ్ఛంతి మున్నగు తత్సమరూపము లేర్పడును.

'వనజముఖ' అని మున్నగుచోట ఉపసర్జనత్వమునొందిన స్వాంగశబ్దమునకు జీష్ ప్రత్యయము వికల్పముగా రాగా 'వనజముఖీ' అని యగును. రానియెడల 'వనజముఖా' అని యగును. 'మీననేత్రా' అని సంస్కృత స్త్రీప్రత్యయాంతము. మీనములవంటి కన్నులు గల స్త్రీయని యర్థము. ఇది ఉపమానపూర్వపద బహువ్రీహి సమాసము. హ్రస్వములు కలుగగా వనజముఖి, వనజముఖ, మీననేత్ర - అని యగును.

'మీననేత్ర' అని యన్నపుడు ఉపధ తకారముతో సంయోగము నొందిన రకారము. కావున ఇది సంయోగోపధము "స్వాఙ్గాచ్చోపసర్జనాదసంయోగోపధాత్"

అను నియమమునుబట్టి సంయోగపధములకు ఙీష్ ప్రత్యయమురాదు. కనుక 'మీన నేత్రీ, పద్మనేత్రీ - మున్నగు అనిష్టరూపములు కలుగరాదు.

అంగాదులు - అఙ్గ, గాత్ర, కణ్ఠ, ముఖ. కేశ, నాసికా, ఉదర, ఓష్ఠ, జఙ్ఘా, దన్త, కర్ణ, శృఙ్గ, పుచ్ఛ॥ అని మొదలుగా గలవి. అంగాదులలో సంయోగోపధములు కూడ కలవు. వానికి ఙీష్ ప్రత్యయము వచ్చును. నేత్రశబ్దము అంగాదులలో చేరక పోవుట వలనను, సంయోగోపధ మగుట వలనను ఈకారము నొందరాదు. కావున ఈకారము నొందిన రూపము లసాధువులని సూరి నిర్ణయము.

స్త్రీలింగరూపములలో ఈకారమును విధించుటకు ఙీప్, ఙీష్, ఙీన్ — అని మూడు ప్రత్యయములను సంస్కృతవ్యాకర్తలు వాడుదురు. ఆ మూడింటిని కలియ గలుపుకొని సూరి ఙీప్రత్యయమని వాడెను.

96. మహతీతరంబు లగు స్త్రీలింగంబుల విశేషణంబులకు౯ గ్లీబత్వంబు విభాష నగు (బా - ౨౫)

పద్మలత మనోహారి - పద్మలత మనోహారిణి; హృద్యంబగు విద్య - హృద్యయగు విద్య; మొదవులలో౯ గపిల పరిష్ఠంబు - కపిల పరిష్ఠ.

వ్యాఖ్య — మహతీవాచకములు కానటువంటి స్త్రీ లింగములయొక్క విశేషణ ములకు విభాషగా నపుంసకత్వము కలుగునని సూత్రార్థము. నపుంసకత్వము కలు గుట యనగా ముఃవర్ణకము నొందుట యని భావము.

"విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగ విభక్తి వచనంబులగు" అను (బాల — కారక — 19) సూత్రమునుబట్టి 'పద్మలత' యను స్త్రీలింగశబ్దమునకు విశే షణమైన 'మనోహారి' శబ్దముకూడ స్త్రీలింగమై 'మనోహారిణి' అని యగును. 'పద్మలత' స్త్రీలింగమే కాని స్త్రీవాచకము కాదు. అచేతన మగుటచే అమహద్వాచకము. కావున దీని విశేషణము ప్రస్తుత సూత్రముచేత నపుంసకతుల్యముగా వర్తింప వచ్చును. అప్పుడు 'మనోహారి' అని యుండును.

'విద్య' యనునది స్త్రీలింగము. కావున దీని విశేషణము స్త్రీలింగమే కావల యును. 'హృద్య యగు విద్య' అని యున్నప్పుడు 'హృద్య' యన్నది స్త్రీలింగ

విశేషణము. 'విద్య' యన్నది స్త్రీవాచకము కాకపోవుటచేత ప్రస్తుతసూత్రమునుబట్టి దీని విశేషణము క్లీబతుల్యము కాగా 'హృద్యమగు విద్య' అని యగును.

"మొదవులలోఁ గపిల వరిష్ఠ" అన్నచోట 'కపిల' యన్నది ఆవునకు పేరు. స్త్రీలింగశబ్దము. కావున దీని విశేషణముకూడ స్త్రీలింగతుల్యముకాగా 'వరిష్ఠ' అని యగును. కపిల యనునది గోవును సూచించును గావున అమహద్వాచకము. అందువలన ప్రస్తుతసూత్రముచేత విశేషణమునకు క్లీబత్వము కలిగిన 'కపిల వరిష్ఠంబు' అని యగును.

**97. భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు.** (బా - ౩౬)

భవదాదులగు హలంత సర్వనామములకును, శతృ రేఫాంతాదులకును దెలుఁగుభాషయందు వ్యవహారంబు లేదని యర్థము, సమాసంబులం దొలుతం గదిసి యుండుఁ బ్రయుక్తంబు లగు. భవద్గుణంబులు - త్వదాశ్రయము - మత్పుణ్యము; లసద్రూపము - భవిష్యత్కాలము - ధూర్వహము॥ ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య – భవత్ + శతృ + ఆదులు = భవచ్ఛత్రాదులు = భవత్, త్వత్, యుష్మత్, మత్, అస్మత్, తత్, ఏతత్ — మున్నగునవి భవదాదులు. లసత్, భవిష్యత్ — మున్నగునవి శత్రాదులు; ధూర్, గీర్, కోర్ — మున్నగునవి రేఫాంతములు. ఈ భవదాదులకు, శత్రాదులకు, రేఫాంతములకు తెలుగునందు ప్రయోగము లేదని సూత్రార్థము. సమాసములందు పూర్వశబ్దములుగా ప్రయోగింపబడుట కాక్షేపము లేదు.

భవత్ + గుణములు = భవద్గుణములు అని సమాసమునందు పూర్వశబ్దముగా నుపయోగింపబడవచ్చును. త్వదాశ్రయము – లసద్రూపము - ధూర్వహము॥ మున్నగునవి యిట్టివే.

[సంస్కృత విభక్త్యంతములును, సంస్కృత పురుషప్రత్యయాంతములును తెలుగున నుపయుక్తములు కారాదు ద్వారా - విశిష్య - విస్తరేణ - మున్నగునవి. శత్రంతములైనను స్రవన్తి, దీవ్యన్తి. గమమాన - వలమాన॥ మున్నగు అజంతములు ప్రయోగింపబడును. ఇట్టివానిని ప్రయోగములనుబట్టి గ్రహింపవలయును.]

# అచ్చిక పరిచ్ఛేదము

1 సంస్కృతసమేతరం బయిన యీ భాష యచ్చ యనంబడు.
స్పష్టము. (బా - ౧)

వ్యాఖ్య — సంస్కృతసమము కానటువంటి దానివి అచ్చికభాష యని యందు రని సూత్రార్థము.

సంస్కృతప్రాకృతతుల్యం బగు భాష తత్సమం బని సంజ్ఞా పరిచ్ఛేదమునందు తెలిసికొంటిమి. క్రిందటి పరిచ్ఛేదమున సంస్కృతసమములయొక్క రూపనిష్పాదన ప్రక్రియ తెలిసికొంటిమి. ఇంక ప్రాకృతసమములు, సంస్కృతభవములు, ప్రాకృత భవములు, దేశ్యములనైన శబ్దముల రూపనిష్పత్తిని గూర్చి తెలిసికొనవలయును. వానిని అచ్చికములని యందురు. ఈపరిచ్ఛేదమునందు వ్యాకర్త అట్టి అచ్చికపదము లనుగూర్చి చెప్పుచున్నాడు. అచ్చికమునకు తెనుగు, అచ్చతెనుగు, వికృతి—అనికూడ వాడుక కలదు.

2. అచ్చికశబ్దంబులెల్లం దఱుచుగ స్త్రీ సమంబులుం గ్లీవమంబులు నయియుండు. (బా - ౨)

స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపాదికంబును, గ్లీబ సమత్వాతిదేశంబుచే మువర్ణకంబు నగునని యెఱుంగునది. అన్న - మిన్న - అద్ద - గద్ద - జాణ - గాణ - ఓడ - గోడ॥ ఇత్యాదులు స్త్రీసమంబులు. బియ్యము - నెయ్యము - అల్లము - మొల్లము - సున్నము - సన్నము॥ ఇత్యాదులు క్లీబసమంబులు. తఱుచుగ నను టచేఁ బుంలింగతుల్యంబులుం గొండొక కలవని తాత్పర్యము. కొమ రుఁడు - చంగురుఁడు - జముఁడు - కందుఁడు॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - అచ్చికశబ్దములు సాధారణముగా స్త్రీసమములుగా కాని, నపుంసక సమములుగా కాని యుండునని యర్థము. స్త్రీసమములనగా ప్రథమైకవచనలోపము నొందిన శబ్దములని యర్థము. అన్న, మిన్న - మున్నగునవి స్త్రీసమశబ్దములు. "స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" అను సూత్రమువ లన్నసంస్క-

తమునందు స్త్రీలింగములయిన శబ్దములకు తెలుగునందు ప్రథమైకవచనలోపము కలుగును. దానివలనఁ బ్రథమైకవచనలోపము కలిగిన శబ్దముల నన్నింటిని స్త్రీలింగసమములుగా వ్యవహరింతురు.

సంస్కృతమునందలి అదంతనపుంసకములకు తత్సమ రూపమునందు మువర్ణకము కలుగును. కావున తెలుగునందు మువర్ణకాంతము లైయున్న శబ్దములను నపుంసకసమము లని వ్యవహరింతురు. బియ్యము, నెయ్యము - మున్నగునవి నపుంసకసమములు. వీనిని క్లీబసమము లనియు ననవచ్చును.

సంస్కృతమునందలి పుంలింగశబ్దములు తెలుగునందు మహద్వాచకము లైనపుడు డు వర్ణకమును పొందును. కావున తెలుగున డు వర్ణక మంతమందుగల శబ్దములు పుంలింగతుల్యము లైనవి. తెలుగునందు స్త్రీసమములు, నపుంసకములు అధికముగా కలవు. పుంలింగములతో తుల్యములయిన శబ్దములు అల్పసంఖ్యలో కలవు: కొమరుఁడు, చందురుఁడు - మున్నగునవి యుదాహరణములు.

[ చిన్నయసూరి 'సమము' అను శబ్దమును చేర్చి పలుకునపుడు సంజ్ఞగా స్వీకరింపవలయును. ఈవిషయ మీవరకే వచ్చినది. స్త్రీసమము, నపుంసకసమము అనునవి సంజ్ఞలు వీనిని అచ్చికశబ్దముల విషయముననే వాడవలయును. అచ్చిక శబ్దములు దాదాపుగా నిపాతముల వంటివి. అనగా, ప్రథమైకవచనాంతతుల్యములైయుండు నని యర్థము. ఒడ, గోడ - మున్నగువానిపై సుప్రత్యయమును చేర్చుట, లోపింపజేయుట యను ప్రక్రియ యవసరము లేదు. "స్త్రీసమము" అని చెప్పుటచేతనే ప్రథమైకవచనలోపము గలిగినవానినిగానే యథాస్థితముగా స్వీకరింపవలయును క్లీబసమములు అన్నప్పుడుకూడ బియ్యము, నెయ్యము - అన్నట్లు యథాస్థితమైన శబ్దమునే స్వీకరింపవలయును. ప్రకృతి యనియు, దానిపైని ప్రత్యయము చేరుటయనియు - వీని విషయమున నుండవు. కావుననే సూరి శబ్దముల రూపమును యథాస్థితముగా చూపెను. కాని ప్రక్రియను చూపలేదు. 'స్త్రీతుల్యము' అని సంస్కృతశబ్దముల విషయమున వాడెను. అక్కడ ప్రకృతిప్రత్యయముల విభాగము కలదు; ప్రథమైకవచనము వచ్చుటయు లోపించుటయు కలదు. పిత, యోధ - మున్నగునవి యుదాహరణములు. 'పుంలింగతుల్యము' అనగా పుంలింగముతో సమానమని యర్థము. ఇది సంజ్ఞ కాదు. కావున తత్సమములకు అచ్చికములకుకూడ ఉపయోగింప బడినది. డుజ్వర్ణకము కలుగు ప్రక్రియకూడ చూపబడినది. ]

"అన్యధర్మస్యాన్యత్రారోపణ"మ్మని 'అతిదేశము' అను పదమునకు నిర్వచనము. ఒకదానియొక్క లక్షణమును మరియొకదానికి ఆరోపించిన అతిదేశ మని

యందురు. స్త్రీలింగములకు కలుగు ప్రథమైకవచనలోపమును నపుంసకములకు మువర్ణకమును అచ్చికశబ్దములకు కలుగుచున్నట్లు ఆరోపించుటచే ఇది అతిదేశము అనిపించుకొనుచున్నది.

3. బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు. (బా - ౩)

మహత్త్వంబున వీని కుత్వడుజాదులు నమహత్త్వంబున మువర్ణకాదులును స్త్రీత్వంబునం దాలుశబ్దముతోడ సమాసంబునుం గలుగునని యెఱుంగునది. బల్లిదుఁడు - బల్లిదము - బల్లిదురాలు॥ బల్లిద - అక్కజ - కావల - బెట్టిద - బెడిద - మిసిమింత - మొక్కల॥ ఇత్యాదులు బల్లిదాదులు.

వ్యాఖ్య — విభక్తిని వివక్షించునపుడు 'బల్లిద' మున్నగు తెనుగు ప్రాతిపదికలను సంస్కృతప్రాతిపదికలతో సమానముగా గ్రహించి ప్రక్రియను జరిగింపవలయునని తాత్పర్యము.

'రామ' మున్నగు సంస్కృత ప్రాతిపదికలకు ఉత్వడుజ్జులు కలుగును. "పుంలింగంబయి మహద్వాచకం బయిన నామంబు తుదియత్వంబున కుత్వంబగు" అనుసూత్రముచేత ఉత్వము కలిగి 'రాము' అని యగును. "పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్జగు" అను విధిచేత డు వర్ణకము కలిగి 'రాముఁడు' అని యగును. అట్లే బల్లిదాదులు సంస్కృతతుల్యములుగా పరిగణింపబడుటవలన 'బల్లిదుఁడు' మున్నగు విధముగా ఉత్వడుజ్జులతోడి రూపములను పొందును.

'మహత్త్వంబున' అని యనగా మహత్తులను బోధించునప్పు డని యర్థము. 'స్త్రీతిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులు నాఁబడు" నని ప్రవచనము. స్త్రీలను, తిర్యక్కులనగా పశుపక్ష్యాదులను, జడము లనగా అప్రాణివాచకములను తప్పించి మిగిలినవానిని మహత్తులుగా పరిగణింతురు. దీనినే మరొకవిధముగా వివరింతును. లోకమునందలి జంగమ స్థావరముల నన్నింటిని రెండు వాచకములుగా విభాగింతురు. దేవమనుష్యరాక్షసాదులకు చెందిన పురుషులను బోధించు శబ్దములు మహద్వాచకములు, మిగిలినవి అమహద్వాచకములు. అమహద్వాచకములలో స్త్రీలను బోధించు శబ్దములను మహతీవాచకము లని యందురు. కాబట్టి స్థూలముగా పైని చెప్పినట్లు దేవమనుష్య రాక్షసాదులకు చెందిన పురుషవ్యక్తులను బోధిం

చునవి మహద్వాచకములనియు, స్త్రీలను బోధించునవి మహతీవాచకము లనియు, పశుపక్ష్యాదులను ప్రాణము లేని పదార్థములను బోధించునావిని, అమహద్వాచకము లనియు నిర్ణయము చేయవచ్చును.

కావున మహత్త్వమునందు ఉత్వడుజ్జులు కలిగి బల్లిదుఁడు, అక్కజుఁడు, కావలుఁడు, బెట్టిదుఁడు - మున్నగు రూపములు కలుగును.

'అమహత్త్వంబున' అని యనగా అమహత్తులను బోధించునప్పుడని యర్థము. 'వృష' మున్నగు సంస్కృత నామములకు తెలుగున "అమహన్నపుంసకముల కదంతములకు ము వర్ణకంబగు" నను సూత్రవిధివిబట్టి 'ము' అను ప్రత్యయము కలిగి 'వృషము' అను రూపము సిద్ధించును. సంస్కృతతుల్యత్వముచేత 'బల్లిద' మున్నగు తెలుగు నామములకును అమహత్త్వము నందు ము వర్ణకము కలిగి బల్లిదము, అక్కజము, కావలము, బెట్టిదము — మున్నగురూపము లేర్పడును

'స్త్రీత్వంబునందు' అని యనగా మహతి వాచకమైనప్పుడని యర్థము. స్త్రీని గూర్చి చెప్పునప్పుడు 'బల్లిద' మున్నగు నామములకు పైని ఆలు శబ్దమును చేర్చి సమాసమును చేయవలయును. బల్లిద + ఆలు — అని యుండును. ప్రస్తుతసూత్రము చేత సంస్కృతతుల్యత్వము నొందిన కారణముగా "తత్సమంబుల కాలు శబ్దము పరమగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు" నను విధి ననుసరింప వలయును. బల్లిదు + రు + ఆలు = బల్లిదురాలు. ఇట్లే అక్కజురాలు, కావలురాలు, బెట్టిదురాలు — మున్నగు మహతీవాచకరూపము లేర్పడును.

ఇట్లు మూడువాచకములందును రూపములను గలిగి యుండుటబట్టియే బల్లిదాదులు సంస్కృతతుల్యములుగా పరిగణింపబడినవి.

[ వ్యాకరణమునందు తత్సమములలో సంస్కృతసమము లని యొక విభాగము కలదు. సంస్కృతసమము లనగా సంస్కృతమునుండి అంగికమైన మార్పు నొందక వచ్చిన రూపములని యర్థము. 'సంస్కృతసమములు' అను మాట సంజ్ఞగా వాడబడును. సంస్కృత తుల్యములు అన్నది సంస్కృతములను పోలి యుండునని మాత్రమే యర్థము. ఇది సంజ్ఞకాదు. తెలుగు శబ్దములకు మాత్రమే వాడబడును. సంబోధనమునందు వీనిమీది డు వర్ణకము లోపింపక బల్లిదుఁడ, బల్లిదుఁడా - మున్నగు విధముగా రూపము లుండును. ]

౪. మహత్తులగు మగాదులకుం గయిరాదులకును డుజ్ఞగు నుత్వంబు గాదు. (బా - ౪)

మగఁడు-మనుమఁడు - కయిరఁడు - కత్తళఁడు॥ మగ - మనుమ- రాయ - పాప - ప్రే - తే - ఈ, కా ప్రత్యయాంతంబులు॥ ఇత్యాదులు మగాదులు. కయిర - కత్తళ - జన్న - నీల॥ ఇత్యాదులు కయిరాదులు.

వ్యాఖ్య - మహద్వాచకములయిన 'మగ' మున్నగు వానికిని, అమహత్తులయిన 'కయిర' మున్నగువానికిని డుజ్వర్ణకము మాత్రమే యగును : తుది అత్వమునకు ఉత్వము కాదని సూత్రార్థము. మగఁడు, మనుమఁడు, రాయఁడు, పాపఁడు, ప్రేఁడు, తేఁడు - మున్నగువిధముగా రూపము లుండును.

బాలవ్యాకరణ తద్ధితపరిచ్ఛేదమునందలి పదునైదవ సూత్రము 'అటమట' మున్నగు శబ్దములకు మతుబర్థమునందు 'ఈ' అను ప్రత్యయమును పుంస్త్వమున విధించుచున్నది. 'అటమట + ఈ' అని యుండి ప్రస్తుతసూత్రముచేత డు వర్ణకము నొంది 'అటమటీఁడు' అని యగును. అట్లే బానసీఁడు, కపటీఁడు మున్నగు శబ్దము లేర్పడును.

'ఆట' మున్నగువానికి మతుబర్థమున పుంస్త్వమునందు 'కా' అను ప్రత్యయము విధింపబడుచున్నది (బాల - తద్ధిత - 11). అప్పుడు 'ఆట' + కా అని యుండి ప్రస్తుతసూత్రము చేత డు వర్ణకమునొంది 'ఆటకాఁడు' అని యగును. అట్లే విలుకాఁడు, మొనగాఁడు - మున్నగుశబ్దము లేర్పడును. ఇంతవరకు చెప్పినవి మగాదులు - మహద్వాచకములు.

ఈ సూత్రమున రెండవభాగము 'కయిర' మున్నగువానికి సంబంధించినది. కయిరాదులు జంతువులపేళ్లు. కావున అమహద్వాచకములు. వీనికివి ప్రస్తుతసూత్రముచేత డు వర్ణకము విధింపబడినది. కయిరఁడు, కత్తళఁడు, జన్నఁడు, నీలఁడు మున్నగువిధముగా సిద్ధరూపము లుండును.

[ అమహద్వాచకములందును కాప్రత్యయాంతములు కొన్నిగలవు. వానికిని డుజ్వర్ణకము వచ్చినపుడు గిజిగాఁడు, ఇబ్బందిగాఁడు - మున్నగువిధముగా రూపము లేర్పడును ]

5. తెనుఁగునం గొన్ని తత్సమదేశ్యశబ్దములకుం బరంబుగ నేకవచనంబున నీచత్వద్యోతకంబయి యిగా యను నొక్కశబ్దంబుమ, దానిపై డువర్ణకాదులునుం జూపట్టెడి ; సంబోధనంబున డు వర్ణకంబు చూపట్టదు. తుది దీర్ఘంబునకు హ్రస్వంబు వైకల్పికంబు. (ప్రౌ - ౨౨)

బాలిగాఁడు - చిట్టిగాఁడు ; బాలిగా - బాలిగ - చిట్టిగా - చిట్టిగ; బాలిగానిన్ - బాలిగానిచేతన్॥ అని తక్కిన విభక్తులూహ్యంబులు; ఇట్లు గోపాలిగాఁడు మొ.

వ్యాఖ్య - తెనుగుభాషయందు ఏకత్వబోధకములయిన కొన్ని తత్సమశబ్దముల మీదను, దేశ్యశబ్దములమీదను నీచత్వమును స్ఫురింపజేయుచు 'ఇగా' యను శబ్దము కలుగును. దానిపై డువర్ణాదులు చేరును. సంబోధనమునందు డువర్ణకము లోపించును. అప్పుడు తుదిదీర్ఘమునకు హ్రస్వము వైకల్పికముగా నగును - ఇది సూత్రార్థము.

'బాల' అనునది తత్సమశబ్దము. ఇది మహద్వాచకమును, ఏకత్వబోధకమును, నీచత్వద్యోతకమునై నపుడు 'ఇగా' అనునది వచ్చి చేరును. తరువాత ప్రథమైకవచనమగు 'డుజ్' వర్ణము చేరగా 'బాల + ఇగా + డుజ్ = బాలిగాఁడు' అని యగును. సంబోధనమునందు డుజ్వర్ణకమునకు లోపము కలుగగా 'బాలిగా' అని యగును. వైకల్పికముగా దీర్ఘమునకు హ్రస్వము ఆదేశము కాగా 'బాలిగ' అనియు నగును. ఇతర విభక్తులు కలుగునపుడు 'ని' గాగమము కలిగి బాలిగానిని, బాలిగానిచేతను మున్నగు విధముగా రూపములుండును.

'చిట్టి' యను దేశ్యశబ్దముపై నిగూడ 'ఇగా' అనునది రాగా 'చిట్టిగా' అను నదియై డుజ్వర్ణకము కలిగి 'చిట్టిగాఁడు' అని యగును. సంబోధనమునందు 'డు' వర్ణకము లోపించి 'చిట్టిగా' అనియు, తుదిదీర్ఘమునకు హ్రస్వము కలిగి 'చిట్టిగ' అనియు కావచ్చును. ద్వితీయాదివిభక్తులు పరమైనప్పుడు చిట్టిగానిని, చిట్టిగానిచేతను-మున్నగు విధముగా నిగాగమముతోడి రూపము లుండును.

'చూపట్టెడి' అని యనుటచే ఉన్నప్రయోగమును అంగీకరించుటయే కాని, యిట్లే చేయవలయు ననెడి విధిలేదు. కావున బాల, గోపాల - మున్నగుతత్సమ

నామములపై ఉత్వదుజ్జులు చేరి బాలుఁడు, గోపాలుఁడు - మున్నగువిధముగా నగుటకు గాని బాల, బాలా, బాలుఁర, బాలుఁరా - మున్నగువిధముగా సంబోధనాంత రూపములను పొందుటకుగాని బాలునిన్, బాలునిచేతన్ - మున్నగువిధముగా ద్వితీయాదివిభక్తులను పొందుటకుగాని యాక్షేపము లేదు. ప్రస్తుత ప్రౌఢవ్యాకరణ సూత్రము కొలదిచోట్లనున్న ప్రయోగములను ప్రదర్శించుటయే ప్రయోజనముగా వ్యవహరించుచున్నది. ఇట్టి రూపములును భాషయందుండుటచే ప్రస్తుతసూత్రము బాలవ్యాకరణమును పూరణము చేయుచున్నది.

సూత్రమునందు 'ఇగా' అనునది శబ్దముగా వ్యవహృతమైనది . శబ్దము అని యనగా పదము అని యర్థముకానిమాట వాస్తవమే; 'అపదము' అను అర్థముకూడ దానికి లేదు. కావున 'బాల + ఇగా' అను స్థలమునందు సంధికావలసిన యవసరములేదు. పైగా తత్సమములకు సంధి నిషిద్ధము. కావున, ఇట్టియెడల సంధి జరుగవలయుననిన, మీఁది 'ఇగా' యనుదానిని ప్రత్యయముగా గాని ఆగమముగా గాని విధించిన బాగుగా నుండెడిది. అప్పుడు అపదాదిస్వరము పరమైనపుడు సంధియై 'బాలిగా' మున్నగువిధముగా నగును.

ఇంకొకవిషయము. సూత్రమున 'ఏకవచనంబున' అనియున్నది. ఏకవచనము అని యనగా ఏకత్వ బోధక మగు ప్రత్యయ మని యర్థము. బహువచనము అని యనగా బహుత్వ బోధకమైన ప్రత్యయ మని యర్థము. ప్రస్తుత సందర్భమున వ్యాకర్త 'ఏకత్వమున' అని యనవలసి యున్నది. కావున 'ఇగా' యనునది శబ్దమనుటయు, 'ఏకత్వము' అను నర్థమున 'ఏకవచనము' అని వాడుటయు సూత్రరచనములో వెసులుబాటును పట్టి యిచ్చుచున్నవి.

నీచత్వముననే కాక మైత్రీవాత్సల్యాదులయందును 'ఇగా' అని కలుగవచ్చును. కావున 'నీచత్వము' అనుదానిని తక్కినవానికి ఉపలక్షకముగా గ్రహింపవలయును.

[ కొన్నియెడల నీచత్వాది ద్యోతకమై 'గా' యని మాత్రమే వచ్చుటయు కలదు. కృష్ణగాఁడు - బాబుగాఁడు - శర్మగాఁడు - వెంకన్నగాఁడు మున్నగునవి యుదాహరణములు. మతుబర్థమునందలి 'కా' ప్రత్యయమునకు ముందును కొన్నియెడల ఇగాగమము కలుగుచున్నది. పాలు + కా + డు = పాలిగాఁడు. ]

**6. దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచక స్త్రీనమంబులగు సంబోధ్య వాచక శబ్దంబులమీఁద నేకవచనంబునఁ గానశబ్దం బొందును.**

అల యను నవ్యయం బొందును గానంబడియెడి. అల దీర్ఘాంతంబు నగు. (ప్రౌ - ౧౩)

భవ్యపతిదేవతాచార పరమపుణ్య! ధర్మమేమఱకుండుమీ తల్లికాన॥ నై. ౮ ఆ॥ మా సామికాన॥ సా. ౧ ఆ॥ (ఈ కవి 'పాపజాతి కాన' అని ప్రయోగించినాఁడు; అది విచార్యము) అక్కల కన్యకాత్వమిటు లాఱడి వోవ నకారణంబ నీ కెక్కడి చూలు వచ్చె॥ నిర్వ. ౨ ఆ॥ కోడఁబడ నమ్మలక్కలని తూలుచు దీనత దోయి లొగ్గుచున్॥ ఆము. ౨ఆ॥ వ్రేలెడు వెంప్రుక లిరుగడ! దూలఁగఁ దలయూచుఁ దొప్పుదొప్పున నోరిం! గేల నడచికొను సెలవుల! లాలలు దొరఁగంగ నన్నలాయని యొరలున్॥ ఉ. హరి. ౪ఆ॥

వ్యాఖ్య - దేశ్యములయందు స్త్రీవాచకములుగాని, స్త్రీసమములుగాని అయిన సంబోధ్యవాచకశబ్దముల పై 'కాన' అను శబ్దముగాని 'అల' అను నవ్యయముగాని ఏకత్వమునందు కొన్నియెడల చేరుననియు, 'అల' యొక్క తుది అత్వమునకు దీర్ఘము కూడ కలుగవచ్చుననియు సూత్రార్థము.

'తల్లి' అనునది దేశ్యశబ్దము : సంబోధ్యవాచకము : ఏకత్వబోధకము. దీనికి 'కాన' అనునది అదనముగా వచ్చి చేరగా 'తల్లికాన' అని యైనది.

[ రెండవలక్ష్యమునందున్న 'సామి' యనునది దేశ్యముకాదు 'స్వామి' యనుదానికి వికృతియందగుటావము. వ్యాకర్త సూత్రమందు 'దేశ్యము' అని యన్నను, వికృతినికూడ ఉదాహరించుటవలన తద్భవములనుకూడ నుద్దేశించియే యుండునని యనిపించును. అట్లు కాకున్న 'సామి' యన్నది ఉదాహరణార్హము కాదు. "క్వచిదామన్త్రణే కానో వైకృతాత్పరతో మతః" అన్నది దీనికి మూలము. ఇందు 'వైకృతాత్' అని యుండగా వ్యాకర్త 'దేశ్యంబులన్' అని పొరపాటుగా ననువాదము చేసెను. అయినను వైకృతమును స్వీకరించుటవలన విషయమున పొరపడలేదనుట స్పష్టము. ]

'సామి' అనునది అచ్చికశబ్దము ; స్త్రీసమము : సంబోధ్యవాచకము : ఏకత్వబోధకము. కావున 'కాన' అను శబ్దముచేరి 'సామికాన' అని యైనది.

'పాపజాతి'అన్నది తత్సమము. ప్రస్తుతసూత్రము తత్సమముల కన్వయింపదు. అందువలన సంబోధనమునందు 'కాన' అనునది వచ్చుటకు వీలులేదు. కాని 'పాప

జాతికాన' అని కవి ప్రయోగమొకటియున్నది. అది తనకు సమ్మతముకాదు. అయినను తప్పని యనుట సాహసమగునని యెంచి 'విచార్యము' అని యనుచున్నాడు. సుకుమారముగా ఆ ప్రయోగమును అపప్రయోగమని యనుటయే యిది.

ఇంక రెండవది 'అల' యను నవ్యయము విషయము. ఇదియు ఏకత్వబోధకమైన స్త్రీవాచకముమీదగాని, స్త్రీసమములమీద గాని వచ్చి చేరుననియే ప్రౌఢవ్యాకర్త యభిప్రాయము.

నిర్వచనోత్తర రామాయణమునందలి 'అక్కల' అనునది యేకత్వమున నున్నదనుటకు సందియము లేదు. కాని ముద్రితప్రతులయందు 'అక్కట' అను సంతాపార్థకమైన అవ్యయము తత్స్థానమున కనిపించుచున్నది. సందర్భమునకు సరిగా సరిపోలునదికూడ. అందువలన దీనిని అలాంతములకు బలమైన యుదాహరణముగా గ్రహించుటకు వీలు లేదు.

రెండవ యుదాహరణమునందు 'అమ్మలక్కలని తూలుచు' మున్నగువిధముగా నున్నది. 'అమ్మల + అక్కల + అని' అన్నది వ్యాకర్త చేసికొన్న విభాగము. 'అమ్మ' శబ్దముపైని, 'అక్క' శబ్దముపైని ఏకత్వముననే 'అల' అని చేరగా అశ్లే ధ్వని యుండవలయును. సందర్భమునుబట్టి చూడగా 'అమ్మలు' అని 'అక్కలు' అని బహువచనరూపములే ఉచితతరములై కనిపించును. అక్కడ పెక్కురు 'ప్రపాపాలికలు' కలరు. వారిని చూచి పాంథుడు అమ్మలని, అక్కలని పిలిచెను. దీనిని బట్టి 'అమ్మలు + అక్కలు + అని' - అనునదే సరియైన విభాగమని యనిపించుచున్నది. కావున 'అల' వచ్చుననుటయు, ఏకత్వము గల దనుటయు, ఈలక్ష్యము విషయమున సందర్భపడకున్నవి. అమ్మలు, అక్కలు - అను రెండును ప్రథమా బహువచనాంతరూపములు. వానిపైని అనుకరణమునందు 'అని' అనునది వచ్చి సంధియై 'అమ్మలక్కలని' యయ్యెను.

[ప్రౌఢవ్యాకర్త యభిప్రాయమునే యనుసరించి అమ్మ, అక్క - అను వానిపై 'అల' యను నవ్యయము ఏకత్వమున వచ్చిన దనుకొన్నచో ఒక యిబ్బంది కలుగును. 'అల' అనునది అవ్యయమని యనుటచే పదత్వము నందుచున్నది. స్త్రీవాచకముయొక్క తుది అత్వమునకు సంధి కారాదు. అందువలన 'అమ్మల' మున్నగు రూపము వచ్చుటకే యవకాశములేదు. కావున 'అల' అను దానిని ఆగమముగా పేర్కొనవలయును. అప్పుడయినచో "అంద్వవగాగమంబుల" అని మొదలయిన సూత్రమునుబట్టి అపదాదిసంధి యగును. ఇక్కడ

విది అయిన పిదప మరల నింకొక యిబ్బంది కలదు. అమ్మల + అక్కల-అని యేర్పడిన పిమ్మట మరల సంధియగుటకు అవరోధము కలదు. 'అమ్మల' అను నది సంబోధనాంతము. సంబోధనాంతములకు సంధి లేదు. కావున దీనికి సంధి యగుటకు వ్యాకర్త యేదేని కొత్త నియమమును కలిగించుటయో, ఉన్న నియమ మును తొలగించుటయో చేయవలయును. అంతవరకు తనపద్ధతనిబట్టి యీ రూపము సిద్ధించు నవకాశము లేదు.]

'అన్న' అనునది అచ్చికము; స్త్రీసమము; ఏకత్వబోధకము. దీనికివి 'అల' యనునది పరమై 'అన్నల' యవి కావచ్చును. చివరి అత్వమునకు దీర్ఘము కలిగి 'అన్నలా' యనియు కావచ్చును.

[నిజమునకు పైలక్ష్యములందు 'అల' అనునవి కాక 'ల' యనునదేయున్న దన్నను అసంగతము కాదు. దానికి పూర్వమున్న వన్నియు అమ్మ,అక్క-అన్న-అని అదంతశబ్దములే. వీనికి బహువచనము 'లు' వర్ణకము కలిగి అమ్మలు, అక్కలు, అన్నలు - అని యగును. అవధారణమునందు గాని, ప్రార్థనాద్యర్థము నందుగాని'అ' వర్ణము కలిగినచో అమ్మల, అక్కల, అన్నల - మున్నగువిధముగా కావచ్చును. చివరి అత్వమునకు దీర్ఘము వచ్చి అమ్మలా, అక్కలా, అన్నలా - మున్నగు విధముగను కావచ్చును. చివరి లక్ష్యము ఒక్కటే యిట్లు అలాంత మునదగినది. అది బహుత్వమునందగుచున్నది. "వారలా వీరలా అని వేడు కొంటిని" మున్నగు ప్రయోగములు గలవు. "అన్నలా తమ్ములా అర్థించుచుంటి" అని మున్నగు విధముగా నున్నప్పుడు 'అన్నలో. తమ్ములో - ఎవరైననుసరే! మిమ్ము నర్థించుచుంటిని' అనియే అర్థము. ఇట్టివానిని బట్టి చూచినచో "స్త్రీ వాచక స్త్రీసమంబులకు" అని యనుటయు, "ఏకవచనంబున" అని యనుటయు నిరర్థకము లగుచున్నవి. మొత్తముమీఁద 'అల'కు సంబంధించిన ప్రసంగము అంత సమర్థముగా లేదు.]

7. పగతాదుల బహువచన లకారంబునకు రేఫం బగు (బా - ౩౪)

పగతురు - అల్లురు - నెయ్యురు - మార్తురు - బలియురు,

వ్యాఖ్య - 'పగత' మున్నగు తెనుగుగామములకు బహువచనమును విధించు నప్పుడు లకారమునకు బదులుగా రకార మాదేశముగా నగునని యర్థము.

పగతాదులు బల్లిదాదులలోనివి కావున నేకవచనమునందు ఉత్వదుజ్జులు కలిగి పగతుఁడు - అల్లుఁడు - నెయ్యుఁడు , మార్తుఁడు - బలియుఁడు అని యుండును. 'లువర్ణంబు బహువచనంబు' కావున బహువచనమునందు 'అల్లుఁడు' మున్నగు

వానిలోని దువర్ణకము తొలగి, దాని స్థానమున 'లు' వర్ణకము వచ్చును. అల్లు + లు. ప్రస్తుతసూత్రముచేత లకారమునకు రకారము కలుగగా లు (ల్ + ఉ) స్థానమున రు (ర్ + ఉ) వచ్చును - అల్లురు. ఇట్లే పగతురు, నెయ్యురు - మున్నగురూపములు నేర్పడును. "బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు" అను సూత్రముచేత ద్వితీయాదివిభక్తులు పరమగునప్పుడు నామమునకు 'ల' యను వర్ణము ఆగమముగా నగును. పగతు + ల + ను. ప్రస్తుతసూత్రముచేత ఈ యాగమ లకారమునకును రేఫము కలుగగాపగతు + ర + ను = పగతురను అని యగును. ఇట్లే అల్లురను, అల్లురచేత, నెయ్యుర కొఱకు, బలియురవలన మున్నగువిధముగా రూపము లేర్పడును.

బహువచనలకార మనునప్పుడు ప్రథమాబహువచనమునం దగు లువర్ణకమును, ద్వితీయాదివిభక్తుల కగు లడాగమమును కూడ గ్రహింపవలయును.

**8. కొన్ని డుమంతంబుల బహువచన లకారంబునకు రేఫంబును, దానికి ముందు పూర్ణబిందుపూర్వక డకారంబు నగు. (బా-౬)**

**గండండ్రు - మిండండ్రు॥ ఇత్యాదులు.**

వ్యాఖ్య - 'డుజ్వర్ణకంబునకుం బ్రకృతియైనది డుమంతంబు నాఁబడు'. 'డు' అను ప్రత్యయము చేరుటకు యోగ్యమైన రూపమును డుమంత మని యందురు. ఉ॥ రాము, విష్ణు - మున్నగునవి.

ప్రస్తుతసూత్రమున గండ, మిండ - మున్నగు డుమంతంబులకు బహువచనమునందు వచ్చు లకారమునకు రేఫమై దానికి పూర్వమందు పూర్ణబిందుపూర్వక డకారము (ండ్) అగునని యర్థము.

మగాదిగణములోనివి కావున గండ మున్నగువాని కేకత్వంబున డుజ్జగును; ఉత్వము కాదు. గండఁడు, మిండఁడు - మున్నగునవి ఏకవచనరూపములు. "లువర్ణంబు బహువచనంబు" అని యనుటచేత డు స్థానమున లు వచ్చును. గండ + లు - అని యగును. ప్రస్తుతసూత్రముచేత లకారమునకు రేఫము వచ్చి ముందు పూర్ణబిందుపూర్వక డకారము కాగా గండ + ండ్ + రు = గండండ్రు అని యగును. అట్లే 'మిండండ్రు' అను రూపముకూడ నేర్పడును. ద్వితీయాదివిభక్తులు పరమగునపుడుకూడ ఆగమలకారమునకు రేఫమును, తత్పూర్వమందు పూర్ణబిందు

పూర్వక దకారము నగును. గండంఁడ్రను, మిండంఁడ్రను - మున్నగువిధముగా రూపము లేర్పడును.

9 కాఁప్రత్యయంబుమీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘు రేఫంబులును లఘురేఫంబునకు ముందు బిందుపూర్వక దకారంబు నగు. (కా - ౮)

విలుకాండ్రు - విలుకాఱు; వేఁటకాండ్రు - వేఁటకాఱు; వేడుక కాండ్రు - వేడుకకాఱు.

వ్యాఖ్య - ఆట మున్నగువానికి మతుబర్థమున పుంస్త్వమునందు కాఁప్రత్యయ మగునని సూరి తద్ధితపరిచ్ఛేదమున విధించెను. అట్లు ఏర్పడిన కాఁప్రత్యయాంతములు మగాదిగణము లోనివే. కావున ఏకత్వమున డువర్ణకషుమాత్రము కలిగి ఆటకాఁడు- విలుకాఁడు మున్నగురూపము లేర్పడును.

ప్రస్తుతసూత్రముచేత బహువచనమునం దగు లకారమునకు లఘ్వలఘు రేఫంబులును, లఘురేఫంబునకు ముందు బిందుపూర్వక దకారంబు నగును. లఘు రేఫము 'ర'. అలఘురేఫము 'ఱ'. ఆటకా + లు అని యుండగా లకారమునకు అలఘురేఫము వచ్చి ఆటకా + ఱు = ఆటకాఱు అని యగును. అట్లే విలుకాఱు, వేఁటకాఱు - అనునవికూడ నేర్పడును. ద్వితీయాదివిభక్తులు పరమైనపు డగు లడాగమమునకు అలఘురేఫము కలుగగా వేఁటకాఱను, విలుకాఱను - ఆటకాఱను - అను రూపము లేర్పడును.

లకారస్థానమున లఘురేఫము వచ్చునెడల దానికి ముందు బిందుపూర్వక దకారముకూడ నగును. విలుకా + లు. లువర్ణమునకు ఆదేశముగా 'రు' వచ్చి నచో, దాని ముందు 'ండ్' అవియు వచ్చును. విలుకా + ండ్ + రు = విలు కాండ్రు. ఇట్లే ఆటకాండ్రు - వేఁటకాండ్రు అనునట్టి రూపములు నేర్పడును. లడాగమమున కీ మార్పు కలుగగా, విలుకాండ్రను - వేటకాండ్రను - ఆటకాండ్రను మున్నగురూపము లగును.

సూత్రమున సూరి 'బిందుపూర్వకదకారము' మాత్రమే విధించెను. బిందువు అర్ధబిందువు (ఁ) పూర్ణబిందువు (ం) అని రెండు విధములు. పూర్ణబిందువు అని స్పష్టముగా నిర్దేశింపలేదు. కావున అర్ధబిందువునుమాత్ర మేల నిల్పరాదు ? అని

ఆశంక కలుగు నవకాశము కలదు. అర్ధబిందువును నిలుపరాదను ఆక్షేపము లేదు. కాని రాబోవు పదునైదవసూత్రమునుబట్టి పర్యవసానముగా అర్ధబిందువు పూర్ణ బిందువుగా మారును.

**10. తే ప్రభృతుల బహువచనమునకు ముందు డుఙ్ఙగు. (బా - ౮)**

**తేఁడులు - తేండ్లు.**

వ్యాఖ్య - 'తే' మున్నగు ఆచ్ఛిక నామములకు బహువచన ప్రత్యయమునకు పూర్వమందు డుఙ్ఙగు నని యర్థము.

డుఙ్ = బిందుపూర్వకమైన డువర్ణము. తే మగాదిగణములోనిది. కావున ఏకవచనమున 'డు' విభక్తి కలిగి 'తేఁడు' అని యగును. బహువచనమునందు లుప్రత్యయము రాగా, డుప్రత్యయము లోపించిపోవును. తే + లు ప్రస్తుత సూత్రమునుబట్టి బహువచనమునకు ముందు డుఙ్ రాగా తే + ఁడు + లు = తేఁడులు అని యగును. రాబోవు పంద్రెండవ సూత్రమునుబట్టి డువర్ణములోని ఉత్వమునకు లోపము కలుగగా 'తేఁడ్లు' అను అనిష్టరూపము కలుగును. రాబోవు పదునైదవ సూత్రము "సమానపదంబునందు సంయోగంబు పరంబగునపు డెల్లచో ఖండబిందువకుం బూర్ణం బగు" అని పూర్ణానుస్వారమును విధించుటచేత 'తేండ్లు' అనియు నగును. ఇట్లే లడాగమము కలిగినప్పుడు తేఁడులను, తేండ్లను - మున్నగు విధముగా రూపము లుండును.

**11. కూఁతు శబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు.**

**(బా - ౯)**

కూఁతురు - కూఁతులు॥ కూఁతురులు - కూఁతుళ్ళు - కూఁతురి నిత్యాదిరూపంబులు గ్రామ్యంబు లని యెఱుంగునది.

వ్యాఖ్య - ఐదవ సూత్రమునందియు బహువచనమునందగుకార్యములను చెప్పు చున్న చిన్నయసూరి ఇచ్చట ఆ విషయమును విడిచి ఏకవచనరూపమును చెప్పు చున్నట్లు స్థూలదృష్టి కనిపించును. నిజమునకు సూరి 'కూఁతు' అనుదానిని శబ్దముగా గ్రహించుటవలన బహువచనమున 'లు' వర్ణము చేర్చి రూపమును సాధించుకొన వచ్చు నని చెప్పినట్లే యైనది॥ కూఁతులు - కూఁతులను మున్నగువిధముగా బహు వచన రూపము లుండును.

కూఁతు శబ్దమునకు ప్రథమైకవచనమున 'రు' వర్ణము అదనముగా చేరును॥ కూఁతురు.

కొందరు 'కూఁతురు' అను ప్రథమైకవచనరూపమును ప్రాతిపదికగా గ్రహించి కూఁతురులు - కూఁతుళ్ళు - కూఁతురిని మున్నగు దుష్టరూపములను వాడుచున్నారు. 'కూఁతు' అనునదియే శబ్ద మగుటవలన పైని లువర్ణంబు చేరి 'కూఁతులు' మున్నగువిధముగానే రూపము లుండును.

గ్రామ్యములు = లక్షణవిరుద్ధపదములు. కూఁతుళ్ళు మున్నగురూపములు శాస్త్ర విరుద్ధము లగుటవలన ప్రయోగమున కనర్హ ములు. శిష్టులు ఇట్టిరూపములను గ్రంథము లందు వాడరా దని గ్రామ్యపదప్రయోగమువలన సూరి నిర్దేశించుచున్నాడు.

**12. చెయువు బహువచన లకారంబున కలఘురేఫంబు విభాష నగు.**

(బా - ౧౦)

చెయువుఱు - చెయువులు - చెయువుఱను - చెయువులను.

వ్యాఖ్య - చేష్ట అను నర్థముగల చెయువు అను శబ్దమునకు బహువచనంబున లు వర్ణకంబు పరమైనపుడు, లకారమునకు అలఘురేఫము రాగా, చెయువు + లు= చెయువు + ఱు=చెయువుఱు అని యగును. ఇట్లే లడాగమము కలుగునప్పుడు చెయువు + ల + ను=చెయువుఱను అని యగును.

ఈ విధి విభాష నగును. కావున అలఘురేఫము రానిపక్షమున బహువచన లకారము యథాతథముగా నుండిపోవును. చెయువు + లు = చెయువులు; చెయువు + ల + ను = చెయువులను.

**13. ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందటి లువర్ణంబునకు బిందుపూర్వక డకారంబు నగు. (బా - ౧౧)**

అండ్రు - అండ్రను॥ ఆలు - చెలియలు - చెల్లెలు - కోడలు - మఱఁదలు॥ ఇవి యాల్వాదులు.

వ్యాఖ్య - ఆలు మున్నగుశబ్దముల బహువచనలకారమునకు రేఫ మగును; తత్పూర్వమందున్న శబ్దగతమైన లువర్ణమునకు బిందుపూర్వకడకారము (ండ్) అగును - ఇది సూత్రభావము. ఆలు + లు అని యుండగా సూత్రవిధివలన ఆ + ండ్ + రు = అండ్రు అని యగును. ఇట్లే చెలియండ్రు - చెల్లెండ్రు - కోడండ్రు-

మఱఁదండ్రు అను రూపము లుండును. ద్వితీయాది విభక్తి పరమగునప్పుడు అండ్రను - చెలియండ్రను - చెల్లెండ్రను - కోడండ్రను - మఱఁదండ్రను మున్నగు విధముగా రూపము లుండును.

సూరి సూత్రమున 'బిందుపూర్వక దకారము' అని మాత్రమే వాడెను. కనుక అర్ధబిందువు వాడుచో ఆక్షేపమేమి ? యను ప్రశ్న యుదయింపవచ్చును. దకార రకార సంయోగము (ద్రు) పరమం దున్నదిగావున "సమానపదంబు" అని మొద లయిన పదునైదవసూత్రమునుబట్టి అర్ధబిందువుకూడ పూర్ణబిందువుగా మారిపోవును. కావున, పరిణామరూపముగా దకారమునకు ముందు బిందుసున్నయే నిల్చును.

14 బహువచనంబు పరం బగునపుడు డ-ల-ట-ర-ల యుత్వంబు నకు లోపంబు బహుళంబుగా నగు. (బా - ౧౨)

గుండ్లు - గుండులు, గిండ్లు - గిండులు, కాళ్ళు - కాలులు. మొసళ్లు - మొసలులు, గొంట్లు - గొంటులు, తుంట్లు - తుంటులు, గోర్లు - గోరులు, సీవిర్లు - సీవిరులు, బహుళగ్రహణముచే విల్లులు, పిల్లులు, పులు లిత్యాదులందు లోపంబు లేదు. తత్సూత్రంబులం గోటి పిప్పలి శబ్దంబులకీ కార్యంబు చూపఁబడెడు॥ కోట్లు - కోటులు, పిప్పళ్ళు-పిప్పలులు.

వ్యాఖ్య - బహువచనమునందు లువర్ణకముకాని, ఆగమ లకారముకాని పరం బగునెడల, పూర్వశబ్దము కడపటి నున్న డ - ల - ట - ర అను వర్ణములమీది ఉత్వమునకు లోపము బహుళముగా నగునని సూత్రార్థము.

గుండు + లు. బహువచన ప్రత్యయ మగు లువర్ణము పరమం దున్నది. కావున శబ్దాంతమునగల డువర్ణకముయొక్క ఉత్వమునకు లోపము కలుగవచ్చును. అట్లు కలిగినయెడల గుండ్ + లు = గుండ్లు అని యగును. లోపము బహుళము కావున, లోపము రానియెడల 'గుండులు' అను రూపముండును. ఇట్లే గొంట్లు, తుంట్లు, గోర్లు, సీవిర్లు మున్నగురూపము లేర్పడును ఉత్వలోపము కలుగనియెడల గొంటులు మున్నగువిధముగా నుండును. 'కాలులు' మొదలైనవి ఉత్వలోపము నొందినపుడు రాలోపు (బా - 14) సూత్రమునుబట్టి 'కాళ్ళు' మున్నగువిధముగా నగును.

విల్లాలు, పిల్లులు, పులులు - మున్నగుశబ్దముల కడపటి లకారముమీది ఉత్వమునకు బహుళవిధిచేత లోపము కలుగదు. ఇవి అప్రవృత్తికి ఉదాహరణములు.

అచ్చికపరిచ్ఛేదమున అచ్చికశబ్దములకే యీ కార్యమగునట్లు సూత్రవిధి కలదు. కాని తత్సమములైన కోటి, పిప్పలి - అను శబ్దముల కడపటి 'ట - ల' వర్ణములమీది ఉత్వమునకుకూడ ఈ లోపము కలుగుచున్నది. ఇది అన్యత్వమునకు ఉదాహరణము.

కోటి + లు. "ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు" (తత్సమ - 45) అను సూత్రమునబట్టి 'కోటులు' అని యగును. ప్రస్తుతసూత్రముచేత టకారముమీది ఉత్వమునకు లోపము కలిగి 'కోట్లు' అని యగుచున్నది. ఉత్వలోపము బహుళ మగుటచేత 'కోటులు' మున్నగువిధముగా లోపము రానిరూపము కూడ నుండును.

**15.** బహువచనము పరం బగునపు డసంయుక్తంబు లయి యుదంతంబు లైన డ - ల - ర లకు లఘులకారంబు బహుళంబుగా నగు. (బా - ౧౬)

త్రాళులు - త్రాడులు; గుమ్మళులు - గుమ్మడులు; మొగిళులు - మొగిలులు; పిడికిళులు - పిడికిలులు; ఊళులు - ఊరులు; పందిళులు - పందిరులు.

వ్యాఖ్య - అసంయుక్తములై ఉదంతములై పదాంతముననున్న డ - ల - ర అను వర్ణములకు బహువచనమునందు 'లు' ప్రత్యయముకాని ఆగమలకారముకాని పరమగుచో అలఘు లకారము (ళ) బహుళముగా నగునని సూత్రార్థము.

త్రాడు + లు. చివరి డకారము ఉత్వవిశిష్టము; అసంయుక్తము. కావున ళకారము కలుగగా 'త్రాళులు' అని యగును. పిడికిలి + లు = పిడికిళులు. ఇచ్చట లకారముమీది యిత్వమునకు ఉత్వము "ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు" అను విధిచేత కలుగును. ప్రస్తుతసూత్రముచేత లకారమునకు ళకారము కలుగవచ్చును. ఊళులు అనుచోట రకారమునకు అలఘులకారము కలిగినది.

ళకారవిధి బహుళ మగుటచేత త్రాడులు - మొగిలులు - ఊరులు మున్నగు విధముగా అలఘులకారము రాని రూపములుకూడ నుండవచ్చును.

**16** బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయిన డకార లకారంబుల కలఘులకారంబు నిత్యంబుగ నగు. (బా - ౨౪)

త్రాళ్లు - గుమ్మళ్లు - మొగిళ్లు - మొసళ్లు - విళ్లు - సిళ్లు.

వ్యాఖ్య - బహువచన శ్లిష్టంబులు = బహువచనప్రత్యయ మగు లువర్ణముతో గాని, ఆగమలకారముతోగాని సంశ్లేషము చెందినవి. "బహువచనము పరంబగు నపుడు డ - ల - ట - ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు" అను పండ్రెండవ సూత్రముచేత పదాంతమునందలి డ - ల - ట - ర లకు ఉత్వము లోపించి, బహువచనము పూర్వమున్నవర్ణముతో సంశ్లేషము నొందును. అట్లు సంశ్లేషము నొందిన డకార లకారములకు అలఘులకారము నిత్యముగా నగునని సూత్ర తాత్పర్యము.

త్రాడు + లు - ఉకారము లోపింపగా త్రాడ్ + లు అని యగును. ఇట్టి యెడల డకారమునకు ళకారము నిత్యమని ప్రస్తుతసూత్రము విధించుచున్నది. అందు వలన 'త్రాళ్ళు' అను రూప మేర్పడును. పూర్వసూత్రముచేత త్రాళులు - త్రాడులు అను రెండు రూపములు గలిగినవి. అట్లే గుమ్మళ్ళు మున్నగువానియందు అలఘు లకారము నిత్యముగా నైయున్నది. బహువచనసంశ్లేషము నొందనియపుడు డ, ల, రలకు అలఘులకారము బహుళముగా కలిగి గుమ్మళులు, గుమ్మడులు; మొగిళులు, మొగిలులు; సీళులు, సీరులు - అను విధముగా రెండేసి రూపములు కలుగుచున్నవి.

[ ఈ సూత్రమునందు రవర్ణమునుగూడ చేర్చి యుండవలసినదని, అట్లు చేర్పకుండుటచేత నీతిచంద్రికలోని తన ప్రయోగములే తన వ్యాకరణమువల్ల సాధింపబడకున్నవని సూరిని కొందరాక్షేపించుట కలదు. అది సరికాదు. వారు సూచించిన రవర్ణమునుగూడ చేర్చినయెడల ఊళ్ళు, పేళ్ళు మొదలయిన రూపములు మాత్రమే యేర్పడును. ఊర్లు, పేర్లు మొదలయిన రూపముల కేమాత్రము నవకాశము కలుగదు. కావుననే సూరి ఆ మార్గము త్రొక్కలేదు. అది ఆయన సూక్ష్మేక్షికకు నిదర్శనము. ఈ వరుసలోనున్న తొలి (బా - 12) సూత్రమునుబట్టి ఊర్లు, పేర్లు, సీవిర్లు, పందిర్లు - మున్నగు రూపములు వికల్పముగా నేర్పడును. తరువాతి (బా - 13) సూత్రమునుబట్టి ఊళులు, పేళులు, సీవిళులు, పందిళులు మున్నగురూపము లేర్పడును. ఇచ్చటి ళ వర్ణము రవర్ణ స్థానమున వచ్చినది. కావున 'స్థానివదాదేశః' అను నియమమునుబట్టి వెనుకటి (బా - 12) సూత్రముచేత 'ళు' యొక్క ఉత్వము లోపించినయెడల ఊళ్లు, పేళ్లు మున్నగు రూపములు కలుగును. కావుననే ప్రస్తుతసూత్రముకడ వీని ప్రసక్తి లేకపోయి

నది. ఇక్కడ నింకొక ప్రశ్న వేయవచ్చును. "వెనుకటి (బా - 13) సూత్రముచేత 'డల' లకు ళత్వము సిద్ధించినయెడల ఈ (బా - 14) సూత్రము వ్యర్థముకాదా?" అని. ఈ సూత్రము లేకున్నప్పటికిని బ్రాళ్లు, గుమ్మళ్లు, మొగిళ్లు, సిళ్లు - మున్నగు రూపము లేర్పడుటలో బాధలేదు. కాని బ్రాడ్లు, గుమ్మడ్లు. మొగిల్లు, సిల్లు - మున్నగు ననిష్టరూపము లేర్పడును. వానిని వారించుటకు వేఱుమార్గము కానరాదు. కావుననే యీ సూత్ర మావశ్యకమైనది. ]

## 17 సమానపదంబునందు సంయోగంబు పరంబగునపుడెల్లచో ఖండబిందునకుం బూర్ణం బగు. (బా - ౧౫)

అనఁటులు - అనంట్లు ; పనఁటులు - పనంట్లు ; గోఁటులు - గోంట్లు; తేఁటులు - తేంట్లు; పేఁడులు - పేండ్లు ; కాఁడులు - కాండ్లు. పేండ్లు కాండ్లిత్యాదులందు ధాతు ళాదేశంబు కొందఱు వక్కాణించిరి ; తెనుఁగున బిందుపూర్వకస్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబు కాదు.

వ్యాఖ్య - సమానపదము అని యనగా అఖండ మగు నేక పదము. భిన్నభిన్న పదములు కూడి ఏకపదమై సమాసము అని యనిపించుకొనును అందు భిన్నభిన్న పదములను వేర్వేరుగా నిరూపింపవచ్చును. అట్లు భిన్నపదములుగా వేరుపఱచుటకు వీలులేని అఖండపదమునే సమానపద మని యందురు.

ఇట్టి సమానపదమునందలి ఖండబిందువునకు బహువచన లకారముతో సంయుక్తమైన వర్ణము పరమగునప్పుడు అన్నియెడలను పూర్ణబిందు వగునని సూత్రార్థము.

'ఎల్లచో' అని యనగా అన్నిచోటులందు నని యర్థము. హ్రస్వముమీది ఖండబిందువునకు పూర్ణబిందువు విభాషగా నగుట కాక్షేపము లేదు. కాని, దీర్ఘము మీద సాధ్యపూర్ణము లేదు. ప్రస్తుతసూత్రమున "ఎల్లచో ఖండబిందునకుం బూర్ణంబగు" నని యనుటవలన దీర్ఘముమీద సైతము పూర్ణబిందు వగునని యర్థము.

అనఁటులు - "బహువచనంబు పరంబగునపుడు డ - ల - ట - ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు" నను విధిచేత ఉత్వము లోపింపగా 'అనఁట్లు' అని యగును - ఈ రూప మింకను పరిపూర్ణము కాదు. ప్రస్తుతసూత్రము చేత సంయోగమునకు ముందున్న ఖండబిందువు పూర్ణబిందువు కావలయును.

అప్పుడు 'అనంట్లు' అనురూపము సిద్ధించును. ఉత్వలోపవిధి బహుళ మగుటవలన, ఉత్వలోపము రానిచో అనఁటులు, అనంటులు - అని ఖండాఖండబిందువులతోడి రూపములు రెండు నుండవచ్చును.

ఏఁడు + లు అని యున్నప్పుడు డకారముమీది ఉత్వమునకు లోపము కలుగగా 'ఏండ్లు' అని యగును. "బహువచన శ్లిష్టంబు లయి...." అని మొదలైన పూర్వసూత్రముచేత డకారమునకు ళకారము కావలయు నని కొందఱ యభిప్రాయము. వారియభిప్రాయము ప్రకార మైనచో 'ఏఁళ్ళు' అని కావలసివచ్చును. తెనుగునందు పరుషసరళంబులకు ముందే బిందువు కానంబడు నవి యుండుటచేత స్థిరవర్ణమైన ళకారమునకు ముందు బిందువు నంగీకరించుట సమంజసము కాదని సూరివాదము. శబ్దమునందు సహజముగనే బిందు వున్నది. కావున డకారమునకు ళకారము నంగీకరింపకున్నయెడల ఏ యిబ్బందియు నుండదు. కాబట్టి ఏఁడ్లు - కాఁడ్లు అని యేర్పడిన రూపములలోని అర్ధబిందువులకు పిమ్మట సంయోగ మున్నది. కావున ప్రస్తుతసూత్రముచేత పూర్ణబిందువు చేయగా ఏండ్లు, కాండ్లు - అను రూపము లేర్పడును. ఉత్వలోపము కానియెడల ఏఁడులు, కాఁడులు - అనియుండును. దీర్ఘము మీదివి కాన నిచ్చటి ఖండబిందువులకు పూర్ణబిందువులు కావు.

18. ఔపవిభక్తికంబుల లివర్ణ నలలువర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగా నగు. (బా - ౧౬)

కొడవలి - కొడవందులు. ఉల్లోపము॥ కొడవండ్లు, పక్షంబున దలఘులకారంబు॥ కొడవళులు - కొడవళ్లు - కొడవలులు. రోఁకలి ప్రభృతుల కిట్లు రూపంబు లెఱుంగునది. ఇల్లు - ఇందులు - ఇండ్లు - ఇల్లులు. కల్లు - పల్లు - ముల్లు - విల్లు శబ్దంబులకు రూపంబు లిట్లు తెలియునది. మద్య నిమ్నార్థకంబు లయిన కల్లు - పల్లు శబ్దంబులును జెల్లు ప్రభృతి శబ్దంబులు ననౌపవిభక్తికంబు లగుటం జేసి వాని కీ కార్యంబు లేదు.

వ్యాఖ్య - ఔపవిభక్తికములు అనగా ద్వితీయాద్యేకవచనము పరమగునపుడు కొన్ని తెనుగుశబ్దములపైని చేరునటువంటి ఇ - టి - తి అను వర్ణములు. ఈ వర్ణ

ములను చేర్చుకొను శబ్దములనుకూడ ఔపవిభక్తికము లని వాడుదురు. చేయి, ఊరు-మున్నగునవి ఔపవిభక్తికశబ్దములు. ఔపవిభక్తికశబ్దములకొన నున్న లివర్ణమునకును, లకారముతోడి లువర్ణము(ల్లు)నకును బహువచనమున లువర్ణకముకాని, అగమలకారముకాని పరంబగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణము(ండు)బహుళముగా నగునని సూత్రార్థము.

కొడవలి - ఔపవిభక్తికశబ్దము. దీనికి బహువచన ప్రత్యయము పరమైన యెడల కడపటి లివర్ణమునకు బిందుసున్నతోడి డువర్ణము ఆదేశముగా నై కొడవలి + లు = కొడవండులు అని యగును. పూర్వ సూత్రముచేత డకారము మీది ఉత్వమునకు లోపము కలిగినయెడల కొడవండ్లు అనియు నగును.

ప్రస్తుతసూత్రవిధి బహుళ మగుటచేత పూర్ణబిందు పూర్వక డువర్ణము రాని పక్షమున కొడవలి + లు = కొడవలులు అని యగును: పదుమూడవసూత్రము చేత ళకారము బహుళముగా కావచ్చును. ఐనచో కొడవళులు అని యగును. ఉత్వమునకు లోపము కలిగి బహువచనముతో సంయోగము నొందిన యెడల, పదునాలుగవసూత్రముచేత ళాదేశము నిత్యముగానై కొడవళ్లు అని యగును. ఇట్లే రోకలి మున్నగువానికి రోకండులు - రోకండ్లు - రోకలులు - రోకళులు - రోకళ్ళు అని బహువచనరూపము లుండును.

ఇల్లు, పల్లు - మున్నగు ఔపవిభక్తికశబ్దములకు పై విధముగనే ఇండులు - ఇండ్లు - ఇల్లులు అనువిధముగా రూపము లేర్పడును. ఇల్లు శబ్దము కడపటి సలలు వర్ణమునకు (ల్లు) ప్రస్తుతసూత్రమువలన పూర్ణబిందుపూర్వక డువర్ణము కలుగగా పై రూపము లేర్పడినవి. బహుత్వము పరమగునపుడు కడపటి లకారము ద్విరుక్తమై యున్నందువలన నిచ్చట అలఘులకారము కలుగదని గుర్తుంచుకొనవలయును. ఱాయి యను నర్థము గల కల్లు శబ్దము కండులు - కండ్లు - కల్లులు అను బహువచనరూపములను బొందును. దంతము అను నర్థము గల పల్లు శబ్దము బహువచనమున పండులు - పండ్లు - పల్లులు అనురూపములను పొందును.

మద్యము అను నర్థముగల కల్లు శబ్దము ఔపవిభక్తికము కానందువలన, దాని లకారమునకు పూర్ణబిందుపూర్వక డువర్ణము కలుగరాదు. అట్లే పల్లము అను నర్థముగల పల్లు శబ్దమునకును ఈ మార్పు రాదు. తెల్లు శబ్దముకూడ అనౌపవిభక్తికము. కావున పూర్ణబిందుపూర్వక డువర్ణము కలుగరాదు.

19. ఒకానొకచో నామంబు సంశ్లిష్ట బహువచనాంత తుల్యంబయి బహువచనంబు నెనయు. (బా - ౧౬)

కొడవండ్లులు - కొడవండ్లులను - కొడవళ్లులు - కొడవళ్లులను॥ ఇట్లు ప్రయోగదృష్టంబులు గ్రహించునది.

వ్యాఖ్య - బహువచన లువర్ణకంబుతో సంయోగము నొందిన శబ్దము మరల బహువచన ప్రత్యయ మగు లువర్ణమును గాని, ఆగమలకారమును గాని పొందు చుండుట ప్రయోగములందు అరుదుగా కనిపించుచున్నదని సూత్రార్థము. ఇట్టి ప్రయోగములు కొలదిగా కలవని యెఱిగించుటయే కాని, యిట్లు చేయవలయునని విధించుట యీ సూత్రముయొక్క అభిప్రాయము కాదు.

కొడవండ్లు - ఇది యిప్పటికే బహువచనశ్లిష్టము. దీనిపై మరల 'లు' ప్రత్యయము కలిగి 'కొడవండ్లులు' అనియు, లడాగమము కలిగి 'కొడవండ్లులను' అనియు రూపములు కనిపించుచున్నవి. అండ్రు మున్నగుశబ్దములకుకూడ బహువచనము పరమై అండ్రురు, అండ్రురను - మున్నగువిధముగా నేర్పడిన రూపములును కొలదిగా కలవు. ఇట్టిరూపములను పూర్వగ్రంథములయందలి ప్రయోగములనుబట్టి గుర్తించుకొనవలయును.

20. దేశ్యంబునం గొన్నియెడల మహన్మహత్యర్థక బహువచనాంత నామంబులపై మరల బహువచన ప్రత్యయములు చూపట్టెడు. అచ్చో వారు, వీరు, మీరు శబ్దంబుల యంత్యోకారంబున కకారంబగు (ప్రౌ - ౪౭)

వేడుకకాండ్రురు - కోడండ్రురు - వెలయాండ్రురు - పెక్కండ్రురు - చూపఱులు - ఒకరులు మొ॥ వారలు - వీరలు - మీరలు॥ ఆడెడువారల కిచ్చును। పాడెడువారలకు నిచ్చు బట్టకు నిచ్చున్ బాడబవరులకు నిచ్చును। వేడుకకాండ్రురకు నిచ్చు వివిధార్థంబుల్॥ విక్ర. ౨ ఆ॥ సుందరి నాకోడండ్రురయుం దభ్యర్హితవు నీవ॥ భార. సభా. ౨ ఆ॥ వెలయాండ్రురను గొండియలం బరిచారికాశ్రేణుల నొండొండ చెరలు వట్టు॥ హరి. ఉ. ౬ ఆ॥ పెక్కుదెఱంగులం బాడికిం। బెక్కండ్రురతోడ నొకండు పెనంగంగం గార్యం। బొక్కటి యగునేని

యుండాం। బెక్కండ్రు రతోడ నైనం బెనంగఁగఁ జెల్లున్॥ విజ్ఞా. వ్యా. ౬౦॥ చూపఱుల చూడ్కి కొక వింత సొబగొనర్చె॥ కళా. ౭ ఆ॥

వ్యాఖ్య - దేశ్యశబ్దములు కొన్ని కొన్నిచోట్ల మహదర్థమునందును, మహత్య ర్థమునందునుగూడ బహువచనముపై బహువచనము నొందుట కవిపించుచున్నది. వారు, వీరు, మీరు - అను శబ్దములు అట్లు మరల బహువచనము నొందునప్పుడు పూర్వ మున్న ఉత్వమునకు అత్వము వచ్చును - అని సూత్రార్థము.

బాలవ్యాకరణముచేతనే యిందు మొదటి నాలుగు లక్ష్యములను సాధింప బడును. కాని "ఒకానొకచో నామంబు" అని మొదలయిన (బాల - 17) సూత్రము క్రింద 'కొదవండ్లు' మున్నగు అమహత్తులనే ఉదాహరించుటవలన మహత్తులకు, మహతీవాచకములకు కూడ లక్ష్యములను చూపదలచి ప్రౌఢవ్యాకర్త యీసూత్రమును ప్రారంభించియుండును.

'వేడుకకాండు' అనునది మతుబర్థమునందు కాప్రత్యయము కలిగినరూపము. దీనికి బహువచనమునందు (బా - 7) వేడుకకాలు, వేడుకకాండ్రు, వేడుకకాండ్రను- అను విధముగా రూపములు గల్గును. ఇందు మొదటిరూపము బహువచన శ్లిష్టము కాదు. దానిపైని మరల బహువచనము వచ్చుటయు కానరాదు. వేడుకకాండ్రు - అనునది బహువచనశ్లిష్టము. దానిపైని మరల 'రు' వర్ణము కలుగగా 'వేడుక కాండ్రురు' అనియు కావచ్చును. ఇట్టివే వేడుకకాండ్రురను - మున్నగు ద్వితీయాది విభక్త్యంతములయిన బహువచనరూపములు.

కోడలు, వెలయాలు - అను రెండు శబ్దములును ఆల్వాదులలోనివి. కావున "ఆల్వాదుల" అని మొదలయిన (బాల - 11) సూత్రమునుబట్టి కోడండ్రు, కోడం డ్రను; వెలయాండ్రు, వెలయాండ్రను - మున్నగురూపములు వచ్చును. బహువచన శ్లిష్టములైన వీనికి మరల బహువచనప్రత్యయ మగు 'రు' వర్ణకము కలుగగా కోడండ్రురు, కోడండ్రురను : వెలయాండ్రురు, వెలయాండ్రురను - మున్నగురూప ములు వచ్చును.

'పెక్కు' అనుదానికి మహద్బహువచనముగా పెక్కురు, పెక్కండ్రు - అను రూపములను (బాల - 24) వివరించెను. 'పెక్కురు' అనుదానిపై మరల బహు వచనము చేయుట కానరాదు. బహువచన శ్లిష్టమైయున్న 'పెక్కండ్రు' అను దాని

పైవి మరల బహువచనప్రత్యయము చేరి పెక్కండ్రురు, పెక్కండ్రురను - మున్నగువిధముగా రూపములు కలుగవచ్చును.

ఇంతవరకు చెప్పినవన్నియు సంశ్లిష్టబహువచనాంతతుల్యములై యుండుట చేత, ప్రక్రియనుబట్టి ఒకే శ్రేణికి చెందిన వానివిగా పరిగణింపవచ్చును. ఇవన్నియు బాలవ్యాకరణమువల్లనే సాధ్యము లన్న విషయమునుగూడ చెప్పికొంటిమి.

'ప్రేక్షకులు' అను నర్థమున 'చూపఱు' అను బహువచనాంత దేశ్యశబ్దము కలదు. ద్వితీయాది బహువచనమునందు చూపఱను, చూపఱచేత - మున్నగువిధముగా రూపము లుండును. ప్రస్తుతసూత్రముచేత 'లు' వర్ణకమును, లడాగమమును కలిగి నప్పుడు చూపఱులు, చూపఱులను, చూపఱులచేత - మున్నగువిధముగా రూపము లేర్పడవచ్చును. బాలవ్యాకరణమున ఈవి ప్రసంగము లేదు కావున దీనిని పూరణ విషయముగా గ్రహింపవచ్చును.

'ఒకరులు' అను రూపము ప్రౌఢవ్యాకర్త యుద్దేశమునుబట్టి 'ఒకరు' అను మహద్బహువచనరూపముపై మరల బహువచనము చేరగా ఏర్పడినరూపము. బాల వ్యాకర్త సర్వనామ ప్రకరణమునందు 'ఒకఁడు' అనుదానికి బహువచనముగా 'ఒకరు' అను రూపమును చూపెను. 'ఒకరులు' అనుదానిని బహువచనముగా చూపినప్పటి కిని, దానికి ఏకవచనరూపముగా 'ఒకరుఁడు' అను శబ్దమును చూపెను. అనగా 'ఒకరు' అను బహువచనాంతరూపముపై 'లు' చేరుట వలనకాక 'ఒకరుఁడు' అను దానికి బహువచనరూపముగా 'ఒకరులు' అవి కలుగుచున్నది. కావున బహువచ నముపై బహువచనము చేరుట యన్నది యిచ్చట లేదు. అందుచేత ప్రస్తుతసూత్ర మున కిది లక్ష్యము కాఁజాలదు. 'ఒకొరుఁడు' అను రూపమునకు 'ఒకొరులు' అవియు, 'ఒక్కరుఁడు' అను రూపమునకు 'ఒక్కరులు' అవియు, 'ఒక్కొరుఁడు' అనుదానికి 'ఒక్కొరులు' అవియున్న బహువచనరూపములందలి 'రు' వర్ణము ఆంగికమేకాని బహువచనప్రత్యయము కాదు.

ఇంక చివరి విషయము. వారు, వీరు, మీరు - అను బహుత్వబోధక శబ్దము లకు మరల 'లు' ప్రత్యయమును లడాగమమును కలుగవచ్చును. అట్టియెడల వెనుక నున్న ఉత్వమునకు అత్వము కలుగును. వారలు,వారలను: వీరలు, వీరలను: మీరలు, మీరలను॥ మున్నగునవి రూపములు.

—

బాలవ్యాకరణమున సూరి 'వాఁడు' అనుదానికి వారు, వారలు, వాండ్రు - అనియు 'వీఁడు' అనుదానికి వీరు, వీరలు, వీండ్రు - అనియు 'నీవు' శబ్దమునకు మీరు, మీరలు - అనియు బహువచనరూపములను చూపెను. 'ఈవు' అను యుష్మ దర్థకమునకు ఈరు, ఈరలు - అను రూపములనుకూడ చూపెను. కావున ప్రౌఢ వ్యాకర్త చెప్పిన ఈ రూపములను సూరి యీవరకే నిపతించి యున్నాడు. అచ్ఛిక పరిచ్ఛేదమునందు సూరి నిపాతమార్గము ననుసరించి రూపప్రదర్శనము చేయగా, ప్రౌఢవ్యాకర్త ప్రక్రియను ప్రదర్శించుటకు పూనుకొనెను. కావున బాలవ్యాకర్త చూపిన రూపములకే ప్రస్తుత సందర్భమున ప్రౌఢవ్యాకర్త రూపసాధన ప్రక్రియను చూపుచున్నాడు. కావున ఇది బాలవ్యాకరణమునకు వివరణ మగుచున్నది.

**21. కలన్వాదుల నువర్ణంబు కుఙ్ఞగు బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు** (బా - ౧౮)

కలఁకు - కలను - కలఁకులు॥ కలను - కెలను - కొఱను - కొలను - గవను - నెఱను - మ్రాను - వరను॥ ఇవి కలన్వాదులు.

వ్యాఖ్య - కలను మున్నగు శబ్దముల కడపటి నువర్ణమునకు బదులుగా కుఙ్ఞ ఏకవచనమున వికల్పముగను, బహువచనమున నిత్యముగను అగునని సూత్రార్థము. కుఙ్ఞ అని యనగా బిందుపూర్వకమగు కువర్ణమని యర్థము.

కలను, కలఁకు - అను రెండురూపములు ఏకవచనమున నుండవచ్చును. బహువచనమున కుఙ్ఞ నిత్య మగుటవలన 'కలఁకులు' అని ఒక్కటియే రూప మగును. హ్రస్వముమీది అర్ధానుస్వారమునకు వికల్పముగా పూర్ణబిందువు కలిగి కలంకు, కలంకులు - మున్నగువిధముగా' నుండవచ్చును. దీర్ఘముమీద సాధ్య పూర్ణము లేనందువలన 'మ్రాను, మ్రాఁకు' - అని యేకవచనమునను 'మ్రాఁకులు' అని బహువచనమునను రూపములుండును.

**22. అట్లు రేను గోను శబ్దముల నువర్ణంబు గుఙ్ఞగు.** (బా - ౧౯)

రేఁగు - రేను - రేఁగులు; గోఁగు - గోను - గోఁగులు.

వ్యాఖ్య - అట్లు అని యనగా, పూర్వసూత్రమున చెప్పినట్లుగా ఏకవచనమున వికల్పముగను బహువచనమున నిత్యముగను రేను, గోను - అను రెండుశబ్దముల తుది నువర్ణమునకు బిందుపూర్వకమైన గువర్ణము (గుఙ్ఞ) ఆదేశముగా నగునని సూత్రార్థము.

రేను శబ్దముయొక్క నువర్ణమునకు ఏకవచనమున గుజ్జు ఆదేశము కాగా 'రేఁగు' అని యగును. ఏకవచనమున ఈ విధి వైకల్పిక మగుటవలన 'రేను' అను రూపముకూడ నుండవచ్చును. ఇట్లే గోను శబ్దమునకు ఏకవచనమున గోను, గోఁగు-అను రెండు రూపము లుండును. బహువచనమున గుజ్జు నిత్యము కావున రేఁగులు, గోఁగులు - అని యగును. ఇచ్చటి అర్ధబిందువు దీర్ఘముమీఁది దగుటవలన పూర్ణబిందువు కారాదు.

**23.** బహువచనంబు పరంబగునపుడు చేను పేను మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు. (బా-౨౦)

చేను - చేలు; పేను - పేలు; మీను - మీలు.

వ్యాఖ్య - చేను, పేను, మీను - అను మూడు శబ్దముల యొక్క కడపటి నువర్ణమునకు బహువచనము పరమగునపుడు లోపము కలుగునని సూత్రార్థము.

చేను + లు=చేలు; పేను + లు=పేలు; మీను + లు=మీలు. అగమలకారము పరమైనపుడును నువర్ణలోపము కలిగి చేలకు, పేలకు, మీలకు - మున్నగువిధముగా రూపము లేర్పడును.

**24.** బహువచనంబు పరంబగునపుడు రేయి ప్రభృతుల తుదియక్షరంబు లోపించు. (బా - ౨౧)

రేయి - రేలు; తాయి - తాలు; వేయి - వేలు; వ్రాయి - వ్రాలు॥ ఇత్యాదులు. ఈ లోపంబు సమాసంబులందుఁ జూపట్టెడు॥ రేరాజు - మగతాపతకము - వేవెలుఁగు.

వ్యాఖ్య - రేయి మున్నగుశబ్దములకు బహువచన ప్రత్యయమగు లువర్ణము గాని, లడాగమము గాని పరమగునపుడు కడపటివర్ణమునకు లోపము కలుగునని సూత్రార్థము.

రేయి + లు. యివర్ణము లోపించి 'రేలు' అని యగును. అట్లే ద్వితీయాది విభక్తులందు లడాగమము కాగా 'రేలను' మున్నగువిధముగా రూపము లేర్పడును.

రేయి మున్నగుశబ్దములు సమాసములందు పూర్వశబ్దములైనప్పుడును, వాని కడపటి వర్ణమునకు లోపము కలుగుచున్నది. రేయి + రాజు = రేరాజు; మగ తాయి + పతకము = మగతాపతకము.

**25.** బహువచనంబు పరంబగునపు డావు ప్రభృతుల తుదియక్షరంబు నకు లోపంబు విభాష నగు. (బా-౨౨)

ఆవు - ఆలు - ఆవులు; జాము - జాలు - జాములు; చుట్టము - చుట్టలు - చుట్టములు; మీసము - మీసలు - మీసములు.

వ్యాఖ్య - అవు, జాము, చుట్టము, మీసము - అను నాలుగు శబ్దముల యొక్క తుదియక్షరమునకు లువర్ణకముగాని ఆగమలకారముగాని పరమగునపుడు లోపము విభాషగా నగునని సూత్రార్థము.

అవు + లు - కడపటి 'వు' వర్ణమునకు లోపము కలుగగా 'ఆలు' అని యగును. లోపము వైభాషికము, కావున లోపము కానియెడల 'ఆవులు' అనియే యుండును. అట్లే చుట్టము శబ్దమునకు చుట్టలు, చుట్టములు - అని, మీసము శబ్దము నకు మీసలు, మీసములు - అని రెండేసిరూపములు బహువచనమునం దగును. జాము శబ్దమునకు జాలు, జాములు - అని రెండు రూపము లుండును.

**26.** హలవసానంబులు పరంబులగునపుడు లు రు వర్ణకంబుల యుత్వంబునకు లోపంబు వైకల్పికంబుగ నగు. (ప్రౌ - ౧౬)

వితతోల్కాశని పుంజ మొక్కయనఁగా విస్ఫీత విక్షిప్త ప
క్షతి వాతాహతిఁ దూలి తూలశకలాకారంబులై వారిద
ప్రతతుల్ సాల్పడి నల్లడం జెదరఁగాఁ బాతె న్మనో వేగుఁడై
పతగేంద్రుం డమృతాంతికంబునకుఁ దత్పాలుర్భయుంబందఁగన్॥
భార. ఆది. ౨॥ ఇట్లు భూసురోత్తముల్ - భూపాలుర్॥ మొ.

వ్యాఖ్య - హల్లు కాని అవసానము కాని పరమైనప్పుడు లు, రు- అను ప్రత్యయముల యొక్క ఉత్వమునకు వైకల్పికముగా లోపము కలుగునని సూత్రార్థము. లు, రు - అనునవి రెండును బహువచన ప్రత్యయములు.

ప్రతతులు + చాల్పడి - అని యుండగా ప్రస్తుత సూత్రమువలన 'లు' ప్రత్యయముమీది ఉత్వమునకు లోపము కలిగి 'ప్రతతుల్' అని అయ్యెను. 'ప్రథమ మీఁది' అని మొదలయిన సూత్రమువలన 'చ' కారము 'స' కారము కాగా 'ప్రతతుల్ సాల్పడి' అని అయ్యెను.

తత్పాలురు + భయంబు - అని యున్నపుడు 'రు' వర్ణకమునందలి ఉత్వ మునకు లోపము కలిగి 'తత్పాలుర్' అని అయ్యెను. 'లు' వర్ణకోత్వమునకు లోపము కలిగి 'భూసురోత్తముల్' అనియు 'రు'వర్ణకోత్వమునకు లోపము కలిగి 'భూపా లుర్' అనియు కావచ్చును.

"పదాంతంబులయి యసంయుక్తంబులయిన ను లు రు ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు" అను బాలవ్యాకరణ సూత్రము (ప్రకీ - 18) చేతనే యీకార్యము జరుగుట కవకాశము కలదు. పై పద్యమునందున్న విస్ఫూర్తి - వ్రత తుల్ - సాల్పడి - నల్గడ - భూపాలుర్॥ అనుచోట్లనున్న ఉత్వలోపమునకు బాల వ్యాకరణ సూత్రము సాధకము కాగలదు. ప్రస్తుతప్రౌఢవ్యాకరణసూత్రమున 'వర్ణక' మని యుపయోగించుటచేత వ్రతతుల్, భూపాలుర్ - అను నివి రెండుమాత్రమే విష యము లగుచున్నవి. ఇటుకాక ను లు రు అను వర్ణములకు ఉత్వలోపమును సాధింప గల బాలవ్యాకరణ సూత్రము కలుగగా ప్రౌఢవ్యాకరణసూత్రము విరర్థక మగుచున్నది.

27. ఇయకు మారుగ నామాంతంబున నెత్వంబు బహుళంబుగా నగు. (బా - ౨౮)

కన్నియ - కన్నె; జన్నియ - జన్నె; వన్నియ - వన్నె; కొంచి యము - కొంచెము; కొండియము - కొండెము. బహుళగ్రహణముచే సందియము - కాఱియ మొదలగు శబ్దములం దెత్వంబు లేదు. ఇయ శబ్దంబునం దికారలోపంబు కొందఱు వక్కాణించిరి. అయ్యాది ప్రయోగంబులందు మృగ్యంబు ముత్తియ శబ్దంబునందుమాత్ర మిత్వ లోపంబు గానంబడియెడి॥ ముత్తియము - ముత్తెము - ముత్యము.

వ్యాఖ్య - నామాంతమునందలి 'ఇయ' అను రెండు అక్షరములకును బదులుగా బహుళముగా ఎత్వము కలుగునని సూత్రార్థము.

కన్నియ - అనునది వర్ణక్రమమును బట్టి 'కన్న్ + ఇయ' అని విడదీయ నగును. ప్రస్తుతసూత్రమువలన ఇయకు మారుగా ఎత్వము కలిగి కన్న్ + ఎ = కన్నె అనురూపము సిద్ధించును. ఎత్వవిధి బహుళ మగుటవలన, ఎత్వము రానిపక్షమున 'కన్నియ' అను రూపమే యుండును. ఇట్లే జన్నియ, జన్నె - మున్నగువిధముగా రెండేసి రూపము లుండును.

బహుళవిధియందు అప్రవృత్తి యొక అంశము. నందియము, కాఱియ - మున్నగుశబ్దముల కడపటి ''ఇయ''కు ఎత్వము కలుగదని సూరి నిషేధించెను. ఇది అప్రవృత్తికి ఉదాహరణము.

పూర్వవ్యాకర్తలు కొందరు ఇట్టియెడ నున్న 'ఇయ' లోని ఇకారమునకు లోప మగునని యనిరి కాని యట్టిది కవిప్రయోగములందు కనిపించుట లేదని సూరి నిరాకరించెను. మృగ్యము అని యనగా వెదకదగినది యని శబ్దార్థము; లేదు అనియే తాత్పర్యము.

అయినను సూరి 'ముత్తియము' అను ఒక శబ్దమునందలి ఇయకు మాత్రము ఇలోప మున్నట్లు అంగీకరించెను. ముత్త్ + ఇయము = ముత్త్ + యము. రెండు వర్ణములకంటె నెక్కువ సంయోగము చెందినపుడు ద్విత్వమునందొకదానికి లోపము కలుగును. కావున 'ముత్త్యము' అని కావలసిన రూపము 'ముత్యము' అనియైనది. ప్రస్తుతసూత్రమునందలి ఎత్వవిధినిబట్టి 'ముత్తెము' అను రూపము నగును. ఎత్వము రానిపక్షమున 'ముత్తియము' అనియే యుండును.

౨౮. ముత్తియ శబ్దేతరంబులయందును దఱచుగ నిత్వలోపంబు గానంబడియెడి. (ప్రౌ - ౪౯)

కన్నియ - కన్య; దివ్వియ - దివ్య; కళ్ళియము - కళ్యము; పళ్లియము - పళ్యము; వీడియము - వీడ్యము॥ నెయ్యపుఁ గన్యకల ననబోలుఁదూపుల జయించి॥ రాఘు. ౧ఆ॥ (చూ. శబ్దరత్నాకరము) గువ్వగ్రద్ద దివ్యాఱుపుఁబువ్వు గూబ। యిల్లు సొచ్చిన శాంతి సేయింప వలయు ॥భార. అను. ౪ఆ॥ కళ్యాలఁ బదిలంబుగాని గుఱ్ఱంబులఁ గ్రొత్త మట్టున కియ్యకొలుపు వెరవు॥ భార. విరా. ౧ఆ॥ అంబుజ బాంధ వాన్వయ నృపాగ్రణి బోనము నేఁడు సూర్యపా। కంబున నాయితం బయిన కజ్జము భోజనశాలలోన బా।ళ్యంబిడినారు పంకజదళాక్షులు రెండవజాముగంట వే।యుంబడె నారగింప సమయం బని చెచ్చెఱ విన్న వించినన్॥ కాశీ. ౫ఆ॥ తరుణధావన ధగధగద్ధళన మణులహత్తు కొల్పిరి లేత వీడ్యముల డాలు। పర్వదినములఁ బామరప్రమద లుదిత। నియమ సంభావనారంభ నిభృతబుద్ధి॥ పాండు. ౩ఆ॥ మొ.

వ్యాఖ్య - నామాంతమున నున్న 'ఇయ' యందలి 'ఇ' త్వమునకు ముత్తియ శబ్దమునందు మాత్రమేకాక యితర శబ్దములయందును లోపము కనిపించుచున్నదని సూత్రార్థము.

'దివ్వియ' అను శబ్దమునందలి ఇయాకు ఎత్వము కలుగగా 'దివ్వె' అని బాలవ్యాకరణసూత్రవిధినిబట్టియే సిద్ధించును 'దివ్ + వ్ + ఇయ' అని యుండగా ప్రస్తుతసూత్రమువలన 'ఇ' లోపింపగా 'దివ్ + వ్ + య' అని యగును. రెండుకంటె ఎక్కువ వర్ణములు సంయోగము చెందినపుడు ద్విరుక్తమైన వర్ణము ద్విత్వమును గోల్పోవును. అప్పుడు 'దివ్య' అని యగును. 'దివ్యాభుపుం డ్రువ్వు' అని తిక్కన ప్రయోగము.

'కళ్ళియము' అనుదానిలో చివరి 'ము' ప్రత్యయము. 'కళ్లియ' అనునది నామము. అంతమందలి ఇయకు ఎత్వము రాగా 'కళ్లెము' అని యగును. 'ఇ' లోపింపగా 'కళ్యము' అని యగును. 'కళ్యాలు' అని తిక్కన ప్రయోగము గలదు. 'పల్లియము' అనునది 'పల్లెము' అనియు 'పళ్యము' అనియు కావచ్చును. 'పళ్యంబు' అని శ్రీనాథుని ప్రయోగము.

'పీడియము' అనునది 'పీడెము' అనియు, ప్రస్తుత సూత్రముచేత 'పీడ్యము' అనియుగూడ కావచ్చును.

మొట్టమొదటి లక్ష్యమైన 'కన్నియ' అనునది ఎత్వమును పొంది 'కన్నె' అని యగును. ప్రౌఢవ్యాకర్త 'ఇ' వర్ణము లోపించుటవలన 'కన్య' అను రూపమేర్పడె నని సూచించుచున్నాడు. సంస్కృతమునందలి 'కన్యా' అనునది హ్రస్వమును పొంది 'కన్య' యగును. అది తత్సమము. దానికిని 'కలను' అను అచ్చిక శబ్దమునకును మిశ్రసమాసము కలిగినది. అది సాధువే. రెండవ విభాగమున 'కన్యకల' అని యేర్పడును. 'కన్యకా' అను శబ్దము హ్రస్వమునొంది బహువచనాంతము కాగా 'కన్యకల'నని యగును. కావున ప్రస్తుత ప్రయోగము 'కన్య' శబ్దమును అచ్చికముగా స్థాపింపజాలదు. అందువలన ఇత్వలోపము జరిగినదనుటకును అవకాశములేదు.

మొత్తముమీద 'కన్య' శబ్దము తప్ప 'దివ్య' మున్నగు శబ్దము లన్నియు ఇత్వలోపమును గాంచినవే. బాలవ్యాకర్త చూపినవానిలో 'కన్నియ' శబ్దమును మాత్రమే ప్రౌఢవ్యాకర్త గ్రహించెను. తక్కినవానిని దాను సొంతముగా చూపెను. బాలవ్యాకర్త చూపిన శబ్దములలో ఇత్వలోపము కలుగదు. కావుననే ప్రౌఢవ్యాకర్త వానిని విడిచిపెట్టెను.

బాలవ్యాకరణము దీనిని బహుళవిధిగా పేర్కొన్నది. కావున 'కన్నియ' మున్నగుచోట్ల ఇయకు మారుగా ఎత్వము వికల్పముగా వచ్చును. 'ముత్తియము' మున్నగుచోట్ల ఇత్వలోపము సైతము వచ్చును. 'సందియము' మున్నగుచోట్ల ఇయకు మారుగా ఎత్వముగాని, ఇత్వలోపముకాని రావు. కావున ప్రౌఢవ్యాకర్త అన్యత్వమునకు ...యములనుచూపి బహుళవిధి కనుకూలముగా బాలవ్యాకరణమును పూరించెనని యనవచ్చును.

**29.** ఎద్దు దేవర శబ్దములకు లులలు పరంబు లగునపుడు దకారంబునకు డకారంబును డకారంబునుత్వంబునకు లోపంబును వికల్పముగాను, రేఫమునకు ళకారమును ళకారంబు నత్వంబునకు లోపంబును నిత్యముగాను క్రమంబుగ నగు. (ప్రౌ - ౩౦)

ఎద్దులు - ఎడ్డులు - ఎడ్లు; ఎద్దులన్ - ఎడ్డులన్ - ఎడ్లన్; దేవళ్లు - దేవళ్లన్॥ మొ.

వ్యాఖ్య - లులలు పరమగునప్పుడు ఎద్దు శబ్దముయొక్క దకారమునకు డకారమును, దాని ఉత్వమునకు లోపమును వికల్పముగా నగును; దేవర శబ్దముయొక్క 'ర' కారమునకు 'ళ' కారమును, దాని అత్వమునకు లోపమును నిత్యముగా నగునని సూత్రార్థము.

'ఎద్దు' అను శబ్దమునకు బహువచనము పరమై 'ఎద్దులు' అని యగును. ప్రస్తుతసూత్రముచేత వికల్పముగా దకారము డకారమైనయెడల 'ఎడ్డులు' అని యగును. దాని ఉత్వమునకు వికల్పముగా లోపము వచ్చినయెడల ఒక డవర్ణమునకు లోపముకు-డనై 'ఎడ్లు' అని యగును. లడాగమము కలిగినపుడు కూడ ఇట్లే ఎద్దులన్ - ఎడ్డులన్ - ఎడ్లన్॥ అను విధముగా రూపము లుండును.

'దేవర' శబ్దమునకు బహువచనము పరముకాగా నిత్యముగా 'రా'కు బదులు 'ళా' వచ్చును: అత్వము లోపించును. అప్పుడు 'దేవళ్లు' అని యగును. ద్వితీయాది విభక్తులయందు దేవళ్లన్, దేవళ్లచేత-మున్నగువిధముగా రూపము లుండును.

[వరి శబ్దమునకు బహువచనము 'వడ్లు' అనునది. ఈ రూపము "తల చుగ ధాన్యవాచకశబ్దములును" అను సూత్రముక్రింద ఉదాహరణములలో చూపబడినది. "వరి శబ్దమునకు లులలు పరమగుచో రకారంబునకు డకారంబును, దాని స్వరంబునకు లోపంబును నిత్యంబుగ నగు" — అని పైవానికి వలెనే దీనికిని ప్రక్రియను చూపియుండిన బాగుండెడిది.]

## నామప్రకరణము

**30. శబ్దములు విశేష్యములు విశేషణములు లని ద్వివిధంబులు.**

(ప్రౌ - ౧)

అయ్య, అన్న, అమ్మ, అక్క - మొదలగునవి విశేష్యములు ; తక్కినవి విశేషణములు.

వ్యాఖ్య - శబ్దములు విశేష్యములని విశేషణములని రెండు విధములుగా నుండు నని సూత్రార్థము.

ఇచ్చట 'శబ్దము' అనుమాట 'నామము' అనువర్థమున నుపయోగింపబడి యుండును. నామముపై ప్రథమాదివిభక్తులు చేరగా 'పదము' ఏర్పడును. అట్టి పదములనుగూర్చి చెప్పుటయే ప్రయోజనముగా ఈ ప్రకరణము ప్రారంభమగుచున్నది. బాలవ్యాకరణము పదములనుగూర్చి చెప్పుటకు తత్సమపరిచ్ఛేదము, అచ్చికపరిచ్ఛేదము - అనురెండు పరిచ్ఛేదముల నుపయోగించుకొనెను. ప్రౌఢవ్యాకరణము ఆరెం[illegible] శబ్దపంచ్ఛేదము అనుపేర నొక్కచోటనే చెప్పుచున్నది. అందు మొదటి విషయముగా పదములను విభాగించుచున్నది.

"పదము లవి నామములు క్రియ లవ్యయంబులని త్రివిధంబులు" అని ప్రౌఢవ్యాకరణము వాక్యపరిచ్ఛేదమున తెల్పెను. అందు 'నామములు' అని చెప్పబడినవే ప్రస్తుతము ఈ విధమగు విభాగమును పొందుచున్నవి.

తాను చెప్పదలచుకొన్న ప్రణాళిక ననుసరించి విశేష్యములు విశేషణములు నని సూత్రకర్త పదములను రెండువిధములుగా విభాగించెను. అందు అయ్య, అన్న, అమ్మ, అక్క - మున్నగునవి విశేష్యములనియు, తక్కినపదములు విశేషణము లనియు తెలిపెను విశేషణ విశేష్యపదములను బాలవ్యాకర్త కూడ వాడియుండెను. కాని వాని విభాగమునుగాని, వాని నిర్వచనములనుగాని దెలుపలేదు. అచ్చికముల విషయమున సూక్ష్మవివేచనమునకు పూనుకొనియుండుటచేత ప్రౌఢవ్యాకర్త ఆపని చేయుచున్నారు.

**31 విశేష్యమనా విశేషణముచేఁ దెలుపఁబడు విశేషముగలది; విశేషణమనా జాత్యాది విశేషములను దెలుపునది.** (ప్రౌ - ౨)

వ్యాఖ్య - విశేషణముచేత తెలుపబడు విశేషము గలదానికి విశేష్యమనియు, విశేష్యముయొక్క విశేషమును తెలుపుదానికి విశేషణమనియు నందురని సూత్రార్థము.

అమ్మ, అయ్య, కొలను, నగరము - మున్నగునవి విశేష్యములు.

జాతి, క్రియ, గుణము - మున్నగు విశేషములను తెలియజేయు బ్రాహ్మణుఁడు, పోవువాఁడు, నల్లనివాఁడు - మున్నగునవి విశేషణములు.

**32.** విశేషణము జాత్యాదిభేదంబుచే షడ్విధంబు (ప్రౌ - ౪)

అవి - జాతిప్రయుక్తవిశేషణము, క్రియాప్రయుక్తవిశేషణము, గుణప్రయుక్త విశేషణము, ద్రవ్యప్రయుక్త విశేషణము, సంఖ్యాప్రయుక్తవిశేషణము, సంజ్ఞాప్రయుక్త విశేషణము॥ ౧. జాతిప్రయుక్త విశేషణమునకు - బ్రాహ్మణుడు. ౨. క్రియాప్రయుక్తవిశేషణమునకు - పోవువాఁడు 3. గుణప్రయుక్తవిశేషణమునకు - నల్లనివాఁడు ౪. ద్రవ్యప్రయుక్తవిశేషణమునకు - ధనవంతుఁడు. ౫. సంఖ్యాప్రయుక్తవిశేషణమునకు - ఒక్కఁడు ౬. సంజ్ఞాప్రయుక్త విశేషణమునకు - దేవదత్తుఁడు॥ మొ.

వ్యాఖ్య - జాతి మున్నగు భేదములచే విశేషణము ఆఱు విధములుగా నుండునని సూత్రార్థము.

ఒక వర్గము నితరవర్గములకంటె భిన్నముగా నిరూపించు ధర్మమునకు జాతి యనిపేరు. 'బ్రాహ్మణుఁడు' అనియన్నప్పుడు క్షత్రియాది వర్గములకంటె భిన్నమగు నొకధర్మమును గల్గినవ్యక్తి బోధింపబడును. కావున నిది జాతిప్రయుక్త విశేషణము

క్రియ యనగా 'చేష్ట' యని యర్థము. 'పోవువాఁడు' అన్నది చేష్టను బోధించుటచేత క్రియాప్రయుక్తవిశేషణ మగుచున్నది.

గుణము అని యనగా స్వభావ మని యర్థము. రంగు, రుచి మున్నగు వానిని దెల్పునని భావము. 'నల్లనివాఁడు' అన్నది గుణమును బోధించుటచేత గుణప్రయుక్త విశేషణము.

ద్రవ్యము అని యనగా పదార్థమని యర్థము. ఏ వస్తువు నైనను ద్రవ్య మని యనవచ్చును. 'ధనవంతుఁడు' అని యన్నప్పుడు 'ధనము' అను ద్రవ్యమును కలవాడను నర్థము కలుగుటచేత ద్రవ్యప్రయుక్తవిశేషణము.

సంఖ్యతో కూడికొనిన విశేషణమును సంఖ్యాప్రయుక్త విశేషణమని యందురు. ఒక్కఁడు, ఇద్దరు — మున్నగునవి లెక్కను తెలియజేయుటచేత సంఖ్యాప్రయుక్త విశేషణములు.

సంజ్ఞ యనగా పేరని యర్థము. కావున 'దేవదత్తుఁడు' మున్నగు పేళ్లను సంజ్ఞాప్రయుక్త విశేషణములని యందురు.

[విశేషణములను ఈవిధముగా విభాగించుట క్రొత్త. పూర్వులు శబ్దమును జాతి గుణ క్రియా సంజ్ఞలనుబట్టి నాలుగు విధములుగా విభాగించిరి. విశేషణములను ఇట్లు విభజించుట ఆంగ్లవ్యాకరణ ప్రభావము వలన నైయుండును.

'జాత్యాదిభేదంబులచే' నని సూత్రమునం దుండుటచే పైనిచెప్పిన షడ్విధ విశేషణములలోనికి చేరకుండ క్రియాజన్యవిశేషణములు, క్రియావిశేషణములు - మున్నగునవి వేరుగా నుండిపోవలసి వచ్చుచున్నది.

**33.** విశేష్యంబు ప్రధానం బితరం బప్రధానంబు. (ప్రౌ - ౬)

వ్యాఖ్య — వాక్యమునందు ప్రధానమైనది విశేష్యము. ప్రధానము కానిది ఇతరము — అని సూత్రార్థము.

ఇది విశేషణ విశేష్యప్రసంగ మగుటచే 'ఇతర' మని యన్నప్పుడు 'విశేషణము' అని గ్రహించుట సందర్భమునకు సరిపడి యుండును.

**34.** ప్రధానంబు పశ్చాద్వాచ్యం బగు. (ప్రౌ - ౭)

అన్వయక్రమమునందు విశేషణములను ముందు చెప్పి కడపట విశేష్యమును జెప్పవలెననుట.

వ్యాఖ్య — ప్రధానము వెనుకగా చెప్పబడు నని సూత్రార్థము. సాధారణముగా వాక్యమునందు విశేషణములను ముందుగా చెప్పి, పిదప విశేష్యమును చెప్పవలయు నని వివరణవాక్యముయొక్క తాత్పర్యము.

అన్వయక్రమము అని యన్నప్పుడు వాక్యమునందలి శబ్దముల విన్యాస క్రమము అని యర్థము. కొందఱు వాక్యమును విన్నపిమ్మట అవగాహనము చేసికొనుటకు గాని, వ్యాఖ్యానము చేయుటకు గాని అన్వయించుకొను క్రమ మని యర్థము చెప్పుదురు. కాని అది సమంజసము కాని, సందర్భసముచితము కాని కాదు. ఎట్లు అన్వయము చెప్పుకొనవలయునన్నది వ్యాకరణ విషయము కాదు. కావున వ్యాకర్త పాఠకుని దృష్టిలో నుంచుకొని పలుకుచున్నాడనుటకంటె వక్తను ఉద్దేశించియే పలుకుచున్నాడనుటయే సమంజసముగా నుండును. ఈ తరువాతి సూత్రము (?) కూడ శబ్దవిన్యాసక్రమమునే సూచించుచున్నది.

[ప్రస్తుతసూత్రమునందు "ప్రధానంబు" అనుటకు బదులుగా 'విశేష్యంబు' అని మార్చుకొన్నచో పూర్వసూత్రమును పూర్తిగా తొలగింపవచ్చును. దాని కింక ప్రయోజనమేమియు లేదు.]

బాలవ్యాకరణమునందు "ఏకవాక్యంబునం దొకానొక్కెండు తక్క సర్వ పదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపం జను" అని (కారక - 37) కలదు. విశేషణ విశేష్యములు క్రమము నపేక్షించు నని తెల్పి ప్రౌఢవ్యాకర్త దానిని సవరింపబూనుకొనెను. కాని విశేషణవిశేష్యవిభాగమే నిర్దిష్టము కాదు. క్రమమును నియతము కాదు. ఆ విషయమును తరువాతి సూత్రములయందు ప్రౌఢవ్యాకర్తయే చెప్పుచున్నాడు. కావున ఈ సవరణము సమర్థముగా లేదు.

**35.** ఒక్కచో విశేషణంబులును విశేష్యంబు లగు. (ప్రౌ - రా)

నారదుం డిట్లనియె. మొ॥

వ్యాఖ్య - ఒక్కొక్కచోట విశేషణము విశేష్యముగా నుపయోగింపబడునని సూత్రార్థము.

'నారదుడు' అనునది సంజ్ఞాప్రయుక్త విశేషణము. పై లక్ష్యమునందు విశేష్యము వేరుగా లేదు. అనగా విశేషణముచేత తెలుపబడు విశేషము గలది వేరుగా లేదు. కావున విశేషణమే విశేష్యముయొక్క స్థానమును బొందిన దని భావము.

[నిజమునకు సంజ్ఞలను విశేష్యములుగా గ్రహింపవలయును. అట్లుకాక విశేషణములుగా గ్రహించుటయు, అవి మరల విశేష్యముల స్థానమున వచ్చిన వనుటయు సరియగు మార్గము కానే కాదు.]

**36** ఒక్కొకచో విశేష్య విశేషణంబులు వ్యత్యస్తంబులు నగు.

(ప్రౌ - లా)

నీ మాఱుదల్లి త్రిభువన భామారత్నంబు గంధవతిపై॥ హరి. పూ. ౨ ఆ॥.

వ్యాఖ్య - ఒక్కొక్కచోట విశేష్యమును విశేషణమును విన్యాసక్రమమునందు తారుమారగునని సూత్రార్థము.

తారుమారగుట యనగా మొదట చెప్పినట్లు విశేషణము ముందును, విశేష్యము తరువాతను ప్రయుక్తముకాక - ముందుగా విశేష్యము ప్రయుక్తమై ఆ తరువాత

విశేషణము ప్రయుక్తము కావచ్చునని యర్థము. పై లక్ష్యమునందు 'త్రిభువన భామారత్నంబు' అను విశేషణముకంటె ముందుగా 'మాఱుదల్లి' యను విశేష్యము ప్రయుక్తమైనది ఈ రెండింటికిని పిమ్మట 'గంధవతి' అను సంజ్ఞాప్రయుక్తవిశేషణము ప్రయోగింపబడినది. కావున విన్యాసక్రమమున విశేషణ విశేష్యములకు తడబాటు కలదని వ్యాకర్త యభిప్రాయము.

[ 'గంధవతి' యను సంజ్ఞను విశేషణముగా నెంచుట, విశేషణము ముందుగా విశేష్యము వెనుకగా ప్రయుక్తము లగు ననుట - యీ రెండును సరియైన నిర్ణయములు కావు. కావుననే యిన్ని తడబాటులు. నిజమునకు 'గంధవతి' యను విశేష్యమునకు సంబంధబోధకమై 'మాఱుదల్లి'యు గుణబోధకమై 'త్రిభువన భామారత్నంబు'ను విశేషణములే యగుచున్నవి. అట్లు నిర్ణయించుకొనుట తడబాటులేని మార్గము. ]

'మాఱుదల్లి' యనునది వ్యాకర్త నిశ్చయమునుబట్టి విశేష్యము కావలసియున్నది. కాని 'మాఱుదల్లియగు గంధవతి' అని యన్నప్పుడు 'గంధవతి' అన్నది ప్రధానమై విశేష్యమగుచున్నది. 'మాఱుదల్లి' యన్నది అప్రధానమై విశేషణ మగుచున్నది. ఇట్లు విశేషణము విశేష్యమగుటయు, విశేష్యము విశేషణ మగుటయుకూడ అక్కడక్కడ కలదని వ్యాకర్త సూచించుచున్నాడు.

[ విశేషణ విశేష్యములు వ్యత్యస్తము లగునని యనుటచేతనే 'విశేషణములు విశేష్యములగుట' యన్నదికూడ సిద్ధించుచున్నది. కావున ప్రస్తుతసూత్రము ప్రవర్తించునెడల, పూర్వసూత్రమునకు ప్రయోజన మెంతమాత్రమును లేదు. కావున అది నిరర్థకము. ]

**37. తెనుగునం గొన్ని శబ్దములు విశేష్యవిశేషణంబు లుభయంబు నగు.** (ప్రౌ - ౧౦)

కొన్ని యనఁగాఁ గీడు ప్రభృతులును నల్లాదులును.

వ్యాఖ్య - అచ్చికములైన 'కీడు' మొదలగు శబ్దములును 'నల్ల' మొదలగు శబ్దములును విశేష్యములుగను విశేషణములుగను కూడ ప్రయోగింపబడునని సూత్రార్థము.

[ లక్ష్యములను ప్రౌఢవ్యాకర్త చూపలేదు. సుబోధినీవ్యాఖ్యాకారులు చూపిన యుదాహరణములే యిక్కడ గ్రహింపబడుచున్నవి. ]

'కృష్ణ కృష్ణ! యనంత! యే కీడు లేదు' అనుచోట 'కీడు' శబ్దము విశేష్య ముగా వాడబడినది. 'కీడు' అనగా 'దోషము' అని కాని 'తక్కువదనము' అని కాని యర్థము చెప్పవచ్చును. 'తామ్రమాదిగఁ గలయట్టి ధాతుచయము। కొలిమి విడి యూఁదఁ గీడెల్లఁ బొలియునట్లు' అనుచోట కూడ 'కీడు' విశేష్యముగానే ప్రయో గింపబడినది. ఇక్కడ 'కీడు' శబ్దమునకు 'మాలిన్యము' అని యర్థము

'నీవేమిట నిమ్మహాధ్వరంబు కీడంటి?' అనుచోట 'కీడు' శబ్దము విశేషణ ముగా ప్రయుక్తమైనది 'కీడు' అనగా 'దోష యుక్తము' అని యర్థము. అట్లే 'వారల తలంపులు కీడు' అని యన్నప్పుడు 'దుష్టములు' అని యర్థమగుటచేత విశే షణమే యగుచున్నది.

'అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు। నల్ల గలిగిన' అన్నచోట 'నల్ల' అను శబ్దము 'నల్లఁదనము' అను నర్థమున నుపయుక్తమైనది. కావున విశేష్యము.

'ఈ నల్ల తిరునామ మెచట దొరికె।' అనుచోట 'నల్ల' శబ్దము 'తిరునా మము' అను విశేష్యముయొక్క గుణమును బోధించుటచేత విశేషణ మగుచున్నది.

**38. విశేషణంబులు కొన్ని వ్యవహితంబులు నగు. (ప్రౌ - ౧౧)**

ఈ లోకంబున వెదకితి। మే లెల్లెడఁ గాన వరుని॥ నిర్వ. 3 ఆ॥

వ్యాఖ్య - కొన్ని విశేషణములు విశేష్యములతో వ్యవధానము పొందియు నుండవచ్చు నని సూత్రార్థము. అనగా విశేషణములకును విశేష్యములకును నడుమ ఇతరపదములు ప్రవేశించి యెడమును గలిగింపవచ్చు నని తాత్పర్యము.

'మేలెల్లెడఁ గాన వరుని' అని యన్నప్పుడు 'ఎల్లెడ మేలు వరునిఁ గాన' నని యభిప్రాయము. 'వరుని' అన్నది విశేష్యము; 'మేలు' అన్నది విశేషణము. ఈ రెండును ఎల్లెడ, కాన అను రెండు పదములు నడుమ ప్రవేశించుటచేత వ్యవ హితములై యున్నవి. సాధారణముగా విశేషణ విశేష్యము లొకదాని నొకటి యంటి యుండవలయును. ఇట్టివి కూడ కొన్ని కలవన్న యభిప్రాయముతో ప్రౌఢవ్యాకర్త యీ సూత్రమును ప్రారంభించెను.

అభిప్రాయము సరియైనదే. ఇచ్చిన యుదాహరణ సరియైనది కాదు. 'మేలె ల్లెడఁ గానవరుని' అని యనుటకు బదులుగా 'మేలిల్లెడు వరునిఁగాన' వను పాఠము ముద్రిత ప్రతులయందు గలదు. ఇదియే సరియైనది. 'మేలిల్లు' అను ధాతువునకు

'శ్రేష్ఠుఁడగు' అని యర్థము. ఈయర్థమున నన్నిచోడాది కవుల ప్రయోగములును గలవు. కావున 'మేలిమైడు' అన్నది క్రియాజన్యవిశేషణమగుచున్నది. ఇది విశేష్యమును ననుసరించియే యున్నది; కావున వ్యవధాన ప్రసంగమున కిక్కడ తావులేదు.

"ఆ నహుషాత్మజుం డగు యయాతి యధిజ్యధనుస్సహాయుఁడై యానత శాత్రవుండు మృగయాలసలోల విబద్ధబుద్ధిఁ దత్కాననమెల్లఁ గ్రుమ్మరి నికామపథిశ్రమఁ దేఁగుదెంచె" అను చోట 'యయాతి' అను విశేష్యమునకు అధిజ్యధనుస్సహాయుఁడు, ఆనత శాత్రవుండు, నికామ పథిశ్రముఁడు — అన్నవి విశేషణములు. నడుమ 'మృగయాలసలోల విబద్ధబుద్ధిఁ దత్కాననమెల్లఁ గ్రుమ్మరి' అను వాక్య భాగమంతయు ప్రవేశించి వ్యవధానమును గలిగించుచున్నది. ఇట్లు వ్యవధానము కలుగుట పెక్కుచోట్ల కలదు.

**౩౯. విశేషణంబులు కొన్నియెడల విశేష్యలక్షకంబు లగు.**

(ప్రౌ - ౧౨)

దేవతల కప్రియంబులు। గావించి మనుష్యు లధమ గతులగుదు రిలన్। గావున వారికి నిష్టము। గావింపుము నన్నుఁ బ్రీతిఁ గావుము తరుణీ! (అప్రియంబులు = అప్రియకార్యములను ; ఇష్టము = ఇష్ట కార్యములు)॥ భార. అర. ౨౮॥ పరమ పతివ్రతన్ సభఁ దపస్వినిఁ బాండవధర్మపత్ని ధర్మరత సద్యోనిజన్ బ్రకృతి మానవభామినిఁగాఁ దలంచి దెప్పరములు పల్కఁగాఁ దగునె! (దెప్పరములు = దెప్పరపు మాటలను)॥ భార. సభా. ౨౮॥ బెట్టిదంబులంగాని చక్కంబడఁడు. (బెట్టిదంబులన్ = బెట్టిదపు మాటలచేత)॥ భార. అర. ౬౮॥ మొ.

వ్యాఖ్య - కొన్నిచోట్ల విశేషణములు విశేష్యములను సూచించునవిగా నుండు నని సూత్రార్థము. అనగా విశేష్యముల నుపయోగింపక పోయినప్పటికిని విశేషణములే విశేష్యములను స్ఫురింపజేయు లక్షణము కలవై యుండునని భావము.

'అప్రియములు' అన్నది కేవలము విశేషణము. దీనికి విశేష్యముగా ఉండ దగినది 'కార్యములు' అనునది. వాక్యమునందు ప్రయోగింపక పోయినప్పటికిని 'అప్రియములు' అను విశేషణముచేతనే 'కార్యములు' అను విశేష్యముకూడ స్ఫురించుట

జరుగుచున్నది. ఇట్లే తక్కిన ప్రయోగములందును విశేషణములే విశేష్యములను స్మరింపజేయుచున్నవి.

**40. దేశ్యమునం దక్కడాదులు నిత్యైకవచనాంతములు.**

(ప్రౌ - ౨౮)

అక్కడ, ఇక్కడ, ఎక్కడ; అచ్చట, ఇచ్చట, ఎచ్చట మొ॥ అది శబ్దముచేత ఇరులు–కేలు మొ॥ కొందఱు ఇరులు–కేలు శబ్దములు బహువచనము లందురు. అట్లు కాదు. ఇరులున నొంటిఁబోఁ బరసతి నెట్టుట॥ విజ్ఞా. ప్రా॥ కలభాషిణి వేసలి యొకకేలఁ బట్టి వేఱొక్క కేల నొఱగత్తి పెఱికె॥ కళా. ౩ఆ॥ ఉపధాన వినిమయం బొండొండ చూపుటఁ జెఱకేలు లణఁకువఁ బ్రిదిలి బిగియ॥ కవిక. ౮ఆ॥

వ్యాఖ్య — 'అక్కడ' మున్నగు దేశ్యశబ్దములు నిత్యము నేకవచనాంతములు గనే యుండునని సూత్రార్థము. అనగా ఆయాశబ్దములకు బహువచనరూపములు కలుగ వని తాత్పర్యము.

బాలవ్యాకరణమున (సంధి–14) గసడదవాదేశ ప్రసంగమున "అప్పు డిప్పు డెప్పు డను శబ్దములు నిత్యైకవచనాంతములు" అని ఒక వాక్యము గలదు అంతకు మించి వాని విశేషమేమియు చెప్పబడలేదు. కావున ప్రౌఢవ్యాకర్త ఆవిషయమును తీసికొని చెప్పుట సమంజసమైయున్నది.

అక్కడ మున్నగువానిపై ని బహువచనము చేరుట కవకాశములేదు. అవి యెప్పుడును ఏకవచనమునందే యుపయుక్తము కావలయును.

ఇరులు, కేలు — అను రెండు శబ్దములు 'లు' వర్ణాంతములై యుండుటచేత బహువచనాంతము లను భ్రమను కలిగించుట కవకాశము కలదు. కావున ఆ భ్రాంతిని వారించి, అవి ఏకవచనాంతము లని నిరూపించుటకు వ్యాకర్త లక్ష్యములను చూపుచున్నారు.

'ఇరులునన్' అని యనగా 'చీకటియందు' అని యర్థము. బాలవ్యాకరణము నందు "డు ము వు న లేకవచనంబులు" అని (తత్సమ – 11) న వర్ణకము నేకవచనప్రత్యయముగా పేర్కొనుట జరిగెను. ఇచ్చట 'ఇరులు' అన్నది ఏకవచనాంతముకానిచో 'నన్' అను సప్తమీప్రత్యయము కలుగనే కలుగదు. కావున ప్రస్తుత

ప్రయోగము 'ఇరులు' శబ్దముయొక్క ఏకవచనాంతత్వమును సమర్థముగా నిరూపించు చున్నది.

ఒకకేలఁబట్టి, వేఱొక కేలన్ – అని కేలుశబ్దమునకు ముందు 'ఒక' యను విశేషణమును జేర్చుటచేతనే ఏకత్వము నిరూపితమగుచున్నది. అది బహువచ నాంతమే యైనయెడల 'ఒక' యను ఏకార్థకమైన విశేషణమును చేర్చుటకు వీలు లేదు. కావున ఈ ప్రయోగము 'కేలు' శబ్దముయొక్క ఏకవచనాంతత్వమును నిరూ పించుచున్నది.

'కేలు' శబ్దము ఏకవచనాంత మని యనుటకు పైయుదాహరణము సమర్థము గానేయున్నది. అంతమాత్రమున దానిని నిత్యైకవచనాంత మని యనరాదు. ప్రౌఢ వ్యాకర్తయే తరువాతి లక్ష్యమునందు 'పెలుకేలుఁలు' అని బహువచనముతోఁడి రూప మును చూపెను. ఈ ప్రయోగము కూడ 'కేలు' అను శబ్దముయొక్క ఏకత్వమును నిరూపించుచున్నది. బహుత్వమునందు 'లు' వర్ణకముచేరి 'కేలులు' అని యగు చుండుటచేత దీనిని నిత్యైకవచనాంత మనియనుట పొసగదు.

[ 'ఇరులు, కేలు శబ్దము లేకవచనాంతంబులు' అని వేరుగా సూత్రించి యుండిన సమంజసముగా నుండెడిది. లువర్ణమును కలిగియుండుటచేత కలిగెడి బహువచనాంత భ్రాంతిని పోగొట్టుటకు సమర్థమై యుండెడిది. ]

**41. సస్యవాచక శబ్దములును. (ప్రౌ - ౪౧)**

ఆరుగ – చోడి – వరి – కంది – పెసర – మినుము మొ॥

వ్యాఖ్య - సస్యము అని యనగా 'పైరు' అని యర్థము. పైరునుగూర్చి చెప్పు శబ్దములు నిత్యైకవచనాంతము లని సూత్రార్థము.

[ పూర్వసూత్రమునందున్న 'నిత్యైక వచనాంతములు' అనుదాని నక్కడ నుండి ముప్పదిమూడవ సూత్రమువరకు ననువర్తింప జేయవలయును. ]

ఆరుగచేను, చోడిచేను - మున్నగు విధముగా ఏకవచనమునందే ప్రయోగ ముండును. 'పంట' యను నర్థమున కూడ ఆరుగపంట, చోడిపంట - మున్నగు విధముగా ఏకవచనముననే ప్రయోగింపబడును. సస్యవాచకము లని సూత్రమునందుం డుటచేత ధాన్యవాచకము లైనప్పుడు ఆరుగలు, చోళ్ళు, వడ్లు - మున్నగు విధముగా నుండుట కాక్షేపము లేదు. ఈ విషయము రాబోవు (ప్రౌఢ - 37) సూత్రమున ప్రస్తావింపబడును.

42. కతిపయ సంభారవాచక శబ్దములును. (ప్రౌ - ౫౦)

అముదము - ఇంగువ - ఉప్పు - చింతపండు - చమురు - పసుపు మొ॥

వ్యాఖ్య - సంభారములు అని యనగా పదార్థము లని యర్థము. సందర్భమునుబట్టి ఇండ్లయందు నిత్యము నుపయోగింపబడు పదార్థము లని యర్థము చేసికొనవలయును. సంభారములకు వాచకములయిన కొన్ని శబ్దములు నిత్యైకవచనాంతము లని సూత్రార్థము..

ఆముదము - మున్నగువానిని ఏకవచనాంతములుగానే వాడవలయును; వానికి బహుత్వమునందు ఉపయోగము కలుగ దని యర్థము.

43. లోహ వాచక శబ్దములును. (ప్రౌ - ౫౧)

ఇత్తడి - ఇనుము - కంచు - బంగారు - వెండి మొ॥

వ్యాఖ్య - లోహములను తెలియజేయు శబ్దములు నిత్యైకవచనాంతము లని సూత్రార్థము. అనగా వీనికి బహువచనాంత రూపములు కలుగ వని యర్థము.

44. సమానార్థకము లయిన యీ వెన సరి సాటి లోనగు దేశ్య విశేషణ శబ్దములును. (ప్రౌ - ౫౨)

స్వరములు సురములు శిరములుం। గరములుం బెండోడలు మెడలుం గన్నులు వెన్నుల్। సురుచిరపదములు రదములు। నిరుపురకుం జూడ నొక్క యీడై యునికిన్॥ రా. కిష్కిం॥ పతిం బడసి సుతులం బడయంగ। సతివలు గోరుదురు కోరినట్టుల తనకున్। బతిం బడసి సుతులం బడసెను। సతు లీ భార్గవికి భాగ్యసంపద వెనయే॥ భార. ఆది. ౩ఆ॥ సురపతి యమ వరుణ ధనే। శ్వర కమలాసనుల దివ్యసభలెల్ల నరే। శ్వర ! చూచితి నవి దీనికి। సరిగా వత్యంత విభవ సౌందర్యములన్॥ భార. సభా. ౧ఆ॥ హేమథరాధరేంద్రమున కెంతయుం బెద్ద ధృతిన్ భుజంగమ। స్వామికి మేలుచేయు పటువాగ్విభవంబున బుద్ధిసంపదం। దామరచూలికిన్ సరి ప్రధానులు దక్కినవారు సాటియే। మామిడి

వీరభద్రున కమాత్యశిఖామణి కివ్వసుంధరన్॥ నై ౧ ఆ॥ మొ. 'సరులు లేని దృక్కంజన శాబకములు' అని యొకచోఁ బ్రయోగము కానఁబడు చున్నది. అది శబ్దాలంకార తత్పరత్వమునఁ బ్రౌఢముగాఁ జెప్పఁబడిన దని గ్రహింపవలయును.

వ్యాఖ్య – 'సమానము' అను నర్థము గల్గి విశేషణము లయిన యీడు, ఎన, సరి, సాటి—మున్నగు దేశ్యశబ్దములు సహితము నిత్యైకవచనాంతములని సూత్రార్థము.

మొదటి యుదాహరణమునందు స్వరములు, ఉరములు - మున్నగునవి బహు వచనాంతములయిన విశేష్యములు. వానికి విశేషణము 'ఈడు' అనునది. ఇది యేక వచనాంతము. "విశేష్యమునకుం బోలె విశేషణంబునకు లింగవిభక్తి వచనంబులగు" అన్న బాలవ్యాకరణ (కారక – 18) సూత్రమునుబట్టి విశేషణముకూడ బహువచ నాంతమై యుండవలయును. 'ఈడు' శబ్దమునకు బహువచనరూపము లేనందువలన, ఏకవచనమే ప్రయుక్తమయ్యెను. కావుననే అది నిత్యైకవచనాంతము. రెండవ యుదాహరణమునందు "సతులిద్దర్గ వికి భాగ్యసంపద నెనయే" యని 'సతులు' అను బహువచనాంతమైన విశేష్యమునకు 'ఎన' అను విశేషణము ఏకవచనాంతముగా ఉప యుక్తమయ్యెను. మూడవయుదాహరణ 'దివ్యసభలు....దీనికి సరిగావు' అని బహు వచనాంత విశేష్యమునకు ఏకవచనాంతముగనే 'సరి' యను విశేషణము వాడబడెను. నడునాటి యుదాహరణమునందు 'తామరచూలికిన్ సరి' యని అన్నప్పుడు 'సరి' యను సమానార్థకశబ్దము ఏకవచనాంతమైన విశేష్యమునకు విశేషణముగా నుపయుక్త మైనది. 'ప్రధానులు దక్కినవారు సాటియే' అని యన్నప్పుడు 'సాటి' యన్న - బహువచనాంతవిశేష్యమునకు విశేషణమైనది.

పై లక్ష్యముల నన్నింటినిబట్టి ఈడు మున్నగుశబ్దములు నిత్యైకవచనాంతము లని నిర్ణయింపవచ్చును. శ్రీనాథుడు 'సరులు లేని దృక్కంజనశాబకములు' అని యొకచోట 'సరి' శబ్దమునకు బహువచనరూపమును ప్రయోగించెను. ప్రౌఢవ్యాకర్త దానిని సాధువుగా సమ్మతించుట లేదు. శబ్దముమీది వ్యామోహమువలన చేసిన ప్రౌఢప్రయోగమని యనుచున్నాడు, 'ప్రౌఢము' అని యనుట లక్షణవిరుద్ధమని యనుటకు మార్గాంతరము. అనగా అట్టి ప్రయోగమును చేయరాదనియే ఆయన భావము.

45. గుణ రస వాచకము లయిన దేశ్యవిశేషణశబ్దములును, (ప్రౌ - 33)

ఈ కాళ్ళు తెలుపు - ఆ కాళ్ళు నలుపు - ఈ పండ్లు తీపు - ఆ పండ్లు పులుపు.

వ్యాఖ్య — గుణములను దెల్పు దేశ్యవిశేషణ శబ్దములును, రసములను దెల్పు దేశ్యవిశేషణశబ్దములనుగూడ నిత్యముగా ఏకవచనాంతములే అయియుండునని సూత్రార్థము.

తెలుపు, నలుపు—మున్నగు రంగులను బోధించు శబ్దములు గుణవాచకములు. తీపు, పులుపు — మున్నగు రుచులను బోధించు శబ్దములు రసవాచకములు.

'కాళ్ళు' అనునది బహువచనాంతమైన విశేష్యము. దీని విశేషణముకూడ బహువచనాంతమై యుండవలసియున్నను నలుపు, తెలుపు - మున్నగునవి నిత్యైక వచనాంతము లగుట వలన నున్నవి యున్నట్లుగనే ప్రయుక్తము లయినవి. కాకి నలుపు, - కాకులు నలుపు: హంస తెలుపు - హంసలు తెలుపు॥ మున్నగువిధముగా ఏకవచనాంతబహువచనాంత విశేష్యములు రెండింటికిని గుణవాచకములు విశేషణములై యొకేమాదిరిగా నుండును. నారింజ పులుపు - నారింజలు పులుపు : మామిడి తీపు - మామిళ్ళు తీపు॥ మున్నగువిధముగా నుండును.

'తెలుపు' మున్నగునవి 'తెల్లన' మున్నగువిధముగను, 'పులుపు' మున్నగునవి 'పుల్లన' మున్నగువిధముగను ప్రయుక్తమైనప్పుడు నిత్యైకవచనాంతములై యుండును. తెల్లని, పుల్లని-మున్నగువిధముగా నున్నప్పుడు అది, అవి శబ్దములతో సమసించి తెల్లనిది, పుల్లనిది - మున్నగువిధముగా ఏకవచనమునందును; తెల్లనివి, పుల్లనివి - మున్నగువిధముగా బహువచనమునందు నుండును. 'తెల్లని' మున్నగునవి నిత్యైకవచనాంతములలోనివి కావని దీనినిబట్టి గ్రహింపవలయును.

[ సూత్రమునందు గుణ, రస వాచకము లని యుపయోగించుట కలదు. గుణముచేత రంగును, రసముచేత రుచిని స్వీకరింపవలయునని ప్రౌఢవ్యాకర్త యభిప్రాయము. ఒక్క 'గుణ' శబ్దముచేతనే పొడుగు, కుఱుచ, సన్నము, లావు- మున్నగు రూపవాచకములను, తెలుపు - మున్నగు వర్ణవాచకములను, పులుపు- మున్నగు రసవాచకములను, మెత్తన, చిక్కన, పలుచన - మున్నగు స్పర్శ వాచకములను గ్రహింప వీలగును. సూరి సమాసపరిచ్ఛేదమునందు "గుణవచ

నంబులగు నల్లాదులకు" అని సూత్రమునందు తెల్పి, "నల్ల, తెల్ల, పచ్చ, ఎఱ్ఱ, చామ, తియ్య, కమ్మ, పుల్ల, విన్న, తిన్న, అల్ల - ఇత్యాదులు నల్లాదులు' అని వివరించెను, కావున "గుణవాచకములయిన" అని సూత్రమున నుండిన చాలును. రసశబ్దమును తొలగింపవచ్చును. అట్లు కాకున్నచో వర్ణరసవాచక ములు మాత్రమే గ్రహింపబడగా రూపస్పర్శ వాచకములను విడువవలసి వచ్చును. అది ప్రౌఢవ్యాకర్తకు సమ్మతము కాదు. ]

**46 కొన్ని యవ్యయంబులు బహువచనాంత తుల్యంబులు నగు.**

**(ప్రౌ - ౪౪)**

అట్టు - అట్లు ; ఇట్టు - ఇట్లు ; ఎట్టు - ఎట్లు ; నిచ్చ - నిచ్చలు ఇత్యాదులు.

వ్యాఖ్య - అవ్యయము లనియనగా లింగవిభక్తి వచనశూన్యములని యర్థము. అనగా ఎప్పుడును మారుపాటు లేకుండ ఒకే విధముగా నుపయోగింప బడునవని తాత్పర్యము. కావున వానికి లింగ సూచకముగా కాని, విభక్తి సూచకముగా కాని, వచనసూచకముగా కాని ప్రత్యయము లేమియు చేరవు. కాని అట్టు, ఇట్టు, ఎట్టు, నిచ్చ - మున్నగు అవ్యయములకు పైని 'లు' వర్ణము కొన్నియెడల చేరుచున్నది. అవ్యయములకు బహువచనాంతత్వము లేదు కాబట్టియే; సూత్రకర్త 'బహువచనాంత తుల్యములు' అని మిక్కిలి జాగరూకతతో తెల్పి 'లు'వర్ణము పరమందు చేరుచున్న విషయమును సూచించు చున్నాడు.

'అట్టు' అన్నది 'లు' వర్ణము చేరగా 'అట్టులు' అని యగును. "బహువచ నంబు పరంబగునపుడు డ ల ట ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు" అను (బాల - అచ్చిక - 12) విధినిబట్టి ఉత్వలోపము కలుగును. "పెఱపల్లు కూడుచో జడ్డకు లోపంబగు." కావున ద్విత్వమునకు లోపము కలిగి 'అట్లు' అను రూపమేర్పడును. ఇట్టివే ఇట్టులు, ఇట్లు; ఎట్టులు, ఎట్లు – అను రూపములు కూడ. 'నిచ్చ' యనునది 'నిత్య' శబ్దభవము. ఇదియు 'లు' వర్ణమునొంది బహువచనాంత తుల్యముగా ప్రయుక్తము కావచ్చును.

సూత్రమునందు "బహువచనాంతతుల్యంబులు నగు" అని సముచ్చయార్థక మును వాడుటచేత అట్టు, ఇట్టు, ఎట్టు, నిచ్చ – మున్నగు లు వర్ణవిరహితరూపము లను వాడుట కెట్టి యభ్యంతరమును లేదు.

**47. అందఱ్ఱాదులు నిత్య బహువచనాంతములు.** (ప్రౌ - 3౫)

అందఱు - ఇందఱు - ఎందఱు - కొందఱు - పెక్కండ్రు - పలుగుండ్రు.

వ్యాఖ్య - అందఱు మున్నగు శబ్దములు నిత్యబహువచనాంతము లని సూత్రార్థము. అనగా వీనికి ఏకవచన రూపము లుండ వని భావము.

బాలవ్యాకరణమునందు "అన్ని ప్రభృతులు సర్వనామంబు" లన్న సూత్ర వివరణము (ఆచ్ఛిక - 24) నందు "అన్ని మొదలగు శబ్దంబు లాయును ద్విప్రభృతి సంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబులగు: అమహదర్థంబు లేకవచనాంతంబు లగు" అని కలదు. అందున్న అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పెక్కు, పలు - అను శబ్దముల మహదర్థక బహువచనరూపములే వరుసగా ఇక్కడ చూపబడినవి. కావున ఇది బాలవ్యాకరణమునందు తెలుపబడినదే కాని క్రొత్తది కాదు. సూరి చెప్పిన ద్విప్రభృతి సంఖ్యావాచకములను ప్రౌఢవ్యాకర్త విడిచిపెట్టెను. ఇద్దరు, ముగ్గురు, నలుగురు, ఐదుగురు, ఆఱుగురు, ఏడుగురు, ఎన మండ్రు, తొమ్మండ్రు, పదుగురు - మున్నగునవి కూడ నిత్యబహువచనాంతములే. ప్రౌఢవ్యాకర్త యుదాహరణములకు సిమ్మట 'మొదలగునవి' అన్న సూచన చేసి యుండిన వీనిని గ్రహింపవచ్చును. కాని ఇక్కడ అట్టి సూచన కానరాదు. అయినను 'ఇద్దరు' మున్నగునవి నిత్యబహువచనాంతములని యనుటకు సందేహము లేదు.

**48. అదరులు లోనగు శబ్దములును.** (ప్రౌ - 36)

అదరులు - అటుకులు - ఎండువులు - మిడుంగురులు నొ॥ ఇవి వృత్తియం దేకవచనాంతంబుల యగు - అదరుటగ్గి మొ॥

వ్యాఖ్య - 'అదరులు' మొదలయిన శబ్దములు బహువచనాంతము లని సూత్రార్థము. అనగా 'అదరులు' మున్నగువానికి లు వర్ణ విరహితరూపములు లేవని భావము. సమాసమునందు పూర్వశబ్దమైనప్పుడు మాత్రము 'లువర్ణ' విరహితముగానే యుండునని వ్యాకర్త వివరణమునందు తెలిపెను.

'అదరులు' అని యనగా మిణుగురు లని యర్థము. ఈ యర్థమునం దీశబ్దము నిత్యబహువచనాంతమై యుండును. 'అదరుటగ్గి' అను సమాసమునందు పూర్వ శబ్దముగా నున్నప్పుడు ఏకవచనాంతమే కావలయు ననియు నియమము చేయబడినది.

[అదరు - అన్నప్పుడు 'కంపము' అను నర్థము కలదు. 'అదరును బెదరు నెయ్యంబు తియ్యంబు' అని మున్నగువిధముగా ఏకవచనమునందు ప్రయోగములు గలవు. కావున నిత్యబహువచనాంతమైన 'అదరులు' అను శబ్దము యొక్క అర్థమును వ్యాకర్త సూచించియుండిన బాగుండెడిది. కానియెడల 'కంపము' అను నర్థమున సైతము నిత్యబహువచనాంతము కావలసివచ్చును. అది ప్రయోగ విరుద్ధము. అట్లే సమాసమునందు 'అదరులయగ్గి' అనునట్లుండ రాదని ఏవార్థకముచేత వారించుటయు సరికాదు. సందర్భమును బట్టి రెండు విధముల నుండుటయే యుచితము.]

'అటువుళ్ళు' అని యనగా 'ముక్కలు' అని యర్థము. "ఆ మెయిన వివిధ వర్మ స్తోమం బటువుళ్లు సేసి" అని యున్నప్పుడు "ముక్కలుచేసి" యని యర్థము చెప్పుకొనవచ్చును. ఇదియు నిత్యబహువచనాంత మని వ్యాకర్త యభిప్రాయము. సమాసమున పూర్వశబ్దమైనపుడు ఏకవచనాంతముగనే "అటువుడుఁ గుప్పనంపుఁ జొరలై" అను మున్నగు విధముగా నుండును.

'ఎండువులు' అని యనగా 'ఎండఁబోసిన ధాన్యము' అని యర్థము. ఇదియు బహువచనాంతమై యుండును.

'మిడుఁగుఱులు' అని యున్నప్పుడు మిడుఁగురుపురువులని వ్యాకర్త యభిప్రాయము కావలయును. అప్పుడైనను బహువచనాంతమే అయియుండవలయునని నిర్ణయించు ప్రయోగము కానరాదు. 'మిడుఁగుఱు' అనునది సమాసమున బూర్వ శబ్దముగా ఏకవచనాంతమై 'మిడుఁగుఱుఁబుర్వులు' మున్నగు విధముగా నుండ వచ్చును. బహుత్వముకలిగి సమాసమున పూర్వశబ్దముగా నుండరా దనుటకును దగిన ప్రయోగము కానరాదు. 'విస్ఫులింగము' అను నర్థమున 'మిడుఁగుఱు' ఏక వచనాంతమై ప్రయుక్తమైనది. 'మిడుఁగు అని తలఁచు బాలుఁడు॥ మిడుఁగుఱుఁ బుర్వుఁ గని' అని నృసింహపురాణ ప్రయోగము.

[అర్థమును నియతము చేయకుండుటవలన ఈసూత్రమునకు అతివ్యాప్తి దోషము పట్టుచున్నది. అంతేకాక 'ఎండువులు' అను శబ్దము కాక తక్కినవానిని నిత్యబహువచనాంతము లని యనుటకును తగినంత ప్రామాణ్యము కానిపింపదు]

**49. తఱచుగ ధాన్యవాచక శబ్దములును.** (ప్రౌ - ౩౭)

ఆళ్ళు - చోళ్ళు - వడ్లు - కందులు - పెసలు - మినుములు మొ॥ తఱచుగ ననుటచే బియ్యము, జీలకఱ్ఱ - ఇవి ధాన్యవాచకము లయ్యును నిత్యైకవచనాంతములే యని గ్రహింపవలయును.

వ్యాఖ్య - ధాన్యవాచకములయిన ఆళ్ళు, చోళ్ళు - మున్నగు దేశ్యశబ్దములు తరుచుగా నిత్యబహువచనాంతములై యుండునని సూత్రార్థము.

"తఱచుగ" నని యనుటవలన బియ్యము, జీలకఱ్ఱ - మొదలయిన సంభార వాచకములు కొన్ని నిత్యైకవచనాంతములై యుండును. అనగా కొన్ని శబ్దములు ధాన్యవాచకము లయ్యును సంభారవాచకములుకూడ నగుచుండును. అట్టి యెడల సంభారవాచకత్వముచేత నిత్యైకవచనాంతములుగా ప్రయోగింపబడుచుండును.

పూర్వసూత్రము (ప్రౌఢ - 29) చేత ద్రవ్యవాచకమైనప్పుడు ఏకవచనాం తత్వము నొంది కందిచేను, వరిపంట - మున్నగువిధముగా ప్రయుక్త మగుటకు ప్రస్తుతసూత్రము అభ్యంతరము కలుగ జేయదు.

**50. క్రీడా విశేష వాచక శబ్దములును. (ప్రౌ - 30)**

అచ్చనగాయలు - ఓమనగుంటలు - కనుమూసిగంతలు - గుజ్జెనగూళ్ళు - బొమ్మపెండ్లిండ్లు - ఉప్పనబట్టెలు - కుప్పిగంతులు - దాఁగిలి ముచ్చులు - పుట్ట చెండ్లు - బిల్లఁగోళ్ళు - సరిబేసులు మొ॥ ఒకానొక కవి యిందుఁ గొన్నింటి నేకవచనాంతములుగాఁ బఠించి యున్నాఁడు. అది విచార్యము.

వ్యాఖ్య - పూర్వసూత్రమునందలి 'తఱచుగ' అను శబ్దమును పూర్వ మందును. 'నిత్యబహువచనాంతములు' అను దానిని పరమందును అనువర్తింప జేసి కాని యీ సూత్రమును పఠింపవలయును.

కొన్ని విశిష్టములయిన ఆటలను దెల్పు దేశ్యశబ్దములు తరుచుగా నిత్యబహు వచనాంతములై యుండు నని సూత్రార్థము. ఏయే క్రీడలకు బహువచనాంతత్వము నిత్యముగానగునో ప్రయోగములనుబట్టి గ్రహింపవలయును. సూత్రమునందు 'క్రీడా విశేష వాచకశబ్దములు' అని యనుటచేత పై నుదహరించిన యాటలవంటి వానికే నిత్యబహువచనాంతత్వము కలుగును. సామాన్యములయిన క్రీడలకు బహువచనాం తత్వము కలుగవలసిన యవసరము లేదు.

అచ్చనగాయలు, ఓమనగుంటలు, కనుమూసినగంతలు - మున్నగునవి బహు వచనాంతములయిన క్రీడావాచకములకు లక్ష్యములు.

కుందెనగిలి, చిట్లపొట్లకాయ, చిడుగుడు, చిల్లకట్టె, చాఁకిమూట - మున్నగునవి యేకవచనాంతము లయిన క్రీడా వాచకములకు లక్ష్యములు.

ప్రౌఢవ్యాకర్త చూపిన ప్రయోగములలో 'సరిబేసులు' వంటి కొన్నింటిని ఒక కవి 'సరిబేసి' మున్నగువిధముగా ఏకవచనాంతములుగా ప్రయోగించియున్నాడు. వాని సాధుత్వము విషయము విచార్యమని వ్యాకర్త యభిప్రాయము. అనగా అది సరియైన రూపము కాదనియే తన తాత్పర్యము.

51. తఱచుగా ద్రుతసమంబులగు దేశ్యశబ్దములకుఁ గడపలఁ గొన్నింటి కేకవచనంబునం బూజ్యతయందు గారు శబ్దంబగు. (ప్రౌ - ౩౫)

అయ్యగారు - అమ్మగారు - తల్లిగారు - తండ్రిగారు - రాజుగారు - రాణిగారు - సెట్టిగారు - నాయుఁడుగారు - దేవిగారు మొ॥

మూఁడుగా రనుటయు కాని మా దశరథావని భర్తకు మీకు భేదమే॥ ఉ. రా. ౫౫॥ మొ. (నాయుఁడుగారు, దేవిగారు - వీనికిఁ దఱచు శబ్దంబు శరణంబు.)

వ్యాఖ్య - ద్రుతసమములయిన కొన్ని దేశ్యశబ్దములకు చివర 'గారు' అను శబ్దము ఏకవచనమునందు పూజ్యతయందగునని సూత్రార్థము.

ద్రుతసమము లని యనగా ప్రథమైకవచనలోపము కలిగిన శబ్దములని యర్థము. అయ్య, అమ్మ - మున్నగునవి ద్రుతసమములు. ఇవి ఏకవచనాంతములై యుండి, పూజ్యత్వ ప్రతిపాదకము లగునప్పుడు 'గారు' అనుశబ్దమును పొంది అయ్యగారు, అమ్మగారు - మున్నగువిధముగా నగును.

'నాయుఁడు' అనునది ద్రుతసమముకాదు. అయినప్పటికిని 'గారు' శబ్దము అను ప్రయుక్తమగుచున్నది. 'దేవి' శబ్దము తత్సమము, స్త్రీలింగము. అయినప్పటికిని 'దేవిగారు' అని గారు శబ్దముతోడి రూపమును పొందుచున్నది. సూత్రమునందు "తఱచుగ" అని చెప్పుటచేత ద్రుతసమభిన్నములయిన వీనిని గూడ గ్రహింపవలయునని సూత్రకర్త వివరణము నందలి ఆశయము.

[ సూత్రమునందు "దేశ్యశబ్దంబులకు" అని కలదు. నిజమునకు అయ్య, అమ్మ, రాజు, రాణి, సెట్టి - యనునవి దేశ్యములు కావు. ఆర్యశబ్దభవము అయ్య అంబాశబ్దభవము అమ్మ. రాజశబ్దముయొక్క తత్సమరూపము రాజు. (ప్రౌఢ వ్యాకర్త వైకృతమును కూడ అంగీకరించెను. అదియు దేశ్యపదము కాదు). రాజ్ఞీ శబ్దభవము రాణి. శ్రేష్ఠికి తద్భవము సెట్టి. కావున సూత్రమునందు 'దేశ్యశబ్దంబులకు' అని కాక తానిచ్చిన లక్ష్యముల నన్నింటిని సంగ్రహించుటకు వీలుగా "అచ్చికశబ్దంబులకు" అని యుపయోగించుట యుచితము. 'ఏకవచనము' అనునది డు, ము, వు, న - అను ప్రత్యయములకు బోధకము. ప్రౌఢవ్యాకర్త దానిని గమనింపక 'ఏకత్వము' అను నర్థమున ఈ శబ్దమును వాడుట కనిపించును. సూత్రమునం దిట్లు వాడుట సమర్థనీయము కాదు. ]

తఱచుగా అవి యనుటచేత 'గారు' శబ్దము అనుప్రయుక్తము కాని రూపములుకూడ నుండవచ్చును.

**52. ద్వితీయాదులందు రు రి యగు. (ప్రౌ - ౪౦)**

ద్వితీయాది విభక్తులయందు గారు శబ్దమునందలి రు వర్ణమునకు రివర్ణం బగుననియర్థము. అయ్యగారిన్ - అయ్యగారితోన్ - అయ్యగారికిన్. ॥మొ.

వ్యాఖ్య - పూర్వసూత్రమునందు అనుప్రయుక్తమైన గారు శబ్దముయొక్క రు వర్ణము ద్వితీయాదివిభక్తులు పరమగు నప్పుడు రి వర్ణముగా మారునని సూత్రార్థము.

'అయ్యగారు' అనుదానికి తృతీయావిభక్తిప్రత్యయమగు 'తోన్' పరము కాగా రు వర్ణము రివర్ణమై 'అయ్యగారితోన్', అని యగును. తక్కిన రూపములవిట్లే యూహించుకొన వచ్చును.

**53. డుమంతంబులగు తత్సమాదిశబ్దంబులకుం గొన్నింటికి ద్వితీయా బహువచనంబుమీఁదం బూజ్యతయందు గారునకు మాఱుగ వారగు. (ప్రౌ - ౪౧)**

శ్రీరాములవారు - వసిష్ఠులవారు - వ్యాసులవారు - స్వాములవారు - రాయలవారు మొ॥ శ్రీరాములవారిన్ - శ్రీరాములవారితోన్। ఇత్యాదు లూహ్యంబులు.

వ్యాఖ్య - పూజ్యత్వమును చెప్పవలసినప్పుడు తత్సమాదులయిన కొన్ని డుమంతములయొక్క ద్వితీయా బహువచనరూపముమీద 'గారు' అనుటకు బదులుగా 'వారు' అనునది చేరునని సూత్రార్థము.

'శ్రీరాముఁడు' అనునది డు ప్రత్యయము అంతమందు గల శబ్దము: ఏకవచనము. ద్వితీయా బహువచనరూపము 'శ్రీరాములన్' అనునది. దీనిపైని ప్రస్తుత సూత్రముచేత 'వారు' అనునది కలుగగా 'శ్రీరాములన్ + వారు' అని యగును. ఇప్పుడిందలి ద్రుతమునకు లోపము కావలయును. ప్రౌఢవ్యాకర్త ద్రుతలోపమునకు అవకాశము తానేమియు కల్పింపలేదు. దీనిని సమాసముగా గ్రహించి "సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు" అను బాలవ్యాకరణ (సంధి-24) విధివిబట్టి ద్రుతలోపము చేయగా 'శ్రీరాములవారు' అని యగును. ఇట్లే వసిష్ఠులవారు, వ్యాసులవారు - మున్నగు తత్సమ డుమంతముల వలని రూపము లేర్పడవచ్చును.

'స్వామి' అనునది తత్సమమే కాని డుమంతము కాదు. సూత్రమును "డుమంతంబులగు" అని మొదలు పెట్టియు 'స్వాములవారు' అను లక్ష్యమును చూపుటచేత వ్యాకర్తకు ఇట్టి ఇ్రీసమ శబ్దములపైనికూడ 'వారు' అని చేరుట సమ్మతమే యని గ్రహింపవలసి వచ్చుచున్నది. సూత్రమునందు మాత్రము విభాష యని కాని బహుళ మనికాని నిల్పి యిట్టి యవకాశమును కల్పించుట జరుగలేదు.

'రాయఁడు' అను శబ్దము డు ప్రత్యయాంతమే: అచ్చికము. "తత్సమాది శబ్దంబులకు" అని సూత్రమునం దనుటచేత అచ్చికములనుకూడ గ్రహించుట కవకాశము కలుగుచున్నది. 'రాయఁడు' అను శబ్దమునకు ద్వితీయాబహువచనరూపము 'రాయలన్' అనునది. దానిపై 'వారు' అను శబ్దము చేరగా ద్రుతమునకు లోపము జరిగి 'రాయలవారు' అనియగును.

ఇతరవిభక్తులు పరమైనపుడు శ్రీరాములవారిని, వసిష్ఠులవారితో, వ్యాసులవారి కొఱకు, స్వాములవారి వలన, రాయలవారి యొక్క - మున్నగువిధముగా రూపము లేర్పడును. అనగా ద్వితీయాది విభక్తులు పరమైనప్పుడు పూర్వసూత్రము చేత రు వర్ణము రి వర్ణముగా మారిన దని యర్థము.

[ తత్సమాది శబ్దములకు అనియనగా తత్సమ తద్భవదేశ్యములను మూడింటిని గ్రహింపవచ్చును అట్టియెడల "తత్సమాది శబ్దంబులకు" అని చెప్పుటవలన ప్రయోజనము లేదు. 'స్వామి' శబ్దమును గ్రహించుటచేత 'డుమం

తము' అను శబ్దముకూడ అప్రయోజక మగుచున్నది. 'ద్వితీయాబహువచనంబు మీద' అని యనుటకూడ సరియైనపద్ధతి కాదు. 'స్వాములవారు' మున్నగువానిని సమాసములే యనుకొన్నప్పటికిని పూర్వముననున్న ద్వితీయాంతత్వము సహేతుకము కాదు. "కర్మంబున ద్వితీయయగు" నని నియమము, అట్టిది యిచ్చట లేదు. కావున 'ద్వితీయాబహువచనంబుమీద' అని యనరాదు. ఇంకొక విషయము. 'గారు'నకు మాఱుగ వారగు - అనియు చెప్పుట సరికాదు. ఎందువలన ననగా 'శ్రీరాములు' మొదలయినవారికి 'గారు' అనునది విధింపబడలేదు. కావున అది వచ్చుటకు వీలులేదు. మరి, దానికి బదులుగా 'వారు' వచ్చుట యనునది అర్థరహిత మగుచున్నది. కావున సూత్రము పెక్కుతడబాటులకు తావొసగిన దనుట తథ్యము.]

మహదర్థకములై బహువచనాంతములయిన తత్సమ తద్భవ దేశ్యము లన్నింటిమీదను 'వారు' శబ్దము చేరుచున్నట్లు కనిపించుచున్నది.

ఈ విధిని 'విభాష'గా కాని 'బహుళము'గా కాని గుర్తించి యుండిన బాగుండెడిది. 'అగు' అని చెప్పుట 'నిత్యముగా నగు' నను భ్రాంతికి అవకాశమును కలిగించుచున్నది. శ్రీరాములు, వసిష్ఠులు - మున్నగువిధముగా 'వారు' శబ్దము లేకయు నుపయోగింప వచ్చును.

**54. అర్థవిశేషంబునం దేకత్వంబునను గొన్ని శబ్దములకు మీఁద వారు చూపట్టెడు.** (ప్రౌ - ౪౨)

అయ్యవారు (ఉపాధ్యాయుఁడు, పూజ్యుఁ డగు బ్రాహ్మణుఁడు, అట్టి వేలుపు). అమ్మవారు (స్త్రీదేవత, పూజ్యయగు బ్రాహ్మణ స్త్రీ)॥ చిత్ర మిది యయ్యవారి సం సేవవేళ। నమ్మవా రుగ్గడించిరో యనుచు నడిగె॥ కళా ౫ ఆ॥ దేవరవారు (పూజ్యులగు మీరు).

వ్యాఖ్య — పూజ్యతయందే కాక, విశిష్టమగు నర్థము మరేదైన నున్నపుడు కూడ అయ్య, అమ్మ, దేవర — మున్నగు శబ్దములకు 'వారు' అనుప్రయుక్త మగు నని సూత్రార్థము.

'అయ్య' అను శబ్దముపై 'వారు' అని చేర్పగా 'అయ్యవారు' అని యగును. ఇది ఏకత్వముననే అయిన రూపము. ఇచ్చటి 'వారు' పూజ్యతయందు రాలేదు. అట్లే యైనచో 'అయ్యవారు' అను మాటకు 'తండ్రిగారు' అని యర్థము కావలయును.

అట్లు కాక ఉపాధ్యాయుడు మున్నగునర్థములు దీనికి కలుగుచున్నవి. అయ్యవారి సంసేవవేళ — అని యన్నప్పుడు వ్యాకర్త చెప్పిన మూడర్థములను గాక ' ప్రభువు' అను నర్థము కలుగుచున్నది. ఇదియు అర్థవిశేషమే.

'అమ్మగారు' అనునట్లు పూజ్యతయందు కాక, స్త్రీ దేవత యను నర్థమునందును, పూజ్యురాలయిన బ్రాహ్మణస్త్రీ యను నర్థమునందును 'అమ్మవారు' అను శబ్దము ప్రయుక్త మగుచున్నది. 'అమ్మవారుగ్గడించిరో' అనుచోట వ్యాకర్త చెప్పిన రెండర్థములను గాక 'యజమానురాలు' అను నర్థము గలదు. ఇదియు అర్థవిశేషమే.

'దేవర' అని యనగా 'ప్రభువు' అని యర్థము. ప్రభువువారు అనికాని, తమరు అనికాని యర్థమైనపుడు 'దేవరవారు' అని కావచ్చును. ఇచ్చట పూజ్యతయే విషయము.

౫౫. పూజ్యతయం దొక్కచో నామ తదేత ద్యుష్మదస్మచ్ఛబ్దంబుల యేకవచనంబునకు బహువచనం బగు; అగుచో సంబోధ్య వాచకంబు బహువచనాంతంబు కాదు. (ప్రౌ - ౮౩)

మద్గురువుల.... నడిగిన వారలు నన్ను నీవంశమింకను క్షత్త్రి వంశంబు గాఁగల దనిరి॥ కళా. ౨ఆ॥ వీ రెవ్వరయ్య ద్రుపద మహా రాజులె (ఇక్కడ నిందయందుఁ బూజ్యత) ॥భార. ఆది. ౬ఆ॥ మీరలు వీరల విద్యాపారము చనుఁబెలుఁగవలయు॥ భార. ఆది. ౯ఆ॥ మా చిత్తంబున వేడ్కయుండునది నీమాధుర్యధుర్యోర్యరువా! గ్వైచిత్రిన్ సఫలంబు సేయుము॥ కళా. ౧ఆ॥ సంబోధ్యవాచకంబు బహువచనాంతంబు గామికి - అతఁడు మీకుం బ్రియశిష్యుఁడఁట యమిథ్యావచనా॥ భార. ఆది. ౨ఆ॥ మహితాత్మ మీర లిమ్మహినుండ॥ కళా. ౧ఆ॥ ఒక్కచో ననుటచే - ఆచార్యుఁడు ద్రోణునకున్ శిష్యుఁడ॥ భార. ఆది. ౨ఆ॥

వ్యాఖ్య — నామములకును, వాడు వీడు నీవు నేను — అను సర్వనామములకును పూజ్యత యందు ఏకవచనమునకు మారుగా బహువచనము కలుగును. అట్లు కలిగినప్పటికిని సంబోధ్యవాచకమునకు మాత్రము బహువచనము కలుగదు — అని సూత్రార్థము.

'గురువు' అనునది ఏకత్వబోధకము. అయినను ప్రస్తుత సూత్రముచేత పూజ్యతయందు బహువచనప్రత్యయము కలిగి 'గురువులు' అని యైనది. ఒకే వ్యక్తి నుద్దేశించినను తచ్ఛబ్దము (వాఁడు)నకు బహువచనము కలిగి 'వారలు' అని యయ్యెను. క్రియ కర్త ననుగుణముగా నుండవలయును. కనుక 'వారలు' అనుదానిని బట్టి క్రియయును బహువచనాంతమై 'అనిరి' అని యయినది.

వీరెవ్వరయ్యా ద్రుపదమహారాజులె - అను లక్ష్యము నందు ఏతచ్ఛబ్దము (వీఁడు) బహువచనాంతమై 'వీరు' అనియైనది: 'ద్రుపద మహారాజు' అన్న నామము బహువచనము నొందినది. ఈ రెండును పూజ్యతయందు బహువచనము కలిగిన లక్ష్యములు. నిజమునకు నిందయే యున్నప్పటికి, పూజ్యతా భాసమునుబట్టియే యిచ్చట బహువచనము కలిగినది. ఇదే లక్ష్యమున 'ఎవ్వరయ్యా' అనుచోటి 'అయ్యా' శబ్దమును సంబోధ్య వాచకముగా గ్రహింపవచ్చును. వీరు, మహారాజులు - అనునవి బహువచనాంతములై యున్నను సంబోధ్యవాచకమగు 'అయ్యా' శబ్దము మాత్రము ఏకవచనాంతముగనే యున్నది. (కొందరు దీనిని ఎదాములలోనిదిగా పరిగణింతురు. అప్పుడు సంబోధ్యవాచక మని చెప్పనవసరము లేదు.)

'నీవు' అనునది పూజ్యతయందు బహువచనముగా 'మీరలు' అని యయ్యెను. ఇది యుష్మచ్ఛబ్దము బహువచనము నొందుట కుదాహరణము. 'మాచిత్తంబు' అని యనునప్పుడు చెప్పునదొక్కవ్యక్తియే. అయినను పూజ్యతాపాదనముచే అస్మచ్ఛబ్దమునకు బహువచనముగా 'మా' యని యయ్యెను.

'మీకున్' అని యుష్మదర్థకము బహుత్వబోధకమై యున్నప్పటికిని సంబోధ్యవాచకము 'అమిత్యావచనా' అని యేకవచనాంతముగనే యుండుట తరువాతి లక్ష్యమున కని పించును. 'మీరలు' అనునది యుష్మచ్ఛబ్దము పూజ్యతయందు బహువచనము నొందగా ఏర్పడిన రూపము. దీని సంబోధ్య వాచకము 'మహితాత్మ' అని యేకవచనాంతమై యున్నది.

'ఒక్కచో' అని మాత్రమునం దనుటచేత పూజ్యతయందు బహువచనము నొందని రూపములు కూడ పెక్కులుండ వచ్చునని తెలియుచున్నది. 'ఆచార్యుఁడు ద్రోణునకున్ శిష్యుఁడ' అనుచోట ఆచార్యశబ్దముచేత పూజ్యత ప్రకటింపబడు చున్నను విశేషణ విశేష్యములకు రెండింటికిని బహువచనప్రత్యయములు చేరలేదు. ఇట్లు ఏకత్వబోధకముగా నుండుట కాక్షేపములేదు.

**56.** సంబోధ్యవాచకంబు బహువచనాంతంబయ్యుఁ గ్రియలమీఁది యమ్మాదు లేకవచనాంతంబుల యగు. (ప్రౌ - ౪౭)

మన యశోద చిన్న మగవానిఁ గనెనఁట! చూచి వత్తమమ్మ సుదతులార॥ భాగ. ౧౦ స్కం. పూ॥ మొ.

వ్యాఖ్య - సమాపక క్రియాశబ్దములమీద కొన్ని యెడల అమ్మ, అయ్య - మున్నగుశబ్దము లనుప్రయుక్తము లగుచుండును. సంబోధ్యవాచకము బహువచనాంతమై యున్నను, పైని చెప్పిన అమ్మ మున్నగుశబ్దము లేకవచనాంతములుగానే ప్రయుక్తము లగునని సూత్ర తాత్పర్యము.

'చూచివత్తమమ్మ సుదతులార!' అను లక్ష్యమునందు 'సుదతులార' అనునది సంబోధ్యవాచకము. 'వత్తము' అనునది క్రియాపదము: ఉత్తమపురుష బహువచనము. దీనిపై 'అమ్మ' అనునది అనుప్రయుక్తమైనది. సంబోధ్యవాచకమును, తదనుగుణముగా క్రియయు బహువచనాంతములై యున్నప్పటికిని 'అమ్మ' యనునది మాత్రము ఏకవచనాంతముగానే మిగిలియున్నది. అనగా క్రియకును, సంబోధ్య వాచకమునకును అనుగుణమై బహుత్వమును పొందకుండుట యిక్కడి విశేషము.

బాలవ్యాకరణమున "సంప్రార్థనంబున మఱియు కదాదులు విభాష ననుప్రయుక్తంబు లగు" అని (క్రియ - ౩౩) తెల్పి అదాదులలో అయ్య, అమ్మ - అనువానిని గూడ పఠించి యుండెను. కావున 'చదువుమా, చదువుఁడా - అని యనునప్పుడు 'ఆ' వర్ణము చేరినవిధముగానే చదువుమమ్మ, చదువుఁడమ్మ - మున్నగువిధముగా 'అమ్మ' శబ్దమును చేరును. ఇది క్రియాపదముపై అనుప్రయుక్తమగు నొకానొక శబ్దమే కాని సంబోధ్యవాచకమునకు విశేషణము కాదు. అందువలన దాని కనుగుణముగా వచనము నొందవలసిన యవసరము లేదు.

కావున బాలవ్యాకరణమునబట్టియే యీ విషయము నిర్ధారింపబడుచున్నను, సందేహనివృత్తికై స్పష్టప్రతిపత్తికై ప్రస్తుతసూత్రమును పరిగ్రహింపవచ్చును. కావున దీనిని బాలవ్యాకరణవిధికి వివరణముగా నెంచుట యుచితము.

**57.** పూజ్యతాతిశయంబున యుష్మదర్థబహువచనంబునకు మాఱుగా నాత్మార్థబహువచనంబు ప్రయుక్తం బగు. (ప్రౌ - ౪౮)

స్వామీ! తాము దయచేయవలయును॥ మొ.

వ్యాఖ్య - అధికమైన పూజ్యతయందు యుష్మదర్థ బహువచనాంతరూపము నకు బదులుగా ఆత్మార్థ బహువచనాంతరూపము ప్రయోగింపబడునని సూత్రార్థము.

యుష్మదర్థ బహువచనరూపములు - ఈరు, ఈరలు, మీరు, మీరలు॥ ఆత్మార్థ బహువచనరూపములు - తారు, తాము, తమరు.

'స్వామీ!' అను సంబోధనముచేత ఎదుటనున్నవ్యక్తినే యుద్దేశించినట్లు స్పష్ట మగుచున్నది. కావున కర్తృవాచకము యుష్మదర్థకమై యుండుట సాధారణము. పూర్వసూత్రము (ప్రౌఢ - 41) చేత పూజ్యతయందు యుష్మచ్ఛబ్దంబునకు ఏకవచ నమునకే బహువచనము కలుగును. అందువలన 'మీరు' అనునది కర్తృవాచకము కావలయును. ప్రస్తుతసూత్రముచేత 'మీరు' అనుదానికి బదులుగా ఆత్మార్థకబహు వచన రూపమైన 'తమరు' అనునది ప్రయోగింపబడును.

ఇట్లే యితరవిభక్తులయందును యుష్మదర్థకమునకు బదులుగా ఆత్మార్థక రూపయుక్తము కావచ్చును. తమ్మున్, తమచేత, తమకొఱకు, తమవలన, తమకు, తమయందు॥ మున్నగువిధముగా రూపములుండును.

58. సంబంధంబున యుష్మదస్మచ్ఛబ్దంబులకుం గొన్ని యెడల బహుత్వం బగు (ప్రౌ - 42)

మీయిల్లు - మాయిల్లు॥ మొ. మాయత్తె పృథ్వీ సమాన పృథాదేవి॥ భార. అర. 3 ఆ॥

వ్యాఖ్య - సంబంధమును తెలియజేయునప్పుడు కొన్నికొన్నిచోట్ల యుష్మచ్ఛ బ్దమునకును బహుత్వము వచ్చునని సూత్రార్థము.

బాలవ్యాకరణమునందు "శేషషష్ఠికి యొక్కయు నగు" అను (కారక-16) సూత్రము దిగువ "ఇచట శేషం బనఁగా సంబంధంబు" అని వివరింపబడెను. కావున సంబంధమును తెలియజేయునప్పుడు షష్ఠీ విభక్తి రావలయును. సంబంధ బోధకమైన షష్ఠిని శేష షష్ఠి యని యందురు. శేషషష్ఠికి, అనగా సంబంధ సూచక మైన షష్ఠీవిభక్తికి 'యొక్క' అను ప్రత్యయము వచ్చును. కాబట్టి నాయొక్క మిత్రుఁడు, నీయొక్క నెచ్చెలి — మున్నగువిధముగా రూపము లుండును.

[illegible] నా, నీ - అను శబ్దములకు కొన్ని యెడల [illegible]న్నది. మా యొక్క మిత్రుఁడు, మీ యొక్క నెచ్చెలి —

మున్నగురూపములును గావచ్చును. 'యొక్క'కు లోపము కలిగి సమాసరూపము నొందినయెడల మామిత్రుఁడు, మీనెచ్చెలి – మున్నగువిధముగా నుండును.

మీ యొక్క యిల్లు – అనునప్పుడు 'యొక్క'కు లోపమువచ్చి 'మీయిల్లు' అని సమాసమైనది. 'మాయిల్లు' అనునది కూడ అట్లే అయిన రూపము. ఇచ్చట ఒకేవ్యక్తికి గల సంబంధమే యుద్దిష్టము. అయినను బహువచనము ప్రయోగింప బడుచున్నది.

ఇట్లే "కు వర్ణకంబును గొన్నియెడల సంబంధంబునం దగు" అని బాల వ్యాకరణమున (కారక - 15) వివరణమునందు కలదు. దానివిబట్టి నాకు మిత్రుఁడు నీకు నెచ్చెలి – అనియు కావచ్చును. అప్పుడు ప్రస్తుత సూత్రముచేత బహువచనము కలుగగా మాకు మిత్రుఁడు, మీకు నెచ్చెలి – అను విధముగా ప్రయోగము లుండును.

ఇక్కడి బహువచనప్రాప్తి పూజ్యతయందు కలుగుటలేదు. సంప్రదాయమును బట్టి కలుగుచున్నది. కావున బహువచనప్రాప్తినిగూర్చి ముచ్చటించుచోట్ల, దీనిని గూర్చి చెప్పుట సమంజసముగానే యున్నది. 'కొన్నియెడల' అని సూత్రమునందుం డుటచేత బహువచనమెచ్చటెచ్చట వాడవలయునో వాడుకమబట్టి గ్రహించుట యుచి తము. కొన్నిచోట్ల బహువచనము వాడుట శుభవిధాయక మగును; కొన్నిచోట్ల అశ్లీలార్థద్యోతక మగును. కావున ఎప్పుడేది వాడవలయునో గుర్తించుకొనుట యవసరము.

[ మాయిల్లు - అని యన్నట్లుగానే ఉభయార్థకమైన అస్మచ్ఛబ్దమును వాడి 'మనయిల్లు' అనురీతిగా వ్యవహరించుట కూడ కలదు. పూజ్యతయందు అస్మ దర్థకైకవచనంబునకు బహువచనము కలిగినప్పుడు 'మేము' అనుదానితోపాటు 'మనము' అనియు నుపయోగించుట కలదు. నాకు బంధువు - మాకు బంధువు- మనకుబంధువు॥ మున్నగువిధముగా 'కు' వర్ణకముతోడి రూపము లుండును.]

59. కిమేకార్థక శబ్దంబులు క్రమంబున నజ్ఞాత వస్తూద్దేశ్య ప్రశ్నము నందును, నిర్దిష్ట స్త్రీపురుషాన్యతర ప్రశ్నమునందును, నిర్దిష్ట స్త్రీ పురుషాన్యతర గ్రహణమునందును, అనిర్దిష్ట స్త్రీపురు షోద్దేశ్యవ్యాహారమునందును దఱచుగ బహువచనాంతంబు లగు. (ప్రౌ - ౪౭)

నిర్దిష్ట స్త్రీపురుష + అన్యతర గ్రహణము = నిర్దేశింపబడిన స్త్రీ పురుషు లలో ఒకరిని తేకొని ప్రసంగించుట.

అనిర్దిష్ట స్త్రీపురుష + ఉద్దేశ్యవ్యాహారము = నిర్దేశము కాని స్త్రీ పురుషుల నుద్దేశించి ప్రసంగించుట.

అజ్ఞాత వస్తువు నుద్దేశించి ప్రశ్నించునప్పుడును, నిర్దిష్ట స్త్రీపురుషులలో ఒక రిని గురించి ప్రశ్నించునపుడును ఎవఁడు, ఎవతె - అను శబ్దములకు బహుత్వము కలుగును: నిర్దిష్ట స్త్రీపురుషులలో ఒకరిని గ్రహించునప్పుడును, అనిర్దిష్ట స్త్రీపురుషుల నుద్దేశించి పలుకునప్పుడును ఒకడు, ఒకతె - అను శబ్దములకు బహుత్వము కలు గును. ఇది సూత్రార్థము.

'ఎవరక్కడ ?' అను నుదాహరణమున అక్కడ ఎవరున్నారో తెలియదు గనుక అజ్ఞాత వస్తువునుగురించి ప్రశ్నించుట జరుగుచున్నది. ఉన్నది పురుషుడని తెలిసినచో 'ఎవరక్కడ?' అని యనవచ్చును. ఉన్నది స్త్రీయని తెలిసినచో 'ఎవతె యక్కడ ?' అని యనవచ్చును. స్త్రీ యో పురుషుడో తెలియక పోవుటవలన, 'ఎవతె' యని వాడవలయునో 'ఎవడు' అని వాడవలయునో తెలియదు. కనుక 'ఎవరు' అని బహువచనము వాడవలయును. అనగా అజ్ఞాత వస్తూద్దేశ్యప్రశ్నమునందు కింశబ్దము బహువచనాంత మగునని యర్థము.

సీతారాము లిద్దరును నిర్దిష్ట స్త్రీ పురుషులు. వారిలో ఒకరి నుద్దేశించి ప్రశ్నిం చుట "వారిలో ఎవరు దయగలవారు" అని యడుగుట. సమాధానమునం దయినచో 'సీత దయ గలది' అని కాని 'రాముడు దయగలవాడు' అని కాని స్పష్టముగా చెప్ప వచ్చును. అప్పుడు మహతీవాచకమును గాని మహద్వాచకమును గాని విశేష్యము నకు అనుగుణముగా వాడవచ్చును. కాని ప్రశ్నమునందు అట్టి స్పష్టతకు అవకాశము లేనందువలన 'ఎవరు' అను బహుత్వవాచకమునే వాడవలయును. అనగా నిర్దిష్ట స్త్రీ పురుషాన్యతర ప్రశ్నమునందు కిం శబ్దమునకు బహుత్వము కలుగ వలయు నని యర్థము.

"ఈ స్త్రీపురుషులు" అని యన్నపుడు స్త్రీపురుషులను నిర్దేశించుట జరుగుచు న్నది. "వారి యిద్దఱిలో దీని నొకరి కిమ్ము" అని యనుటచేత ఒకరిని మాత్రమే గ్రహించుట జరుగుచున్నది. ఇట్టియెడల ఒకడు అనికాని, ఒకతె అనికాని అనుటకు వీలుకాదు. కావున 'ఒకరు' అని బహువచనరూపమునే వాడవలయును. అనగా

నిర్దిష్ట స్త్రీపురుషాన్యతరగ్రహణమునందు 'ఏక'శబ్దమునకు బహుత్వము కలుగునని యర్థము.

[ఏకశబ్దము' కాక 'ఆమె' అనికాని 'అతడు' అనికాని స్పష్టముగా నిర్దేశించినచో బహుత్వము రావలసిన యవసరము లేదు. అప్పు డది ప్రస్తుతసూత్రమునకు విషయము కాదు.]

'ఒకరుపోయిన త్రోవ నొకరు పోరు' అని యున్నప్పుడు 'ఒకరు' అను శబ్దమునకు స్త్రీయని కాని పురుషు డని కాని యర్థమును స్పష్టముగా చెప్పుటకు వీలు లేదు. స్త్రీయే యుద్దేశింపబడినచో 'ఒకతె పోయిన త్రోవ నొకతె పోదు' అని యనవచ్చును. పురుషుడే యుద్దేశింపబడినచో 'ఒకఁడు పోయిన త్రోవ నొకఁడు పోఁడు' అని యనవచ్చును. అట్టి స్పష్టనిర్దేశములేని సమయమున 'ఒకరు' అని ప్రయుక్తమగును. అనగా అనిర్దిష్ట స్త్రీపురుషోద్దేశ్యవ్యాహారమునందు 'ఏక' శబ్దమునకు బహుత్వము కలుగు నని యర్థము.

'వారొక్కరే వచ్చిరి' అని యున్నప్పుడు కూడ ఏక వ్యక్తియే వచ్చుట జరిగెను. స్త్రీపురుష నిర్దేశము మాత్రము ఆ ప్రసంగమునందు జరుగలేదు - అందువలననే 'ఒక్కరు' అని ఏకశబ్దబహువచనరూపము ప్రయుక్తమయ్యెను.

సూత్రమునందు "తఱుచుగా బహువచనాంతంబు లగు" నని యనుటచే కొలదిగా బహువచనాంతములుకాని కిమేకార్థక శబ్దములు ఉండవచ్చునన్న యవకాశము కలదు. 'సీత' యని 'రాముడు' అని నామగ్రహణము చేసినప్పుడు కిం శబ్దమును ప్రయోగించు నవకాశమే లేదు. అట్టియెడల మహతీవాచకముకాని, మహద్వాచకము కాని విశేష్యమున కనుగుణముగా ఉపయుక్తమగును. అప్పు డింక బహువచన ప్రసక్తియే లేదు. ఇట్లు రెండు వాక్యములుగా ఒకే వాక్యమును వ్యాసముచేసి (పెంచి) వాడుటకూడ ప్రయోగములందు కలదు. సూత్రకర్త 'తఱచు' శబ్దముచేత ఇట్టి ప్రయోగముల కవకాశము కలుగుచున్నదని వివరణమునందు తెలిపెను.

పైని చెప్పిన నాలుగు తరగతులకు చెందని విశేష ప్రయోగములుకూడ కొన్ని కలవు. 'నీ వెవ్వరు' అన్నచోట 'నీవు' అను యుష్మదర్థక ప్రయోగముచేత ఎదుటివ్యక్తిని ప్రశ్నించుటయే జరుగుచున్నది. అజ్ఞాతవ్యక్తిని ఉద్దేశించి ప్రశ్నించుట యిచ్చట లేదు. కాని వ్యక్తిగతవిశేషము అజ్ఞాతమే. అందువలన బహువచనము కలిగి 'ఎవ్వరు' అని యైనది. అటుకాక 'ఎవ్వతెవీవు' అని స్త్రీవ్యక్తిని

'ఎవ్వడవోరి' అని పురుషవ్యక్తిని ప్రశ్నింపవచ్చును. ఇక్కడ స్త్రీ పురుష విషయము కాని, సంఖ్యావిషయముకాని అజ్ఞాతము కాదు. కావున రెండు విధముల వాడవచ్చును.

'మజ్జనని కావది యెవ్వరు' అనుచోట కిం శబ్దము బహుత్వము నొందినది. 'జనని' యని యనుటచేతనే స్త్రీత్వమును, ఏకత్వమునుగూడ తెలియుచున్నవి. అందు వలన 'ఎవ్వతె' అని యుపయోగించినను దోషము లేదు. వ్యక్తి విశేషము అజ్ఞాతమే కనుక బహుత్వము నొంది 'ఎవ్వరు' అనియైన నుండవచ్చును.

'ఎవ్వ రవనిం దలిదండ్రుల పేరు' అన్నదికూడ బహుత్వము నొందిన రూపమే. 'తలిదండ్రులు' అను బహువచన రూపము చేత కి మర్థకముకూడ బహుత్వమున నుండుట యుక్తమే. అప్పుడు 'ఎవ్వరవనిం దలిదండ్రులు' అని యుండ వచ్చును. అప్పుడు విశేషమేమియు లేదు. 'తలిదండ్రులపేరు' అనునది అమహద్వాచకము; ఏకవచనాంతము. దీనికి విశేషణముకూడ అట్లే యున్నచో 'ఎయ్యది' అని యుండవలయును. అట్లుకాక మహద్బహువచనాంతమైన 'ఎవరు' అనునది విశేషణ మగుచున్నది. కావున ఇది పూర్వప్రయోగములకంటె భిన్నమైన విశేషప్రయోగము. 'మాయయ్య నీపేరెవ్వరు' అనుచోటకూడ 'పేరు' అను నమహదర్థకైకవచనరూపమునకు 'ఎవ్వరు' అను మహదర్థకబహువచనరూపము విశేషణ మగుచున్నది.

'నామము మేఘవర్ణుఁడన్' అనుచోట కిం శబ్దము కాని ఏకశబ్దముకాని లేదు. కావున అది లక్ష్య మగుటకు వీలుకాదు. అయినను 'నామమున మేఘవర్ణుఁడన్' అను విధముగా కాని 'నామము మేఘవర్ణుఁడు' అను విధముగా కాని యుండవలయును. కావున ఆప్రయోగమే అపపాఠమై యుండును. 'పేరున మేఘవర్ణుఁడన్' అను పాఠాంతరమొకటి యిచ్చట సూచితమై యున్నది. కాని యిదియు ప్రస్తుత సూత్రమునకు లక్ష్యము కాజాలదు.

కొన్నిచోట్ల 'అది' యను శబ్దము 'ఎవ్వరు' అను శబ్దమునకు పూర్వమందు వచ్చునని వివరణవాక్యమునకు భావము. 'అది యెవ్వరవి' అనుచోట అజ్ఞాతవస్తూద్దేశ్య ప్రశ్నము కలదు. కావున 'ఎవ్వరు' అని కి మర్థక బహువచనరూపము వచ్చెను. దానికి పూర్వమందు 'అది' అని వచ్చుట మరొక విశేషము. 'ఎవ్వరు' అనునది మహదర్థక బహువచనరూపమై యుండగా 'అది' యనునది అమహదర్థ కైకవచన

రూపమగుచున్నది. అట్లే తరువాతి లక్ష్యమునందుకూడ 'అదియెవ్వరే' అని ప్రయుక్తమైనది.

[ఇక్కడ వ్యాకర్త "ఎవ్వరది పూర్వకంబయి కానంబడియెడి" నని యనెను. దీనిని బట్టి 'అది' యను శబ్దము 'ఎవ్వరు' అను శబ్దమునకు పూర్వము ందు మాత్రమే రావలయు నని యనిపించుచున్నది కాని ముందు వచ్చినట్లుగనే వెనుకకూడ వచ్చి 'ఎవ్వరది' అని కాని 'ఎవ్వరేయది' అని కాని యగుట కాక్షేపము లేదు.]

## సర్వనామ ప్రకరణము

60 అన్ని ప్రభృతులు సర్వనామంబులు. (బా - ౨౮)

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు - ఆ - ఈ ఏ - నీ - నా - మన - తా - సంఖ్యావాచకంబులు॥ అన్ని ప్రభృతులు. వీనికిం బ్రథమాంతరూపంబు లుదాహరించెద. వీనిలో డుమంతంబుల కెల్ల న్వాగమంబు పూర్వోక్తంబు స్మరించునది. బహువచన లకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును బ్రథమా బహువచనంబున కుం బోలె నెఱుంగునది. విశేషాకారంబులు గలిగెనేని కొండొకచో ద్వితీయవలెకును, గొండొకచోఁ దృతీయయుం దొక్క రూపంబువలెకును రూపభేదంబులు వక్కాణించెద. శేషం బూహించునది. అన్ని మొదలగు శబ్దంబు లాఱును ద్విప్రభృతి సంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబు లగు; అమహదర్థంబు లేక వచనాంతంబు లగు. ఇందు నీ మొదలగు నాలుగు శబ్దంబులు సర్వార్థంబులం దుల్యరూపంబు లయియుండు.

మ - అనునది మహదర్థ మనుటకు అ - అనునది యమహదర్థ మనుటకును ప్ర-మొదలయినవి ప్రథమాది విభక్తులకును సంకేతములుగా నిందు గ్రహించునది.

మ అ

సర్వార్థావదర్థకము

ప్ర. { అందఱు / అందఱు } ....అన్ని

ఇయదర్థకము

ప్ర. ఇందఱు....ఇన్ని

కియద్యావదర్థకము

ప్ర. ఎందఱు ...ఎన్ని

కతిపయార్థకము

ప్ర. కొందఱు....కొన్ని

బహ్వర్థకము

ప్ర. { పెక్కండ్రు / పెక్కురు } పెక్కు దీనికి

బహువచనముం

గలదు- పెక్కులు

ఈశబ్దంబు లౌపవిభక్తికంబు లగుటం జేసి అన్నిటి- అన్నింటి; ఇన్నిటి - ఇన్నింటి; ఎన్నిటి - ఎన్నింటి; కొన్నిటి- కొన్నింటి; పెక్కిటి- పెక్కింటియను రూపంబులు ద్వితీయాద్యేకవచనంబులు పరం బగునపు డమహత్త్వంబునం దగు నని తెలియునది.

బహ్వర్థకము

ప్ర. { పలుగురు / పలుగుండ్రు } అమహత్వంబున దీనికి

వ్యస్తప్రయోగంబు లేదు.

తదర్థకము

ఏ మ బ

ప్ర. వాఁడు { వారు / వారలు / వాండ్రు }

ద్వి. వానిని { వారిని / వారలను / వాండ్రను }

అ

ప్ర. { అది / అద్ది / ఆయది / అయ్యది } .... { అవి / అవ్వి / ఆయవి / అయ్యవి }

ద్వి. { దానిని / ఆదానిని / అద్దానిని } ....వానిని

ఇదమర్థకము

ఏ మ బ

ప్ర. వీఁడు { వీరు / వీరలు / వీండ్రు }

ద్వి. వీనిని { వీరిని / వీరలను / వీండ్రను }

అ

ప్ర. { ఇది / ఇద్ది / ఈయది / ఇయ్యది } { ఇవి / ఇవ్వి / ఈయవి / ఇయ్యవి }

ద్వి. { దీనిని / ఈదానిని / ఇద్దానిని } వీనిని

యత్కిమర్థకము

మ

ప్ర. { ఏఁడు / ఏవాఁడు } { ఏరు / ఏవారు / ఏవారలు / ఏవాండ్రు }

ఎవ్వాఁడు { ఎవ్వారు / ఎవ్వారలు / ఎవ్వాండ్రు

ఎవ్వఁడు { ఎవ్వరు / ఎవ్వండ్రు

ఎవఁడు { ఎవరు / ఎవండ్రు

ద్వి. ఏవిని ఏరిని

ఏవానిని { ఏవారిని / ఏవారలను / ఏవాండ్రను

ఎవ్వానిని { ఎవ్వారిని / ఎవ్వారలను / ఎవ్వాండ్రను

ఎవ్వనిని { ఎవ్వరిని / ఎవ్వండ్రను

ఎవనిని { ఎవరిని / ఎవండ్రను

అ

| | | |
|---|---|---|
| ప్ర. | ఎది | ఎవి |
| | ఏది | ఏవి |
| | ఎద్ది | ఎవ్వి |
| ప్ర. | ఏయది | ఏయవి |
| | ఎయ్యది | ఎయ్యవి |
| ద్వి. | దేనిని | వేనిని |
| | ఏదానిని | ఏవానిని |
| | ఎద్దానిని | ఎవ్వానిని |

మహతి వాచ్యం బగునే నేకత్వంబున యత్కిమర్థక శబ్దంబు ఎవ్వరిత - ఎవ్వర్త - ఎవ్వత - ఎవరిత - ఎవర్త - ఎవత - ఎవ్వరితి - ఎవ్వర్తి - ఎవ్వతి - ఎవరితి - ఎవర్తి - ఎవతి - ఎవరితె - ఎవర్తె - ఎవ్వతె - ఎవ్వర్తె - ఎవరితె - ఎవతె - ఎవ్వర్తుక - ఎవ్వతుక - ఎవర్తుక - ఎవతుక అని యిరువదిరెండు రూపంబులు వడయు.

తదాదులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునం బూజ వివక్షించునపుడు అతఁడు - ఆతఁడు; ఇతఁడు - ఈతఁడు; ఎతఁడు - ఏతఁడు: అను రూపంబులు వడయు. మహతీవాచకంబులు॥ ఆమె - ఆపె - ఆకె; ఈమె - ఈపె - ఈకె; ఏమె - ఏపె - ఏకె అను రూపంబులు వడయు.

యుష్మదర్థకము

ప్ర. { నీవు / ఈవు  { మీరు / మీరలు / ఈరు / ఈరలు

ద్వి. నిన్నును....మిమ్మును

తృ. నీచేతను....మీచేతను

అస్మదర్థకము

ప్ర. { నేను { మేము / నేము ; ఏను ఏము

ద్వి. నన్నును మమ్మును

తృ. నాచేతను మాచేతను

ఉభయార్థకము

నిత్యబహువచనాంతము

ప్ర. మనము

ద్వి. మనలను

తృ. మనచేతను - మనలచేతను

ఆత్మార్థకము

ప్ర తాను { తాము / తారు / తమరు

ద్వి. తన్నును తమ్మును

తృ. తమచేతను

ఇంక సంఖ్యావాచకంబులు వక్కాణించెద.

ఏకార్థకశబ్దము

| ఏ | ప్ర |
|---|---|
| ఒకడు - | ఒకరు, ఒకండ్రు |
| ఒకొండు - | ఒకొరు, ఒకొండ్రు |
| ఒక్కఁడు - | ఒక్కరు, ఒక్కండ్రు |
| ఒక్కొఁడు - | ఒక్కొరు, ఒక్కొండ్రు |
| ఒకరుఁడు - | ఒకరులు / ఒకళులు / ఒకళ్లు |
| ఒకొరుఁడు - | ఒకొరులు / ఒకొళులు / ఒకొళ్ళు |
| ఒక్కరుఁడు | ఒక్కరులు / ఒక్కళులు / ఒక్కళ్ళు |
| ఒక్కొరుఁడు | ఒక్కొరులు / ఒక్కొళులు / ఒక్కొళ్లు |
| ఒకరువుఁడు | ఒకరువులు |
| ఒకొరువుఁడు | ఒకొరువులు |
| ఒక్కరువుఁడు | ఒక్కరువులు |
| ఒక్కొరువుఁడు | ఒక్కొరువులు |
| ఒరుఁడు | ఒరులు |
| ఒరువుఁడు | ఒరువులు |
| ఒండు | ఒండులు, ఒండ్లు |
| ఒడ్డు | ఒడ్డులు, ఒడ్లు |

ద్వితీయాది విభక్తిరూపంబు లూహించునది.

అ

ప్రథమైకవచనాంతములు.

ఒకటి - ఒకొటి - ఒక్కటి - ఒక్కొటి - ఒకఁడు - ఒకొఁడు - ఒక్కఁడు - ఒక్కొఁడు - ఒండు.

ఈ శబ్దంబులకు సంఖ్యావాచకంబులకు బహువచనంబు లేదు.

దీనికి మహతి వాచ్యం బగునప్పు డేకత్వంబున వక్ష్యమాణ రూపంబు లెఱుంగునది.

మహత్యర్థకము

ఒకరిత - ఒకర్త - ఒకర్తు - ఒకర్తుక - ఒకత - ఒకతుక - ఒకొరిత - ఒకొర్త - ఒకొర్తు - ఒకొర్తుక - ఒకొత - ఒకొతుక - ఒక్కరిత - ఒక్కర్త - ఒక్కర్తు - ఒక్కర్తుక - ఒక్కత - ఒక్కతుక - ఒక్కొరిత - ఒక్కొర్త - ఒక్కొర్తు - ఒక్కొర్తుక - ఒక్కొత - ఒక్కొతుక - ఒకరితి - ఒకర్తి - ఒకతి - ఒక్కొరితి - ఒకొర్తి - ఒకొతి - ఒక్కరితి - ఒక్కర్తి - ఒక్కతి.

ఒకొ౯రితి - ఒకొ౯ర్తి - ఒక్కొ౯తి - ఒకరితె - ఒకర్తె - ఒకతె - ఒకొ౯రితె - ఒకొ౯ర్తె - ఒకొ౯తె - ఒక్కరితె - ఒక్కర్తె - ఒక్కతె - ఒక్కొ౯రితె - ఒక్కొ౯ర్తె - ఒక్కొ౯తె - ఓర్త - ఓర్తి - ఓర్తు - ఓర్తుక.

ఇంక ద్విప్రభృతి సంఖ్యావాచకంబులు ప్రథమాంతరూపంబులు వక్కాణించెద.

| మ | అ |
|---|---|
| ఇద్దరు | |
| ఇరుగురు | రెండు |
| మూగురు | |
| ముగ్గురు | మూఁడు |
| ముగురు | |
| నలుగురు | నాలుగు |
| అయిదుగురు | అయిదు |
| ఏగురు | ఏను |
| ఆఱుగురు | ఆఱు |
| ఏడుగురు | ఏడు |
| ఎనమండ్రు | ఎనిమిది |
| తొమ్మండ్రు | తొమ్మిది |
| పదుగురు | |
| పదురు | పది |
| పదుగుండ్రు | |
| పదుండ్రు | |
| పదునొకరు | పదునొకటి |

ఇచ్చట వేళ శబ్దార్థరూపంబులెల్ల నర్థానురూపంబుగం గూర్చుకొనునది.

పదునొకరు పదునొకటి

ఇత్యాదులు

| | |
|---|---|
| పన్నిద్దఱు | పండ్రెండు |
| పన్నిరుగురు | |
| పదుమూగురు | |
| పదుముగ్గురు | పదుమూఁడు |
| పదుముగురు | |
| పదునలుగురు | పదునాలుగు |
| పదునైఁగురు | పదునైదు |
| పదునేగురు | పదునేను |
| పదునాఱుగురు | పదునాఱు |
| పదునేడుగురు | పదునేడు |
| పదునెనమండ్రు | పదునెనిమిది |
| పందొమ్మండ్రు | పందొమ్మిది |
| ఇరువండ్రు | ఇరువది |
| ఇరువదియొకరు | ఇరువదియొకటి |
| ముప్పండ్రు | ముప్పది |
| నలువండ్రు | నలువది |
| ఏఁబండ్రు | ఏఁబది |
| అఱువండ్రు | అఱువది |
| డెబ్బండ్రు | డెబ్బది |
| ఎనుబండ్రు | ఎనుబది |
| తొంబండ్రు | తొంబది |
| నూఱుగురు | నూఱు |
| వేగురు | వేయి |
| పదువేగురు | పదివేలు |

ఇత్యాదు లూహ్యంబులు.

రెండు మొదలగునవి యూపవిభక్తిక శబ్దంబు లగుటంజేసి ద్వితీయాది విభక్తులు పరంబులగునపుడు టింటు లగువని యెఱుఁగునది. రెండిటిని- రెండింటిని- రెంటిని; మూఁడిటిని- మూఁడింటిని- మూఁటిని- ఇత్యాదులు. ఏకశబ్దమునకు॥ ఒంటి- ఒకానొకఁడు- ఒకానొకటి- ఒకానొకరిత- ఒగిమ- ఒండొకరు- ఓరట్ట అనురూపంబులును, ద్విశబ్దార్థంబునకు॥ ఇనుమడి- ఈరాలు అను రూపంబులు నర్థవిశేషంబులం జూపట్టెడు.

వ్యాఖ్య - అన్ని మున్నగుశబ్దములు సర్వనామము లని సూరి వివరణము. సంస్కృతమున గల "సర్వాదీని సర్వనామాని" అను నిర్వచనమున కిది యనువాదమే. సంస్కృతమున సర్వనామములకు విభక్తి చేరునపుడు నామములకంటె భిన్నమైన విధానము కనిపించును. తెనుగున అంతగా భిన్నత్వము కనిపింపదు కాని, వైచిత్రి లేకపోలేదు. దానినిబట్టియే సూరి వీనిని వేరుగా శీర్షికనుంచి వ్రాయసాగెను.

కొందరు "నామవాచకములకు బదులుగా వాడబడునవి సర్వనామములు" అని ఒక నిర్వచనము చేసిరి. ఇది ఆంగ్ల సంప్రదాయమునుబట్టి Pronoun అను భాషాభాగమునకు చేసిన నిర్వచనము. సంస్కృతసంప్రదాయమునకుగాని, ఆంధ్రసంప్రదాయమునకుగాని యీ నిర్వచనము ఏమాత్రమును సరిపడదు. నామవాచకములకు బదులుగా వాడబడు వాఁడు, అది, వారు, అవి, వీఁడు, ఇది, వీరు, ఇవి మున్నగునవి కొన్ని కలవు. అట్లుకాక పరిమాణమును దెల్పు అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని మొదలయినవియు - పెక్కు, పలు మొదలగు బహ్వర్థకములును - అ, ఈ, ఏ అను నిర్దేశాత్మకములును - నీవు, మీరు మున్నగు యుష్మదర్థకములును - నేను, మేము, మనము మున్నగు అస్మదర్థకములును - ఒకటి, రెండు మున్నగు సంఖ్యావాచకములును సర్వనామములే. ఇవి నామములకు బదులుగా కాక స్వతంత్రముగనే వ్యవహరించును. కావున ఆంగ్లసంప్రదాయానుసారము చేసిన నిర్వచన మిక్కడ పరిమితదని తేలినది. సూరిచేసిన నిర్వచనమే సర్వనామముల కన్నింటికి సరిపడియున్నదనుట సమంజసము.

"వీనికిం బ్రథమాంతరూపంబు లుదాహరించెద" అని వివరణమునందలి వాక్యము. సర్వనామములకు గల విశేషనియమములను సూత్రపట్టి వ్రాయుట పాఠకులకు క్లేశకరము కాగల దను నుద్దేశముతో సూరి లాఘవము నపేక్షించి ఉదా

హరణమును పట్టికల రూపములో నొసగెను. పైని చెప్పిన సర్వనామముల కన్నింటికి ప్రథమావిభక్తి రూపములను ప్రదర్శించెను.

"అనుదంత మగు తెనుఁగు డుమంతమునకు నిగాగమము నిత్యముగా నగు" (తత్సమ - 21) అను సూత్రమును బట్టి ద్వితీయాద్యేకవచనము పరమగునపుడు 'ని' వర్ణము ఆగమ మగును. ఇదియే యీ వివరణమున 'న్యాగమము' అని స్మరింపబడినది. అనుదంతములకు నిత్యముగా నగుననుట వలన మగనిచేత, మనుమనికొఱకు - మున్నగువిధముగా రూపము లగును. ఉదంతములకు నిగాగమము వైకల్పికముగానై పగతుచేత, పగతునిచేత: బల్లిదుకొఱకు, బల్లిదునికొఱకు - మున్నగువిధముగా రెండేసి రూపములు కలుగును. ఈ విషయమునే స్మరించి డుమంతము లయిన సర్వనామములకు నిగాగమాదు లిష్టే యగు నని సూరి తెలిపెను. ఒకఁడు, ఒకనిని, ఒకనిచేత - మున్నగువిధముగా రూపము లగును.

"బహువచన లకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును బ్రథమాబహువచనంబునకుంబోలె నెఱుంగునది" అను వాక్యము నీ క్రిందివిధముగా గ్రహింపవలయును. 'వాఁడు' అను తచ్ఛబ్దముయొక్క బహువచనలకారమునకు రేఫమై 'వారు' అని యగును. ఈ బహువచనాంతరూపముపై మరల లువర్ణము కలుగును. అప్పుడు వెనుకనున్న ఉత్వమునకు అత్వ మగును. వారు + లు = వార + లు = వారలు. బహువచన లకారమునకు రేఫంబును, దానికి పూర్వమందు పూర్ణబిందు పూర్వకడకారంబు నగుననుటవలన వా + ండ్ + రు = వాండ్రు మున్నగువిధముగా రూపము లేర్పడును. ఇట్లు అనేకవిశేషములను కలిగియుండుటవలన, ఆ యారూపముల నన్నింటిని వివరించినచో పాఠకునకు క్లేశము కలుగు నను మద్దేశముతో ప్రథమాంతరూపములనుబట్టియే ద్వితీయాద్యంతరూపములనుగూడ గ్రహించుకొనవలయు నని సూరి సూచించుచున్నాడు. కొన్నియెడల, అట్లూహించుకొనుటకు వీలు కానప్పుడు సూరి ద్వితీయా తృతీయాది రూపములను కూడ ప్రదర్శించెను. ఉ॥ ప్ర. నేను - ద్వి. నన్నును - తృ. నాచేతను. ఆ తరువాతిరూపములు నాకొఱకును, నావలనను అన్నట్లుగా నుండును. కనుక పాఠకుని యూహకే విడిచిపెట్టెను.

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు అను నాఱు శబ్దములును మహద్వాచకము లైనప్పుడు బహువచనాంతములై యుండును. అమహత్తు లైనప్పుడు ఇవి యేకవచనాంతములుగానే యుండును. పెక్కు శబ్దమునకు అనుహదర్థమున 'పెక్కులు' అను బహువచనాంతరూపము సైతము కలదు. 'పలు' అను శబ్దమునకు

వ్యస్తము (విడి) గా వాడుక లేదు. రెండు, మూఁడు, నాలుగు - మున్నగు సంఖ్యా వాచకములుకూడ మహత్తు బోధించునపుడు బహువచనాంతములుగనే యుండును. అమహత్తును బోధించునపుడు ఏకవచనములై యుండును. నీవు, నేను, తాను, మీరు, మేము, తాము - మున్నగునవి మహద్వాచకములైన సమయమునందును, అట్లు కాని సమయమునందునుకూడ మార్పునొందక, ఒకేవిధ మగు రూపములతో నుండును.

అన్ని మొదలగునవి ఔపవిభక్తికము లగుటవలన ద్వితీయాద్యేకవచనము పరమగునపుడు అన్నిటికి, అన్నింటికి: ఇన్నిటికి, ఇన్నింటికి - మున్నగువిధముగా టింటులతోడి రూపము లేర్పడును. ఔపవిభక్తికమైన టివర్ణమునకు, హ్రస్వముమీఁది దానికి పూర్ణబిందువు బహుళముగా కావచ్చును. 'టి' వర్ణమును, పూర్ణబిందుపూర్వకమైన టివర్ణమును గలిపి సూరి యిచ్చట "టింటులు" అని యుపయోగించెను.

రెండు, మూఁడు మున్నగుశబ్దములకు టింటులు కాగా రెండిటివి, రెండింటివి: మూఁడిటివి, మూఁడింటివి, మూఁటివి - మున్నగువిధముగా రూపము లేర్పడును.

ఏకార్థకమైన శబ్దమునకు అర్థవిశేషమునందు ఒంటి - ఒకానొకఁడు - ఒకానొకటి - ఒకానొకరిత - ఒరిమ - ఒండొకరు - ఓరట్ల అనురూపములు కలుగుచున్నవి. అట్లే రెండు అను శబ్దమునకుకూడ అర్థవిశేషమునందు ఇనుమడి, ఈరాలు - మున్నగువిధముగా రూపములు కలుగుచున్నవి.

**61.** ఈ, ఏ, ఒక శబ్దములకంతెం బరంబయిన యంతశబ్దము నకారంబునకు లోపంబగు. అగుచో నీయేల దీర్ఘమునకు హ్రస్వమును ఒకకు వర్ణవ్యత్యయ సంహితలు నగు. (ప్రౌ - ౩౧)

ఇంత - ఎంత - కొంత (చూ. డెబ్బది) శబ్దశాసనుఁడు "తచ్ఛబ్దాతః" అని సూత్రించిన సూత్రమునందలి తచ్ఛబ్ద మంత ప్రభృతులకు నుపలక్షణ మని తెలియునది.

వ్యాఖ్య - ఈ, ఏ, ఒక - అను శబ్దములకు 'అంత' అను శబ్దము పరమగును. అప్పుడు 'అంత' శబ్దమునందలి 'అ' లోపించును. అప్పుడు ఈ, ఏ - అను రెండు వర్ణములు హ్రస్వములగును. 'ఒక' శబ్దమునందలి వర్ణములు వ్యత్యయమును పొంది, ఆ పిమ్మట కలియును. ఇది సూత్రార్థము.

'ఈ' అను శబ్దమునకు 'అంత' పరమైనచో 'ఈ + అంత' అని యగును. ప్రస్తుతసూత్రముచేత 'అ' లోపింపగా 'ఈ + ంత' అనియై దీర్ఘము హ్రస్వము కాగా 'ఇంత' అని యగును. 'ఎంత' యనునది కూడ 'ఏ' శబ్దముపై ఇట్లే యేర్పడును.

'ఒక' శబ్దమునకు 'అంత' పరమైనచో 'ఒక + అంత' అని యుండును. 'అ' లోపింపగా 'ఒక + ంత' అని యుండును. 'ఒక' శబ్దమునందలి వర్ణములు వ్యత్యయము (వెనుకముందులుగా మారుట) పొందగా 'కఒ' అనియై సంధివశమున 'కొ' అని యగును. అనగా 'కొ + ంత' అనియై పర్యవసానమునందు 'కొంత' అని యగును.

“శబ్దాత్తచ్ఛబ్దాతః” అని చింతామణి సూత్రము. “శబ్దముకంటెం బరంబయిన అది శబ్దంబు నత్వంబునకు లోపంబగు” అని యర్థము. ప్రౌఢవ్యాకర్త 'అది' శబ్దమని యనుటచేత 'అంత' మున్నగువానినికూడ గ్రహింపవచ్చునని వివరణవాక్యమున తెలుపుచున్నారు. 'అంత' లోని అకారము లోపించుట కిది ప్రమాణము.

బాలవ్యాకరణమునందు పరిమాణార్థకములయిన అంత, ఇంత, కొంత - అను అమహచ్ఛబ్దములనుగూర్చి చెప్పబడలేదు. కావున ప్రౌఢవ్యాకర్త వానిని చెప్పుట యవసరమే.

సర్వనామముల కన్నింటికి ఈ మూడు శబ్దములనే ప్రధానములుగా భావించుటవలన ప్రౌఢవ్యాకర్త వీనిరూపనిష్పత్తిని తొలుదొల్తగా చూపుట కారంభించెను. ఇంతను గొన్నిరూపములను వీనియాధారమున నిష్పన్నము గావించుట ముందు కననగును.

[ఇంత - మున్నగు వానివంటిదే 'అంత' యనునది కూడ. దీనికి వ్యుత్పత్తిని చూపిన వ్యాకర్త దానికి చూపక పోవుట సమంజసము కాదు. దానిని అవ్యుత్పన్న రూపమని యనుటకు వీలులేదు కదా! ఇట్లు కాక ఆ, ఈ, ఏ - అను త్రికము నుండి వీనిని సాధించుట సక్రమమగు పద్ధతి కాగలదు. పూర్ణబిందుపూర్వక తకారమును పరిమాణార్థమునందు ఆగమముగా విధించి, దీర్ఘము హ్రస్వము గావించినయెడల అంత, ఇంత, ఎంత - అను రూపముయి సిద్ధించును. 'ఒక' శబ్దమునకు 'అంత'ను విధించి 'ఒకంత' యని చేసి, వర్ణవ్యత్యయమువలన 'కొంత' యని వికల్పముగా అయిన దనవచ్చును. ఇటులైనచో 'అది' శబ్దమునకు చెప్పిన చింతామణి సూత్రమును అంత శబ్దమునకు పట్టింపవలసిన యవసరము

లేదు. 'ఇంత' పరమైనపుడు 'ఒకింత' యనియు కావచ్చును. కావున ప్రౌఢ వ్యాకర్త చూపిన ప్రక్రియ సూటిగా సులభముగా లేదు.]

**62. అమహదర్థంబున భిన్నవస్తుసముదాయం బర్థంబగుచో నేకవచనంబున నంతాదుల తకారంబునకు ద్విరుక్త వి వర్ణంబగు.**

**(ప్రౌ - ఇ-౨)**

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని.

వ్యాఖ్య - అమహత్తులయి గుంపుగానున్న భిన్నవస్తువులను చెప్పవలసి వచ్చినపుడు 'అంత' మున్నగువాని తకారమునకు బదులుగా ద్విరుక్తమైన 'వి' వర్ణము (న్ని) కలుగునని సూత్రార్థము.

అన్ని గుఱ్ఱములు - మున్నగువిధముగా నున్నప్పుడు 'అన్ని' యనునది బహుత్వబోధకమై అమహదర్థకమైన విశేషణము. 'అంత' అను శబ్దమునందలి 'త' యనుదానికి బదులుగా 'న్ని' అని కలుగగా 'అం + న్ని' అని యగును. "సంస్కృత సమేతరములయిన తెలుఁగు శబ్దములయందుఁ బరుష సరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది" అను (బాల - సంజ్ఞ - 16) నియమమువలన స్థిరవర్ణమునకు ముందున్న బిందువు తొలగిపోయి 'అన్ని' అని యగును. ఇట్లే 'ఇంత' యనునది 'ఇన్ని' అనియు ఎంత, కొంత - అనునవి ఎన్ని, కొన్ని - అనియు నగును. ఇవి యర్థమునుబట్టి బహుత్వబోధకములయినను, ప్రక్రియనుబట్టి ఏకవచనాంతములుగనే పరిగణింపబడవలయును. దీనిని గుర్తుచేయుటకే ప్రౌఢవ్యాకర్త "ఏకవచనంబున" అని సూత్రమునందు నిబంధించియున్నాడు.

బాలవ్యాకరణమునందు అమహదర్థకమైన సర్వనామదర్థక రూపములుగా అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని - అనిచూపుట జరిగెను. అంతకుముందే "అన్ని మొదలగు శబ్దంబు లాఱును ద్విప్రభృతి సంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబు లగు; అమహదర్థంబు లేకవచనాంతంబు లగు" అని వివరించుట కూడ జరిగెను. కావున ప్రౌఢవ్యాకర్త ప్రక్రియను నిరూపించుట తప్ప, క్రొత్తగా చేర్చిన యంశమేమియు లేదు.

**63. ఆ ఈశబ్దములకును ఏశబ్దమునకును మహదర్థంబున నన్ని విభక్తులయందును వకారంబు నిత్యముగాను వైకల్పికముగాను, అమహదర్థంబునం బ్రథమేతర విభక్తులయందు వచవద్వయంబు**

నం క్రమంబున దకార వకారంబులు నిత్యముగాను బూర్వాగ
మంబు లగు. (ప్రౌ - ౫౩)

వాఁడు - వారు; వీఁడు - వీరు; వానిన్ - వారిన్; వీనిన్ -
వీరిన్; వానిచేతన్ - వారిచేతన్; వీనిచేతన్ - వీరిచేతన్; వేఁడు -
ఏఁడు - వేరు - ఏరు; వేనిన్ - ఏనిన్ - వేరిన్ - ఏరిన్; వేనిచేతన్ -
ఏనిచేతన్; మొ॥ పిలిచి చారుల రావించి యిలయు దివియు। ముంచు
కపివీరసేనల మించు గాంచి। వీరిలో ముఖ్యు లెవ్వారు వేఁడు రాముఁ।
డతని యనుజన్మఁ డెట్టివాఁ డనుచుఁ బలుక॥ రామా. ౭ ఆ॥ మొ.
దానిన్ - వానిన్; దీనిన్ - వీనిన్; దేనిన్ - వేనిన్; దానిచేతన్ -
వానిచేతన్; దానియందున్ - వానియందున్ మొ॥ అనుప్రయుక్తంబు
లగునపుడు వీనికి రూపంబు లిట్లయగు. (చూ. మీఁదు).

వ్యాఖ్య - ఆ, ఈ శబ్దములకు మహదర్థమున అన్ని విభక్తులయందును
వకారము నిత్యముగా పూర్వాగమ మగును; ఏ శబ్దమునకు మహదర్థమున అన్ని
విభక్తులయందును వకారము వైకల్పికముగా పూర్వాగమ మగును; ఆ ఈ ఏ
శబ్దములకు అమహదర్థమున ప్రథమేతరవిభక్తులయందు రెండువచనములందును
నిత్యముగా దకార వకారములు క్రమముగా పూర్వాగమము లగును - ఇది సూత్ర
సమన్వయము.

'ఆ' అను శబ్దమునకు మహదర్థమున డుజ్వర్ణకము వచ్చి 'ఆ + డుజ్' అని
యగును. ప్రస్తుతసూత్రముచేత వ కారము పూర్వాగమము కాగా వ్ + ఆ + డుజ్ =
వాఁడు అని యగును. అన్ని విభక్తులయందును 'వ' కారము వచ్చును గనుక ద్వితీ
యాది విభక్తులు పరమగునపుడు 'వానిని' మున్నగువిధముగా నుండును. బహువచ
నమునందు వారు, వారిని - మున్నగువిధముగా నుండును. ఈ శబ్దముపై ఇట్లు
వీఁడు, వీరు, వీనిని - మున్నగురూపము లేర్పడును.

'ఏ' శబ్దమునకు 'డుజ్' పరము కాగా 'ఏఁడు' అని మహదర్థకరూప మగును.
ప్రస్తుతసూత్రముచే పూర్వమందు వకారము చేరగా 'వేఁడు' అని యగును. వకార
ప్రాప్తి వైకల్పిక మగుటచే కలుగనిపక్షమున 'ఏఁడు' అనియే యుండిపోవును. ఇతర
విభక్తులు పరమగునపుడు ఏరు, వేరు; ఏరిన్, వేరిన్ - మున్నగువిధముగా వాగ
మముతోడి రూపమొకటియు, వాగమము లేని రూపమొకటియు కలుగుచుండును.

'ఆ' శబ్దమునకు ద్వితీయాదివిభక్తులు పరమగునపుడు అమహదర్థమున ఏక వచనమునందు 'ద' కారము పూర్వాగమ మగును.

'ఆ' అను శబ్దముపై ద్వితీయయందు రాబోవు సూత్రము (ప్రౌఢ - 60) బట్టి 'ని' వర్ణకము కలుగును. 'ఆ + ని' అని యుండగా ప్రస్తుతసూత్రముచేత 'ద్' అన్నది ముందుచేరి 'దాని' అని యగును. ఇట్లే దానిచే, దానికొఱకు-మున్నగు నవి యేర్పడును. 'ఈ' శబ్దముపై దీనిని, దీనిచే, దీనికొఱకు - మున్నగు రూప ములును 'ఏ' శబ్దముపై దేనిని, దేనిచే, దేనికొఱకు - మున్నగురూపములును ఏకత్వమునందు కలుగును.

బహుత్వమునందు 'ఆ, ఈ, ఏ' - అను శబ్దములకు ద్వితీయాదివిభక్తులు పరమైనపుడు వకారము పూర్వాగమమగును. అపుడు వానిన్, వీనిన్, వేనిన్ - మున్నగువిధముగా రూపము లేర్పడును.

ప్రస్తుతసూత్రముచేత కలిగిన వాఁడు, వారు - అనునవి ఇతరశబ్దమున కపు ప్రయుక్త మగుటయు కలదు. అప్పుడుకూడ 'వ'కార మట్లే యుండునవి వివరణ మందలి తుదివాక్యము తాత్పర్యము.

చిన్నయసూరి తదర్థక మహద్రూపములుగా వాఁడు. వారు, వానిని, వారిని - మున్నగువానిని చూపెను. ఇదమర్థక మహద్రూపములుగా వీఁడు, వీరు, వీనిని, వీరిని - మున్నగువానిని చూపెను. అమహత్తదర్థకరూపములుగా అది, అవి, దానిని, వానిని - మున్నగువానిని అమహదిదమర్థకరూపములుగా ఇది, ఇవి, దీనిని, వీనిని - మున్నగువానిని సూరి చూపెను. యత్కిమర్థకమునకు మహదర్థకమునందు ఏఁడు, ఏరు. ఏనిని, ఏరిని - మున్నగురూపములను చూపెను. అమహదర్థమునందు ఏది, ఏవి, దేనిని, వేనిని - మున్నగురూపములను చూపెను. కావున ప్రౌఢవ్యాకర్త ప్రక్రియా పూర్వకముగా చూపిన రూపములను బాలవ్యాకర్త యితఃపూర్వమే చెప్పి యుండెను.

ప్రౌఢవ్యాకర్త వేఁడు, వేరు, వేనిని, వేరిని - మున్నగు విధముగా ఏశబ్దము మీద ఏర్పడిన మహదర్థకరూపములను అదనముగా చూపెను. చిన్నయసూరి వీనిని తాను చెప్పలేదు. కావున వీనినికూడ కలియగలుపుగొనుట యవసరము.

64. కొన్నిచోట్ల మహదర్థంబున నే శబ్దంబునకు వాఁడు వారును. అమహదర్థంబునం ద్రికంబున కది యవ్వలును స్వార్థంబున

నేక బహువచనంబులం గ్రమంబుగ సమప్రయుక్తంబు లగు.

(ప్రౌ - ౨౪)

ఏవాఁడు - ఎవ్వాఁడు - ఏవారు - ఎవ్వారు: ఆయది-అయ్యది; ఆయవి-అయ్యవి; ఈయది - ఇయ్యది - ఈయవి - ఇయ్యవి; ఏయది- ఎయ్యది - ఏయవి - ఎయ్యవి.

వ్యాఖ్య - ఏ శబ్దమునకు వాఁడు, వారు - అను శబ్దములు మహదర్థమున సమప్రయుక్తము లగును. త్రికమునకు (ఆ ఈ ఏ) స్వార్థమునందు 'అది' అను శబ్దము ఏకత్వమున 'అవి' అను శబ్దము బహుత్వమున అనుప్రయుక్త మగును - ఇది సూత్రార్థము

'ఏ' శబ్దముపై 'వాఁడు' అనునది వచ్చి 'ఏ + వాఁడు = ఏవాఁడు' అని యగును. బహుత్వమునందు 'ఏవారు' అని యగును. "త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు" అను బాలవ్యాకరణ (సమాస - 14) సూత్రమును బట్టి 'ఏ + వ్వాఁడు' అనియై "ద్విరుక్తం బగు హల్లు పరంబగునపు డాచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను (సమాస - 13) విధినిబట్టి 'ఎవ్వాఁడు' అని యగును. 'ఎవ్వారు' అను రూపముకూడ ఇట్లే ఏర్పడును.

'ఆ' అను శబ్దమునకు అమహదర్థకైకవచనమున 'అది' అనుప్రయుక్తము కాగా 'ఆ + అది' అని యగును. దీర్ఘముమీఁద సంధి లేనందువలన యడాగమము కలిగి 'ఆ + యది' అని యగును. ఇప్పుడు "త్రికంబుమీఁది" అను సూత్రమువలన 'ఆ + య్యది' అనియై "ద్విరుక్తంబగు హల్లు" అని మొదలయిన సూత్రముచేత 'అయ్యది' అని యగును. ఆయది, ఈయది, ఏయది - యనునవి కేవలము యడాగ మముతోడి రూపములు. అయ్యది, ఇయ్యది, ఎయ్యది, - అనునవి యడా గమమును ద్విత్వమును కలిగి, త్రికమునకు హ్రస్వము కలిగిన రూపములు ఇట్లే బహుత్వమున ఆయవి, అయ్యవి - మున్నగు విధముగా 'అవి' శబ్దముతోడి రూపము లేర్పడును. 'ఆయది' మున్నగువానియందు అర్థభేద మేమియు లేదు. అనగా అవి స్వార్థమునందే అయిన రూపములని భావము.

బాలవ్యాకర్త యీ రూపముల నన్నింటిని చూపియున్నాడు. వానికి ప్రక్రియను ప్రదర్శించుటయే ప్రౌఢవ్యాకర్త చేసిన పని.

65 ఇట నే హ్రస్వంబగు; అగుచో వా దీర్ఘంబునకు హ్రస్వంబును ద్విత్వంబునకు లోపంబును విభాష నగు. (ప్రౌ - ౩౫)

ఎవ్వఁడు - ఎవఁడు - ఎవ్వరు - ఎవరు.

వ్యాఖ్య - ఇట నని యనుటచేత ఏ శబ్దముపై తచ్ఛబ్దమనుప్రయుక్తమైనప్పుడని యర్థము. అట్టియెడల 'ఏ' శబ్దము 'ఎ' అని యగును. అప్పుడు మీదనున్న 'వా' యొక్క దీర్ఘమునకు హ్రస్వమును, ద్విత్వమును విభాషగా నగును. ఇది సూత్రార్థము.

'ఏ + వాఁడు' అనునది పూర్వసూత్రమునందు చెప్పినట్లు 'ఏవాఁడు' అనియు 'ఎవ్వాఁడు' అనియు నగును. ప్రస్తుత సూత్రముచేత 'వా' దీర్ఘమునకు హ్రస్వము కలుగగా 'ఎవ్వఁడు' అను రూపము కలుగుచున్నది. బహుత్వమునందు 'ఎవ్వరు' అను రూపము కలుగుచున్నది.

ప్రస్తుతసూత్రము రెండవయంశముగా ద్విత్వమునకు లోపమును విధించుచున్నది. 'ఎవ్వఁడు' అనునది 'ఎవఁడు' అనియు 'ఎవ్వరు' అనునది 'ఎవరు' అనియు రూపాంతరములను గ్రహించును.

[ప్రస్తుతసూత్రముచేత ఎవాఁడు, ఎవారు - అను అనిష్టరూపములు కలుగుట కవకాశము కలదు. అందువలన "హ్రస్వంబును ద్విత్వంబునకు లోపంబును" అని సముచ్చయార్థకమును వాడుట సరికాదు. "కృతహ్రస్వంబు మీఁది వా దీర్ఘంబునకు హ్రస్వంబు వికల్పంబుగ నగు; అయ్యేని వికల్పంబుగ ద్విత్వలోపంబునగు" అని యన్నయెడల ఆ యనిష్టరూపములు వారింపబడును.]

బాలవ్యాకరణ మీ రూపముల నన్నింటిని చూపినది.

66 అ, ఇ, ఏ శబ్దములకుఁ బూజ్యతయందు మహదేకవచనంబుపైఁ దవర్ణాగమంబును, వాని దీర్ఘంబునకు వికల్పముగా హ్రస్వంబును; మహత్యేకవచనంబున వానిమీఁదఁ బరంబయిన అత, అప, అను శబ్దంబుల తొలియకారమునకు లోపంబును, తుది యకారంబున నెకారాదేశంబు నగు. (ప్రౌ- ౩౬)

అతఁడు - ఆతఁడు; ఇతఁడు - ఈతఁడు; ఎతఁడు - ఏతఁడు;
ఆకె (ఆ + అక + ఎ) - ఆపె (ఆ + అప + ఎ) - ఆమె (ఆ +

అమ + ఎ); ఈకె (ఈ + అక + ఎ) - ఈపె (ఈ + అప + ఎ); ఈమె (ఈ+అమ+ఎ)-ఏకె (ఏ + అక + ఎ)-ఏపె (ఏ + అప + ఎ) - ఏమె (ఏ + అమ + ఎ)॥

వ్యాఖ్య - పూజ్యతను దెల్పవలసినప్పుడు మహదేకవచనమున ఆ ఈ ఏ లకు పైని 'త' అని అదనముగా చేరును. అప్పుడు వాని దీర్ఘము వికల్పముగా హ్రస్వమగును - అని సూత్రమున ప్రథమార్ధము యొక్క అర్థము.

'ఆ' అను దానిపై 'త' చేరి మహదేకవచనమున 'డు' వర్ణకము నొందగా 'ఆతఁడు' అని యగును. ఇట్లయిన పిమ్మట 'ఆ' కు హ్రస్వము కలుగగా 'అతఁడు' అని యగును. హ్రస్వవిధి వైకల్పికమగుటచే హ్రస్వము కలుగనియెడల 'ఆతఁడు' అనియే యుండును. ఇట్టివే ఇతఁడు - ఈతఁడు; ఎతఁడు - ఏతఁడు॥ అను రూపములు. 'వాఁడు' మున్నగువానికంటె 'అతఁడు' మున్నగువానియందు పూజ్యత ద్యోతితమగును.

బాలవ్యాకర్త "తదాదులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునం బూజ వివక్షించునపుడు అతఁడు - ఆతఁడు; ఇతఁడు - ఈతఁడు; ఎతఁడు - ఏతఁడు అను రూపంబులు వడయు"నని తెలిపెను. ప్రౌఢవ్యాకర్త వానికే నిష్పత్తిని ప్రదర్శించెను.

మహతిని బోధింపవలసినప్పుడు ఆ ఈ ఏ - అను శబ్దములకు ఏకత్వమునందు పరమగు అక, అప, అమ - అను శబ్దముల 'అ' వర్ణమునకు లోపమును, చివరి అత్వమునకు ఎత్వము నగునని సూత్రమున ద్వితీయార్ధము యొక్క అర్థము.

'ఆ + అక' అనియుండి 'అ'త్వమునకు లోపము కలిగి 'ఆ + క' అని యగును. చివరి అవర్ణమునకు ఆదేశముగా ఎ వర్ణము కలిగి 'ఆకె' అని యగును. 'ఆమె, ఆపె' అనునవి యిట్లే 'ఆ' శబ్దముమీద ఏర్పడిన మహతీవాచక రూపములు. 'ఈ' యను దానిపై ఈకె, ఈపె, ఈమె అనియు, 'ఏ' యను దానిపై ఏకె, ఏపె, ఏమె - అనియు నిట్లే యేర్పడును.

తదాదులు మూడింటినిగూర్చి చెప్పుచు "మహతీవాచకంబులు ఆమె - ఆపె - ఆకె; ఈమె - ఈపె - ఈకె; ఏమె - ఏపె - ఏకె అను రూపంబులు వడయు" అని బాలవ్యాకర్త తెల్పెను. వానినే ప్రౌఢవ్యాకర్తయు చూపెను.

[ వ్యాకరణమునందు ప్రక్రియాలాఘవ మపేక్షితము. కావున "త్రికంబున కమహదేకత్వంబున కపవర్గంబు లైదంతంబు లంతాగమంబులగు" అని చెప్పినచో సరిపోయెడిది. అట్లు కాకున్నచో తన పద్ధతిని బట్టియే కె, పె, మె - అనునవి చివర చేరునని అనియుండిన బాగుండెడిది. అట్లుకాక 'అక' మున్నగువానిని చెప్పి అత్వమునకు లోపమును, చివర ఎత్వమును చెప్పుట ప్రక్రియాభారమును పెంచును. ఇంతకును 'అక' ప్రభృతులు స్వస్వరూపముతో నిలువవు. అట్లుకాక అక్క, అప్ప, అమ్మ - యనువాని ద్విత్వరహితరూపములే అక ప్రభృతులనియు, అందువలన చరిత్ర కనుకూలముగా నున్నదనియు కొందరు వాదింపవచ్చును. కాని ఆవిషయము చరిత్రాత్మకవ్యాకరణములకు, భాషాశాస్త్రమునకు సంబంధించినది. అది యక్కడ ప్రసక్తము కావలయును. వ్యాకరణమునకు చరిత్ర పరిణామము కాక, ప్రక్రియాలాఘవము లక్ష్యము కావలయును. ఈ దృష్టినే తాత్కాలికముగా అంగీకరించినయెడల 'ఆ+అమ' అని యన్నప్పుడు 'ఆయమ' యనికాక ప్రౌఢవ్యాకర్తనుబట్టి 'ఆమె' అను రూపమొక్కటియే రావలయును. మరి, భాషయందు ఈమె, ఈయమ మున్నగువిధముగా రూపములు కలవు. అవి ప్రస్తుతవిధివలన అగతికములు కావలసి వచ్చును. కావున 'ఆమె' మున్నగుచోట 'మె' మున్నగువర్ణములనే విధించిన సక్రమముగా నుండును. 'అమ్మ' శబ్దము పరమైనప్పుడు త్రికవిధిచేతనే ఆయమ్మ, ఈయమ్మ- మున్నగు రూపములును, ఒద్దకు లోపము రాగా ఆయమ, ఈయమ - మున్నగు రూపములును కలుగును. కావున ప్రౌఢవ్యాకర్త చూపిన ప్రక్రియ సమంజసమని యనుట కవకాశము చాలదు. ]

సూత్రమున "ఎకారాదేశంబు నగు" అని యనుట సమర్థనీయము కాదు. ఎకార మనుటవలన ఎ, ఏలు రెండును గ్రాహ్యములు కావలయును. కాని యిక్కడ దీర్ఘము రారాదు. కావున 'ఎత్వం'బని నియతముచేయుట వాంఛనీయము. లక్ష్యములందు 'అ+అక+ఎ' మున్నగువిధముగా చూపుట సరియగు పద్ధతికాదు. 'అక' ప్రభృతుల తుది అత్వమునకు ఎత్వము ఆదేశముగా నగుచున్నది. కావున 'అక్+ఎ' అనియే యుండవలయును. అత్వమును తొలగించి ఎత్వము వచ్చును. కనుక అత్వమునకు ప్రక్కగా ఎత్వమును చూపరాదు. ప్రస్తుత స్థితినిబట్టి 'ఎ' ఆగమ మను భ్రమను కలిగించుచున్నది. కావున అట్లు చూపకుండిన బాగుండెడిది.

**67. ఆ ఈ శబ్దములకు ఏ శబ్దమును సమహదర్థంబునం బ్రథమా విభక్తి పరంబగునపుడు నిత్యముగాను వైకల్పికముగాను గ్రమంబున హ్రస్వంబు లగు. (ప్రౌ - ౩౨)**

( చూ. మీఁది సూత్రము. )

వ్యాఖ్య - అమహదర్థమునందు ప్రథమావిభక్తి పరమగునపుడు ఆ ఈ శబ్దములు నిత్యముగాను, ఏ శబ్దము వైకల్పికముగాను హ్రస్వమగు నని సూత్రార్థము.

ప్రథమైకవచనమునందు తరువాతిసూత్రమున 'ది' విధింపబడు చున్నది. 'ఆ' అనుదానికి 'ది' ప్రథమైకవచనమునందు వచ్చి చేరును. 'ఆ + ది' అని యుండగా ప్రస్తుత సూత్రముచేత హ్రస్వము కలిగి 'అది' అని యగును. ఇట్లే 'ఈ'శబ్దముపై 'ఇది' అని యగును. బహుత్వమునందు కూడ హ్రస్వము కలుగును. కావున 'వి' పరమందుండగా హ్రస్వము వచ్చి అవి, ఇవి - అను రూపము లేర్పడును.

ఏశబ్దమునకు హ్రస్వము వైకల్పికము కావున హ్రస్వము కలిగినచో ఎది, ఎవి - అనియు హ్రస్వము కలుగనిచో ఏది, ఏవి - అనియు రూపము లుండును.

68. త్రికంబున కమహదర్థంబునఁ బ్రథమైకవచన బహువచనంబులం గ్రమంబుగ దివి వర్ణకంబు లగు. (ప్రౌ - ౫౦)

అది - అవి; ఇది - ఇవి; ఏది - ఏవి.

వ్యాఖ్య - అమహదర్థమునందు ఏకత్వమును బోధింపవలసి వచ్చినపుడు 'ది' అనియు, బహుత్వమును బోధింపవలసివచ్చినపుడు 'వి' అనియు ప్రథమావిభక్తి యందు ఆ ఈ ఏ అనుశబ్దములకు చేరునని సూత్రార్థము.

ఆ + ది - అని ప్రథమైకవచనమునందు కాగా పూర్వసూత్రముచేత హ్రస్వము ప్రాప్తించి 'అది' అని యగును. ఇట్లె తక్కిన రూపములును.

బాలవ్యాకర్త అమహద్వాచకరూపములుగా పైవాని నన్నింటిని చూపెను. కావున ప్రక్రియను చూపుటయిక్కడి విశేషము.

[ ఉదాహరణములయందు 'ఏ' శబ్దమునకు ఏది, ఏవి - యను రూపములనే చేర్చెను. పూర్వసూత్రముచే వైకల్పికముగా హ్రస్వము ప్రాప్తింపగా ఎది, ఎవి - అనికూడ నగును. పూర్వము తా నుదాహరణములను చూపలేదు. కాబట్టి యిక్కడ ఆరెంటిని చేర్చియుండిన సమంజసముగా నుండెడిది. ]

69. హ్రస్వవ్యస్త త్రికంబుమీఁది దివులకు ద్విత్వంబు నగు. (ప్రౌ - ౫౧)

అద్ది - అవ్వి; ఇద్ది - ఇవ్వి; ఎద్ది - ఎవ్వి॥ ఇట్లనుటచే అయ్యదీర్ఘాదులయందు ద్విత్వంబు కలుగదని యూహింపవలయును.

వ్యాఖ్య - వ్యస్తముగా నుండి హ్రస్వమైయున్న త్రికము మీది 'ది' 'వి' అను వానికి ద్విత్వము సహితము కావచ్చు నని సూత్రార్థము.

'అది' అనునది పూర్వసూత్రములచే 'ఆ'కు హ్రస్వమును, 'ది' వర్ణమును కలుగగా ఏర్పడినరూపము. ప్రస్తుతసూత్రముచేత 'ది' వర్ణమునకు ద్విత్వము కలుగగా 'అద్ది' అని యేర్పడును. ఇట్లే అవ్వి, ఇద్ది, ఇవ్వి - అను రూపములు కూడ నేర్పడును.

'ఏది' అను దానికి పూర్వమందు దీర్ఘ ముండుటచే ద్విత్వప్రవృత్తి లేదు. 'ఏవి' అనునదికూడ అట్టిదే. ఎది, ఎవి - అను రూపములందు ఎత్వము హ్రస్వమే కాబట్టి ది వి వర్ణములకు ద్విత్వము వచ్చి ఎద్ది, ఎవ్వి అని కావచ్చును.

వ్యస్తత్రిక మని యనుటచే త్రికము పూర్వశబ్దముతో సమసించినప్పుడు ఈ కార్యము జరుగదు. ఆ + అది = ఆయది - అయ్యది॥ ఈవిధముగనే యుండును. 'ది' వర్ణమునకు ద్విత్వము కలుగదు. ఈయది, ఇయ్యది, ఏయది, ఎయ్యది - అనునవి కూడ ఇట్టివే.

ఇట్లే వచ్చెడిది, వచ్చునవి, నాది, నీవి - మున్నగు సమాసరూపములందు ది వి వర్ణములకు ద్విత్వము కలుగరాదు.

[సూత్రమునందు 'హ్రస్వ' అను విశేషణము అవసరము కాదు. త్రికము నకు ది వి వర్ణములు పరములగునపుడు ఆఈలకు హ్రస్వము నిత్యము; ఏకు వైకల్పికము. ఇట్లు విధింపబడిన పిమ్మట ఆఈల విషయమున దీర్ఘముగానుండు అవకాశము లేనేలేదు. 'ఏ'కు హ్రస్వము వైకల్పికమైనమాట సత్యమే. హ్రస్వము మీదనే అయిన 'ఎద్ది' అని యెట్లును కావచ్చును. 'ఏది' అను దీర్ఘరూపముమీద కూడ ద్విత్వము వచ్చిన 'ఏద్ది' అని యగును. వెంటనే "ద్విరుక్తం బగు హల్లు పరంబగు నపు డాచ్ఛికం బగు దీర్ఘంబునకు హ్రస్వంబగు" అను (బాల - సమాస - 13) నియమమునుబట్టి 'ఎద్ది' అను రూపమే సిద్ధించును. కావున "వ్యస్తత్రికంబుమీఁది" యని మొదలిడిన సరిపోయెడిది.]

**70. ద్వితీయైకవచన బహువచనముల వెంటను నివర్ణకం బగు.**

(ప్రౌ - ౬౦)

దానిన్ - వానిన్; దీనిన్ - వీనిన్; దేనిన్ - వేనిన్.

వ్యాఖ్య - పూర్వము చెప్పికొనిన అమహదర్థక త్రికమునకు ద్వితీయావిభక్తి యందు ఏకవచన బహువచనములు రెండింట 'ని' యను ప్రత్యయము కలుగునని సూత్రార్థము.

'అ' అను దానికి 'ను' యను ద్వితీయాప్రత్యయము పరమందున్నచో ఏకత్వమున (ప్రౌఢ - ౬౭) దకారము పూర్వాగమ మగును. అప్పుడు 'ద్ + అ + ని' అని యగును; 'దాని' అని రూపమేర్పడును అట్లే బహువచనమునందు 'వ' కారము పూర్వాగమము కాగా వ్ + అ + ని = వాని అని యగును.

[ప్రౌఢవ్యాకర్త 'ని' అనుదానిని ద్వితీయాప్రత్యయముగా విధించుచున్నారు. మరి దానిపైని 'న్' అనునది ఏవిధివలన చేర్చుచున్నారో యర్థము కాదు. నిజమునకు ఇచ్చటి 'ని' యనునది ఆగమమే. దానిమీద నున్న ద్రుతము ద్వితీయావిభక్తి ప్రత్యయమైన ను వర్ణమే. అ + ని + ను - అని యున్నప్పుడు దాగమము కలిగి ద్ + అ + ని + ను అనియై దా + ని + ను అని యుండును. "ఇకారంబుమీది" అను (బాల - తత్సమ - ౨౮) సూత్రమునుబట్టి 'దానిని' అని కావచ్చును. "అవసానంబునందు" అని మొదలయిన (బాల - సంధి - ౨౦) సూత్రమునుబట్టి 'దానిన్' అని కావచ్చును. కావున ఇచ్చటి 'ని' వర్ణమును ద్వితీయాప్రత్యయముగా గ్రహించుట యుచితము కాదు.]

"బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లదాగమంబగు" అను (బాల - తత్సమ - ౩౧) విధినిబట్టి 'ల' వర్ణము విభక్తికి పూర్వమందు రావలసియున్నను ప్రస్తుతసూత్రము బహువచనమున కూడ 'ని' వర్ణమునే విధించుటచేత దానికి ప్రాప్తి కలుగదు.

['ని' యనునది ప్రౌఢవ్యాకర్తనుబట్టి ప్రత్యయమే కనుక దీనికి ముందు 'ల' ఆగమముగా వచ్చును. దానిని వారించు ప్రయత్నముకూడ వ్యాకర్త చేయలేదు. మొత్తము మీద 'ని' వర్ణక మనుట ఎన్నో యభ్యంతరములకు, అపరూపములకు కారణము కాగలదు. ఇది సరియైన పద్ధతి కాదు.]

**71. అయ్యది తృతీయాదివిభక్తులుపరంబులగుచో నాగమంబుగా నగు.** **(ప్రౌ - ౭౧)**

దానిచేతన్ - వానిచేతన్. మొ.

వ్యాఖ్య - అమహదర్థక త్రికమునకు తృతీయాదివిభక్తుల పరమైనపుడు 'ని' వర్ణము ఆగమముగా నగునని సూత్రార్థము.

అ + చేతన్ - అని యున్నప్పుడు ప్రస్తుతసూత్రముచేత 'ని' వర్ణము ఆగమముగా నగును. అప్పుడు అ + ని + చేతన్ - అనియగును. ఏకత్వమున పూర్వాగమమైన ద వర్ణము నొంది ద్ + అ + ని + చేతన్=దానిచేతన్ అని యగును. బహుత్వమున వ వర్ణమురాగా వానిచేతన్ అని యగును. దీని కొఱకు వీనివలన - దేనికి - వేనియందు॥ మున్నగురూపము లిట్లు ఏర్పడినవే.

[ పూర్వసూత్రమును ఈసూత్రమును కలిపి "ఏకత్వబహుత్వంబుల ద్వితీయాది విభక్తులు పరంబులగుచో నమహత్తికంబునకు నిగాగమంబగు" అని యన్నచో సరిపోయెడిది; రెండుసూత్రముల యవసరము లేకుండెడిది; అప్పుడున్న లోపములు లేకపోయెడివి; సంక్షిప్తతయు కలిగెడిది. ]

బాలవ్యాకరణము దానిని, దీనిని, దేనిని - అని యుదాహరించినది. తృతీయాదులం దిట్లే యగు ననుటచే 'దానిచే' మున్నగురూపములను సూచించినట్లే.

72. అది యిది యెది యనువానికిఁ దృతీయాసప్తమ్యేకవచనంబుల యందు దాన దీన దేన యనియు, వాని బహువచనంబులయందు వాన వీన వేన యనియు రూపంబు లగు. (ప్రౌ - ౬౨)

చనునెడ శ్రీరాముఁడు పా॥ వన వన నిబిరూపవై భవశ్రీ నుల్లం॥ బున నిడి దాన విచిత్రా॥ తనురాగప్రౌఢి వచ్చి తనుఁ బైకొనఁగన్॥ రాఘ. ౨ ఆ॥ నలుఁ గాన మివ్వనంబునఁ। గల వెప్పుడుఁ గాంతు మృగకరులను సింహం। బుల ఋక్షంబుల నిది మా। ర్తుల కవిమయు మాతపంబు దూఱదు దీనన్॥ భార. అర. ౨ ఆ॥ కాననము గిరులు నదులును। నానాతీర్థములు భూజనంబుల కెల్లన్। భూనుత! సాధారణములు। వానను ధర్మములు సేయవచ్చు నిశేచ్ఛన్॥ భార. అను. ౨ఆ॥ అనిన నలుగాలివాన గోవును నశేష। శబ్దముల మంత్రమును లోహజాతిఁ గాంచ। నమును మనుజుల విప్రుండు సమధికత్వ। భాజనము లంద్రు వేదప్రపంచవిదులు॥ భార. శాంతి. ౧ ఆ॥ కలవు నూఱులు వేలు లక్షలును గోటు। లప్రమేయముల్ ఘనమాయ లధిప! నాకు। వానఁ దగులక పోరాదు వనజభవున। కైన నభవునకైనను నన్యు లెంత॥ లక్ష్మి. ౪ ఆ॥ ధ్యానం బింద్రియవృత్తులు। మానిగను టహింప గురు సమర్చనవిధి ని। త్యానుష్ఠానము జపమును। వీనం బని సేవ్య మెద్ది

వినఁగా వలతున్॥ భార. అన. ౪ ఆ॥ ఒక్కఁడొక్కటిచేత నెక్కుచుఁ దఱుఁగుచుఁ ద్రిగుణంబులను బ్రవర్తించువీన। జనితంబు లగుఁ బ్రీతి సంతాప మోహాదులు॥ భార. అను ౫ ఆ॥ అని మెఱింగించి మఱియు నిట్లను సజుండు। స్వేద ముద్భేద మండమన్ వీనఁ బుట్టు॥ భార. అశ్వ. ౨ఆ॥ మొ. దీనన్, వేనన్-అనువానికిఁ బ్రయోగంబులు మృగ్యంబులు.

వ్యాఖ్య - పూర్వసూత్రములచేత అది, ఇది, ఎది - అను వానికి తృతీయా విభక్తి పరము కాగా దానిచేత, దీనిచేత, దేనిచేత మున్నగువిధముగా నగును. ప్రస్తుతసూత్రముచేత దానన్, దీనన్, దేనన్ - అన్న రూపములేర్పడును. అనగా చిట్టచివరి ప్రత్యయమున కంతటి కాదేశముగా అత్వము కలుగు చున్నది. అయినను ప్రౌఢవ్యాకర్త యీవిధముగా ప్రక్రియను చూపక 'దానిచే' మున్నగురూపములకు 'దానన్' మున్నగు రూపములను విపఠించుచున్నాడు. ఇట్లే సప్తమియందు 'దాని యందు' మున్నగువానికి 'దానన్' మున్నగువిధముగా రూపము కలుగును. బహువచనమునందు 'వానన్' మున్నగువిధముగా నగును.

బాలవ్యాకర్త యీ రూపములను చూపలేదు. కావున ఈ సూత్రము బాల వ్యాకరణమునకు పూరక మగుచున్నది. ప్రౌఢవ్యాకర్త పై రూపములకు ప్రయోగము లను ఉదాహరించెను. దేనన్ వేనన్ - అనువానికి ప్రయోగములు తనకు కనిపింపక పోయినను ఆ రూపము లుండునన్న విశ్వాసముతో సామ్యమునుబట్టి ప్రౌఢవ్యాకర్త వానినిగూడ సాధించి యుండెను.

[ సూత్రమున తృతీయా సప్తమీత్యాదిగా వాడెను. తృతీయయందు చేత, తోడ - అను రెండు ప్రత్యయములు గలవు. 'దానన్' మున్నగునవి చేత వర్ణకముతోడి రూపమునకే కలుగుచున్నవి. తోడ వర్ణకముతోడి దానికి కలుగుట లేదు. ఆవిషయమును సూత్రకర్త స్పష్టముచేయుట యావశ్యకము. ]

**73.** షష్ఠ్యంత గతం బాకబ్దం బనుహద్దర్శకంబు సమస్తంబు వ్యస్తంబు నయి కొన్నియెడల వర్థకూన్యంబగు. (ప్రౌ - ౬3)

తత్పుర వ్రపము పాడపీఠికా। శిరముల కొప్ప నర్చనలు చేసిన పువ్వుల యవ్విధంబునన్॥ భార. ఆది. ౮ ఆ॥ పాడుగాపునాగతి॥ కళా. 3 ఆ॥ మఱి బావులు నూతిటికంటె నొక్క సత్క్రతు వనిమేలు॥ భార. ఆది. ౪ ఆ॥

వ్యాఖ్య - అమహదర్శకమైన 'ఆ' శబ్దము పదాది యందుండి సమాసగతమై కొన్నియెడల అర్థశూన్యముగా నుండును; పదాంతముననుండి వ్యస్తమై కొన్ని యెడల అర్థశూన్యముగా నుండును. ఇది సూత్రార్థము.

'ఆ' శబ్దము సమాసపూర్వపదముగా ఆస్లే యుండును. వ్యస్తముగా నున్నప్పుడు 'అది' అని యగును. కావున ఆ, అది - అను నీ రెండును కొన్నియెడల నిరర్థకముగా ప్రయోగింపబడుచుండుటయు కలదని సూత్రతాత్పర్యము.

'పువ్వుల విధంబునన్' అని యున్నప్పు డున్న యర్థమే 'పువ్వుల యవ్విధంబునన్' అని యున్నపుడును గలదు. అర్థవిశేషమేమియు కలుగలేదు. కావున సమాసగతమైన 'ఆ' శబ్దము ఇక్కడ నిరర్థకము. 'పాడుగాపునాగతి' అన్నప్పుడు కూడ 'పాడుగాపుగతి'అని యన్నప్పటికంటె అర్థవిశేషములేదు.

మూడవ లక్ష్యమునందు "ఒక్కసత్క్రతువు మేలు" అనునర్థముననే 'అది' యనునది వాడబడి 'సత్క్రతు వది మేలు' అని యైనది. అయినప్పటికిని అర్థవిశేషము మాత్రమేమియు లేదు. ఇచ్చట 'అది' వ్యస్తముగా ప్రయోగింపబడిన దనుట స్పష్టముగానే యున్నది.

బాలవ్యాకరణమున కిది పూరణము.

**74. తవర్ణకంబు స్త్ర్యర్థకం బగు.** (ప్రౌ - ౭౪)

వ్యాఖ్య - 'త' యను ప్రత్యయము స్త్రీయను నర్థమును బోధించునని సూత్రార్థము. అనగా స్త్రీ యను నర్థమును చెప్పవలసినప్పుడు ఆయాశబ్దములకు 'త' వర్ణకమును చేర్చవలసి యుండునని తాత్పర్యము. (ఉదాహరణములు తరువాతి సూత్రముకడ చూపబడును.)

**75. అయ్యాది యేకత్వంబున సమాసగత షష్ఠ్యంత యత్కిమర్థకా న్యైకార్థక శబ్దంబుల పయి నగు.** (ప్రౌ - ౭౫)

ఎవ్వారిత - ఎవరిత; ఒక్కరిత - ఒకరిత; ఒక్కొరిత - ఒకొరిత: (దీనికి ఎవరియొక్క యాడుది యనియు, ఒకరియొక్క యాడుది యనియు, ఒక్కయాడు దనియు నర్థములు.)

వ్యాఖ్య - యత్కిమర్థకముయొక్కయు, అన్యైకార్థకముయొక్కయు సమాసగత షష్ఠ్యంతరూపముపై ఏకత్వమున త వర్ణకము వచ్చునని సూత్రార్థము.

సంస్కృతమునందలి యదర్థమును, కిమర్థమును గూడ తెలుగునందలి 'ఏ' యను రూపమే తెలుపును. ఇది మహదర్థక మైనపుడు ఎవ్వరు, ఎవరు - అని యగును. దీనికి షష్ఠ్యంతరూపము ఎవ్వరి యొక్క, ఎవరియొక్క - అను విధముగా నుండును. సమాసగత మైనపుడు "సమాసవిభక్తికి లోపంబగు" అను (బాల - సమాస - 26) సూత్రమునుబట్టి 'యొక్క'కు లోపము కలిగి ఎవ్వరి, ఎవరి - అని యగును. ఆ రూపములపై 'త' వర్ణకముచేరి 'స్త్రీ' యను నర్థమును చెప్పును. ఇచ్చటి తవర్ణము తద్ధిత ప్రత్యయము. ఎవ్వరిత, ఎవరిత - యనునవి తద్ధితరూప ములుగానే గ్రాహ్యములు.

అన్య + ఏకార్థకము = అన్యైకార్థకము = ఇతరము అను నర్థమును, ఒకటి అను నర్థమును చెప్పునది. తెలుగున నీరెండర్థములందునుగూడ 'ఒక' శబ్దమే యుపయుక్తమగును. దీనికి మహదర్థక షష్ఠ్యంతరూపము ఒక్కరి యొక్క, ఒకరి యొక్క, ఒక్కొరియొక్క, ఒకొరియొక్క మున్నగువిధముగా నుండును. సమాస గతమని యనుటచే 'యొక్క'కు లోపము వచ్చును. అప్పుడు మిగిలిన రూపముపై స్త్ర్యర్థకమైన తవర్ణకము కలిగి ఒక్కరిత, ఒకరిత, ఒక్కొరిత, ఒకొరిత - మున్నగు విధముగా నగును.

బాలవ్యాకరణము యత్కిమర్థకమునకును, ఏకార్థకమునకును మహతీవాచ్య మగునపుడు కలుగురూపముల నన్నింటిని చూపెను. ప్రస్తుతలక్ష్యము లందు చేరినవే.

[ సూత్రమున సమాసగతషష్ఠ్యంత యత్కిమర్థక మనుటచే 'ఎవ్వరి' యను రూపమును, సమాసగత షష్ఠ్యంతాన్యైకార్థకమనుటచే 'ఒక్కరి' యను రూపమును గ్రహింపవలయు నని వ్యాకర్త భావము. నిజమునకు 'ఏ' యనియు 'ఒక' యనియు మాత్రమే సూత్రభాషకు నర్థము కావున "మహద్బహుత్వ బోధకములు" అనునదికూడ సూత్రమునందు చేరవలయును. అట్లు కానియెడల తన యాశయము సిద్ధింపదు. 'బహుత్వబోధకములు' అని యనకపోయినచో ఎవ్వని, ఒక్కని - మున్నగు నిగంతములుకూడ తావు కలుగజేసికొనును. దీనిని పరిహరించుట యవసరము. మరొక్క విషయము. ఎవ్వారి, ఏవారి - యను రూపములును ఇక్కడ పనికిరావు. వానిని వారించుట జరుగలేదు. ]

ఎవ్వరిత, ఎవరిత - యనువానికి 'ఎవరియొక్క యూరుది' యని సూత్రకర్త యర్థమును దెల్పెను. అట్లు నియతము చేయుట ప్రయోగానుకూలము కాదు. 'ఎవ్వఁడు' అను మహదర్థకమున కెట్టి యర్థముగలదో 'ఎవ్వరిత' యను మహతీరూపమునకు

అట్టి యర్థమే కలదు. అట్లే ఒక్కరిత - మున్నగు వాని యర్థముకూడ నియతము కావలసిన యవసరము లేదు.

76. దాని యత్వంబున కిత్వైత్వంబులు పర్యాయంబున నగు, ఆదేశౌత్వంబుపైఁడి దాని కెత్వంబు రాదు. (ప్రౌ - ౭౬)

ఎవ్వరిత - ఎవరిత - ఎవ్వరితె - ఎవరితె; ఒక్కరిత - ఒకరిత - ఒక్కరితె - ఒకరితె - ఒక్కొరిత - ఒకొరిత - ఒక్కొరితె - ఒకొరితె.

వ్యాఖ్య - 'త' వర్ణకముయొక్క అత్వమునకు ఇత్వమును, ఎత్వమును పర్యాయముగా (ఒక మారు ఇత్వము, ఒక మారు అత్వము చొప్పున) నగును. ఓత్వము ఆదేశమైనపుడు ఎత్వము రాదు - ఇది సూత్రార్థము.

'ఎవ్వరిత' అని పూర్వసూత్రముచే ఏర్పడగా, ప్రస్తుతసూత్రముచేత ఇత్వము ప్రాప్తించినచో 'ఎవ్వరిత' యనియు ఎత్వము ప్రాప్తించినచో 'ఎవ్వరితె' యనియు నగును. తక్కిన రూపములు నిట్లే రెండేసి రూపముల నొందవచ్చును. 'ఎవ్వరిత' మున్నగు అత్వముతోడి రూపములుకూడ ఉపయుక్తములు కావచ్చును.

[పర్యాయంబున నగు - అని యనుటకంటె 'విభాషగనగు' నని యన్నచో పర్యాయ కల్పనము, వికల్పముకూడ సాధించుటకు వీలుగా నుండెడిది. 'పర్యాయము' అని యనుటచేత తవర్ణముతోడి తొలిరూపము ఉండరాదేమో యను భ్రాంతి కలుగుట కవకాశము కలుగుచున్నది.]

సూత్రమున రెండవభాగ మింకొకటి కలదు. ఓత్వము ఆదేశముగా నైనపుడు 'త' వర్ణకమునకు ఎత్వము రాదని దాని యర్థము. రాబోవు (ప్రౌఢ - ౬౯) సూత్రముచేత ఒక్కాదులకు ఓత్వము ఆదేశముగా విధింపబడినది. అప్పుడు ఓర్త, ఓర్తి, ఓర్తు, ఓర్తుక - మున్నగురూపములు వచ్చునుగాని 'త' వర్ణకముపై ఎత్వము కలుగదు.

['ఆదేశౌత్వము' అనునది స్పష్టముగా లేదు. 'ఒక్క' శబ్దమునకు ఒక్కొఁడు, ఒక్కొరు - మొదలయిన విధముగా 'క' కారమునకు ఒత్వము గలిగిన రూపములు కూడ కలవు. ప్రౌఢవ్యాకర్త అచ్చటి ఒత్వము నుద్దేశించి యీ విషయమును చెప్పుటలేదు. కావున ఒక్కొరితె, ఒకొరితె - మున్నగు రూపములుకూడ కలుగుటకు ఏమాత్రమును ఆక్షేపణములేదు. ఇంతకును ఈ ద్వితీయ భాగమును (ప్రౌఢ) ౬౯ వ సూత్రముకడ చేర్చిన స్పష్టమై యుండెడిది]

77 రేఫ సంయుక్తం బగుచో నొక్కొక శబ్దంబుల మీఁది తకా
రంబున కుత్వంబు నగు. (ప్రౌ - ౬౭)

చూ. మీఁదు.

వ్యాఖ్య - ఒక్క, ఒక అను వానిమీది తకారము పూర్వమున్న రకారముతో సంయోగము నొందినయెడల ఉత్వమును గూడ పొందవచ్చు నని సూత్రార్థము.

ఒకరిత - మున్నగువానియొక్క రేఫముమీది 'ఇ' వర్ణము పై సూత్రముచేత లోపము కావచ్చును. అప్పుడు 'త' యనునది 'తు' అని కూడ మారవచ్చునని సూత్రతాత్పర్యము. అప్పుడు ఒకర్తు, ఒక్కర్తు - మున్నగురూపము లేర్పడును.

78. త వర్ణకంబు పరం బగుచో రేఫంబు మీఁది యిత్తునకు లోపంబు విభాష నగు. (ప్రౌ - ౬౮)

ఎవ్వర్త - ఎవర్త - ఎవ్వర్తి - ఎవర్తి - ఎవ్వర్తె - ఎవర్తె॥ ఒక్కర్త - ఒకర్త - ఒక్కర్తి - ఒకర్తి - ఒక్కర్తు - ఒకర్తు - ఒక్కర్తె - ఒకర్తె - ఒక్కొర్త - ఒకొర్త - ఒక్కొర్తి - ఒకొర్తి - ఒక్కొర్తు - ఒకొర్తు - ఒక్కొర్తె - ఒకొర్తె.

వ్యాఖ్య - పూర్వము విధింపబడిన తవర్ణకమునకు పూర్వమందున్న ఎవ్వరి. ఎవరి, ఒక్కరి, ఒకరి - అనువానిలోని రేఫమీది ఇత్వమునకు లోపము విభాషగా కలుగునని సూత్రార్థము.

ఎవ్వరి + త - అని యున్నప్పుడు ఇత్వము లోపింపగా 'ఎవ్వర్త' అని యగును. తక్కినవియు నిట్లే ఇత్వము లోపించిన పిమ్మట రకారము తరువాతి తవర్ణకముతో సంయోగమునొందిన రూపములే. 'త' వర్ణకమునకు ఇత్వము కాని ఎత్వము కాని వచ్చినపుడుకూడ ఈ మార్పు జరుగును. ఒక్కశబ్దముమీది రకార మిట్లు సంయోగమునొందినపుడు తకారమునకు ఉత్వముకూడ కలుగవచ్చును.

79. కొన్నియెడల రేఫ సంయుక్త తవర్ణకంబు ముందటి యొక్కాదుల కోత్వం బాదేశం బగు. (ప్రౌ - ౬౯)

ఓర్త - ఓర్తి - ఓర్తు.

వ్యాఖ్య - పూర్వము చెప్పినట్లు రేఫము తకారముతో సంయోగము చెంది నపుడు ఒక్క, ఒక - అనువానికి సర్వాదేశముగా 'ఓ' అను శబ్దము కొన్నియెడల కలుగవచ్చునని సూత్రార్థము.

ఒక్క ర్త - అని యున్నప్పుడు 'ఒక్క' శబ్దముమీది రకారము తవర్ణకముతో సంయోగము నొందియున్నది. కావున ప్రస్తుతసూత్రముచేత 'ఒక్క' అనుదాని కంతటికి బదులుగా 'ఓ' అనునది వచ్చి 'ఓర్త' అనునది యగును. 'ఒకర్త' యనునదికూడ 'ఓర్త' యనియే యగును. త వర్ణకము ఇత్వమును, ఉత్వమును పొందినపుడుకూడ ఈ మార్పు జరుగును. ఓర్తి, ఓర్తు - అనునవి ఉదాహరణములు. ఒక్క, ఒక యనువానికి 'ఓ' ఆదేశమైనపుడు 'త' వర్ణకమునకు ఎత్వము రాదని (ప్రౌఢ - ౬౬) యనుటచేత 'తె' అంతమందున్న రూపము గలుగదు.

[ ఈసూత్రమునకు పిదప "అనుచో నెత్వంబు రాదు" అని యున్నచో బాగుండెడిది. అప్పుడు "ఆదేశాత్పరంబగుచో దాని కెత్వంబు రాదు" అను భాగ మును 66వ సూత్రమునుండి తొలగించి వేయవచ్చును. ]

**80. ఎవ్వరితాదులందలి రి వర్ణంబునకు లోపంబు విభాష నగు.**

(ప్రౌ - ౨౦)

ఎవ్వత - ఎవత - ఎవ్వతి - ఎవతి - ఎవ్వతె - ఎవతె; ఒక్కత - ఒకత - ఒక్కతి - ఒకతి - ఒక్కతె - ఒకతె - ఒక్కొత - ఒకొత - ఒక్కొతి - ఒకొతి - ఒక్కొతె - ఒకొతె. [స్వార్థంబునం గప్రత్యయం బురా॥ ఎవ్వతుక - ఎవతుక - ఎవ్వర్తుక - ఎవర్తుక - ఒక్కతుక - ఒకతుక - ఒక్కొతుక - ఒకొతుక - ఒక్కర్తుక - ఒకర్తుక - ఒకొర్తుక - ఓర్తుక॥ అని రూపంబులు.]

వ్యాఖ్య - ఎవ్వరిత మున్నగు వానియందలి 'రి' వర్ణమునకు విభాషగా లోపము కలుగునని సూత్రార్థము.

'ఎవ్వరిత' యను రూపమునందుండి 'రి' లోపింపగా 'ఎవ్వత' అని మిగులును. అట్లే 'ఒక్కరిత' మున్నగువానిలోని 'రి' లోపించిన యెడల 'ఒక్కత' మున్నగు విధముగాను లేకున్న 'ఒక్కరిత' మున్నగువిధముగాను రూపము లుండును.

[కుండలీకరణములందు వ్యాకర్త మరొక యంశమును ప్రారంభించెను. నిజమునకు విపులముగా ప్రక్రియను చూపదలచిన నాను ఇట్లు చెప్పుట సరిగా లేదు.]

స్వార్థమునందు అనియనగా అర్థవిశేషములేని యర్థమని యర్థము. అట్టి యెడల 'రి' వర్ణము లోపింపగా ఏర్పడిన 'ఏవ్వత' మున్నగువానికిని రేఫసంయుక్తము లయిన 'ఏవ్వర్తు' మున్నగు వానికిని మీద 'క' వర్ణము కలుగునని తెలిపెను. అట్టి యెడల పూర్వస్వరమునకు ఉత్వము కలుగునన్న విషయమును జ్ఞాపనము చేయుట యవసరము. కాని ప్రౌఢవ్యాకర్త అపని చేయలేదు. అయినను లక్ష్యములనుబట్టి ఉత్వము కలుగునన్నదే నిశ్చయము- ఏవ్వతుక, ఎవతుక - మున్నగునవి యుదాహరణములు.

[ చిన్నయసూరి తద్ధితపరిచ్ఛేదమునందు చిఱుతాదులకు స్వార్థమునందు కవర్ణకమును విధించెను. ప్రౌఢవ్యాకర్త యక్కత 'ఉక' వర్ణకమని చెప్పియుండిన దానిని జ్ఞాపనము చేసినట్లుండును. అప్పుడు ప్రత్యేకముగా సూత్రించి ప్రక్రియను చూపవలసిన యవసరము లేదు. దానిచేతనే దీనిని సిద్ధింపజేసికొనవచ్చును. అట్లుకాక భిన్నమైన మార్గమున 'క' ప్రత్యయమని చెప్పుట చేత, పూర్వస్వరమునకు ఉత్వమును విధించుకొనుటయు అవసరమే. ]

81. నీ మీ నే మే హల్లులకు లోపంబు విభాష నగు. (ప్రౌ - ౭౧)

ఈవు - నీవు - ఈరు - మీరు - ఏను - నేను - ఏము - మేము.

వ్యాఖ్య - నీ, మీ యనునవి యుష్మదర్థక ప్రాతిపదికలు. నే, మే యనునవి అస్మదర్థక ప్రాతిపదికలు. వీని హల్లులకు విభాషగా లోపము కలుగునని సూత్రార్థము.

[ ప్రథమైకవచనమున నీవు, నేను - అనియు బహువచనమున మీరు, మేము - అనియు రూపము లుండును. ప్రౌఢవ్యాకరణము ప్రథమాంత రూపములను సాధింపకుండ, ఇతర రూపములను, అక్కడ మార్పులను చెప్పుటకు పూనుకొన్నది. ]

నీవు, నేను - అను ఏకత్వ బోధక రూపముల తొలి 'న' కారము వైకల్పికముగా లోపింపగా ఈవు, ఏను - అని యగును. మీరు, మేము - అను బహుత్వ బోధక రూపముల తొలిహల్లు లోపింపగా ఈరు, ఏము - అని యగును.

'విభాష'అని యనుటచేత ప్రథమాంతరూపముల తొలిహల్లులకు లోపము వైకల్పికమనియు ఇతరరూపములయందు లోపము నిషిద్ధ మనియు వ్యాకర్త సాభిప్రాయముగా నుపయోగించెనని తోచుచున్నది. కావున ప్రథమేతర విభక్తి యగు

నప్పుడు నిన్ను, నన్ను, మిమ్ము, మమ్ము - మున్నగువిధముగనే రూపము లుండవల యును. సూరి వీనిని చూపెను.

82. బహుత్వంబు . మే కు నే విభాష నగు. (ప్రౌ - ౭౨)

మేము - నేము.

వ్యాఖ్య - అస్మదర్థక బహుత్వమునందలి 'మే' అనుదానికి బదులుగా 'నే' యని వికల్పముగా నగునని యర్థము.

'మేము' అనుదానిలో 'మే' అను దానికి బదులుగా 'నే' అని కాగా 'నేము' అని యగును. పూర్వసూత్రముచేత 'ఏము' అను రూపము కలుగుట మున్నే చూచితిమి.

[నీ మీ నే మే - యను నాలుగింటిలో 'మే' యొక్కటియే కలదు. అది బహుత్వమున మాత్రమే వచ్చును. అట్టిచో మెత్తగా ప్రస్తుతసూత్రమున 'బహుత్వమున' అని చెప్పుటవలన ప్రయోజనమేమియు లేదు. దానిని విడువ వచ్చును.]

బాలవ్యాకర్త 'నేము' అను రూపమునుగూడ ప్రదర్శించియే యున్నాడు.

83. నిన్ను నన్ను దన్ను - వీనియందలి ద్వితీయమున కేనియు, ద్విత్వయుక్త నవరమున కేనియు, మిమ్ము మమ్ము దమ్ము- వీనియందలి ద్విత్వంబునకును లోపంబు వైకల్పికంబు (ప్రౌ - ౭౩)

నినున్ - నిన్ - ననున్ - నన్ - తనున్ - తన్ - మిమున్ - మమున్ - తమున్॥ నిన్। నమ్మినవారి కెన్నఁడును నాశము లేదు గదమ్మ యీశ్వరీ॥ భాగ. ౧౦ స్క-౦॥ నన్ నిలువం బెట్టితి॥ భాగ. ౧౦ స్క-౦॥ పనియేమి పంచినఁ బదపడి చేసెద నవక తన్ బంచిన యాతఁడుంబ చేయుదు॥ భార. ఆది. ౩ అ॥ మొ.

వ్యాఖ్య - నిన్నున్, నన్నున్, తన్నున్ - అను ద్వితీయైకవచనాంతముల యొక్క ద్విత్వమునకుగాని నవర్ణముతోడి నువర్ణమునకుగాని లోపము వికల్పముగా నగును. అట్లే ద్వితీయాబహువచనాంతములయిన మిమ్మున్, మమ్మున్, తమ్మున్ - అనువాని మామునకు లోపము వికల్పముగా నగును. ఇది సూత్ర తాత్పర్యము.

ద్విత్వము లోపింపగా నినున్, ననున్, తనున్ - అనురూపములు కలుగును ద్విత్వ ను వర్ణము లోపింపగా నిన్, నన్, తన్ - అను రూపము లేర్పడును.

బహుత్వమునందు ద్విత్వము మాత్రమే లోపించును. అట్టియెడల మిమున్, మమున్, తమున్ - అను రూపములు కలుగును.

బాలవ్యాకరణమునందు (అచ్చిక - 24) అస్మదర్థకములు నన్నును, మమ్మును- అని చూపబడినవి. యుష్మదర్థకములు నిన్నును, మిమ్మును అని ఆత్మార్థకములు తన్నును, తమ్మును అని ద్వితీయాంతములుగా చూపబడినవి. చివరి ఉత్వమునకు లోపము కలిగినచో నన్నున్, మమ్మున్ - మున్నగు రూపములు వచ్చును. "అకారంబు క్రింది అకారంబునకు" అని మొదలయిన (ప్రకీర్ణ - 7) సూత్రమునుబట్టి నన్నున్, నిన్నున్, తన్నున్ - అనువాని ద్విత్వమునకు లోపము కలిగి ననున్, నినున్, తనున్ - అను విధముగా నగును. "అక్కటాదుల జడ్డకు లోపంబగు" అను (ప్రకీర్ణ - 9) సూత్రమునుబట్టి మమ్మున్, మిమ్మున్ - తమ్మున్॥ అను వాని ద్విత్వమునకు లోపము కలిగి మమున్ - మిమున్ - తమున్॥ అను రూపములు కలుగును. నన్ను, నిన్ను, తన్ను - అనునవి నను, నిను, తను - అనియైన పిమ్మట "పదాంతంబులయి యసంయుక్తంబులయిన" అని మొదలయిన (ప్రకీర్ణ - 16) సూత్రమునుబట్టి నన్, నిన్, తన్ - అను రూపములను పొందును. కావున ప్రస్తుత ప్రౌఢవ్యాకరణసూత్రము సిద్ధించిన రూపములనే సాధించుటకు పూనుకొన్నది. ఇది యవసరము కాదు.

**84. తాము తమరు తారు నగు. (ప్రౌ - ౭౪)**

స్పష్టము.

వ్యాఖ్య - 'తాము' అను ఆత్మార్థక బహువచనరూపము 'తమరు', అనియు 'తారు' అనియు కూడ నగునని సూత్ర తాత్పర్యము.

ప్రౌఢవ్యాకర్త ప్రక్రియను విడిచిపెట్టి రూపములను విపతించుటకు పూనుకొనెను. కాని యిదియు అవసరముకాదు. బాలవ్యాకరణము ఈ మూడు రూపములను ముందుగనే చూపియున్నది.

**85. నామ పునరావృత్తిని ఆతం మున ఖిన్నంబు నఖిన్నంబునయి తచ్ఛబ్దార్థంబు తత్పర్యాయం బగు. (ప్రౌ - ౭౫)**

వాఁడె సురాసురులెల్ల నడ్డమై వచ్చిననైన రాక్షసవివాహమునం గొనిపోవు నిన్ను॥ భాగ. ౧౦ స్క౦. పూ॥ (వాఁడె భిన్నరూపము ; ఆ సుదర్శనాయుధుఁ డనుట యభిన్నరూపము - సుదర్శనాయుధుఁడు నామపదము;) వివిధపుణ్యకథలు వినువేడ్క నితనిఁ బూజించిరి॥ భార. ఆది. ౧ ఆ॥ (అతనిన్ భిన్నరూపము; అక్కథకు ననుట యభిన్నరూపము-కథకుఁడు నామపదము.) కలహంస పలికిన పలుకుల గణియించు వడి దానిపోయిన వలన చూచు॥ భార. అర. ౨ ఆ॥ (దాని భిన్నరూపము; ఆ కలహంస యనుట యభిన్నరూపము - కలహంస నామపదము.) వెం॥

వ్యాఖ్య - ఒకమారు నామవాచకమును ప్రయోగించిన పిమ్మట, మరల దానిని చెప్పవలసి వచ్చినపుడు భిన్నముగా కాని, అభిన్నముగా కాని తచ్ఛబ్దము ప్రయుక్తమై దానికి బదులుగా వ్యవహరించు నని సూత్ర తాత్పర్యము.

మొదటియుదాహరణ మిట్లుంత వలయును - "తా వచ్చె సుదర్శనాయుధుఁడు వాఁడె సురాసురులెల్ల నడ్డమై వచ్చిననైన రాక్షస వివాహమునం గొనిపోవు నిన్ను" అనుచోట కర్తయైనది సుదర్శనాయుధుఁడు. మరల చెప్పవలసినప్పుడు తచ్ఛబ్దమగు 'వాఁడె' అనునది వేరుగా ప్రయుక్తమైనది. ఇట్లు కాక 'ఆ సుదర్శనాయుధుఁడు' అను విధముగా నామమునే మరల గ్రహించి పూర్వమునందు తచ్ఛబ్దమును జేర్చి పలుకుటయు చేయవచ్చును. ఇచ్చట తచ్ఛబ్దము అభిన్నముగా నున్నది. అనగా సమసించి యున్నదని యర్థము. అట్లే తక్కినచోట్లకూడ 'కథకుని' అను నామమునకు బదులుగా 'అతనిన్' అని, 'కలహంస' అని యనుటకు బదులుగా 'దాని' యని తచ్ఛబ్దమును వాడుట కలదు.

**86. ఒక్కచో నామంబె యగు.** (ప్రా - ౬౬)

సురవరు లర్థులై చూచుచు నుండంగ నలు వరియించిన నాఁటి యొగ్గు దలఁచి యిట్టి యాపదలు చేసిరో వేల్పు। లనుర కోపమునన యయ్యె నాకు। నీ వియోగదుఃఖము॥ భార. అర. ౨ఆ॥ (నామంబె= నామపద మొక్కటియే.)

వ్యాఖ్య - నామపునర్గ్రహణము చేయునప్పుడు కొన్ని చోట్ల నామము మాత్రమే యగును. అనగా తచ్ఛబ్దము రాదని తాత్పర్యము.

పూర్వము ప్రయుక్తమైన నామమే రావలయునన్న నియమము లేనందువలన తత్పర్యాయముకూడ రావచ్చును. పై యుదాహరణమునందు 'సురవరుఁడు' అన్నది నామపదము. మరల ఆ యర్థము వచ్చినప్పుడు 'వేల్పులు' అను అదే అర్థము గల మరొకపదము వాడఁబడినది. ఇట్లు 'ఆ' అను శబ్దమాత్రమే సమాసము కాకుండ పైతము నామమును వాడవచ్చును. ఇది బాలవ్యాకరణ పూరక విషయము.

87. నామ తదేత ద్యత్కిమర్థంబులకుఁ బునర్గ్రహణంబునఁ బ్రథమాద్యంత మయి పూర్వపరంబుగ నాత్మార్థం బభిహితం బగు. (ప్రా - ౭౭)

తా వచ్చె సుదర్శనాయుధుఁడు॥ భాగ. ౧౦ స్కం. ఉ॥ విదురుఁ డురుపిపాసాన్నలవలనన్। మానుగ నేమఱకుం డని। తాను బ్రబోధించె॥ భార. ఆది. ౬ ఆ॥ (ఇటఁ దా శబ్దము పాదపూరణార్థకము; వచ్చె సుదర్శనాయుధుఁడు - విదురుఁడు ప్రబోధించె॥ అని యాత్మార్థ విరహితం బుగనే జెప్ప నగు.) అడవిఁ దపస్సుఁ జాసి యత్నిన నలిగి గా। తన్నె యిట్లు సేయ నువిద కడఁగె॥ భార. ఆర. ౨ అదియును దన కర్మనుజేశ్వరుం డపాయంబు సేయునకాఁ దలంచి॥ భార. ఆది. ౨ ఆ॥ కర్మములు మేలు నిచ్చును। గర్మంబులు కీడు నిచ్చుఁ గర్తలు దనకున్। గర్మములు బ్రహ్మకైనను। గర్మగుఁడై పరుఁడుఁ దడవఁగా నేమిటికిన్॥ భాగ. ౧౦ స్కం. పూ॥ మొ.

వ్యాఖ్య - నామమునుగాని, తదర్థకమునుగాని, ఏతదర్థకమునుగాని, యత్కిమర్థకమును గాని పునర్గ్రహణము చేసినపుడు పూర్వమందుగాని పరమందుగాని ఆత్మార్థము ప్రథమాదివిభక్తులతో కూడుకొన్నదై ప్రయోగింపబడునని సూత్రార్థము.

నామము = నామవాచకము; తదర్థకము = వాఁడు అది ఆమె మున్నగునది; ఏతదర్థకము = వీఁడు ఇది ఈమె మున్నగునది; యత్కిమర్థకము = ఎవఁడు ఏది ఎవతె మున్నగునది॥ ఇవి మరల గ్రహింపబడవలసినప్పుడు వీని కనుగుణమైన విభక్త్యాదులతో తాను, తాము మున్నగు ఆత్మార్థక శబ్దము ముందుగాని వెనుకగాని యుప యోగింపబడుచుండునని తాత్పర్యము.

తావచ్చె సుదర్శనాయుధుఁడు - అనుచోట 'సుదర్శనాయుధుఁడు' అనుటకు బదులుగా 'తాను' శబ్దము ప్రథమైకవచనాంతముగా పూర్వమందు ప్రయుక్తమయ్యెను.

విదురుఁడు .... తాను బ్రబోధించె - అనుచోట 'తాను' శబ్దము 'విదురుఁడు' అను నామమునకు బదులుగా పరమందు ప్రయుక్తమయ్యెను.

[ కుంతలీకరణములు నడుమ వ్యాకర్త 'తాను' శబ్దము పైప్రయోగముల యందు పాదపూరణముకొరకు వచ్చుచున్నదని విశదించి, అది లేని యుదాహరణములను చూపెను; అది కొంతవరకు సత్యమే. కాని యిక్కడిది శాబ్దిక విషయము కాదు; సాహిత్యవిషయము. 'తాను' శబ్దమును ప్రయోగించుటచేత కలుగు స్ఫూర్తినిబట్టి కవులు వానిని ప్రయోగించుచుందురు; సహృదయులు వానిని గ్రహించుచుందురు. కావున ఇట్టిచోట్ల నున్న 'తాను' శబ్దమును పాదపూరణము కొరకు, అనగా వ్యర్థముగా వచ్చినదనుట సార్వత్రిక సత్యము కాజాలదు.]

తన్నుఁ బాసి... నువిద కడఁగె - అనుచోట 'ఉవిద' యను నామమునకు బదులుగా ద్వితీయైకవచనాంతమైన 'తన్ను' అను సర్వనామము పూర్వమందు ప్రయుక్తమయ్యెను.

అగియును దనకు - అనుచోట 'అది' యను తచ్ఛబ్దమునకు బదులుగా షష్ఠ్యంతమైన ఆత్మార్థకరూపము పరమందు ప్రయుక్త మయ్యెను.

తరువాత యుదాహరణమునందు 'బ్రహ్మ' అను నామమును పునర్గ్రహణము చేయు సందర్భమున 'తనకున్' అని షష్ఠ్యంతమైన ఆత్మార్థకము పూర్వమందు ప్రయుక్తమయ్యెను.

[ నామమునకు, తదర్థకమునకు, 'తాను' శబ్దము కలుగుటకు ప్రయోగములు చూపబడెను. వీనినిబట్టి ఏతదర్థకమునకు, యత్కిమర్థకమునకు ఆత్మార్థకము వచ్చినప్పటి రూపముల నూహించుకొనవచ్చు ననునాశయముతో, వానిని వ్యాకర్త ప్రదర్శింపలేదు. ]

**88 ఆత్మార్థం బొకానొకచో నామాన్మదర్థాభిధాయియు నగు.**

(ప్రౌ - ౬౮)

తనకు మఱి తానె చుట్టంబు తానె తనకు। గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్త యనఁగ। వనజనేత్ర ! గాంధర్వవివాహ మతిర। హస్యమును సమంత్రకమును నగుచు నొప్పు. (తనకున్ స్త్రీకనుట)॥ భార. అది. ౪౫॥ తన తొంటి కర్మరాశికి। ననుచరమై బహువికారమై మనము వడిన్। జను నింద్రియముల తెరువులఁ దనువులు పైకొ్కనఁ జెడవు తన కర్మంబుల్ (తన = ప్రాణియొక్క)॥ భాగ. ౧౦స్క-౦. పూ॥ మొ.

తనకిష్టుఁడున్ సహాధ్యాయుఁడు నై నవాఁడు. (తనకున్ = నాకు)॥ భార ఆది. ౧ఆ॥ తన తనుచ్ఛాయ మస్తకహీనమై తోఁచె. (తన తనుచ్ఛాయ = నాతనుచ్ఛాయ)॥ జై. ౭ ఆ॥ నీవు చెప్ప నొడికంబునఁ బూనిన యీప్రబంధమున్ దనకిపు డంకితంబు ప్రమదంబుగఁ జేయుము. (తనకున్ = నాకు)॥ రుక్మాం. ౧ఆ॥ తమ సొమ్ము తమకిచ్చె ధర్మరాజని మహీసురులు దానము సేయఁ జూచి నగరె. (తమ సొమ్ము = మాసొమ్ము; తమకున్ = మాకు)॥ జై. ౧ఆ॥ మొ.

వ్యాఖ్య - 'తా' అను శబ్దము నామార్థమును గొన్నిచోట్ల అస్మదర్థమును గొన్నిచోట్ల తెలుపుచుండునని సూత్రార్థము.

తనకు మఱి తానె చుట్టంబు - అనులక్ష్యమునందు గల 'తనకు' అను షష్ఠ్యంతమైన ఆత్మార్థమునకు "ప్రీ కి" అని నామపరముగా వ్యాకర్తయే అర్థమును తెలిపెను. అనగా నామపునర్గ్రహణమునందు నామమునకు బదులుగా ఆత్మార్థక శబ్దము పూర్వమందు ప్రయుక్తమయ్యెనని భావము. పూర్వసూత్రమున చెప్పిన దానికంటె ఇది భిన్నము కాదు. ఇక్కడనుండి "తనతోంటి" అని మొదలయిన లక్ష్యమువరకు అన్నియు ఇట్టి కార్యమునకు లోనైనవే. ఇందు ప్రధానముగా నామమే ప్రయుక్తము కాకుండుట కానవగును. సందర్భమునుబట్టి నామము నూహించుకొనవలయును. నామము స్థానమునను ఆత్మార్థకము కలిగి, పునర్గ్రహణసమయమునకూడ ఆత్మార్థకమే వచ్చుట యిక్కడి విశేషముగా గుర్తింపవలయును. ఇదియే పూర్వలక్ష్యములకంటె వీనిని భిన్నముగా నిరూపించుటకు హేతువు.

తనకిష్టుఁడున్ సహాధ్యాయుఁడు - అన్నపుడు ఆత్మార్థమునకు అస్మదర్థము (నాకు) కలదని ప్రౌఢవ్యాకర్త వివరించెను. కాని యిక్కడ నామార్థముననే కలిగెను కాని అస్మదర్థమున ఆత్మార్థకశబ్దము కలుగలేదు. తరువాతిదైన "సారమతి" నని మొదలయిన పద్యమునందు కర్తృవాచకము నన్నయభట్టు. అదియే యిక్కడ నన్వయింపగా 'నన్నయభట్టు తనకిష్టుఁడున్ సహాధ్యాయుఁడునైన వాఁడుతోడయి.... బంధుఁడయ్యె' అను విధముగా వాక్యముండును. కావున ఇక్కడిది నామార్థముననే కలుగుచున్న ఆత్మార్థక మమట సందర్భనముచితమై యుండును.

'తన తనుచ్ఛాయ' మొదలయినచోట్ల 'తన' యనునది 'నా' యను నర్థమున నుపయుక్తమయ్యెను. సందర్భమునుబట్టియే ఆత్మార్థమున కున్న అర్థవిశేషమును గ్రహించుట యవసరము. ఏమయినను అస్మదర్థమునందు ఆత్మార్థక ప్రయోగము అంత ప్రచురము కాదు. నామార్థముననే పునర్గ్రహణమునందు ప్రయోగము రూఢము.

**౮9. కర్తృ బహుత్వంబునఁ దనతనకుఁ దమతమయు నగు.**

(ప్రౌ - ౭౯)

తమతమ పుత్త్రికుగాఁ జిత్తములం జేకొని దయను బృథగ్భావము లేక ముదంబునఁ బెంచిరి॥ భార. అర. 3ఆ॥ మొ.

వ్యాఖ్య - కర్త బహుత్వబోధకమై యున్నప్పుడు 'తనతన' యను నామపునర్గ్రహణమునన్నైన ఆత్మార్థకము 'తమతమ' యని బహువచనాంతముకూడ కావచ్చునని సూత్రార్థము.

'పెంచిరి' అను క్రియాపదముచేత కర్త బహుత్వబోధకమని తెలియుచున్నది. (భార్యలు నూర్వురు - అని యాతరువాత కర్త వచ్చును) కాబట్టి కర్తృవాచకమును పునర్గ్రహణము చేసినపుడు ఆత్మార్థకము 'తనతన' యని ద్విరుక్తమై వచ్చిన యెడల, అది 'తమతమ' యని బహువచనాంతముకూడ కావచ్చును. కావుననే 'తమతమ పుత్త్రికుగా' నని బహుత్వము కలిగెనని వ్యాకర్త యభిప్రాయము.

కర్త బహువచనాంతమై యున్నప్పుడు దానికి బదులుగా విధింపబడు ఆత్మార్థకముకూడ బహువచనాంతమే కావలయును. అట్లగుట సాధారణ విషయమే. అట్లు కాకున్న యెడల విశేషము. కావున, 'తమతమ' యని వచ్చుటకు వేరువిధి యవసరములేదు. సూత్రమందు 'తనతనకు' బదులుగా 'తమతమ' వచ్చునని యున్నది. 'తనతన' యను ఏకార్థకరూపము పూర్వము విధింపబడలేదు. కావున దానికి ప్రాప్తియే లేదు. కావున దానికి బదులుగా వచ్చుట యన్నది సంగతము కాదు. నిజమునకు విధింపవలసినది ఆత్మార్థమునకు ద్విరుక్తి యగుట. అది జరుగనే లేదు. "సత్యయు రుక్మిణియుఁ దనతన పట్టు విడువకుండిరి." ఇట్లు బహుకర్తృక వాక్యమున్నప్పుడు, ఏకర్త కాకర్త ఏకత్వమునే స్ఫురింపజేయును. కావున 'తన' యని ఏకత్వబోధకమైన ఆత్మార్థకము కలిగి, బహుకర్తృకత్వమున కనుగుణముగా ద్విరుక్తముగా ప్రయుక్తమగును. అట్టియెడల 'తనతన' యనుటకు బదులుగా "తమతమ" యని వచ్చుటయు జరుగుచుండును. అటుకాక బహుత్వబోధకమైన కర్త యొక్కటే యున్నప్పుడు ఏకవచనప్రాప్తి కవకాశమే లేదు.

**90. ఒక్కొక్క శబ్దంబుల యత్వంబున కొత్వంబు విభాష నగు.**

(ప్రౌ - ౮౦)

ఒక్కఁడు - ఒక్కొఁడు - ఒకఁడు - ఒకొఁడు

వ్యాఖ్య - ఒక్క, ఒక - అను వానికి విభక్తి వివక్షించునపుడు తుది అత్వ మునకు బదులుగా ఒత్వము వికల్పముగా నగునని సూత్రార్థము.

'ఒక్క' శబ్దమునకు మహదర్థమున 'డుజ్' కలిగి 'ఒక్కఁడు' అని యగును. అట్లే 'ఒకఁడు' అనునదియు ప్రాప్తించును. ప్రస్తుతసూత్రముచేత ఒత్వమురాగా 'ఒక్కొఁడు' అనియు 'ఒకొఁడు' అనియు రూపములు కలగును

మహతి వాచ్యమైనప్పుడుకూడ ఈ ఒత్వము కలుగును. వ్యాకర్త యిక్కడ ఉదాహరణములను చూపలేదు. పూర్వమే (ప్రౌఢ - ౬౧, ౬౮, ౬౮, ౭౦) ఒత్వముతోడి స్త్రీవాచకరూపములు ఉదాహరింపబడుటచే, ఇచ్చట పురుషవాచకములను మాత్రమే ఉదాహరించుట జరిగెను.

బాలవ్యాకరణ మీరూపముల నన్నింటిని ప్రదర్శించినది.

౪౧ ఒక్కొకాదులకు డువర్ణకంబు పరంబగునపుడు మహదర్థంబున రు రువ్వగాగమంబులగు. అవి పరంబగుచోఁ గకారమునకు లోపంబును, కకారాదులకు లోపంబురా డు వర్ణకమునకు ద్విత్వయుక్త డు వర్ణంబును, అమహదర్థంబునం గకారాదులకు లోపబిందువులును విభాష నగు. (ప్రౌ - ౨౧)

ఒక్కరుఁడు - ఒక్కొరుఁడు - ఒకరుఁడు - ఒకొరుఁడు - ఒక్కరువుఁడు - ఒక్కొరువుఁడు - ఒకరువుఁడు - ఒకొరువుఁడు - ఒరుఁడు - ఒరువుఁడు - ఒడ్డు - ఒండు.

వ్యాఖ్య - ఒక్క, ఒక, ఒక్కొ, ఒకొ - అనువానికి డుజ్ పరమగునపుడు మహదర్థమునందు 'రు' అని కాని 'రువు' అని కాని వికల్పముగా నగును. ఆ యాగమములు కలిగి నపుడు పూర్వమున్న కకారమునకు లోపము వికల్పముగా కలుగును. కకారము మున్నగువానికి (క్క, క, క్కొ, కొ) లోపము కలిగి నపుడు డు వర్ణమునకు బదులుగా ద్విత్వయుక్త డు వర్ణము (డ్డు) వికల్పముగా నగును అమహదర్థమునందు కకారాదులకు (క్క, క్కొ, క, కొ) అనువానికి లోపమును బిందువును వికల్పముగా కలుగును - ఇది సూత్ర తాత్పర్యము.

'ఒక్క' యనుదానికి డుజ్ పరమందుండగా రుగాగమమైనచో ఒక్క + రు + డుజ్ = ఒక్కరుఁడు అని యగును రువుగాగమమైనచో 'ఒక్కరువుఁడు'

అని యగును. 'ఒక' శబ్దమునకు ఈ యాగమములు కలిగినయెడల ఒకరుఁడు, ఒకరువుఁడు - అని యగును. 'ఒక్కొ' శబ్దమునకైనచో ఒక్కొరుఁడు, ఒక్కొరువుఁడు - అనియు, 'ఒకొ' శబ్దమునకైనపుడు ఒకొరుఁడు, ఒకొరువుఁడు - అనియు రూపము లుండును.

ఆ యాగమములు కలిగినప్పుడు వికల్పముగా క కారమునకు లోపము కలుగును. అప్పుడు ఒరుఁడు, ఒరువుఁడు - అను రూపములు కలుగును.

కకారమునకును, రు రువుగాగమములకు లోపము కలిగినప్పుడు డు వర్ణకము స్థానమున ద్విత్వయుక్తి డువర్ణము కలుగును. అప్పుడు 'ఒడ్డు' అను రూప మేర్పడును.

[ సూత్రమునందు "అచి పరంబగుచోఁ గకారమునకు" అని కలదు. అక్కడి కకారముచేత క, క్క, కొ, క్కొ - అనువానిని గ్రహింపవలసి యుండును. తరువాతి యంశమున "కకారాదులకు లోపంబురా" నని యనగా కకార సంజ్ఞచేత పై నాలుగింటిని, అదిశబ్దముచేత రు, రువు - అను నాగమము లనుకూడ గ్రహింపవలసి యుండును. ఈ తరువాతిదైన చివరి భాగమునందు "కకారాదులకు" అని యన్నప్పుడు పైవన్నియు గ్రహింపవలయుననియే ప్రౌఢ వ్యాకర్త యభిప్రాయము. అయన యింతవరకు సాధించిన మహదర్థకరూప ములతోపాటుగా అమహదర్థకరూపమును సాధింపబూనుకొనెను. కావున 'కకారాదుల' కని యనుట యుచితమే. ]

ఒక్కరుఁడు - మొదలగు నీ రూపములయందు కకారము మొదలు డు వర్ణము నకు ముందరివర్ణము లన్నియు లోపము నొందగా ఒ + డు - అనియే మిగులును. బిందువును కూడ విధించుటచేత ఒ + ం + డు అనియై 'ఒండు' అని యగును. ఇది ప్రౌఢవ్యాకర్త భావించిన ప్రక్రియ.

[ ఈ ప్రక్రియ సూటిగా సుకరముగాలేదు. 'ఒక' శబ్దముమీద మహదర్థకములయిన ఒకరుఁడు, ఒకరువుఁడు - మున్నగువానిని సాధించుకొనిన పిమ్మట నమహదర్థకమునే చెప్పికొనిన బాగుండును. ఇంక కలోపము, బిందువిధి - అని రెండింటిని విడిగా చెప్పుటకూడ సక్రమ పద్ధతికాదు. రెండును కావలసి వచ్చి నపుడు క వర్ణకమునకు బిందువు నాదేశముగా చెప్పిన చాలును. ఇప్పుడు 'డు' వర్ణకమునకు పూర్వము బిందువెట్లు నుండనే యున్నది. కావున 'క'లోప మొక్కటి యాపేక్షకము. అదియొక్కటే చెప్పికొనినయెడల 'ఒక + డుజ్' అనునది 'ఒ + డుజ్ - అని యగును. జిత్తు బిందుపూర్వం బగును. "అఁట యిఁకె చూఁడు" సూత్రముచే తొలి హ్రస్వముమీద పూర్ణబిందువువచ్చి 'ఒండు' అని యగును.

ప్రౌఢవ్యాకర్త చూపిన విధానమువలన సున్న యొకటి అదనముగా వచ్చుటకూడ జరుగుచున్నది. కావున, ఈ ప్రక్రియ భారమే కాని దోషపరిహారము కాలేక పోయినది.]

ఒండు - అను రూపమును ప్రౌఢవ్యాకర్త అమహదర్థకముగా మాత్రమే చూపెను. బాలవ్యాకర్త మహదర్థకమునందు చూపి, అమహదర్థకమునందుకూడ మరల 'ఒండు' శబ్దమును చూపెను. మహదర్థక ప్రయోగములేదని యనుటకు తగిన యాధారములు కనిపింపవు: ఉన్నదనియనుటకు ప్రయోగములు మృగ్యములు. నిజమునకు 'ఒక + ఒండు' అనునవి 'ఒకొండు' అనియై యుండునేమో! అట్లే యగుచో మహదర్థకముగా అదియే చాలును. అదియే పూర్వమందు వచ్చి 'ఒండు + ఒకఁడు' అనియుండి 'ఒండొకఁడు' అని కావచ్చును. సూరి యిట్లు భావించి మహదర్థకముగా చూపి యుండెనో, కాక తన్నిర్వాహక మగు ప్రయోగమును చూచియే వ్రాసెనో చెప్ప జాలము. తక్కినరూపముల విషయమున నిరువురు నేకాభిప్రాయులే.

**92.** టివర్ణం బమహదర్థంబున నొక్కఁడాదుల డువర్ణకంబునకు విభాష నగు. (ప్రౌ - ౧౫)

ఒక్కటి - ఒక్కొటి - ఒకటి - ఒకొటి.

వ్యాఖ్య - ఒక్కఁడు మొదలయిన అమహదర్థక రూపముల డు వర్ణకమునకు బదులుగా 'టి' విభాషగా నగునని సూత్రార్థము.

ఒక్కఁడాదులు అని యనగా ఒక్కఁడు, ఒక్కొఁడు, ఒకఁడు, ఒకొఁడు, ఒండు - అనునవి.

ప్రస్తుతసూత్రముచేత డు వర్ణకమునకు బదులుగా టి వర్ణమురాగా 'ఒక్క + టి = ఒక్కటి' అని యగును. ఇట్లే ఒక్కొటి, ఒకటి, ఒకొటి - అను రూపములు వికల్పముగా నేర్పడును.

పూర్వసూత్రముచేత సాధింపబడిన 'ఒండు' అను శబ్దమును వ్యాకర్త యుదాహరణములలో చేర్పలేదు. అదియు చేరవలసినదే. చేర్చుట సమంజసము.

'ఒండు' శబ్దముయొక్క 'డు' వర్ణమునకు 'టి' వర్ణమురాగా 'ఒ + టి' అని యగును. ఇక్కడికి రూపము పూర్తికాలేదు. టి వర్ణమునకు ముందు పూర్ణబిందువును విధించుకొనవలయును. ఆపని వ్యాకర్త చేయలేదు. ఇక్కడి 'టి' వర్ణమును ఔపవిభక్తికముగా సంకేతించుకొనినయెడల "పదాద్యంబగు హ్రస్వంబు మీఁది

టి వర్ణంబునకు ముందు పూర్ణబిందువగు" అను నియమము (బాల - 33) చేత పూర్ణబిందువు కలిగి 'ఒంటి' యని కావచ్చును.

బాలవ్యాకర్త అమహదర్థకములుగా ఒకటి, ఒకొటి - మున్నగురూపములను చూపి 'ఒంటి' అనుదానిని విశేష రూపములలో చూపియున్నాడు.

**93. ఎక్కటి యొక్కటి. (ప్రౌ - ౮3)**

స్పష్టము.

వ్యాఖ్య - ఒక్కటి యను శబ్దము 'ఎక్కటి' అని కూడ నుండునని సూత్రార్థము.

దీనివలన ప్రౌఢవ్యాకర్త ప్రక్రియాభారమును సహింపక, నిపతించెను. బాల వ్యాకర్త 'ఎక్కటి' యను నీరూపమును ఏకార్థకశబ్దముయొక్క అమహదర్థములలో పఠించియున్నాడు.

**94. ఒక శబ్దం బొకచో నల్పార్థకం బగు. (ప్రౌ - ౮౪)**

ఒక మున్నూఱు గదల్చి దెచ్చిన లలాటోగ్రాక్షు చాపంబు॥ భాగ. ౯ స్కం॥ ఒక నూతేఁడుల్ ॥ మార్క. ౫ ఆ॥ ఏమొక కొండ అము॥ వి.క. ౫ ఆ॥

వ్యాఖ్య - 'ఒక' యను శబ్దము అల్పార్థమున సైతము కొన్నిచోట్ల ఉపయోగింపబడునని సూత్రార్థము.

బాలవ్యాకరణము 'ఒక' అని యనుటకు ఏకార్థక శబ్దమని వాడెను. ప్రౌఢ వ్యాకర్త యీవరకు (ప్రౌఢ - ౯౯) అన్యైకార్థక శబ్దమని వాడెను. అనగా 'ఒక' యనునది అన్యార్థమును, ఏకార్థమునుగూడ సూచించునని యర్థము. ప్రస్తుతసూత్ర ముచే ఆ 'ఒక' శబ్దమునకు అల్పార్థముకూడ కలదని చెప్పుచున్నాడు.

ఒక మున్నూఱు - అని యన్నప్పుడు 'మున్నూఱు' అను బహ్వర్థకమునకు 'ఒక' యనునది విశేషణము. ఇది యేకార్థకమే యైనచో బహ్వర్థకమునకు విశేషణముకారాదు. కావున దీని (అల్పార్థము) కొంచెము అను నర్థముననే గ్రహింప వలయును. ఒక నూతేఁడుల్, ఒక కొండఅము - అనునవి కూడ సరిగా ఇట్టి ప్రయోగములే. కావున 'ఒక' యన్నది అల్పార్థముననే అచ్చట ప్రయుక్తమయ్యెను.

బాలవ్యాకర్త 'ఏకార్థకము' మున్నగువానిని కేవలసంకేతములుగా గ్రహించెను. ప్రౌఢవ్యాకర్త యౌగికార్థ గ్రహణముచేసి అర్థాంతరప్రయోగములనుకూడ చూపుచున్నాడు. ఇది యిరువరకు శబ్దముల నుపయోగించుటలో గల దృష్టిభేదమునుబట్టి వచ్చిన భేదము.

95. ఒకానొకచో నవిర్దిష్టార్థమం దొకశబ్దమునకుం బూర్వాగమం బగు. (ప్రౌ - రాజ)

ఒకానొకండు - ఒకానొకతె - ఒకానొకటి॥ ఒకానొకచో ననుటచే ఒకండు - ఒకతె - ఒకటి॥ ఒక శబ్ద మొక్కాదులకు నుపలక్షణము.

వ్యాఖ్య - అర్థము అవిర్దిష్టమై యున్నప్పుడు 'ఒక' శబ్దమునకు పూర్వమందు 'ఒకాన్' అన్న ఆగమము కలుగును.

ఒకండు, ఒకతె, ఒకటి - అనువానికి పూర్వమందు 'ఒకాన్' అని రాగా ఒకానొకండు, ఒకానొకతె, ఒకానొకటి - అని యగును. ఈ యాగమము రాని యెడల 'ఒకడు' మున్నగువిధముగనే యుండిపోవును. సూత్రమునందలి 'ఒకచో' అను దళముచేత ఆగమప్రాప్తికి వైకల్పము సూచింపబడినది.

ఒక శబ్దముచేతనే 'ఒక్క' మున్నగువానినికూడ గ్రహింపవలయునని ప్రౌఢవ్యాకర్త వివరణమందు నిర్దేశించెను. తాను లక్ష్యములను చూపలేదు. బాలవ్యాకర్త యేకశబ్దమునకు అర్థవిశేషములందు ఒకానొకండు, ఒకానొకటి, ఒకానొకరిత - మున్నగురూపములను చూపెను. 'ఒక్క' శబ్దమునకు ఆగమము కలిగినరూపమును తాను నుదాహరింపలేదు. అయినను "ఏకవాక్యంబునం దొకానొక్కండు దక్క" అని (బాల - కారక - 37) సూత్రమునందు 'ఒక్క' శబ్దము నొకి రూపమును ప్రయోగించి యున్నాడు.

96. సర్వనామంబులం మహదర్థంబునం దమమగ లు ఆలు నగు. (ప్రౌ - [illegible])

ఎల్లరు - ఎల్లరన్ - వారు - వీరు - వేరు॥ మొ. తలచుగ ననుటచే తాము - మేము - తమ్ముమ్ - మమ్ముమ్ - మిమ్మునిత్యాది రూపంబులు నగునని యెఱుంగునది.

వ్యాఖ్య - మహదర్థకములయిన సర్వనామములయొక్క డు, లు - అను వానికి రు, ర - అనునవి క్రమముగా నగునవి సూత్రార్థము.

'ఎల్ల' యనునది నిత్యబహువచనాంతము. దీనికి మహదర్థ వివక్షయందు 'డు' వర్ణకము చేరి, ప్రస్తుతసూత్రముచేత 'రు' వర్ణమై 'ఎల్లరు' అని యగును. 'ఎల్ల' శబ్దము ద్వితీయాద్యంత మైనప్పుడు బహుత్వమునందు లగాగమము నొంది, ప్రస్తుతసూత్రముచేత రవర్ణముగా మారగా ఎల్లరన్, ఎల్లరిచేత - మున్నగు రూపము లేర్పడును. వాఁడు, వీఁడు, వేఁడు అనువానికి బహుత్వమునందు లు వర్ణకము కలిగి ప్రస్తుత సూత్రముచేత రు వర్ణముగా మారగా వారు, వీరు, వేరు - అను రూపము లేర్పడును.

[ వారు - మున్నగువానికి ద్వితీయాది విభక్తులయందు మార్పు గలుగును. అది (ప్రౌ - ౪౦) రాబోవు సూత్రమున చెప్పబడును. కావుననే వ్యాకర్త యిచ్చట ఉదాహరణములను విడిచిపెట్టెను. ]

'తఱుచు' అను శబ్దమును వాడుటవలన రువర్ణమును రవర్ణమును గలుగని 'వాండ్రు' మున్నగు రూపములుకూడ కలుగుట కవకాశము కలదని ప్రౌఢవ్యాకర్త వివరణమందు తెలిపెను. పూర్వసూత్రము (ప్రౌఢ - ౭౮) ఈ బహువచన రూపములను నిరూపించెను. కావున ఇప్పుడు వానిని తిరిగి చెప్పవలసిన యవసరము లేదు. అయినను "ఇత్యాది రూపంబులు నగునని" అని సముచ్చయార్థకము వాడుట వైకల్పికార్థస్ఫూర్తిని గలిగించుచున్నది. కావున "తఱుచుగ" అనికాక సూత్రమును "సర్వనామంబులకుఁ గొన్నింటికి" అని చెప్పియుండిన మరింత సమంజసముగా నుండెడిది.

బాలవ్యాకర్త 'ఎల్లరు' అను రూపమును చూపలేదు. కావున ప్రౌఢవ్యాకర్త ఆశబ్దమునే ముందుగా చూపి పూరించుచున్నాడు. తక్కినరూపము లన్నియు బాలవ్యాకర్త చూపినవే.

**97 ఏఁ జే రే దే ని శబ్దంబు లర్థవిశేషంబునం దీర్ఘాంతంబు లగు.**

(ప్రౌ - ౮౬)

ఏఁడీ నా బలుమానికంబుల కోటారు॥ అచ్చ. రా. అయ్యో॥ వారేరీ సిరి మూటకట్టుకొని పోవంజాలిరే॥ భాగ. ౮ స్కం॥ ఏది యేదీ యిది చాలుఁ గ్రొత్త॥ కళా. ౧ఆ॥ మొ. హ్రస్వాంతంబులు

నగు - వాఁడేఁడీ, వారేరీ మొ॥ (అర్థవిశేషము - ఎక్కడ, ఎక్కడ నున్నాఁడు॥ ఇత్యాది.)

వ్యాఖ్య - ఏఁడు, ఏరు, ఏది, ఏవి - అను ప్రశ్నార్థక సర్వనామములకు విశేషార్థము కలుగునపుడు ఈకారము కలుగునని సూత్రార్థము.

'ఏఁడీ' అనునది 'ఏఁడు' అను మహద్బోధకమైన కిమర్థకైకవచనాంతరూపముపై ప్రస్తుతసూత్రముచేత 'ఈ' వర్ణము చేరగా ఏర్పడినరూపము. 'ఏఁడు' అనునది 'ఎవఁడు' అనుటకు పర్యాయవాచకమే. ప్రస్తుత ప్రయోగమున 'ఏఁడీ' యనునది 'ఎవఁడు' అను నర్థమున కాక 'ఎక్కడ నున్నాడు' అను విశేషార్థమునందు ప్రయుక్తమయ్యెను.

'వారు + ఏరీ' అని యున్నపుడు 'వారెవరు?' అను నర్థము కాక 'వారెక్కడ నున్నారు?' అను విశేషార్థమే కలుగుచున్నది. 'ఏది యేదీ' అను చోటి 'ఏది' యను శబ్దమునకు దీర్ఘము కలిగి ఆసక్తిని తెలుపుచున్నది.

సూత్రమున 'ఏరు' అను రూపమును మాత్రమే వ్యాకర్త చూపెను. 'వేరు' అను దానికి కూడ అర్థవిశేషమునందు ఈకారము కలిగి "నినుబోలు సత్కవులు వేరీ నేఁటికాలంబునన్" అను విధముగా శ్రీనాథుని ప్రయోగము కలదు.

వీనికి హ్రస్వము కలుగుటచే ఏఁడి, ఏరి, ఏది, ఏవి - అను విధముగా నుండియు అర్థవిశేషమును బోధింపవచ్చును.

[ఇట్టియెడల 'ఏఁడి యేఁడీ' 'ఎది యేదీ' అనువిధముగా ద్విరుక్తములగుటయు, అప్పుడు ఆమ్రేడితము తుదివర్ణమునకు ఈకారము వచ్చుటయు తరుచుగా కలుగుచుండును. ఆవిషయమునుగూర్చి చెప్పియుండవలసినది.]

98. అంతాదులకు వారు పరంబగుచో వాకు లోపంబును రు ర లకు లు ల లాదేశంబు నగు. (ప్రౌ - ౨౭౨)

అందఱు - అందఱన్, మొ॥

వ్యాఖ్య - అంత, ఇంత, ఎంత, కొంత - అనువానికి 'వారు' అను తచ్ఛబ్దము పరమగునపుడు 'వా' అను తొలియక్షరమునకు లోపమై, మిగిలిన రు వర్ణమునకు 'ఱు' ఆదేశముగా నగును. ద్వితీయాదివిభక్తుల బహుత్వరూపమున 'ర' వర్ణమునకు బదులుగా 'ఱ' యగును - ఇది సూత్రార్థము.

'అంత + వారు' అని యున్నప్పుడు ప్రస్తుతసూత్రముచేత 'వా'కు లోపము కలుగగా 'అంత + రు' అని యగును. ఇప్పుడు రేఫమునకు అలఘు రకారము కలుగగా అంత + ఱు అని యగును. ఇక్కడికి ఈరూపము సమగ్రము కాలేదు. తరువాతి సూత్రముచేత 'అందఱు' అను రూపము సిద్ధించును. ఇట్టివే ఇందఱు, ఎందఱు, కొందఱు - అను రూపములు కూడ.

[ ఈ సూత్రరచనము సక్రమముగా లేదు. 'అంత' యను శబ్దముపై 'వారు' అనునది ఏ యర్థమునందు చేరుచో స్పష్టీకరించి యుండవలసినది. అట్లు కానందువలన అంతవారు, అంతటివారు, ఇంతవారు, ఇంతటివారు, ఎంతవారు, ఎంతటివారు - మున్నగు రూపములను ఈ సూత్రము వారించుట జరుగుచున్నది. ఉన్నప్రయోగములను వారించుట యుచితము కాదు. ]

**99. వాలోపంబు తఱి వాని తకారంబునకు దకారం బగు.**

(ప్రౌ - ౯౯)

అందఱు - ఇందఱు - ఎందఱు - కొందఱు.

వ్యాఖ్య - పూర్వసూత్రముచేత 'వా' అను నక్షరమునకు లోపము కలుగగా 'అంత' మున్నగువానిలోని 'త' కారము 'ద' కారముగా మారునని సూత్రార్థము.

'అంత + ఱు' అని పూర్వసూత్రముచేత సిద్ధింపగా ప్రస్తుతసూత్రమువలన 'త' స్థానమున 'ద' రాగా 'అందఱు' అని యగును. ఇందఱు, ఎందఱు, కొందఱు; అందఱన్, ఇందఱన్, ఎందఱన్, కొందఱన్ - మున్నగునవి యిట్లేర్పడిన రూపములే. బాలవ్యాకర్త యీరూపముల నన్నింటిని చూపెను.

**100. ద్వితీయాదులం దసంయుక్త రవర్ణకంబు నత్వంబున కిత్వంబు తఱచుగ నగు**

(ప్రౌ - ౧౦౦)

వారిన్ - వీరిన్ - నేరిన్ - ఒకరిన్॥ వాండ్రన్ - వీండ్రన్ - నేండ్రన్ - ఒకండ్రన్ - మొ॥ తఱచుగ ననుటచే నిరువుర నిత్యాదుల యం దిత్వంబు గలుగదు.

వ్యాఖ్య - ద్వితీయాదివిభక్తులు పరమగునప్పుడు అసంయుక్తమైయున్న ర వర్ణకముయొక్క అత్వమునకు ఇత్వము తఱచుగా ఆదేశమగునని సూత్రార్థము.

‘ఆ’ అను శబ్దమునకు ద్వితీయార్థమున ‘లన్’ అనునది పరమై (ప్రౌ - 88) ర వర్ణము కాగా ‘అ + రన్’ అనియగును. ముందు వకారము కలిగి వ్ + అ + రన్ = వా + రన్ అని యగును. ప్రస్తుతసూత్రముచేత రకారముయొక్క అత్వమునకు ఇత్వము కాగా ‘వా + రిన్ = వారిన్’ అని యగును. వీరిన్, వేరిన్, ఒకరిన్, ఎవరిన్ మున్నగునవి యిట్లు ఏర్పడినరూపములే.

‘అసంయుక్త ర వర్ణకము’ అని యనుటచేత ‘వాండ్రన్’ మున్నగురూపముల యందు డకార సంయుక్త రవర్ణముయొక్క అత్వమునకు ఇత్వము కలుగరాదు. అందువలన రాలోవ (ప్రౌ - 83) సూత్రముచే సిద్ధించు వీండ్రన్, వేండ్రన్ - మున్నగునవి అట్లే యుండిపోవును.

‘లఘుగ’ అని చెప్పుటచేత అసంయుక్త ర వర్ణమే యున్నను ఇరువురను, మూగురను, ఎల్లరను - మున్నగుచోట్ల ఇత్వము కలుగదు.

‘ర’ వర్ణము అని యనుటవలన లఘురేఫమే యుద్దిష్టమయ్యెను. కావున అలఘురేఫము యొక్క అత్వమునకు ఇత్వము కలుగవలసిన యవసర మెంత మాత్రము లేదు; కలుగరాదు. అందలన్, చూపలన్, పగలన్ మున్నగువాని నుదాహరణములుగా గ్రహింపవచ్చును.

[ ప్రౌఢవ్యాకర్త ఇచ్చట ర వర్ణమును రవర్ణక మనుట సరి కాదు. సూరి ‘ల’ కారమును ద్వితీయాదులకు ఆగమముగా విధించెను. దాని స్థానమున వచ్చున దగుటచే ‘ర’ వర్ణముకూడ ఆగమమే కావలయును.]

బాలవ్యాకర్త యీరూపముల నన్నింటిని చూపెను.

**101. అపదాద్యం బయి యసంయుక్తం బయిన గకారంబునకు వకారంబు విభాష నగు.** (బా - ౨౪)

పలుగురు - పలువురు; ఇరుగురు - ఇరువురు; వేగురు - వేవురు; తోగ - తోవ; పగలు - పవలు

వ్యాఖ్య - పదమునకు ఆద్యము కానిదియు, సంయుక్తము కానిదియు అయిన గకారమునకు వకారము విభాషగా నగునని సూత్రార్థము.

‘పలుగురు’ అనునది తెనుగు పదము. ఇందు ‘గు’ అను నక్షరము మాటకు మొదట లేదు. మరొక అక్షరముతో సంయోగము చెంద లేదు. కావున ఇది అపదా

ద్యము, అసంయుక్తము. ఇట్టి గకారమునకు వకారము విభాషగా కావచ్చును. 'గు' స్థానమున 'వు' వచ్చినచో 'పలువురు' అని యగును. ఇట్లు వ కారము రాకుండ 'పలుగురు' అనియు నుండవచ్చును.

విభాష యని యనుటచే వికల్పమును, నిషేధమును గలవు. ఇరుగురు - ఇరువురు; వేగురు - వేవురు; తొగ - తొవ; పగలు - పవలు॥ మున్నగునవి వికల్ప విధికి ఉదాహరణములు.

అపదాద్యమై అసంయుక్తమై యున్నప్పటికిని కొన్ని చోట్ల గ కారమునకు వకారమురాదు. నగము - మొగము - పిడుగు - మొగిలు॥ మొదలయిన వానిని నిషేధమునకు లక్ష్యములుగా గ్రహింపవచ్చును.

102. రు ర వర్ణకంబులు పరంబులగునపుడు సాధారణంబుగ సంఖ్యా వాచకంబులకు గు వర్ణంబు పూర్వాగమం బగు. (ప్రౌ - ౮౧)

ఇరుగురు - మూగురు - నలుగురు - ఐదుగురు - ఏగురు - ఆఱుగురు - ఏడుగురు - వేగురు - పదుగురు. మొ॥ సాధారణంబుగ ననుటచే ఎనమండ్రు - తొమ్మండ్రు - ఇరువండ్రు - ముప్పండ్రు॥ ఇత్యాదులందు రాదని యెఱుంగునది.

వ్యాఖ్య - సంఖ్యావాచకములకు మహదర్థమునుగాని మహత్యర్థమునుగాని వివక్షించునపుడు బహుత్వమున ప్రథమావిభక్తి రువర్ణమును ద్వితీయాదివిభక్తులకు ముందు ర వర్ణమును కలుగును. అట్టియెడల సాధారణముగా ఆ 'రు ర' వర్ణములకు ముందు 'గు' అనునది యాగమముగా నగును - ఇది సూత్రార్థము.

'రెండు' అను సంఖ్యావాచకమునకు మహదర్థక బహుత్వమునందు 'లు' కలుగగా 'రెండు + లు' అని యగును. "సర్వనామంబులకు మహదర్థంబునం దుఱుగ లుల లకు రుర లగు" అను(ప్రౌఢ - 86) సూత్రమునుబట్టి 'రెండు + రు' అని యగును. రాబోవు (ప్రౌఢ - 97) సూత్రముచేత రెండునకు 'ఇరు' ఆదేశము కాగా 'ఇరు + రు' అని యగును. ఇప్పుడు ప్రస్తుతసూత్రముచేత 'రు' వర్ణమునకు ముందు 'గు' వర్ణము ఆగమముగా చేరగా 'ఇరుగురు' అని యగును. పూర్వ (బాల - 27) సూత్రముచేత గ కారమునకు వ కారము కాగా 'ఇరువురు' అనియు కావచ్చును.

ఇట్టివే అయిదుగురు, ఆఱుగురు, ఏడుగురు - మున్నగు రూపములు మూఁగురు - మున్నగువానియందు పూర్వశబ్దము లోపాదికములయిన మార్పులను పొందెను. వానిని ప్రౌఢవ్యాకర్త యిక ముందు వివరించును.

సూత్రమునందు 'సాధారణముగ' అని యనుటచే ఎనమండ్రు, తొమ్మండ్రు - మున్నగుచోట్ల పైనిచెప్పిన గవర్ణము కలుగదు. అప్పుడు కలుగురూపములు రాబోవు (ప్రౌఢ - 93) సూత్రముచేత నిరూపింపబడును.

[ ఈ సూత్రరచన సరిగాలేదు. "సంఖ్యావాచకంబులకు గు వర్ణంబు పూర్వాగమం బగు" అని యర్థము కలుగుచున్నది. వ్యాకర్త యుద్దేశమున రు ర వర్ణముల కంటె ముందుగా (ప్రథమముగా) అని యర్థము కావచ్చును. కాని అది పద్ధతికాదు. దేనికి విధింపబడునో దానికి పూర్వముందు చేరుదానిని పూర్వాగమ మని యందురు. కావున "సాధారణంబుగ సంఖ్యావాచకంబుల మీఁది రు ర వర్ణంబులకు గు వర్ణంబు పూర్వాగమంబగు" అని సూత్రరచన సాగినయెడల స్పష్టముగా నుండును. ]

ఈ రూపముల నన్నింటిని బాలవ్యాకర్త ప్రదర్శించెను.

**103.** సంఖ్యావాచకంబులకు విభక్తి పరంబగునపుడు కొన్నింటి యంత్యాక్షరంబులకు లోపం బగు. (ప్రౌ - కా-౩)

మూఁగురు - నలుగురు - ఎనమండ్రు - తొమ్మండ్రు - ఇరువండ్రు - ముప్పండ్రు॥ మొ. అక్షరంబుల కనుటచే 'నెనుబండ్రు' లోనగువాని యందు పాంత్యస్వర వర్ణంబునకు లోపంబు. కొన్నింటి యనుటచే అయిదుగురు, ఆఱుగురు - ఇత్యాదులందు లోపము లేదు.

వ్యాఖ్య - విభక్తి పరమగునపుడు, అనగా పూర్వము చెప్పిన రు ర వర్ణములు పరములైనపుడు కొన్ని సంఖ్యావాచకములయొక్క అంత్యాక్షరములకు లోపము కలుగు నని సూత్రార్థము.

'మూఁడు' శబ్దమునకు బహువచనము పరమై 'రు' వర్ణకముకాగా 'మూఁడు + రు' అని యుండును. ఇట్టియెడల 'మూఁడు' శబ్దముయొక్క అంత్యాక్షరములైన అర్ధానుస్వారమును 'డు' వర్ణమును లోపింపగా 'మూ + రు' అని మిగులును. పూర్వసూత్రముచేత 'గు' వర్ణము రాగా 'మూఁగురు' అని యగును. 'నాలుగు

మునకు రు వర్ణము చేరగా కడపటి యక్షరము లోపించి 'నాలు + రు' అని యగును. రాబోవు (ప్రౌఢ - 91) సూత్రముచేత దీర్ఘమునకు హ్రస్వము కలిగి 'నలు + రు' అని కాగా పూర్వసూత్రముచేత 'గు' వర్ణముచేరి 'నలుగురు' అని యగును.

ఎనిమిది - తొమ్మిది - ఇరువది - ముప్పది॥ అనువానికి కూడ రు ర వర్ణములు పరములగునప్పుడు కడపటి యక్షరములు లోపింపగా ఎనిమి - తొమ్మి - ఇరువ - ముప్ప॥ అని పూర్వాంగములై యుండును. అప్పుడింకను ముందు నిరూపింపబోవు కొన్నిమార్పులు కలిగిన పిమ్మట (ఎనమండ్రు - తొమ్మండ్రు - ఇరువండ్రు - ముప్పండ్రు॥ అను రూపములు సిద్ధించును.

అక్షరంబుల కనుటచే "ఎనుబండ్రు" అను దానియందు అంత్యవర్ణమేకాక ఉపాంత్యవర్ణముకూడ లోపించుట సూచింపబడుచున్నదని ప్రౌఢవ్యాకర్త తాత్పర్యము. కావుననే దానిని వివరణమునందు చేర్చి చెప్పెను. కాని నిజమునకు 'ఎనుబది' అను శబ్దమునకు 'రు' పరము కాగా 'ది' యను సంఖ్యాక్షరము మాత్రమే లోపించుచున్నది. 'ఎనుబ + రు' అని కాగా తరువాతి సూత్రముచే బిందుపూర్వక డ కారము కలిగి 'ఎనుబండ్రు' అని యగును ఇచ్చట అంత్యాక్షరము కాక మరేటియు లోపించుట లేదు. కావున "అక్షరంబుల కనుటచే" అని మొదలయిన వివరణవాక్యము ప్రమాదపతితమని నిర్ణయింప వచ్చును.

"కొన్నింటి యంత్యాక్షరంబులకు" అని యనుటచేత ఆరు, ఆఱు, ఏబది - మున్నగు సంఖ్యావాచకముల యంత్యాక్షరములకు లోపము కలుగుట లేదు.

104 రు ర వర్ణంబులు పరంబులగునపుడు కొన్నింటికి నిత్యముగాను, గొన్నిటికి వైకల్పికముగాను బిందుపూర్వక డకారంబు పూర్వాంగమం బగు. (ప్రౌ - 93)

ఎనమండ్రు - ఎనమండ్రన్ ; తొమ్మండ్రు - తొమ్మండ్రన్ ; ఇరువండ్రు - ఇరువండ్రన్ ; ముప్పండ్రు - ముప్పండ్రన్ ; నలువండ్రు-నలువండ్రన్ ; ఏబండ్రు - ఏబండ్రన్ ; అఱువండ్రు - అఱువండ్రన్; డెబ్బండ్రు - డెబ్బండ్రన్ ; ఎనుబండ్రు - ఎనుబండ్రన్; తొంబండ్రు - తొంబండ్రన్॥ మొ. పెక్కండ్రు - పెక్కండ్రన్ - పెక్కురు - పెక్కురన్ ; పదుండ్రు - పదుండ్రన్ - పదురు - పదురన్ -పదుగుండ్రు -

పదుగుంన్డ్రన్ - పదుగురు - పదుగురన్ ; వాండ్రు - వాండ్రన్ - వారు - వారిన్॥ మొ.

వ్యాఖ్య - సర్వనామములకు మహదర్థమున ప్రథమావిభక్తియందు రువర్ణక మును, ద్వితీయాది విభక్తులయందు 'ర' వర్ణమును కలుగునపుడు బిందుపూర్వక దకారము కొన్నింటికి నిత్యముగాను, కొన్నింటికి వైకల్పికముగాను ఆదవముగా వచ్చి చేరునని సూత్రార్థము.

'ఎనిమిది' అను సంఖ్యావాచకమునకు మహదర్థక బహుత్వమున 'రు' వర్ణకము కలిగి 'ఎనిమిది + రు' అని యగును. పూర్వసూత్రముచే అంత్యాక్షరమునకు లోపము రాగా 'ఎనిమి + రు' అని యగును. ప్రస్తుత సూత్రముచేత 'రు' వర్ణము నకుముందు బిందు పూర్వక ద కారము రాగా 'ఎనిమి + ండ్ + రు' అని యగును. ఇచ్చట పూర్ణబిందువని యనక పోయినను దకారము రకారముతో సంయోగము పొందుటవలన "సమాస పదంబునందు సంయోగంబు పరంబగునపు డెల్లచో ఖండబిందువకుం బూర్ణంబగు" అను(బాల - 66)విధివిబట్టి పూర్ణబిందువే యగును.

ఇప్పటి కింకను రూపనిష్పత్తి పూర్తికాలేదు. తరువాతి సూత్రములకడ వీనిని మరల గ్రహింపవలయును.

'పెక్కు' మున్నగువానికి రు ర లు చేరుటచేత పెక్కురు, పెక్కురన్ అను రూపములు రావచ్చును. వైకల్పికముగా పూర్ణబిందుపూర్వక దకారమురాగా, చివరి ఉత్వమునకు అత్వముకూడ కలిగి పెక్కండ్రు, పెక్కండ్రన్ - అను విధముగా కూడ నగును.

పది శబ్దముపై పదుగురు, పదుగురన్ - అని గువర్ణము తోడిరూపములును; పదుగుండ్రు, పదుగుండ్రన్ - అని గువర్ణమును ప్రస్తుతవిధిచే ప్రాప్తించిన బిందు పూర్వక దవర్ణమును కలిగిన రూపములును; పదురు, పదురన్ - అని గువర్ణ విర హితములైన రూపములును; పదుండ్రు, పదుండ్రన్ - అని గువర్ణ విరహితములై బిందుపూర్వకదకారయుతములై యున్న రూపములును గూడ గలవు.

'వాఁడు' శబ్దమునకు బహువచనరూపములుగా వారు, వాండ్రు - అను రూప ములు చూపబడినవి. వీండ్రు, ఏవాండ్రు - మున్నగునవియు నిట్టివే.

[ఈ సూత్రముకూడ స..గా లేదు. "కొన్నింటికి బిందుపూర్వక దకారంబు పూర్వాగమంబగు" అను అన్వయము కలుగుచున్నది. సర్వనామశబ్దములకు 'ండ్'

అనుసది పరమందు చేరుచున్నది. అంతేకాని పూర్వమందు చేరుటలేదు. కావున "బిందుపూర్వక దకారంం బంతాగమంబగు." అని యుండవలయును.]

పై రూపముల నన్నింటిని బాలవ్యాకరణము ప్రదర్శించి యున్నది.

**105. బిందుపూర్వక దకారంబు పరంబగుచోఁ దుది యిత్వోత్వ ములకత్వం బగు.** (ప్రౌ - 105)

ఉ క్తము.

వ్యాఖ్య - బిందుపూర్వక దకారము పరమైనయెడల సర్వనామ శబ్దముల తుది యిత్వమునకును, ఉత్వమునకును అత్వము కలుగునని సూత్రార్థము.

పూర్వసూత్రముచే 'ఎనిమి + ండ్ + రు' అని యేర్పడగా ప్రస్తుత సూత్రముచేత 'ఎనిమ + ండ్ + రు' అని యగును. రాదేశ (101) సూత్రము వలన 'ని' వర్ణము 'న' వర్ణము కాగా 'ఎనమండ్రు' అని యగును.

'పెక్కు + ండ్ + రు' అని యున్నప్పుడు ప్రస్తుతసూత్రముచేత ఉత్వ మునకు అత్వము కలిగి 'పెక్క + ండ్ + రు = పెక్కండ్రు' అని యగును.

సర్వనామములయొక్క తుది యిత్వోత్వములకే యీ మార్పు గలుగును. కావ వనే పదుండ్రు, పదుగుండ్రు - మున్నగుచోట్ల ఆగమములయిన ఉత్తునకు, గు వర్ణ మునకు ఈ మార్పులు కలుగుట లేదు. 'ఇత్వము' అని హ్రస్వమునే సంకేతించుట చేత వీండ్రు - మున్నగుచోట్ల అత్వము కలుగవలసిన యవసరము లేదు.

**106. కొండొకయెడ లు అవర్ణకములు పరంబగునపుడును నత్వం బగు.** (ప్రౌ - 106)

చూపలు - చూపఱున్॥ మొ.

వ్యాఖ్య - ఒకానొకచోట లు ఱు వర్ణములు పరమైనప్పుడు పహితము పూర్వ మున్న ఉత్వమునకు అత్వము కలుగునని సూత్రార్థము. పూర్వసూత్రముచేత బిందు పూర్వక దకారమునకు ముందుమాత్రమే అత్వప్రాప్తి కలదు. ఈ సూత్రముచేత తద్భిన్నమైన మరొక ప్రయోగము సాధింపబడుచున్నది.

'చూపు + వారు' అని యున్నపుడు "అంతాదులకు వారు పరంబగుచో" అని మొదలయిన (ప్రౌఢ - 88) సూత్రమును బట్టి వాకు లోపమువచ్చి 'రు'

వర్ణము 'ఱు'గా మారును. 'చూపు + ఱు' అని యుండగా ప్రస్తుతసూత్రముచేత 'చూపు' శబ్దము తుదనున్న ఉత్వమునకు అత్వము కలిగి 'చూప + ఱు = చూపఱు' అని యగును.

**107.** పలు శబ్దంబునకు రురలు పరంబగునపుడు గువర్ణంబును వలయుచో మీఁద బిందుపూర్వక దకారంబును విభాష నగు. (ప్రౌ - ౯౬)

పలుగురు - పలుగురన్ - పలుగుంద్రు - పలుగుంద్రన్॥ మొ.

వ్యాఖ్య - 'పలు' అను సర్వనామమునకు బహుత్వమునందు రువర్ణముగాని, రవర్ణము గాని పరమైనప్పుడు గువర్ణము వచ్చును; కావలయునన్నచో దానిమీఁద బిందుపూర్వక ద కారము కూడ నగును - ఇది సూత్రార్థము.

'పలు' అనునది బహ్వర్థక సర్వనామము. దీనికి మహద్బహువచనమున 'రు' వర్ణము పరము కాగా 'పలు + రు' అని యుండును. ప్రస్తుత సూత్రముచేత 'గు' ఆగమము కాగా పలుగురు అని యగును. బిందుపూర్వక దకారముకూడ వచ్చిన యెడల 'పలుగు + ంద్ + రు = పలుగుంద్రు' అని యగును. ద్వితీయాదివిభక్తులయందు 'ర'వర్ణము పరమగునప్పుడు సైతము ఈ యాగమములు కలుగును. అందువలన పలుగురన్, పలుగుంద్రన్ - అను రూపములు వచ్చును.

గు వర్ణము ఇంతకుముందు (ప్రౌఢ - 91) సూత్రముచేతనే విధింపబడినది. కాని అది సంఖ్యావాచకములకే నియతమైయున్నందున సంఖ్యావాచకములలో చేరని 'పలు' శబ్దమునకు 'గు' వర్ణవిధి వేరుగా చెప్పవలసి వచ్చినది. ఆ సూత్రమునందున్న "సాధారణముగ" అను శబ్దముచేత 'పలు' శబ్దమును కూడ అం దంతర్భవింపజేసికొనవచ్చును. అయినను స్పష్టతకొరకై ప్రౌఢవ్యాకర్త మరల చెప్పుట మంచిదే.

[ ఈసూత్రము కూడ సరిగా లేదు. ఇక్కడ 'గు' వర్ణము 'పలు' శబ్దమునకే తుదను చేరుచున్నట్లు వ్యాకర్త విధించెను. ఒకచోట శబ్దమునకు, మరొకచోట విభక్త్యాదులకు ఒకే ఆగమమును విధించుట సమంజసమగు పద్ధతి కాదు. ఇదివరకు రు ర వర్ణములకు పూర్వాగమములుగా విధించినట్లే యిప్పుడును విధించిన నొక సామ్యము సిద్ధించుట కవకాశము కలుగును; ఇంక మరొక విషయము. సూత్రమున రెండవభాగమునందు "వలయుచో" అని ప్రారంభమున

"[illegible]" [illegible]. [illegible] యున్నయెడల చివర "[illegible]" [illegible] "పలయుచో" అన్నదానిని తొలగింపవల [illegible]. [illegible] వెనుకల రెండు మాటలను వాయుట సరియగు [illegible]. ]

**108. ఇరు రెండున కాదేశం బగు (ప్రౌ - ౯౭)**

ఈశ్త్రము.

వ్యాఖ్య - మహదర్థమునందు రు ర వర్ణములు పరములగునపుడు రెండు శబ్దమునంతటికి బదులుగా 'ఇరు' అనియగును - ఇది సూత్రార్థము.

'రెండు + రు' అని యున్నప్పుడు ప్రస్తుతసూత్రముచే 'ఇరు + రు' అని యగును. గువర్ణము (ప్రౌఢ - 91) వచ్చి చేయుటచేత 'ఇరు + గు + రు=ఇరుగురు' అని యగును.

**109. ఒకానొకచో నిరుగురున కిద్దఱాదేశం బగు (ప్రౌ - ౯౮)**

వ్యాఖ్య - 'ఇరుగురు' అని యనుటకు 'ఇద్దఱు' అనునది యాదేశముగా నొకానొకప్పు డగునని సూత్రార్థము.

'ఇరుగురు' అనునది "అపదాద్యంబయిన" అని మొదలయిన (బాల - 27) సూత్రమునుబట్టి 'ఇరువురు' అని కావచ్చును. ఉత్వలోపముచే 'ఇర్వురు' అనియు కావచ్చును. 'ఇద్దఱు' అను మఱొకరూపముకూడ దీనికి కలదని ప్రౌఢవ్యాకర్త [illegible]చుచున్నాడు.

[ సూత్రమున 'ఒకానొకచో' అని యనుటచేత కొన్ని నిర్దిష్టస్థలములందే [illegible] యనిపించును. కాని అట్టినియమములేదు. ఎప్పుడైనను కావచ్చును. కావున తత్స్థానమున 'వలయుచో' అని యుండిన [illegible]. ]

**110 విభక్తి పరంబగుచో మూఁడు నాలుగుల దీర్ఘంబునకు హ్రస్వంబు బహుళంబుగా నగు. (ప్రౌ - ౯౯)**

ముగురు॥ (శేవ. ముక్తము).

వ్యాఖ్య - పరమందు విభక్తి ప్రత్యయ మున్నప్పుడు మూఁడు నాలుగు అను శబ్దముల దీర్ఘమునకు హ్రస్వము కలుగునని సూత్రార్థము.

[ సూత్రమున 'విభక్తి' యని యుండరాదు. మూఁటికి, మూఁడింటికి, నాలుగింటికి [illegible] మున్నగురూపములందు విభక్తి పరముగుచున్నది. అయినను

హ్రస్వము వచ్చుట లేదు. కావున వెనుకటి మాదిరిగనే "దురంబు పదంబులగుచో" అని యుండుట సమంజసము. సూత్రకర్త తాత్పర్యము కూడ అదియే ]

'మూఁడు' అను శబ్దము మహదర్థమునందు 'రు' వర్ణకమును బొంది గు గాగమమును బొందును; తుది వర్ణములకు లోపము కలుగును 'మూ + గురు' అని యుండి ప్రస్తుతసూత్రముచేత హ్రస్వము కలుగగా 'ముగురు' అని యగును.

'నాలుగు' శబ్దముకూడ ఇట్లే 'నాలు + గురు' అని యుండి దీర్ఘము హ్రస్వము కాగా 'నలుగురు' అని యగును.

బహుళమని యనుటచే హ్రస్వము కలుగని 'మూగురు' మున్నగు రూపములు కూడ నుండుట కవకాశము కలదని యర్థము.

[ఇక్కడ బహుళమని యనుట సరిగాలేదు "మూఁడు శబ్దమునకు వైకల్పికముగాను, నాలుగు శబ్దమునకు నిత్యముగాను" అను విధముగా స్పష్టము చేసిన బాగుండెడిది. ]

**111.** ప్రాప్తహ్రస్వంబులగు మూడేల మీఁది వర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగ నగు. (ప్రౌ - ౧౦౦)

ఉక్తము.

వ్యాఖ్య - హ్రస్వములైనట్టి 'మూ' వర్ణముమీది 'దే' వర్ణముమీది వర్ణములకు ద్విత్వము బహుళముగా కలుగునని సూత్రార్థము.

'మూఁడు' శబ్దమునకు 'రు' వర్ణము పరమగుచుండగా అంత్యవర్ణములకు లోపమును గువర్ణాగమమును కలుగగా 'మూ + గు + రు' అని యగును. పూర్వ సూత్రముచేత దీర్ఘము హ్రస్వముకాగా 'ముగురు' అని యగును. ప్రస్తుత సూత్రము వల్ల కృతహ్రస్వముమీది 'గు' వర్ణమునకు వైకల్పికముగా ద్విత్వము కలుగును. కలిగినచో 'ముగ్గురు' అని యగును. కలుగకున్న 'ముగురు' అని పూర్వరూపమే యుండును.

ఏడు శబ్దమునకు పది పరమైనప్పుడు వర్ణవ్యత్యయమును సంహితయు కలుగగా (ప్రౌఢ - 61) 'దే' యని యగును. సమాసపరిచ్ఛేదమునందలి విధులచేత దె + బది అని యగును. ప్రస్తుతసూత్రముచేత బకారమునకు ద్విత్వము కలుగగా 'దెబ్బది' యని యగును.

[ 'మూ' మీది వర్ణమునకు వైకల్పికముగను, 'డే' మీది వర్ణమునకు నిత్యముగను ద్విత్వము కలుగుచున్నది. దీనిని బహుళకార్యమని తెల్పుట సము చితముగా లేదు. ]

**112.** ఎనిమిది నివర్ణంబున కత్వంబగు. (ప్రౌ -౧౦౧)

ఉక్తము.

వ్యాఖ్య - రురలు పరమైనపుడు 'ఎనిమిది' అను శబ్దములోని ని వర్ణము యొక్క ఇత్వమునకు అత్వము ఆదేశముగా కలుగునని సూత్రార్థము.

ఇదియు మహాదర్థక విషయమే. 'ఎనిమిది + రు' అని యున్నప్పుడు (ప్రౌఢ - 92) తుదివర్ణమునకు లోపము రాగా 'ఎనిమి + రు' అని యగును. బిందుపూర్వక దకారము (ప్రౌఢ - 93) కలిగి, తుది యిత్వమునకు అత్వము (ప్రౌఢ - 94) కలుగగా 'ఎనిమి + ంద్రు' అని యుండును. ప్రస్తుతసూత్రము చేత 'ని' వర్ణము 'న' వర్ణము కాగా 'ఎనమండ్రు' అని యగును.

**113.** పది యిత్వంబున కుత్వంబగు. (ప్రౌ - ౧౦౨)

ఉక్తము.

వ్యాఖ్య - రురలు పరమైనప్పుడు 'పది' శబ్దములోని ఇత్వమునకు ఆదేశముగా ఉత్వము కలుగునని సూత్రార్థము.

'పది + రు' అని యున్నప్పుడు ఉత్వము కలుగగా 'పదురు' అని యగును. బిందుపూర్వక దవర్ణము అదనముగా చేరినప్పుడుకూడ ఉత్వము కలిగి 'పదుండ్రు' అని యగును. ఇట్లే 'గు' వర్ణమాదేశమైనప్పుడు కూడ ఉత్వము కలిగి పదుగురు, పదుగుండ్రు - అను రూపములు కలుగును.

**114.** సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమం బగు.

(బా - ౨౨)

రెండవవాఁడు - రెండవది - మూఁడవవాఁడు - మూఁడవది.

వ్యాఖ్య - ఉత్తరపదము పరమగునపుడు సంఖ్యావాచకమునకు తుద 'అవ' అనునది ఆగమముగా పూరణార్థమునందు చేరునని సూత్రార్థము.

పూర్వపదమునకును ఉత్తరపదమునకును వర్ణముగల వ్యవధానమును లేకుండ జేయుట పూరణము. ఇది సంబంధమును వ్యక్తము చేయును.

'రెండు + వాఁడు' అని యున్నప్పుడు ఈరెండుపదములకును నడుమగల ఎడమును పోఁగొట్టి, సంబంధమును బోధించును 'అవ' యనునది అదనముగా చేరును. రెండు + అవ + వాఁడు = రెండవవాఁడు. ఇట్టివే రెండవది, మూడవవాఁడు, మూఁడవది - మొన్నగు రూపములు.

115. కొన్నియెడల నవ కగు కానంబడియెడి. (ప్రౌ - ౧౦౨,

వినఁ నేడగు పర్వము సే।లసఁగా ద్రోణాభిషేకమాదిగాఁ గెలయు। య్యెనిమిది పర్వములను స।త్యానుపమమ్మై ద్రోణపర్వమమరున్ సర్గలన్॥ భార. ఆది. ౧ఆ॥ అనుపమబలులగు కర్ణా।ర్జునవీరుల శౌర్య మహిమ శోభిల్లంగా। నెనిమిది యగు పర్వంబిది। యనఁ బరఁగుం గర్ణ పర్వ మతి హృద్యంబై॥ భార. ఆది. ౧ఆ॥ పదియగు వేఁయి నిండుటయుఁ బం క్తి ముఖాండు మనంబునన్ ముదం। బొదవఁగ నిర్వికారమున నున్న శిరంబును గోయఁజూచినన్॥ ని. ౩ఆ॥ (ఇట్టియెడల 'అవ' యనియే యుండ వచ్చును. అయినను గ్రంథములయందుఁ బాఠమిట్లగపడుచున్నది. )

వ్యాఖ్య - సంఖ్యావాచకముమీద పూరణార్థమునందు చేరునట్టి 'అవ'కు బదులుగా 'అగు' అనియు కొన్నియెడల నగునని సూత్రార్థము.

'ఏడు + పర్వము' అని యున్నప్పుడు 'అవ' యనునది ఆగమముకాగా 'ఏడవపర్వము' అని యగును. ప్రస్తుతసూత్రముచేత 'అవ' యనుదాని స్థానమున 'అగు' యని రాగా 'ఏడగుపర్వము' అనియగును.

'ఎనిమిది + పర్వము' అని యున్నప్పుడు 'అగు' అన్నది ఆగమముకాగా 'ఎనిమిది యగు పర్వము' అని కావచ్చును సంధి యయినచో 'ఎనిమిదగు పర్వము' అనియు కావచ్చును. 'పదియగువేయి' అన్నదికూడ ఇట్టి రూపమే. ఇట్టియెడల 'అవ' యనియు నుండవచ్చును. అట్లున్నచో ఎనిమిదవపర్వము. పదియవవేయి - మొన్నగువిధముగా రూపములుండవచ్చును.

ఇట్టియెడల 'అవ' యనియే యుండవచ్చుననియు గ్రంథములయందు కని పించు పాఠములనుబట్టి, యిట్లు చెప్పవలసి వచ్చెననియు ప్రౌఢవ్యాకర్త కుండలీకృత వాక్యములయందు తెలిపెను. నిజమునకు అట్లు చెప్పకొనవలసిన యవసరములేదు.

ఏడగు పర్వము - అని యన్నప్పుడు ఏడు సంఖ్యయగు పర్వము అని యర్థము. ఇచ్చట 'అగు' యన్నది శబ్దవిశేషణము. కర్మధారయములయందు పూర్వపదముగా

క్రియాజన్య విశేషణము కావచ్చును "కర్మధారయంబు త్రికత్రేసమ" మున్నగు విధముగా మొదలయిన (బాల - సమాస - ౯) సూత్రమునుబట్టి యది యంగీకృతమే. కావున "ఏడగు పర్వము" అనునది సాధారణరూపమే. దానిని వేరుగా పేర్కొనవలసిన యవసర మిక్కడ లేదు. అందువలననే బాలవ్యాకర్తయు దానిని పేర్కొనలేదు. అంతేకాక, నన్నయ తిక్కనల తరువాతి కవులు 'అగు' తోడి రూపములను దాదాపు పూర్తిగా పరిత్యజించి, 'అవ' తోడి రూపములనే వాడుట కనుట్టుటచే దీనిని బట్టిచూడ అవశిష్ట మాత్రమైన దీనినిగూర్చి ప్రసంగింపవలసిన యవసరము లేదని సూరి విడనాడియుండును. ఈసూత్ర మావశ్యకము కాదు.

116. ద్రుతాంత మంత శబ్దంబు తన తమ పూర్వకంబు స్వయమర్థకంబు. (ప్రౌ - ౧౦౮)

తనయంత - తనంత - తమయంత - తమంత॥ వనిత తనంతఁ దా వలచి వచ్చినఁ జుల్కనగాదె యేరికిన్॥ స్వా. ౨౯॥

వ్యాఖ్య - ద్రుతముతో కూడికొనియున్న 'అంత' అను శబ్దము ఏకవచనమున 'తన' యను శబ్దముపైని, బహువచనమున 'తమ' యను శబ్దముపైని చేరి 'స్వయముగా' అను నర్థము నిచ్చునని సూత్ర తాత్పర్యము.

'తన' అనునది షష్ఠ్యంతమైన ఆత్మార్థకైకవచన రూపము. దీనిపైని 'అంతన్' అను పదము చేరగా 'తనయంతన్' అని యగును. అత్వసంధి యైనయెడల 'తనంతన్' అనియు కావచ్చును. 'తమ' అనునది షష్ఠ్యంతమైన ఆత్మార్థక బహువచన రూపము. దీనిపైని 'అంతన్' అను పదము చేరగా 'తమయంతన్' అనియు 'తమంతన్' అనియు రూపములు కలుగును.

ద్రుతవిశిష్టమైన అంతశబ్దము సర్వార్థకమైన అమహదేకవచనరూపము. 'అంతన్' అను ద్రుతసహితరూపము ఆనంత్యార్థకము. ఈ ఆనంతర్యార్థకమే తన తమ లపైని చేరి స్వయమర్థక మగుచున్నవి.

'వనిత తనంతఁ దా వలచి వచ్చినఁ జుల్కనగాదె యేరికిన్' అని యన్నప్పుడు 'తనంతన్' అనునది ద్రుతాంతమై స్వయమర్థక మగుచున్నది. 'తనంతన్' అని యనగా 'తనకు తానుగా' అని యర్థము.

[ అంత శబ్దము తదాదులపైని కూడ చేరి స్వయమర్థకమగును. వాని యంత వాఁడు - నీయంత నీవు నాయంత నేను॥ అని మున్నగు విధముగా

నుండవచ్చును. కావున తన, తమ అనువాని మీద వచ్చినప్పుడే స్వయమర్థక మగునని నియతము చేయుట సరియైన మార్గము కాదు ]

**117.** **షష్ఠ్యంత తదేతద్యుష్మదస్మదాత్మ శబ్దపూర్వకంబు లగు ప్రథమాంత తదాదిశబ్దంబు లవధారణార్థకాంతంబులు తఱచుగ స్వయమర్థకంబు లగు.** (ప్రౌ - ౧౦౮)

వానికి వాఁడె - వీనికి వీఁడె - నీకు నీవె - నాకు నేనె - తనకుఁ దానె - వారికి వారె॥ మొ. తఱచుగ ననుటచే తనుదాన - తారుదారె ఇత్యాదులు గ్రాహ్యములు॥ పొరలెత్తి ఘనసారతరువులఁ దను ద్రాన తొరఁగిన పచ్చకప్పురపు రజము॥ స్వా. ౨౮॥ తను దానా పూర్ణప్రభల వెలయు॥ పర. ౧౮॥ మొ.

వ్యాఖ్య - తత్, ఏతత్, యుష్మత్, అస్మత్, ఆత్మ - అను శబ్దముల యర్థముల నిచ్చు షష్ఠ్యంతరూపములపై అవధారణార్థకము తోడి తదాదులు చేరి స్వయమర్థకము లగునని సూత్రభావము.

'వాఁడు' అనునది తదర్థకము; ఏకవచనాంతము. దీనికి షష్ఠ్యంతరూపము 'వానికి' అనునది. ప్రస్తుతసూత్రముచేత దీనిపైని అవధారణార్థకముతోడి 'వాడు' శబ్దము వచ్చి స్వయమర్థక మగును. ఎ, ఏ, అ, ఆ లు అవధారణార్థకములు. కావున 'వాఁడె' యనునది అవధారణార్థకముతోడి తచ్ఛబ్దము. 'వానికి' అను దానిపై 'వాఁడె' యనునది చేరి 'వానికివాఁడె' అని యగును. దీనికి 'స్వయముగా' అని యర్థము కలుగుచున్నది. ఇట్లే బహుత్వమున 'వారికి వారె' అని యగును.

'వీఁడు' అను ఏతచ్ఛబ్దమునకు 'వీనికి వీఁడె' అని యేకత్వమున 'వీరికి వీరె' అని బహుత్వమున రూపము లుండును.

యుష్మచ్ఛబ్దమునకు ఏకత్వమున 'నీకు నీవె' యని, బహుత్వమున 'మీకు మీరె' యని స్వయమర్థకరూపము లుండును.

నాకు నేనె, మాకుమేమె - యని అస్మదర్థమునందును తనకుఁ దానె, తమకుఁదామె - యని ఆత్మార్థమునందును రూపములు గలుగును.

సూత్రమున 'తఱచుగా' నాయనుటచేత పూర్వశబ్దము షష్ఠ్యంతము కాకుండ కూడ నుండవచ్చును. 'తనుదాన' అని యన్నప్పుడు 'తాన' అన్నది అవధారణార్థ

కముతోడి ఆత్మార్థకశబ్దము. (తాను + అ) పూర్వమున్నది ఆత్మశబ్దముయొక్క ద్వితీయాంతరూపమైన 'తన్ను' అనునది. ద్విత్వ లోపము కలిగి 'తను' అనియైన రూపము ఇక్కడ నున్నది. 'తారుదారె' అని యున్నప్పుడు 'తారు' అన్నది ప్రథమాంతమైన ఆత్మార్థక బహువచనరూపము. పైనిచేసినవి అవధారణార్థకముతోడి ఆత్మార్థకమే. కావున సూత్రమున చెప్పినట్లు పూర్వశబ్దముగా షష్ఠ్యంతము కానిరూపములుకూడ కొన్ని యుండవచ్చును దానిని సూచించుటకే 'తఱచుగ' అను పదము సూత్రమున ప్రయుక్తమయ్యెను

తనుదానాపూర్ణప్రఫల - అని యనుచోట ఉత్తరపదమునందు అవధారణార్థకము కూడ చేరలేదు. తనుదాను + ఆపూర్ణప్రభల - అని విభాగము. 'తఱచుగ' అను శబ్దము చేతనే దీనినికూడ గ్రహింపవచ్చును. ఇది వ్యాకర్త యుద్దేశించినట్లు కనబడదు. అయినను తానిచ్చిన లక్ష్యమే యగుటవల్ల, కాదనుటకును వీలులేదు. కావున అవధారణార్థకముండి తీరవలయునన్న నిర్బంధముకూడ ఇక్కడ లేదని తెలుచున్నది.

[ సూత్రమున 'షష్ఠ్యంత' అని యుపయోగించుట నిర్దేశకముగా లేదు. షష్ఠియందు కు, యొక్క, లోపల అనువానిలో ఏప్రత్యయముతోడి రూపమును వ్యాకర్త యుద్దేశించెనో స్పష్టము కావలయును. ఇచ్చట కు వర్ణముతోడి రూపము మాత్రమే స్వీకార్యము. తక్కినది కాదు. కావున 'షష్ఠ్యంత' యనియనక 'కు వర్ణకముతోడి' అని వ్రాసిన బాగుండెడిది. ]

118. కొన్నియెడల షష్ఠ్యంత తదాది శబ్దపూర్వకంబులు గాకయునవి స్వయమర్థకంబు లగు. (ప్రౌ - ౧౦౫)

వాఁడే వచ్చెను॥ వాఁడు తనంత వచ్చెననుట. ఇత్యాదు లెఱుంగునది.

వ్యాఖ్య - వానికి, వీనికి మున్నగురూపములు పూర్వమునందు చేరకున్నప్పటికిని వాఁడె. వీఁడె మున్నగునవియే స్వయమర్థకములై కొన్ని యెడల ప్రయుక్తములగునని సూత్రార్థము.

వానికి వాఁడే వచ్చెను - అని యుండవలసిన చోట 'వాఁడే వచ్చెను' అని యుండి స్వయమర్థమును బోధించు చున్నది. వాఁడు తనంత వచ్చె నని యర్థము. ఇక్కడ పూర్వమందుండవలసిన 'వానికి' అన్నది లోపించెనని యరము.

**119.** **షష్ఠ్యంత తదేత ద్యుష్మ దస్మ దాత్మ శబ్దపూర్వకం బంతట పృథగర్థకం బగు.** (ప్రౌ - ౧౧౦)

వానియంతట వాఁ డున్నాఁడు. మొ॥

వ్యాఖ్య - షష్ఠీవిభక్తితో వంతమగు తదాది శబ్దములపై వచ్చిన 'అంతట' అను శబ్దము వచ్చి 'వేఱుగా' అను నర్థము నిచ్చునని సూత్రార్థము.

వానియొక్క, వీనియొక్క మున్నగునవి షష్ఠ్యంతములు. వీనిమీద 'అంతట' అను శబ్దము వచ్చి సమాసము కాగా 'యొక్క'కు లోపము కలిగి 'వానియంతట' అని యగును. దీనికి 'వేఱుగా' అని యర్థము.

[ 'అంత' అను శబ్దముకంటె 'అంతట' అను శబ్దము భిన్నము కాదు. 'అంత' అనుదానికి ఔపవిభక్తిక 'టి' వర్ణము కలుగగా 'అంతటి' అని యగును. దీనికి తృతీయా సప్తములయందు అత్వము (బాల - ౪౮) కలిగి 'అంతట అని యగును. 'అంత' శబ్దమువలెనే యిదియు ప్రాంతాంతమే కావున, ఆ శబ్దము పరమగునపుడు వచ్చు స్వయమర్థము ఇప్పుడును రావచ్చును. "నీయంతట నీవు చెప్పితివి" అని యన్నప్పుడు స్వయముగా అని యర్థము. "నీయంతట నీవుంటివి" అని యన్నప్పుడు వేరుగా నని యర్థము. "వాని యంతట వాఁడున్నాఁడు" అని యన్నపుడు పృథగర్థమే యున్నదనుకొందము. "వానియంతట వాఁడు చూచెను" అని యన్నప్పుడు స్వయముగా చూచెననియే యర్థము. కావున అంత, అంతట- అను శబ్దములకు అర్థవిషయమైన భేదము పాటించుట తగదు. నుడికి విషయము, అంత శబ్దము తన, తమ అనువాని మీద చేరినప్పుడే స్వయమర్థకము కావలసిన యవసరము లేదు. 'నీయంత నీవు వచ్చితివి' అని కాని 'నీకు నీవే వచ్చితివి' అని కాని యన్నప్పుడు స్వయమర్థమే కలదు కావున, 'అంతట' అను శబ్దమును 'అంత' శబ్దముకంటె భిన్నముగ పాటించుట సరికాదు. 'అంతట' అనుదానికి పృథగర్థమును మాత్రమే నియతముచేయుటయు ప్రయోగానుకూలము కాదు. ]

**120.** **ఆదరార్థంబున ద్విరుక్తి యగు** (ప్రౌ - ౧౧౧)

కృష్ణ కృష్ణ - హరి హరి. మొ॥

వ్యాఖ్య - ఆదరమును సూచించునప్పుడు ఉపయోగింపబడిన పదమే మరల వెంటనే యుపయోగింపబడునని సూత్ర తాత్పర్యము.

ఆదరము - అని యనుటచేత వాత్సల్యము, గౌరవము, ఆసక్తి మున్నగు వానిని గ్రహింపవచ్చును.

'కృష్ణ' యను సంబోధ్యవాచకమును మరల వెను వెంటనే ప్రయోగించి 'కృష్ణ కృష్ణ' యని యనుటచేత ఆదరము వ్యక్తమగుచున్నది.

[ నిజమునకు 'కృష్ణ' యనునప్పుడు ఆదర భావమున్నచో ద్విరుక్తివలన అది మరింత వెల్లడి యగును. ఆగ్రహమే యున్నచో అప్పుడు ఆగ్రహాతిశయమే వెల్లడి యగును. కావున తరువాత చెప్పిన అత్యంతార్థమే దీనికిని సరిపడును. ఆదరార్థము అని చెప్పుట సరికాదు. ]

లక్ష్యములందు సంబోధనాంతములు మాత్రమే చూపబడినవి. తదితరములు కూడ ద్విరుక్తములై అర్థవిశేషమును దెలుపవచ్చును. ఏది యేది, చూడు చూడు - మున్నగువాని నుదాహరణములుగా గ్రహింపవచ్చును.

## 121. అత్యంతార్థంబునందు నగు. (ప్రౌ - ౧౧౨)

ఔరౌర - కటకటా. మొ॥ కని కని - విని విని. మొ॥ తద్గు ణౌఘముల్ విని విని॥ కళా. ౬ ఆ॥

వ్యాఖ్య - అత్యంతము అని యనగా మిక్కిలి యధికము అని యర్థము. ఈ అర్థమును తెలుపునప్పుడును ద్విరుక్తి కలుగునని సూత్రార్థము.

'ఔర' అనునది ఆశ్చర్యమును చూపును. అధికమైన ఆశ్చర్యమును చూపవలసి నప్పుడు 'ఔరౌర' యని ద్విరుక్తముచేయుట కలదు. 'ఓహోహో' అని ప్రశంసార్థము నందు 'కటకటా' యని సంతాపార్థమునందు ద్విరుక్తి కనిపించుచున్నది. ఇవన్నియు అత్యంతమైన భావమును దెల్పుటయందే ప్రవర్తించుచున్నవి.

'కని కని' అని యనగా 'ఎక్కువగా చూచి' యని యర్థము. 'వినివిని' అని యనగా 'ఎక్కువగా విని' యని యర్థము. కావున అత్యంతార్థమున ద్విరుక్తి యగు చుండుననుట వాస్తవము.

చిన్నయసూరి కడాదులవిషయమునుదెల్పి "ఈసూత్రంబునకు భృశార్థంబు నందు ద్విరుక్తంబు విషయం బని యెఱుంగునది" అని వృత్తియందు తెలిపెను. భృశార్థము అను దానికి అత్యంతార్థము అనునది పర్యాయమే. ఔరౌర - ఏమేమి - కట్ట కడ - ఊరూరన్ - ఇంచించుక - కొట్టుకొట్టు॥ మున్నగునవి సూరి చూపిన ద్విరుక్తి లక్ష్యములు. వీని యన్నింటియందును భృశార్థము (అత్యంతార్థము) సంగతమగును. కావున ద్విరుక్తి ఏయర్థమున వచ్చుచున్నదో సూరి యొక్కచోటనే చెప్పెను, తాను చెప్పిన అన్నిచోట్లకు అది సంగతమైయున్నది. కావున ఈ విషయము క్రొత్తది కాదు.

'ఏగి యేగి యనుచో' అని క్త్వార్థకసంధి విషయమున ఒకప్రసంగము చేసెను. దానినిబట్టి భృశార్థమున క్త్వార్థకరూపము ద్విరుక్తము కావచ్చునని భంగ్యంతరమున నాతడుసూచించియేయున్నాడు. కనికని, వినివిని - అని ప్రౌఢవ్యాకర్త చూపిన ప్రయోగములు పైదాని వంటివే. కావున ప్రౌఢవ్యాకర్త క్రొత్తవిషయమును చెప్పక పోయినను, బాలవ్యాకర్త సూచించినదానిని స్పష్టము చేయుచున్నాడని యనవలయును.

**122.** కొన్నియెడలం ద్వరితానాదరార్థంబుల రెంటను నగు.

(ప్రౌ - ౧౧౩)

శేలెమ్ము - పోపొమ్ము. మొ॥

వ్యాఖ్య - వేగమును గాని, అనాదరమును గాని, రెండింటినిగాని సూచింప దలసి వచ్చినప్పుడును ద్విరుక్తి యగునని సూత్రార్థము.

'లెమ్ము' అనునది 'లేలెమ్ము' అనియై వేగమునుగాని అనాదరణమును గాని సూచించును. 'పోపొమ్ము' అనునదికూడ ఇట్టిదే.

[రూపనిష్పత్తికై "ఆమ్రేడితంబు పరంబగునపుడు" అని మొదలగు న (ప్రౌఢ - సంధి - 23) సూత్రము వ్యాఖ్యానము చూడుడు.]

**123.** కొన్నిశబ్దంబు లర్థవిశేషంబున ద్విరుక్తంబులయి యదంతంబులు నగు.

(ప్రౌ - ౧౧౪)

ఒండొండ - తరతరను॥ (ఇట్లు నర్థవిశేషము క్రమముగానగుట)

వ్యాఖ్య - విశేషార్థమునందు కొన్నిశబ్దములు ద్విరుక్తములగును. అప్పుడు చివరివర్ణముపై అత్వము చేరును. ఇది సూత్రతాత్పర్యము.

'ఒండు' అను శబ్దము పునరుక్తమయిన 'ఒండు + ఒండు = ఒండొండు' అని యగును. దీనికి చివర అత్వముచేరగా 'ఒండొండ' అని యగును. దీనికి 'క్రమముగా' అనియర్థము. 'తరము' అనునది పునరుక్తమై సమసించగా 'తరతరము' అని యగును. దానికి చివర అత్వము చేరగా 'తరతరమ' అనియై 'క్రమముగా' అను నర్థము నిచ్చును.

[కొన్నిశబ్దము లని యన్నను, ప్రయోగములనుబట్టి యీ రెండే కనిపించు చున్నవి. వ్యాకర్తయు "మొ" అను సంకేతమును చూపలేదు. కావున ఇట్టి వింక లేవనియే ఆయన యభిప్రాయమై యుండును.]

**124.** నామపదంబు లార్యాద్యర్థపరకంబులయి వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకంబు లగు. (ప్రౌ - ౧౧౨)

నన్ను నేకార్థసమవేతు। బాడియయ్యా యిట్లు పనికిఁ బనుప॥ భార. అర. ౨ఆ॥ అర్హమయ్యా॥ ఉ. హరి. ౬ ఆ॥

వ్యాఖ్య - అయ్య మున్నగు నర్థములను బోధించు పదములు పదమందుండగా నామపదములు వ్యతిరేకార్థమును స్ఫురింపజేయుచు ప్రశ్నార్థకము లగునని సూత్రార్థము.

ఆర్యాద్యర్థకములు - అయ్య అమ్మ మున్నగునవి

'పాడి' యనగా 'ధర్మము' అని యర్థము. ఇది నామ పదము. దీనిపై 'అయ్య' అన్నది చేరి 'పాడియయ్య' అని యయ్యెను. ఇది ప్రశ్నార్థకము. 'ధర్మము కాదుగదా' యని వ్యతిరేక నిశ్చయము కలిగిన ప్రశ్నముగా వాడుక నొంది యున్నది. 'అర్హము' అనగా 'తగినది' యని యర్థము; విశేషణము. దీనికిపైని 'అయ్య' అని చేరి 'అర్హమయ్య' అని ప్రశ్నవాచక మయినది. 'తగినది కాదు కదా' అనియే దీని భావము.

చిన్నయసూరి 'అదాదులు' అని అన్నవాటిలో అయ్య, అమ్మ మున్నగునవి కలవు. సూరి సంప్రార్థనమున మధ్యమ క్రియలపై అదాదులు చేరునప్పుడగు మార్పులను క్రియా పరిచ్ఛేదమునందు (33, 34) తెలిపెను. ప్రౌఢవ్యాకర్త (శబ్ద - 44) యితర క్రియలమీఁదకూడ అమ్మాదు లగునని తెలిపెను. ఇచ్చట క్రియల మీదనేకాక నామములమీద కూడ నగునన్న విషయము నారంభించెను దీనిని వేరుగా చెప్పవలసిన యవసర మంతగా కనుపట్టదు. పైగా చెప్పిన విషయము సర్వదా సత్యము కాదు.

అదాదులలోని ఏ శబ్దము చేరినను ఈయర్థము స్ఫురింప వచ్చును. పాడియా —పాయే — పాడిడియో — పాడియయ్య — పాడియమ్మ॥ అని యన్ని విధములు ననవచ్చును. వీనివలన కేవల ప్రశ్నమే స్ఫురింపవచ్చును. కొన్నియెడల వ్యతిరేక వ్యంజక ప్రశ్నము స్ఫురింపవచ్చును. అది వక్త కంఠస్వరమునుబట్టి, కాకువునుబట్టి యుండునుగాని శబ్దసాహచర్యమునుబట్టి యుండదు. 'పాడియయ్య' అని యన్నప్పుడు 'ధర్మమే యగును' అని నిశ్చయాత్మకమైన యర్థము సహితము స్ఫురింప వచ్చును. కావున దీనిని వ్యాకరణవిషయముగా గ్రహించుట సరియైన మార్గము కాదు.

125. నామ సర్వనామంబులకును గళలగు నవ్యయంబులకును గర పల సముచ్చయార్థవిశేష పాదపూరణంబులయందు ను శబ్దంబు తఱచుగ నగు. కళలగు ననుదంత శబ్దములమీఁద నయ్యది యు పరపూర్వకంబుగ విభాష నగు. మఱియు నది శేష షష్ఠి యందు యొక్క లోపించినపుడు లాగమాంత బహువచనంబు మీఁదను సముచ్చయమునం జూపట్టెడు. (ప్రౌ - ౧౧౬)

లాగమాంత మనుట మీమాది పద్యదాసార్థమని గ్రహించునది.

(౧) సముచ్చయమునందు నామపదములకు — అన్నయుం దమ్ముండును, పతియుఁ బతియును, వాఁడును వీఁడును, చిన్నెయును వన్నెయును, నన్నును నిన్నును, తనచేతను మనచేతను, భూరిదక్షిణ మహాక్రతువులయు మొ. అవ్యయములకు — చెప్పకయుఁ జూప కయు, ఏసియు వ్రేసియు మొ. (౨) అర్థవిశేషమందు నామపదము లకు — పెం॥ పుర జమదగ్నిసూనుఁడును బోలఁడు నిన్నని విందు విఁటినే॥ ద్రుప॥ భార. ఆది. ౫ ఆ॥ శౌనసమునం దిచ్చోటనే కాదు వ॥ న్నేవీటన్ మిగులంగ నెవ్వఁడును రేఁ డేభంగులం జూచినన్॥ భార. విరా. ౧ ఆ॥ తనపూర్వాశపఁ స్థానం॥ అని యనురాగమున బదరి నంతయుఁ జూడన్॥ మనమునఁ దలపోసి యొకం॥ డును మధ్యేరాత్ర మునఁ గడుంగుతుకమునన్॥ అచ్చోట వసియింపఁజని॥ హరి. ఉ. ౫ ఆ ధీరమతులిట్లు చేసిన॥ వారెవ్వరుఁగలరె॥ భార. ఆది. ౭ఆ॥ ఎంతయుం దనరుఁ జళుక్యమన్మథుడు॥ భార. ఆడి. ౧ ఆ॥ అనుటయుఁ బిన్నసఖ్యా నగి॥ భార. ఉద్యో. ౩ ఆ॥ మెయిఁగల విలాస విభ్రమలక్ష్మిల్॥ దక్క టయును నొక యొఱపై॥ నెక్కొ-స॥ స్వా. ౪ ఆ॥ మొ. అవ్యయము లకు — అమృతాశనంబు సేయకయును దేవ! నాకజరామరత్వంబు నందుటయును॥ భార.ఆది. ౨ఆ॥ పంక్తికంఠుడు నెట్లుం॥ బంపఁగఁజాలక రోషము॥ పెంపునఁ గారాగృహమునఁ బెట్టఁగఁబంచెన్॥ నిర్వ. ౭ ఆ॥ వాబువటి మూర్ఛపోయిం॥ బోటరిదైన్యందు దెలిసి॥ ఉ. హరి ౪ ఆ॥

మొ. (౩) పాదపూరణమునందు నామపదములకు - అందఱున్ వివశులై॥ భార. ఆది. ౫ఆ॥ రేయిపగలు నిద్రయు నెప్పుడెఱుఁగక॥ భార. అర.౧ఆ॥ ఇక్ష్వాకుల కగు నభీష్ట మిదియు మొదలుగాన్॥ భార. ఆది ౧ఆ॥ భాసిలుఁ దత్పురికోట మిక్కిలిన్ సహింపను॥ కళా.౧ఆ.॥ మున్ను ముచ్చిచ్చును విశాలి గొన్నచోటు॥ స్వా. ౨ఆ॥ విపంచి విన్న మొదలున్ నీ వంటమింజేసి॥ స్వా. ౩ ఆ॥ ఇమ్మహాకాహార్యమునం జరింపు మెప్పుడున్॥ స్వా ౨ ఆ॥ ఇట్లు అంతయు, పెద్దయు, తద్దయు మొ. అవ్యయములకు — ఆధారము లేకను. (లేకను=లేకయును)॥ భార. ఆది. ౨ ఆ॥ ఊఱడకం దిగిచి (ఊఱడకన్ = ఊఱడకయును)॥ భార. ఆది. ౮ ఆ॥ అనిలుఁ డను దూతవోయి తోడ్కొనియుఁ దెచ్చె॥ భార. ఆది ౩ ఆ॥ కమలాప్తుఁ డుదయింపక మున్న బుటుకున - మునుఁగు సంగమతీర్థమునకు నేఁగి॥ పాండు. ౫ ఆ॥ ఏనొకటి విన్నవించెద! దానవకులమథన! పెద్దతడవున నుండి! బూని వినిపింపఁగలవని॥ ఉ. హరి. ౫ ఆ॥ మొ. తెలుచుగ ననుటచే నుశబ్దము కొన్నిటికొకప్పుడు వచ్చును ఒకప్పుడు రాదని యర్థము గ్రహింపవలెను. దీనికుదాహరణములు పాదపూరణము నందలివి. విభాష ననుటచే నుశబ్దము కొన్ని యెడల యువర్ణపూర్వకముగానే వచ్చుననియు, కొన్ని యెడల యువర్ణ పూర్వక మయ్యును, గాకయు వచ్చుననియు నర్థము పరిగ్రహింపవలయును యువర్ణపూర్వకముగానే వచ్చుటకు - అనుటయు మొ. యువర్ణపూర్వకమయ్యును గాకయు వచ్చుటకు - ఎంతయు సంయమవంతుఁడు సహదేవుఁ డధ్యాత్మవిద్య నారాధ్యుఁ డెంత, ననఘుండు ధౌమ్యుండు॥ భార. సభా. ౨ ఆ॥ తమ్మికొలను ప్రవేశించు తలిరుఁబోండ్ల! విలసనము లెంతనెంతయు వింతలయ్యె॥ కళా. ౬ ఆ॥ చేటునకె యగుఁ జూలుచేఁ గలుగుమే లెంత॥ స్వా. ౩ ఆ॥ ఒకగృధ్ర మెంతఁ బ్రియమున! నొక చర్మముఁ గఱచికొనుచు నుడుపథమున రా॥ భోజ. ౮ ఆ॥ అమ్ములెల్లను జల్లి సుమములు లెంత॥ అధ్యా బాల. కాం॥ నిడుపుఁ దూర్పునఁ బడమరనై రేఁకు కడల నంభోనిధిఁ గదిసియుండు॥

భార. భీష్మ. ౧ ఆ॥ లేఁజిగురుఁగొమ్మం జేవ గాకుండునే (కొమ్మన్ = కొమ్మయును.)॥ వసు. ౩ ఆ॥ పురారిం జేరలేఁడు. (పురారిన్ = పురారియును.)॥ ఉ. హరి. ౬ ఆ॥ తపసి యిట్టిదిం గలదె? (ఇట్టిదిన్ = ఇట్టిదియును) నిర్వ. ౪ఆ॥ నీ వేమిని వేగిరపడక (ఏమిని = ఏమియును)॥ హరి. పూ. ౮ ఆ॥ అలభీమనాథునకు నప్పటియుం బ్రణామిల్లి॥ రుక్మాం. ౧ ఆ॥ వెఱ్ఱిదీతె రో! కలి దలఁజుట్టు మన్న క్రియగా నొక కొందలు దాల్తురప్పటిన్॥ గలుషపథ ప్రవర్తనమె॥ కళా. ౨ ఆ॥ ఓట రొకింత యేనియు సుయోధను చిత్తమునందు లేదు॥ భార. ఉద్యో. ౩ ఆ॥ అమరంగ జూదంబు నీకు నభిమత మేనిన్॥ భార. అర. ౨ ఆ॥ మఱిం, దెనుఁగుం గబ్బము లెన్నియేనియును, (మొదటిరూపము మఱియును,)॥ ప్రభా. ౧ ఆ॥ ముక్తిందు వెండిన్ విపులఁ బొడమనీ. (మొ. రూ. వెండియును)॥ శౌండు. ౩ ఆ॥ మొ.

వ్యాఖ్య - సముచ్చయార్థమునందును, అర్థవిశేషమునందును, పాదపూరణమునందును నామపదములకు సర్వనామపదములకు కళలయిన అవ్యయములకు మీద 'ను' అను శబ్దము లచ్చుగా చేరు నన్నది సూత్రమున ప్రధాన విషయము.

సముచ్చయము అనియనగా 'కలుపుట' యని యర్థము. 'అన్న' అను శబ్దమును, 'తమ్ముఁడు' అను శబ్దమును సముచ్చయము నొందునపుడు 'ను' వర్ణము వాని కడపల రావలయును. 'అన్న' యనునది అనుదంతము (ఉదంతము కానిది) అగుటవల్ల 'ను' వర్ణమునకు ముందు 'యు' అని కూడ చేరును. అందువల్ల 'అన్నయును' అని యగును. 'తమ్ముఁడు' అనునది ఉదంతమే యగుటవలన 'ను' వర్ణము చేరి 'తమ్ముఁడును' అనియగును. 'అన్నయును దమ్ముఁడును' అని కలుపుట సముచ్చయము. 'నేతియుం బతియును - చిన్నెయును వన్నెయును' అన్నవి కూడ ఇట్టి రూపములే. పైవి నామపదములకు చూపఁబడిన లక్ష్యములు. వాఁడును వీఁడును - నన్నును నిన్నును - తనచేతను మనచేతను॥ అనునవి వివిధవిభక్తులతోడి సర్వనామములు 'ను' వర్ణమును పొందినరూపములు.

'చెప్పక' మున్నగునవి వ్యతిరేకక్త్వార్థకములు అవ్యయములు. వీనికిని మీద సముచ్చయార్థకము చేరి చెప్పక[illegible] జూపకయు - ఏపియు వ్రేసియు మున్నగునవి [illegible]

'మహాక్రతువులయొక్క' అనునది షష్ఠ్యంత బహ్వర్థకరూపము. దీనిపై నిఁకూడ సముచ్చయార్థకము వచ్చి 'మహా క్రతువులయొక్కయు' అని కావచ్చును. 'యొక్క' అను ప్రత్యయమునకు లోపమురాగా మిగిలిన లదాగమముతోఁడి రూపమునై సముచ్చయార్థకముచేరి 'మహాక్రతువులయు' అనికావచ్చును.

సూత్రమునందు "లాగమాంత బహువచనము" అనికలదు. అందువలన మీయొక్క, మాయొక్క, తమయొక్క మున్నగు బహువచనరూపములపై 'యొక్క' లోపించుటయు, సముచ్చయార్థకము చేరుటయు జరుగదు వీనిచివర లదాగమము లేదు, కావున ఇవి లాగమాంతములు కావు. కావున వీని కీ కార్యము జరుగదు. ఇట్లు సమానమునందు నిషేధమును విశేషించి చెప్పుటకే పర్యుదాసమని పేరు.

అర్థవిశేషమున 'ను' వర్ణము నామసర్వనామావ్యయములకు వచ్చుట కలదు. 'జమదగ్నిసూనుఁడును బోలఁడు' అనియన్నప్పుడు 'జమదగ్నిసూనుఁ డైనను బోలఁడు' అనియర్థము. 'ఒకండును మర్త్యరాత్రమున' అని యున్నప్పుడు 'ఒకఁడే' యని యర్థము. 'చేయకయు' అన్నప్పుడు 'చేయనప్పటికిని' అనియర్థము.

అందఱున్ వివశులై - నిద్రయు వెప్పుడెఱుఁగక - తోడ్కొనియుఁదెచ్చె - ఉదయింపకయు మున్నె॥ మున్నగుచోట్ల సముచ్చయార్థకము పాదపూరణమునందు మాత్రమే ప్రయుక్తమయ్యెను.

కొమ్మన్ - పురారిన్ - ఇట్టిదిన్ - ఏమిన్॥ మున్నగువిధముగా అను దంతములపై యువర్ణపూర్వకము కాని నువర్ణము చేరుట కనిపించుచున్నది. కొమ్మయున్ - పురారియున్ - ఇట్టిదియున్ - ఏమియున్॥ మున్నగువిధముగా ఉండవలసి యున్నను, అట్లుకాని రూపములుకూడ నుండుటచేతనే ప్రౌఢవ్యాకర్త యువర్ణపూర్వకత్వమును వికల్పముగా విధించుట జరిగెను.

[ నిజమునకు 'ను' వర్ణము కాక 'ఉను' అనునదియే సముచ్చయార్థకము. అది ఉదంతములపై చేరినపుడు వెనుకటి ఉత్వముతో కలియుటచేత 'రాముఁడును' మున్నగువిధముగా 'ను' వర్ణము మాత్రమే అదనముగా కనిపించుచున్నది. అనుదంతముల మీద చేరినపుడు 'సీతయును లక్ష్మియును' మున్నగు విధముగా సంధి కాకుండుటచేత యడాగమము కలిగి 'యును' అని కనిపించుచున్నది. కొన్ని ప్రౌఢ ప్రయోగములయందు ఉత్వమునకు లోపము వచ్చి 'కొమ్మన్' మున్నగువిధముగా వినిపించుచున్నది. ]

## ఔపవిభక్తిక ప్రకరణము

**126.** ఇ‌ – టి – తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు.
(బా - ౨౮)

విభక్తి నిమిత్తకంబులయి యాదేశాగమాత్మకంబు లయిన ఇ- టి- తి అను వర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు.

వ్యాఖ్య - వక్ష్యమాణంబులు=ఇకముందు చెప్పబడునవి. ఇకముందు చెప్పబడుచున్న ఇ- టి- తి అను వర్ణములను ఔపవిభక్తికములని యందురని సూత్రార్థము.

విభక్తిని కారణముగా చేసికొని ఆదేశముగా కాని, ఆగమముగా కాని తెలుగు శబ్దములపైని చేరునటువంటి ఇ- టి- తి అను వర్ణములు ఔపవిభక్తికము లని యనబడును.

**127.** ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిఁ బ్రాయికంబుగ నగు. (బా - ౨౯)

కాలు - కాలిని - కాలిచే; నాఁగలి - నాఁగటిని-నాఁగటిచే; నేయి - నేతిని - నేతిచే, ద్వితీయైకవచనంబు పరంబగునప్పు డౌపవిభక్తికంబులు రావని కొందఱు వక్కాణించిరి. అయ్యది లక్ష్యలక్షణ విరుద్ధం బగుటంజేసి యనాదరణీయంబు

వ్యాఖ్య - పూర్వ సూత్రమున చెప్పిన ఇ- టి- తి అను ఔపవిభక్తికములు కొన్ని తెలుగునామములకు ద్వితీయ మొదలుకొని సప్తమివరకు గల ప్రత్యయములు ఏకవచనములందు పరములగునప్పుడు తరుచుగా నగునని సూత్రార్థము.

'కాలు + ను' - కాలు అనునది ఔపవిభక్తికశబ్దము. దీనికి ద్వితీయావిభక్తి ప్రత్యయమగు 'ను'పరమందున్నది. కావున ఔపవిభక్తికమైన ఇవర్ణము నామముతుది నున్న ఉత్వమునకు ఆదేశముగా నగును. కాలి + ను - అను రూప మేర్పడును. "ఇకారంబుమీఁది కు- ను- వు- క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు" (తత్సమ - 28) అను సూత్రమును బట్టి 'కాలిని' అని యగును. 'చే' అను తృతీయావిభక్తి పరమగునప్పు డిట్లే ఇవర్ణము కలిగి కాలు + ఇ + చే=కాలిచే అని యగును.

'నాఁగలి + ను' అని ద్వితీయావిభక్తి పరమగుచుండగా నామముయొక్క తుదివర్ణమునకు ఆదేశముగా 'టి' యను ఔపవిభక్తికము వచ్చును. నాఁగటి + ను "ఇకారంబు మీఁది" అని మొదలయిన తత్సమపరిచ్ఛేదమునందలి 28 వ సూత్రమును బట్టి 'నాఁగటిని' అని యగును. తృతీయావిభక్తి పరమగునప్పుడు 'నాఁగటిచే' అని యగును.

నేయి + ను. ద్వితీయావిభక్తి పరమగుచున్నది. కావున నామముయొక్క కడపటి యక్షరమునకు బదులుగా 'తి' వర్ణము కలిగి 'నేతి + ను' అని యగును. ఇచ్చటి నువర్ణము ఇకారముమీఁది దగుటవలన ఇత్వమును బొంది 'నేతిని' అని యగును. ఇట్లే తృతీయాద్యేకవచనములు పరములగునప్పుడు నేతితో, నేతికొఱకు - మున్నగువిధముగా రూపములేర్పడును.

ద్వితీయైకవచనము పరమగునపుడు ఔపవిభక్తికములు కలుగవని కొందరు చెప్పిరనియు, పూర్వకవుల ప్రయోగములనుబట్టియు పూర్వవ్యాకర్తల విధినిబట్టియు కూడ వారి మాట యసత్య మని తెల్పి సూరి నిరాకరించెను.

**128.** ఊరు మొదలగువాని కిత్వం బగు. (బా - ౩౦)

ఊరు - ఊరిని; కాలు - కాలిని; ప్రాను - ప్రానిని; నోరు - నోరిని; చోటు - చోటిని.

వ్యాఖ్య - ద్వితీయాద్యేకవచనప్రత్యయములు పరములై నప్పుడు ఊరు మున్నగుశబ్దములకు 'ఇ' యను ఔపవిభక్తిక మగు నని సూత్రార్థము.

ఊరు + ను. ఇత్వము కలిగినయెడల ఊరి + ను'. అని యగును. ఇత్వము మీఁది నువర్ణము 'ని' గా మారుటచేత ఊరి + ని=ఊరిని అను రూపము సిద్ధించును. కాలు, ప్రాను, నోరు, చోటు-మున్నగుశబ్దములకుకూడ ఇట్లే ఇవర్ణము కలిగి కాలిని, ప్రానిని, నోరిని, చోటిని - మున్నగువిధముగా ఔపవిభక్తికరూపము లేర్పడును.

**129.** టి వర్ణంబు గొన్నింటి యంత్యాక్షరంబున కాదేశంబును కంత్యాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును ప్రాయికంబుగ నగు. (బా - ౩౧)

ఆదేశము॥ త్రాడు- త్రాటిని; కాఁడు- కాఁటిని; నోరు-నోటిని; ఏఱు - ఏటిని. ఆగమము॥ అన్ని - అన్నిటిని; ఎనిమిది - ఎనిమిదిటిని; వేయి- వేయిటిని. ఉభయము॥ ఏమి- ఏటిని- ఏమిటిని; పగలు- పగటిని - పగలిటిని; మొదలు - మొదటిని - మొదలిటిని; రెండు - రెంటిని - రెండిటిని; మూఁడు - మూఁటిని - మూఁడిటిని; నూఱు - నూటిని- నూఱిటిని.

వ్యాఖ్య - ద్వితీయాద్యేకవచన ప్రత్యయములు పరములగునప్పుడు కొన్ని నామముల కడపటి యక్షరమున కాదేశముగను, కొన్నినామముల తుద నాగమముగను, కొన్నినామములకు రెండు విధములుగను టివర్ణము అగునని సూత్రార్థము.

త్రాడు + ను. ద్వితీయావిభక్తి ప్రత్యయ మగు నువర్ణము పరమగుచుండగా నామాంతమునకు టివర్ణము ఆదేశముగా నగును. త్రాటి + ను. "ఇకారంబుమీఁది కు. ను- వు- క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు" అను విధినిబట్టి 'త్రాటిని' అని యగును. ఇట్లే కాఁడు - నోరు - ఏఱు అను వానికి టివర్ణము ఆదేశము కాగా కాఁటిని - నోటిని - ఏటిని అను ఔపవిభక్తికరూపము లేర్పడును.

అన్ని + ను. ద్వితీయావిభక్తి పరమందుండగా 'టి'వర్ణము ఆగమముగా నై అన్ని + టి + ను అని యగును. ఇకారముమీది నువర్ణమున కిత్వము కలిగి 'అన్నిటిని' అను రూపము సిద్ధించును ఇట్లే ఎనిమిది, వేయి - మున్నగుశబ్దములకు ద్వితీయాద్యేకవచనము పరమగుచుండగా టివర్ణము ఆగమముగా నై ఎనిమిదిటిని, వేయిటిని - మున్నగురూపము లేర్పడును.

ఏమి మున్నగుశబ్దములకు ద్వితీయైకవచనము పరమగుచుండగా టివర్ణము కడపటి అక్షరమునకు ఆదేశముగను, ఆగమముగనుకూడ కావచ్చును. ఏమి + ను- టివర్ణము ఆదేశముకాగా ఏటి + ను అని యగును. ఇకారముమీది నువర్ణమునకు ఇత్వము కలిగి 'ఏటిని' అని యగును. టివర్ణము ఆగమమైన యెడల ఏమిటి + ను అని యగును. నువర్ణమున కిత్వము కలిగి 'ఏమిటిని' అని యగును. ఇట్లే పగలు, మొదలు, రెండు, మూఁడు, నూఱు - అను శబ్దములకు టివర్ణము ఆదేశము కాగా పగటిని, మొదటిని, రెంటిని, మూఁటిని, నూటిని - అను విధముగా రూపసిద్ధి యుండును. టివర్ణము ఆగమమైనయెడల పగలు + టిని: మొదలు + టిని: రెండు + టిని: మూఁడు + టిని: నూఱు + టిని - మున్నగువిధముగా

నగును. రాజోపు(బాల - 36)సూత్రమువలన టివర్ణమునకు ముందున్న ఉత్వమునకు ఇత్వము కలిగి పగలిటిని, మొదలిటిని, రెండిటిని, మూఁడిటిని, నూఱిటిని - అను రూపములు సిద్ధించును.

130 హ్రస్వముమీఁది టివర్ణంబు ముందు పూర్ణబిందువు బహుళం బుగా నగు. (బా - 32)

అన్నింటిని - ఎనిమిదింటిని - పగంటిని - పగలింటిని - రెండింటిని - మూఁడింటిని.

వ్యాఖ్య - పైని చెప్పినట్లు ఆదేశముగాకాని, ఆగమముగాకాని, వచ్చిన టివర్ణమునకు పూర్వమందు హ్రస్వమున్నయెడల, బహుళముగా పూర్ణబిందువు వచ్చునని సూత్రార్థము.

అన్నిటిని - టి వర్ణమునకు ముందు హ్రస్వ ముండుటచేత పూర్ణబిందువు వచ్చి 'అన్నింటిని' అనియు రూపము కావచ్చును ఇట్లే ఎనిమిదిటిని, ఎనిమిదింటిని: పగటిని - పగంటిని; పగలిటిని, పగలింటిని; రెండిటిని, రెండింటిని; మూఁడిటిని, మూఁడింటిని అను విధముగా రూపము లుండవచ్చును.

హ్రస్వముమీది టివర్ణమునకు ముందు పూర్ణబిందువే విధింపబడినది కావున పైని చెప్పినట్లు 'మూఁడింటిని' మున్నగువిధముగా పూర్ణబిందువుతోడి రూపము కావచ్చును. పూర్ణబిందువు లేనియెడల 'మూడిఁటిని' అనువిధముగా రూపసిద్ధి యుండును. అంతే కాని టివర్ణమునకు ముందు అర్ధానుస్వారము నుంచరాదు. కాఁటిని, మూఁటిని - మున్నగు స్థలములందలి అర్ధానుస్వారము కాఁడు, మూఁడు - అను ప్రాక్ఛబ్ద సిద్ధముగా నున్నదే కాని టివర్ణమునకు ముందు ఆగమముగా వచ్చినది కాదని గుర్తు పెట్టుకొనవలయును.

131 ఏకాచ్కంబగు హ్రస్వంబుమీఁది టివర్ణంబునకు ముందు పూర్ణ బిందు వగు (బా - 33)

కన్ను - కంటిని; మిన్ను - మింటిని; ఇల్లు - ఇంటిని: పల్లు - పంటిని

వ్యాఖ్య - పదమునకు మొట్టమొదటిది హ్రస్వాక్షర మైనయెడల, దానిమీద వచ్చు 'టి' వర్ణమునకు పూర్వమందు నిత్యముగా పూర్ణబిందు వగు నని సూత్రార్థము.

కన్ను + ను. చివరి యక్షరమున కాదేశముగా టి వర్ణము వచ్చి 'క + టి + ను' అని యగును. టివర్ణమునకు ముందున్న 'క' హ్రస్వాక్షరమును పదాద్యమును అగుటచేత నిత్యముగా పూర్ణబిందువై 'క + ంటి + ను' అని యగును ఇకారముమీది నువర్ణమున కిత్వము కలిగి 'కంటిని' అను రూపము సిద్ధించును. ఇట్లే మింటిని, ఇంటిని, పంటిని - మున్నగు ఔపవిభక్తికరూపములు.

**132** అల్లు మొదలగు శబ్దముల కింతాగమంబు తివర్ణంబును రేఫంబున కొక్కటికి లోపంబు నగు. (బా - ౬౪)

అల్లు - అలితిని॥ అల్లు - కల్లు - కొల్లు - గొల్లు - మిల్లు - వల్లు॥ ఇవి యల్లు మొదలయినవి.

వ్యాఖ్య - ద్వితీయాద్యేకవచన ప్రత్యయములు పరములగునప్పుడు అల్లు మున్నగు శబ్దములకు తివర్ణము ఆగమముగా నగును: అప్పుడు నామాంతమున గల ఒక 'ల' వర్ణము లోపించు నని సూత్రార్థము.

అల్లు + ను. ద్వితీయైకవచనప్రత్యయ మగు 'ను' పరమందుండగా 'తి' వర్ణము ఆగమముగా నై అల్లు + తి + ను అని యగును. అప్పుడు ఒక లవర్ణమునకు లోపము వచ్చి అలు + తి + ను అని యగును. రానున్న ౩౮ వ సూత్రమునుబట్టి 'తి' వర్ణమునకు ముందున్న ఉత్వమునకు ఇత్వము కాగా అలి + తి + ను యగును. ఇకారముమీది నువర్ణమునకు ఇత్వము కలుగగా అలితిని అనురూపము సిద్ధించును. ఇట్లే 'కలితిని - కొలితిని - గొలితిని - మిలితిని - వలితిని మున్నగు విధముగా ఔపవిభక్తికముల ద్వితీయాంతరూపములు సిద్ధించును.

**133.** విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతుల తుది యక్షరంబు తివర్ణంబగు. (బా - [illegible])

గోయి - గోతులు - గోతిని - గోతులను॥ గోయి - చేయి - దాయి - నేయి - వాయి - రోయి॥ ఇత్యాదులు.

వ్యాఖ్య - విభక్తి పరమగునపుడు గోయి మున్నగు శబ్దములయొక్క తుది యక్షరమునకు బదులుగా ఔపవిభక్తిక మయిన తివర్ణము కలుగునని సూత్రార్థము.

'విభక్తి పరమగునప్పుడు' అని యనుటచేత ద్వితీయాద్యేకవచనములు పరమగునప్పుడును, ద్వితీయాదబహువచనములు పరమగునప్పుడును: ప్రథమాబహువచనము పరమగునప్పుడునుకూడ ఈ కార్యము జరుగునని తాత్పర్యము.

గోయి + ను- ద్వితీయైకవచనము పర మైనపుడు తుది వర్ణమునకు 'తి' వర్ణము ఆదేశమై 'గోతి + ను' అని యగును. ఇకారముమీది 'ను' వర్ణకమునకు ఇత్వము కలిగి 'గోతిని' అని యగును.

ప్రథమాబహువచనము పరమగునపుడుకూడ 'గోయి + లు' అనునది 'గోతి + లు' అని యగును. "ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు" (తత్సమ-15) అను సూత్రమునుబట్టి గోతు + లు=గోతులు అని యగును. "బహూర్థంబున ద్వితీయాదివిభక్తులకు లదాగమం బగు" (తత్సమ-3) అను సూత్రమునుబట్టి గోయి + ల + ను అని యేర్పడగా, ప్రస్తుత సూత్రమువలన నామముతుది వర్ణమున కాదేశముగా తివర్ణంబు వచ్చి గోతి + ల + ను అని యగును. "ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు" అను విధిని బట్టి గోతు + ల + ను=గోతులను అని యగును. అట్లే చేతులు, చేతులను, చేతిని: నూతులు, నూతులను, నూతిని: నేతులు, నేతులను, నేతిని - మున్నగువిధముగా రూపము లేర్పడును.

134 ఔపవిభక్తికాంతంబులగు చేయి నేయి లోనగు శబ్దంబుల యాద్యచ్చునకు హ్రస్వంబును, మీఁది హల్లునకు ద్విత్వంబును ప్రథమైకవచనంబునందు వైకల్పికంబుగ నగు.

(ప్రౌ - ౧౮౫)

చేయి - చెయి - చెయ్యి; నేయి - నెయి - నెయ్యి; మొ॥ ఇతర స్థలంబులయందు చేతితోన్ - చేతికిన్; నేతితోన్ - నేతికిన్॥ మొ॥

వ్యాఖ్య - ఔపవిభక్తికములయిన చేయి మున్నగు శబ్దముల మొదటి యచ్చునకు హ్రస్వమును, ఆ పిమ్మట హల్లునకు ద్విత్వమును వికల్పముగా కలుగు నని సూత్రార్థము. ఇది ప్రథమైకవచనమునందు మాత్రమే జరుగు కార్యము.

'చేయి' యున్నది ఔపవిభక్తికము. ద్వితీయాది విభక్తులు పరమైనపుడు చేతిని, చేతితో - మున్నగు విధముగా 'తి' వర్ణము ఆదేశముగా అగుచున్నది. ప్రథమైకవచనమునందు ప్రస్తుత సూత్రమువలన తొలిదీర్ఘమునకు హ్రస్వము కలుగగా 'చెయి' అను రూపమేర్పడును. మీదిహల్లునకు ద్విత్వము కలుగగా 'చెయ్యి' అనియు

నగును. ఇట్లే 'నేయి' యన్నది నెయి, నెయ్యి - అని మరి రెండు రూపములను పొందును. ఇట్లే 'గోయి' యన్నది గొయి, గొయ్యి యని 'వేయి' యన్నది వెయి, వెయ్యి యని 'నూయి' యన్నది నుయి, నుయ్యి యని మరి రెండేసి రూపములను పొందును.

ఈ విధి ప్రథమైకవచనమువరకే నియతము. కావున బహువచనము కాని, ద్వితీయాది విభక్తులుకాని పరమైనప్పుడు ఈ కార్యములు కలుగవు. వానికి రావలసిన ఔపవిభక్తికము లేవియో వచ్చును. బాలవ్యాకరణమే వానిని విధించినది.

[చేయి మున్నగు శబ్దములు ఔపవిభక్తికములు. ఇటితి వర్ణములనే కాక, ఆ వర్ణములు చేరు శబ్దములనుకూడ ఔపవిభక్తికము లనియే యందురు. కావున "ఔపవిభక్తికాంతములు" అని వాడుట సమంజసము కాదు ప్రథమైకవచనమున ఔపవిభక్తికములు చేరవు. అట్టియెడల ఔపవిభక్తికాంతములు అని వాడుట సందర్భమును క్లిష్టతరము చేయును. మరొక విషయము. సూత్రవిధిని 'వైకల్పికము' అని ప్రౌఢవ్యాకర్త నిర్దేశించెను. ఇచ్చట రెండుకార్యములు నొకేమాటు జరిగి యొక రూపము, ఒకేమాటు జరుగకుండ నుండుటవలన ఒక రూపము వచ్చిన యెడల 'వైకల్పికము' అని యనుట సరిపడును. సూత్రమునందలి విధిద్వేదియు జరుగకుండుటవలన ఒక రూపము ఒక విధిమాత్రమే జరుగుటవలన ఒకరూపము, రెండు విధులును జరుగుటవలన మరొక రూపము - మొత్తము మూడు రూపము లేర్పడుచున్నవి. కావున దీనిని 'విభాష' యని యనుట యవసరము. అప్పుడు మాత్రమే అప్రవృత్తికి, పర్యాయప్రవృత్తికి అవకాశము కలుగును.]

బాలవ్యాకరణము చెయి, చెయ్యి - మున్నగు రూపముల గురించి ప్రసంగింపలేదు. కావున ఇది బాలవ్యాకరణమునకు పూరకము.

## 135. టి తి వర్ణంబులు పరంబు లగునప్పు డుత్వంబున కిత్వం బగు.

(బా-౩౭)

రెండిటికి- మూఁడిటికి- నాలుగిటికి- పగలిటికి- మొదలిటికి- పెక్కిటికి. కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు॥ నెత్తుటికి.

వ్యాఖ్య - ఔపవిభక్తికములైన టి, తి అను వర్ణములు పరములగునపుడు వెనుకటి ఉత్వమునకు ఇత్వ మగునని సూత్రార్థము.

రెండు + టికి- టివర్ణము పరమందుండుటవలన 'రెండు' శబ్దముయొక్క కడపటి ఉత్వమునకు ఇత్వము కలిగి 'రెండిటికి' అను రూపము సిద్ధించును. ఇట్లే మూఁడిటికి, మూఁడింటికి, నాలుగిటికి, నాలుగింటికి - మున్నగురూపము లేర్పడును.

అఱ్ఱు మున్నగు శబ్దములకు టివర్ణము పరమగునపు డిట్లే ఉత్వమున కిత్వము కలుగగా అఱితి, కఱితి - మున్నగురూపము లేర్పడును.

టివర్ణము పరమగునప్పుడు 'నెత్తురు' శబ్దము తుది యక్షరముయొక్క వెను కటి ఉత్వమునకు ఇత్వము కలుగదు. 'నెత్తు + టికి' ఇది విశేషము. ఎదురు, నుదురు మున్నగు శబ్దములుకూడ ఇట్లే ఎదుటికి, నుదుటికి మున్నగు విధముగా నుండును.

**136.** టివర్ణంబు పరంబగునపుడు క్రిందు మీఁదు ముందు పువర్ణంబుల కత్వం బగు. (బా - ౩౭)

క్రిందు- క్రిందటిని; మీఁదు- మీఁదటిని; ముందు- ముందటిని; మాపు- మాపటిని; అప్పుడు- అప్పటిని.

వ్యాఖ్య - క్రిందు మీఁదు ముందు మాపు రేపు మున్నగు శబ్దములకు ద్వితీయా ద్యేకవచనములు పరమగునపుడు టివర్ణము ఆగమముగా నగును. అట్లే అప్పుడు, ఇప్పుడు మున్నగుశబ్దముల కడపటివర్ణమునకు టివర్ణము ఆదేశముగా నగును. అప్పుడు వెనుకనున్న ఉత్వమునకు అత్వమగును - ఇది సూత్రార్థము.

క్రిందు + టివి. ప్రస్తుతసూత్రముచేత ఉత్వమునకు అత్వము రాగా 'క్రిం దటిని' అని యగును. ఇట్టివే మీఁదటిని, ముందటిని మున్నగునవి.

అప్పుడు మున్నగుశబ్దములకు టివర్ణము ఆదేశముకాగా అప్పు + టివి అవి యగును. ప్రస్తుతసూత్రముచేత ఉత్వమునకు అత్వము కలిగి 'అప్పటిని' అని యగును. ఇట్లే ఇప్పటికి - ఎప్పటికి - మున్నగురూపము లగును.

**137.** ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు (బా - ౩౮)

గోరను గీఱెను - ఊర నున్నాఁడు - గొడ్డట నఱికెను - ఇంట లేఁడు - వఱుతఁ గలిసె - కఱుతఁ దూఁచెను॥ పక్షంబునందు గోరిచే - నూరియం దిత్యాదులు.

వ్యాఖ్య - ఔపవిభక్తికరూపములకు తుదను తృతీయావిభక్తి ప్రత్యయము కాని, సప్తమీవిభక్తి ప్రత్యయముకాని యున్నయెడల ఆప్రత్యయస్థానమున అత్వము బహుళముగా నగునని సూత్రార్థము.

గోరు + చేతను. తృతీయైకవచనము పరమగుచుండగా ఇత్వము కలిగి 'గోరిచేతను' అని యైనది. ప్రస్తుతసూత్రముచేత 'చేతను' అను ప్రత్యయమున కాదేశముగా 'అ' వర్ణముకలిగి 'గోర + అ' అని యై 'గోర' అని యగును. 'చేతను' ద్రుతాంత మగుటవలన నిచ్చుటను ద్రుతము కలిగి 'గోరను' అని యగును.

ఊరియందును - ఇచ్చట అందును అను సప్తమ్యేకవచనము పరమగుచుండగా ఇత్వము కలిగినది. ప్రస్తుతసూత్రమునుబట్టి 'అందును' అనుదానికి బదులుగా 'అ' వర్ణము కలుగగా ఊరి + అ = ఊర అని యగును. 'అందును. అనునది ద్రుతాంత మగుటవలన నిచ్చుటను ద్రుతము చేరి 'ఊరను' అనురూపము సిద్ధించును.

ఈ ఆదేశవిధి బహుళ మగుటవలన అత్వము రానిపక్షమున గోరిచేత, ఊరియందు - మున్నగువిధముగా ప్రత్యయాంతరూపము లట్లే యుండును.

## 138 . ఊరు చోటు మేన్వాదు లున్లుగ్విషయంబులు,

(ప్రౌ - ౧౦౬)

ఊరు లోనగువానికిఁ దృతీయయం దత్వము సంప్రాప్తింపదు గాన 'ఔపవిభక్తిక నామ్నామత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే' అను సూత్రమున కవి విషయములు గాక 'కేషాంచిదుదంతానాం నేతి విభక్తావునో లుక్స్యాత్' అను సూత్రమునకు విషయంబు లగుచున్నవని యెఱుంగవలయును.

వ్యాఖ్య - ఊరు చోటు మేను మున్నగునవి 'ఉన్' అను దానికి లోపము కలిగెడి స్థలము లని సూత్రార్థము.

'ఊరు' అను శబ్దము జడవాచకము. కావున సప్తమియందు "ఉకారాంత జడంబునకు నవర్ణకం బగు" అను బాలవ్యాకరణ ( కారక - '8 ) సూత్రమునుబట్టి 'ఊరునన్' అని యగును. ప్రస్తుతసూత్రముచేత చివరి 'ఉన్' లోపింపగా 'ఊర్ + అన్ = ఊరన్' అని యగును. ఇట్లే చోటన్, మేనన్ - అను రూపములును కలుగును.

చిన్నయసూరి పూర్వసూత్రము (బాల - 38) చేత 'ఊరన్' అను రూపమును సాధించియున్నాడు. అచ్చట "ఊరియందు" అని సప్తమ్యర్థమున నుండగా విభక్తి

కంతటికి బదులుగా అత్వము కలిగి 'ఊర' అని యగును. తృతీయాదులకు నుగాగమ మగును. కనుక 'ఊరన్' అని యేర్పడును.

ప్రౌఢవ్యాకర్త సూరిచూపిన రూపవిప్రతిపత్తికి సమ్మతించుటలేదు. ఊరు మున్నగువానికి తృతీయావిభక్తియందు అత్వము కలుగదు గనుక తృతీయా సప్తములం కుమ్మడిగా చెప్పిన విధికి ఇది లక్ష్యము కారాదని ఆయన దానికి కారణము చూపుచున్నాడు. అది కానిచో ఉన్లోపమును అంగీకరించి తీరవలయు నని ఆయన అభిప్రాయము.

ఈవిషయము తొలుత ఆంధ్ర శబ్దచింతామణియందు ప్రసక్తమైనది. అందలి శ్లోకమిది-

"కేషాఞ్చి దుదన్తానాం నేశి విభక్తావునో లుక్స్యాత్".

ఔపవిభక్తికనామ్నా మత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే" అని. ఇందు మొదటిపంక్తి ఒకసూత్రము. కొన్ని యుదంతములకు నవర్ణకము పరమైనపుడు 'ఉన్' లోపించునని దాని యర్థము. రెండవపంక్తి మరొకసూత్రము. ఔపవిభక్తిక ములకు సప్తమీ తృతీయల యర్థమునందు అత్వము కలుగునని దానియర్థము. సూరి రెండవసూత్రమును కొంచెము సవరించి. దానికి లక్ష్యముగా ఊరన్, గోరన్ - గోతన్ - మున్నగువానిని సాధించెను. 'ఊరన్' అని యున్నప్పుడు 'ఊరియందు' అను నర్థము మాత్రమే యుండుననియు ఊరిచేత, ఊరితోడ - అను నర్థము ఉండ దనియు కావున 'సప్తమీతృతీయార్థే' అను దాని కిది లక్ష్యము కారాదనియు ప్రౌఢ వ్యాకర్త తలచెను అందువలన దానిని సవరింపబూని మొదటిసూత్రము నాశ్రయిం చెను. దీనినిబట్టియైనచో నవర్ణకము పరమగుచున్నది. కావున సప్తమ్యర్థము మాత్రమే వచ్చునని ఆయన అభిప్రాయము.

ఆయన యభిప్రాయము నిర్దిష్టము కాదు. సప్తమియందు మాత్రమేకాక తృతీయయందును 'న' వర్ణకము వచ్చును. బాలవ్యాకరణము (కారక - 23) "ఉదంతజడంబు తృతీయకు న వర్ణకంబగు" అని సూత్రించినది. కావున 'న' వర్ణకము పరమైనప్పుడు తృతీయార్థమును సప్తమ్యర్థమును గూడ రావచ్చును. కావున ప్రౌఢవ్యాకర్త చేయు సవరణము కూడ ప్రయోజనకరము కాదు. పైగా ఉదం తముల కత్వము ప్రాప్తించుటకే సూత్రమును, అనుదంతములయినవానికి బాల వ్యాకరణసూత్రమును చెప్పుకొనవలసివచ్చుచున్నది. కావున లాభము లేకపోగా కష్టము పెరుగుచున్నది.

చింతామణి రెండుసూత్రములచేత సాధించినరూపములను బాలవ్యాకరణ మొకే సూత్రముచేత సాధించుచున్నది. అనగా ప్రక్రియాలాఘవమును సంపాదించిన దని-యర్థము. 'బహుళ' మని నిర్దేశించుటవలన కొన్నియెడల అప్రవృత్తియు అంగీకరింపబడుచున్నది. కావున 'ఊరన్' మొదలయినచోట తృతీయార్థమునుగాక సప్తమ్యర్థమును చెప్పుకొనవలసిన నిర్బంధముకూడ కలుగుచున్నది. ఊరియందు, ఊరున - మున్నగు రూపములకు కూడ బహుళవిధివలననే యవకాశము కలుగుచున్నది. 'గోరన్' మున్నగుచోట్ల తృతీయార్థము మాత్రమే ప్రసిద్ధము. కావున ఇన్నియర్థములను భావించి, ప్రక్రియాలాఘవము నెంచి సూరి బహుళముగా అత్వమును విధించెను.

ప్రౌఢవ్యాకర్త చింతామణికి విధేయముగా దీనిని సవరింపబూనుకొనెను. కాని తన సవరణము సమర్థము కాకపోయినది. పైగా దేనిని వారింపదలంచుకొనెనో, ఆతృతీయార్థము తన సవరణమందును వచ్చుట కవకాశము మిగిలియే యున్నది.



ద్వితీయ సంపుటి

ఇందు

బాలవ్యాకరణము నందలి

కారక సమాస తద్ధిత క్రియా కృదంత

ప్రకీర్ణక పరిచ్ఛేదములకు

ప్రౌఢవ్యాకరణమునందలి

కారక సమాస తద్ధిత క్రియా కృదంత వాక్య

ముక్తలక్షణ వివేచనములకు

వ్యాఖ్యానము

కలదు